# ఆంధ్రపత్రిక

## ఆనందనామ సంవత్సరాది సంచిక

[అరువది నాల్గవ సంచిక]

**[1974 - 75]**



సంపాదకుడు:

**శివలెంక శంభుప్రసాద్**

[1938 – 1972]



**వెల రూ. 4**

ఆంధ్రపత్రికా కార్యాలయమున ముద్రితము.

Supplement to Andhra Patrika Issue Dated 24-3-1974 Regd No. M 1118

సంచిక 64

# ఆనందనామ సంవత్సరాది సంచిక

సంవత్సరము 1974–75

## విషయానుక్రమణిక

వసంతహేల—శ్రీ సామవేదం జానకీరామశర్మ 1
బాసర శ్రీసరస్వతీక్షేత్రము—శ్రీ పి. ఆర్. 4
జానపద సాహిత్య సంపద...కపిలిపాటలు—
డా॥ ఎస్. గంగప్ప 6
స్వప్నసుందరి—శ్రీ పోచిరాజు శేషగిరిరావు 10
సుప్తచేతన—శ్రీ యు. ఏ. నరసింహమూర్తి 11
నేను మానవుణ్ణయ్యాను!—శ్రీ వి. ఆర్. గణపతి 14
శ్రీ అరవిందుల పరిణామ సిద్ధాంతము :
మనస్సునుంచి అతీత మనస్సువరకు—
శ్రీ వి. వి. ఎస్. రామదాసు 15
అక్బర్‌షా రచించిన శృంగారమంజరి—
శ్రీ బులుసు వేంకటరమణయ్య 17
ఉప్పొంగే నది—'శ్రీ నిఖిల్' 20
ప్రపంచ వ్యవస్థ—వెనుకబడిన దేశాలు—
శ్రీ వి. శ్రీరామచంద్ర 22
మరో ఉగాది—పోర్నంది సరోజ 27
'బ్రహ్మజ్ఞాన కళానిధి'—
డా॥ కేతవరపు వేంకటరామకోటిశాస్త్రి 28
నిరంతరద్వయం—శ్రీ మధురాంతకం రాజారాం 31
చాణక్యుని వాస్తవకథ—
శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి 36
శుభాకాంక్ష—'మనశ్రీ' 37
బండారు తమ్మయ్య—వీరశైవ వాఙ్మయసేవ—
శ్రీ సముద్రవు శ్రీ మహావిష్ణువు 38
పాతికేళ్ల పురావస్తు పరిశోధన—తెలంగాణా—
శ్రీ తేరాల సత్యనారాయణశర్మ 41
ఆనందనందనము—శ్రీ బులుసు వేంకటేశ్వరులు 43
శృంగారము—అశ్లీలము—శ్రీ పులిచెర్ల సాంబశివరావు 45
వేదంలో, ఆయుర్వేదంలో గర్భనిరోధ ప్రక్రియలు—
శ్రీ తిరుమల రామచంద్ర 47
దారి (సాహిత్య రూపకం)—
శ్రీ నూతలపాటి గంగాధరం 51
వారణాసి—శ్రీ శనగన నరసింహస్వామి 60
విద్యుద్విహంగం (రూపకం)—శ్రీ మిరియాల రామకృష్ణ 61
అధిక్షేపము—కవితానిక్షేపము—శ్రీ దాశరథి 64
తొలి తమిళ—తెలుగు నిఘంటువు—
డా॥ చల్లా రాధాకృష్ణశర్మ 65
ఆనందా!!—శ్రీ శ్రీనివాస కాశ్యప 66
అమ్మా భారతమాతా అంతరించావా!
పదిహేను శతాబ్దాలక్రితమే!—
అనువాదకులు: శ్రీ భోగరాజు కోదండరామశర్మ;
శ్రీ నిమ్మగడ్డ రావ్‌ప్రసాద్ 68
బ్రెన్‌గన్—శ్రీ సీరపాణి 72
జాజి పందిరి—శ్రీ మల్లాది సూరిబాబు 73
నిగమ శర్మోపాఖ్యానము-ఒకపరిశీలనము—
డా॥ నేలటూరి వేంకటరమణయ్య 77
కుట్టికవి తీవ్రావహేళన—శ్రీ పి. గణపతిశాస్త్రి 81
మొగిలీశ్వర క్షేత్రము—శ్రీ ఇరువారం లోకనాథం 86
తెనుగు కవుల కవితా చమత్కృతి—
కుమారి దాసరి శారద 89
ఆస్తికతలో జిజ్ఞాస వైశాల్యమెంత?
శ్రీ కొండిపర్తి శేషగిరిరావు 92

ముఖచిత్రం: **లేపాక్షి చిత్రము**

చిత్రకారుడు: శ్రీ వై. బాలయ్య, సిద్దిపేట.

ఈ 'ఆనంద' ఉగాది ప్రత్యేక సంచికతో పాటు ఒక ప్రతి ఆనంద సంవత్సర పంచాంగం ఉచితంగా ఏజెంటువద్ద తీసుకొనవచ్చును.

ఓమ్

# ప్రస్తావన

కొన్ని నెలలుగా భారత దేశంలోని వివిధ పత్రికలు తీవ్రమయిన కాగితం కొరతకి గురి అవుతూ వచ్చాయి. ఈ కొరత ఇప్పుడప్పుడే తీరిపోయేట్టు కనిపించదు. ముందు ముందు మరికొంత తీవ్రం అయితే కూడా కావచ్చు. పోయిన సంవత్సరం మధ్య భాగంలో ఉన్న న్యూస్‌ప్రింట్ వెల క్రమంగా పెరుగుతూ వస్తోంది. త్వరలో అది ఆ వెలకి రెండు మూడు రెట్లు అయిపోవచ్చు. న్యూస్‌ప్రింట్ వెల అధికం కావటమేకాక దొరకటంకూడా కష్టం అవుతోంది. పత్రికలకి సంబంధించినంతవరకు ఈ ఇబ్బంది ఇంత కొట్టవచ్చినట్లు కనిపిస్తోంది కాని, అది దేశం ఎదుర్కొంటున్న ఎన్నో ఇబ్బందులలో ఒకటి. భారత దేశంలో అన్ని రకాల ఉత్పత్తి అభివృద్ధి కావలసినంత అభివృద్ధి కావటం లేదు. దీనికి తోడు ప్రభుత్వం లోటుదారీ ద్రవ్య విధానాలని అనుసరించటానికి వెనుదియ్యటం లేదు. దీనంతటి ఫలితంగా నిత్యజీవితానికి కావలసిన వస్తువుల వెలలు అన్నీ ఎంతో వేగంగా పెరిగిపోతున్నాయి. నేటిదాకా దేశాన్ని పాలించే వారిలో ఈ సమస్య పరిష్కారానికి అవసరమయిన చైతన్యం కలిగినట్లు తోచదు. ఈ సారి తయారయిన బడ్జెట్టులో కనిపించే లోటుకన్నా కొన్ని రెట్లు పెద్దదయిన లోటు తేలవచ్చు. భారతదేశంలో అక్కడక్కడా చెలరేగే అలజడులు ఒక విధంగా ప్రజలలో చెలరేగే అసంతృప్తికి ప్రతిబింబాలనిగూడా అనవచ్చు.

అరబ్బు దేశాలు, ఇస్రాయెల్‌ల మధ్య జరిగిన యుద్ధంతోబాటు పెట్రోలు కొరత సమస్య ఒకటి బయట పడింది. ఆధునిక ప్రపంచంలో భూమిలో దొరికే ఈ పదార్థానికి అద్వితీయమయిన ప్రాముఖ్యత ఉంది. రవాణా, రసాయనిక పరిశ్రమలు మాత్రమే కాక ఆహార పదార్థాల ఉత్పత్తికూడా పెట్రోలుమీద ఆధారపడుతున్నాయి. అరబ్బు దేశాల వారు ఒక్కసారిగా పెట్రోలు ధరని పెంచి వేశారు. దీనితో ముడి చమురు దిగుమతి చేసుకునే దేశాల కర్చులు విపరీతంగా పెరిగిపోయాయి. అన్ని రంగాలలోనూ అభివృద్ధి సాధించటానికి ప్రయత్నించే భారతదేశం వంటి దేశాలకి ఇదొక పెద్ద దెబ్బగా పరిణమిస్తోంది. ఇంధనంగానేకాక కృత్రిమంగా తయారయ్యే ఎరువుల ముడిపదార్థంగా ఉపయోగపడే పెట్రోలు పదార్థాలు ప్రియం అవటంతో విదేశీ మారకం సమస్యలు దుర్భరంగా కనిపిస్తున్నాయి. పెట్రోలు పదార్థాల వెలలు పెరిగిపోవటం వలన ప్రపంచం అంతటా ఎన్నో రకాల తయారీల వెలలుకూడా పెరిగిపోతాయి. దీని ఫలితంగా ప్రపంచం మొత్తంమీద అభివృద్ధి కార్యక్రమాలలో కొంత మార్పు రావటానికి అవకాశం ఉంది. పారిశ్రామికోత్పత్తిమీద పెట్టుబడి కర్చులు విపరీతంగా పెరిగిపోతే వెనుకబడిన దేశాల అభివృద్ధి పథకాలు వెనకబడుతాయి. భారత దేశంలో కనిపించే ఎన్నో సమస్యలు ఈ విధంగా ప్రపంచం మొత్తంమీద కనిపించే పెద్ద సమస్యలలో ఒక భాగం మాత్రమే అని ఊహించినా తప్పులేదు.

సమస్యని గుర్తించిన తరువాత దాని పరిష్కారంకోసం తగిన ప్రయత్నాలు చెయ్యాలి. తటస్థ విధానం అనుసరిస్తామని చెప్పుకునే వారికి ప్రపంచంలో అన్ని దేశాలతోనూ స్నేహ సంబంధాలు పెంచుకొనటానికి నేడు కొన్ని అవకాశాలు ఏర్పడుతున్నాయి. అమెరికా సంయుక్త రాష్ట్రాలతో సైనిక ఒప్పందాలు చేసుకున్న పాకిస్తాన్ ఆ దేశంతోనేకాక కమ్యూనిస్టు చైనా, రష్యాలతోకూడా స్నేహంగా ఉండగలుగుతోంది.

అమెరికా అధ్యక్షుడు చేయివా, రష్యాల పర్యటనలు చేశారు. అమెరికా సంయుక్త రాష్ట్రాలతో సోవియట్ యూనియన్ అన్ని రకాల వాణిజ్య సంబంధాలనీ పెంచు కొనటానికి పూనుకుంటోంది. భారత దేశంలో అధి కారంలో ఉన్న వారందరూ ఈ పరిణామాలని గమ నించటంలో తప్పులేదు. ప్రపంచం అంతటా పరస్పర సహకారంకోసం ఇన్ని ప్రయత్నాలు జరుగుతూ ఉంటే భారతదేశం వెనుకబడరాదు. పరస్పర సహకార సిద్ధాం తాలని అంతర్జాతీయ రాజకీయాలలోనే కాక దేశంలో కూడా అనుసరించాలి. భారతదేశం అంతా ఒకటే అనుకున్నప్పుడు ప్రాంతీయ దురభిమానాలకి తావు ఇచ్చి వివిధ ప్రాంతాలమధ్య ద్వేషాలని పెంచటం మంచిది కాదు. శివసేన వారు బొంబాయిలో మహారాష్ట్రులకే కొన్ని ఉద్యోగావకాశాలు ఉండాలంటున్నారు. వీరి ప్రాంతీయ సిద్ధాంతాలకి ఆంధ్రప్రదేశ్‌లో ప్రత్యేక మయిన గౌరవం లభిస్తోందంటే అతిశయోక్తి కాదు. ఆరు సూత్రాల పథకంద్వారా ఆంధ్రప్రదేశ్ ఎన్నో ప్రాంతాలుగా చీలిపోతోంది. ఆనంద సంవత్సరం అంత ఆనందం తీమకు వచ్చేదిగా కనిపించటం లేదు!

ఆంధ్రపత్రిక ఆనంద సంవత్సరాది సంచికకి తమ రచనలు, చిత్రాలు పంపిన వారందరికీ మా ధన్య వాదాలు తెలుపుకుంటున్నాము. ఇక ముందుకూడా ఎప్పటిలాగే రచయితలు, రచయిత్రులు, చిత్రకారులు ఆంధ్రపత్రికకి తమ రచనలు, చిత్రాలు పంపి, మాతో సహకరిస్తారని ఆశిస్తున్నాము.



# ఆంధ్రపత్రిక ఆనందనామ సంవత్సరాది సంచిక

బహుపుష్ప గంధ సంభారముల్ మోయుచు
కదలి సాగెను మెల్ల గంధవహుడు
చివురుల పూవుల చిన్ని పిందెల నిండి
వరలె నామ్రము భాగ్యవంతు పోలి
కోకిలరవము దిక్కుల నిండి మాధవు
పెండ్లి సన్నాయినా ప్రీతి నింపె
నేలనాల్గు చెఱంగులు నింగికూడ
బహుళ శోభాన్వితమ్ములై వరలె మిగుల
రమ్యమధుమాస వేదా విరాజమాన
మానసమ్ముల జనులు సమ్మాన్యులైరి!!

సినిమాల దాంపత్య చిత్ర చిత్రమ్ముల
పరికించె పనివడి బ్రహ్మచారి
చైత్ర వైశాఖ మాసముల పెండ్లి ముహూర్త
ములు లేవనుట విని సాగిరె కన్య
శిశిరాన పుట్టిల్లు చేరి వసంతమ్ము
నగమైన రాకున్కి నగవె భర్త
సాంతమ్ము చదివె వాత్స్యాయన కామ సూ
త్రము లర్థ సహితమ్ము రసికమౌళి
ఎంత చోద్యము పట్టింపు లెల్లపోయి
ఇరువురొకరైరి నడుమ తీర్పరియు లేక
మధుర మధురమాస బహుళ సంపదలు పొదలి
తెలుగు భూముల విహరించి దీప్తినింప!!

ఆమని సంపద లరయుగా లేనట్టి
కాకము పికముపై కాలు దువ్వె
వనభూమి శోభలు కనిపింప దిరిగెడు
హరిణ శాబములపై కుతికె పులులు
తలపెద్ద యువతి చిత్రము పెల్లు ఘూర్ణిల్ల
జంటల భాగ్యమ్ము కంట గించె
పేరి శాఖల ప్రేమమీఱ సల్లాపించు
శారికలను తన్ని పితలేగ
ప్రకృతి పులకించి సొగసుల పంటపండ
ననుభవించెడు జీవుల నరయలేని
కుమతి వర్గమ్ము వెలికిద్యగోరి వేడ్క
మాధవస్వామి పొనరించె మహిమ లెన్నొ!!

ప్రేయసీ ప్రియులను ప్రేమ సూత్రమ్మున
బంధింప నేర్చిన భావుకుండు
ఆమ్ర పల్లవముల కౌషధ స్థితి జేర్చి
కోకిల గానమ్ము కూర్చు వెజ్జ
ఈ వమ్ము శీతమ్ము దూపటునట్లుగా
మలచి పేర్పడసిన మాంత్రికుండు

తరులు లతలు పూయ గలపి సుగంధమ్ము
పంచి పెట్టెడు మహాభాగ్యశాలి
జీవలోకమ్ము క్రొంగ్రొత్త సిరుల దనిసి
అనుప మానందమొందజేసిన మనస్వి
మాధవుండు విహారసంపదలు చిలుక
తెలుగు సీమంతినికి క్రొత్త చెలువమబ్బె!!

తెలి పట్టు పుట్టమ్ము తెరచి కప్పిన రీతి
తరుశాఖికల పూల హారువు మీఱె
జలము పైని నిశ్చలములై వికసించె
నలినముల్ యోగిహృన్నలినములన
వనశులు నవ్యశోభా భాసితమ్ములై
ఆప్త బంధుల ప్రేమలట్లు క్రాలె
యువతులు యువకులు నొప్పిరి చంద్రశీ
తల శుభ్రకాంతుల పొలుచు ప్రేమ
సంధ్య వేళలు పుష్పసౌగంధ్య మొలయ
దరియు నర్థాంగు లట్లు చిత్తములు దన్ప
రమ్య మోహనతలు తన రాజ్యమందు
సరసుడై పంచె ప్రజకు వసంతన్పుడు!!

తిరిగి కోరిన పతి సరసి దినత తోప
అలియుట కనులతో తెలిపె కాంత
పడచి దూరపు ప్రయాణము చేసి వచ్చిన
కాంతుని శ్రమదీర కౌగిలించె
పతికడ తనకోర్కి బయల సుబ్బ గనిక
సాధించుకొనె నెరజాణ కాన
అలి నోకగా నాటలాడుచున్నటు చేరి
తన యూహ చెల్లించుకొనె ప్రియుండ
మన్మధుని యాజ్ఞ నెరవేర్ప మాధవుండు
కోరి సర్వాత్మనా అనుకూల యత్న
మొనరించెను ప్రేయసీప్రియులమనయములు
ప్రార్థనలు విస్మరించు టేర్పడునటు !!

శెఫాలికా లత చివురు వ్రేళులు చాచి
చెంత నామ్రము గిలిగింత పెట్టె
హాళాళి చిక్కు తీయగ నెంచు వడువున
సువిద వక్షోజమ్ము లొత్తె ప్రియుడు
లలిత సరోజ నాళములేర్చి కరిణికి
కరి నోటి కందించె మురుసెనంగ
సుమపాత్ర తేలియ సొక్క త్రావగ జేసి
ప్రియను ముద్దిడె నళి ప్రేమ చిందె
శారికా కీర కోకిల వారమెల్ల
అనుపమానందమున హళాహళి యొనర్చె
చెప్పతరమె వసంతుండు చేసినంత
వందనము డిగ్గె పుడమి ననంగ మిత్ర!!

కోకిల కూజనమ్ము కొలఁగావి యీఁగాక
మధువు చిందెడు గాన మహిమ చాలు
అలిరావమల్పమ్మె పిలుపు దక్కెనేమి
శ్రుతిపేయ నాదమ్ము మతిరహించు
హరిణ యూధములచే నబ్బు లాభము కాన
మైన కన్నులపండువగును చూడ
శారికా కీరముల్ సమకూర్చునది లేదు
కసవిన హృదయమ్ము తనివిసెందు
ఒక మహోద్భుతశక్తి మహోన్నత మఱియు
చేరగ వసంతన్నపుడు విశ్వమహిమ
సర్పములు కూడ నందగా నునువు పఱచి
ఇంద్రజాలికుఁడనగ వహించె కీర్తి!!

అడవి పర్ణకుటీర మందుండు తపసికి
చిత్త చాంచల్యమ్ము హత్తుకొనియె
వయసుమీఱుట కొట్టవచ్చినట్టుగ నుండ
కైసేతలన్ దాచగడగె వృద్ధ
తారుణ్య ముడిగిన నారీమణిని చింత
తరుమ రేయెల్ల జాగరము చేసె
చదువుకు స్వస్తివాచకము చెప్పి వివాహ
మాడె విద్యార్థి యూహలు ఫలింప
ఎంతకని వేడుచూడ వసంతు డౌర!
స్వస్థచిత్తుల చిత్తముల్ శాంతిలేక
మటమటింపంగ జేయుచు నాట బొమ్మ
లట్లు త్రిప్పగసాగె ప్రజ్ఞాన్వితుండు!!

విశ్వ మెన్నటి లోక పిన్నజాలిక నేడు
వక్షస్థలమ్ముపై వర్ష నైచె
పుట్టిన దాదిగా పుష్టిగా నుండక
బక్క చిక్కిన పెయ్య బలిసె మిగుల
పొలముల పుంతల పులుమేయు నాబోతు
జంకక కొల్లువ్వి అంకె వైచె
పాలియుదనుచు మేపక యూరకొన్నట్టి
బర్రె పాలొసగె నిబ్బడికి మించి
సర్వసౌఖ్యము లొసగుచు సకల జీవ
లోకము రహింప తానతిలోక శక్తి
ప్రత్యణువు నందు నింపి పేర్వడసె కోరి
తెలుగునేల వసంతుండు కొలువు తీరి!!

గులుకొ రసాలమ్ము కుసుమాస్త్రరథ మొప్ప
క్షేత్ర గజమ్ముగా నంతరించి
మదకోకిలారావ మంజు వాద్యము లెల్ల
శ్రుతి పేయమ్మె శుభస్థితి దలిర్ప
అల్లిబిల్లిగ వల్లు పుల్లల తాజాల
మొప్పిన ధనువుగా గొలువు గొలువ
అళివంతతుల మనోహరమ్మైన గుణముగా
ధనురంగముల యందు నమువు పఱచి
కుసుమ నికరమ్ము విశిఖులై కొమరు మిగుల
సఖుడగు వసంతునిం గూడి సర్వలోక
ములు జయింపంగ వచ్చెడు లలితమూర్తి
మదను డెల్లరనెల్ల సంపదల దనుపు!!

("ఋతుహేల" కావ్యమునుండి)

# వాసర శ్రీ సరస్వతీ క్షేత్రము

శ్రీ పి. ఆర్.

ఆంధ్రప్రదేశ్‌లో గోదావరినదీ తీరమున వాసర యందు వెలసియున్న శ్రీ మహాసరస్వతీక్షేత్రము మహామహిమాన్వితమై, దివ్య ప్రభాయుతమై, వేలాది భక్తులకు భుక్తి, ముక్తి దాయకముగా విలసిల్లుతున్నది. స్థలమా — గౌతముడు దివినుంచి భువికి తెచ్చిన అపరగంగ పవిత్ర గోదావరి తటము. మూర్తియా — ఆ హాటకుగర్భురాణి, జగదాంబ, శ్రీ మహాసరస్వతి. క్షేత్రమా — సకల శృతి, స్మృతి పురాణేతిహాసాదులను రచించి పరబ్రహ్మావతారమైన అపరబ్రహ్మ వేదవ్యాసుడు అవిరళ తపస్సు చేసి అక్కడ ధారపోసిన పవిత్రమూర్తి మంతము.

## త్రి పు టి

మహాసరస్వతీ, మహాలక్ష్మి. మహాకాళీ మూర్తులు మూడూ ఒక్క ప్రదేశములో త్రిపుటియైన దేవతాక్షేత్రముగా వాసర కీర్తింపబడు



వాసర క్షేత్రమందలి మహాసరస్వతీ విగ్రహము జగద్గురు శ్రీ శృంగేరీ మహాస్వాములవారు సమర్పించిన పట్టు వస్త్రముల అలంకరణములతో

తోంది. ఈ క్షేత్రమునకు సమీపంలో రవీంద్రపురము, రేణుకాపురము, మహతీపురము. రత్నపురము ఉన్నవి. వ్యాసపురముతో బాటు అన్ని పురములలో శ్రీ ఆంజనేయస్వామి విగ్రహాలు ఉన్నవి. ఇప్పుడు ఆ పురములన్నియు కలిపి వాసరపురిగా భాసిల్లుతున్నది. వ్యాసపురి వాసరయై ప్రస్తుతం "బాసర్"గా పిలువ బడుతోంది.

## రా క పో క లు

ఆదిలాబాదుజిల్లా భైంసా తాలూకాలో ఈ గ్రామము ఉన్నది. కాచిగూడా—మన్మాడ్ రైలు మార్గంలో నిజమాబాదు తర్వాత నాల్గవ రైలు స్టేషన్ ఇది. నిర్మల నుంచి బస్సులు ఉన్నవి. స్టేషన్ నుండి అమ్మవారి మందిరమునకు మైలున్నర దూరము గలదు. దేవాలయము నుండి గోదావరి ఒడ్డుకు ఆరు ఫర్లాంగులు ఉన్నది. స్టేషన్ నుండి దేవాలయానికి, దేవాలయం నుండి గోదావరికి రస్తా ఉన్నది. స్టేషన్‌నుంచి దేవాలయానికి రిక్షాల్లోను, బళ్ళలోను, కార్లలోను పోవచ్చు.

## అష్టతీర్థ సరోవరం—గోదావరి తీర్థములు

ఆలయములోనికి వెళ్ళడానికిముందుగ అష్టతీర్థ సరోవర దర్శనం అవుతుంది. పూర్వ దిశను ఇంద్రతీర్థము, పశ్చిమదిశ విష్ణుతీర్థము, ఆగ్నేయదిశ సూర్యతీర్థము, దక్షిణదిశ వ్యాసతీర్థము, నైఋతి దిశ వాల్మీకితీర్థము, ఉత్తరదిశ పుత్రతీర్థము, ఈశాన్యదిశను శివతీర్థము, సరోవరం మధ్యలో శ్రీ సరస్వతీతీర్థము అలరారుచున్నవి.

సరస్వతీ మందిరమునకు పూర్వదిశన దాదాపు మైలు దూరములో గోదావరి ఒడ్డున ఇంద్రేశ్వరము, అరమైలు దూరములో సూర్యేశ్వరము, ఉన్నవి. మందిర పార్శ్వభాగమున, శ్రీ సరస్వతీ తీర్థమునకు దక్షిణతీరమున వ్యాసేశ్వరము, మందిర ప్రాకారాంతర్భాగమున దక్షిణమున వాల్మీకేశ్వరము అను తపోస్థానములు ఉన్నవి.

## ఋషుల తపోభూమి

వాసర గ్రామమునుండి రైలుకు వెళ్ళేదారిలో కుడివైపున నారాయణేశ్వరమున శ్రీ వేంకటేశ్వర ఆధారాధనా మందిరము ఉన్నది. వాసర గ్రామమునుండి మందిరమునకు వెళ్ళు పర్వతమార్గమున శ్రీ గణేశ తీర్థము, మందిరమునకు పూర్వదిశను స్కంధేశ్వరము, ఉత్తరదిశ యందు మైలుదూరంలో శివేశ్వరము గలవు. పాపనాశేశ్వరము, ఋషి సభా మండపమను పేర ప్రసిద్ధి చెందియున్నది. అమ్మవారికి ఎదురుగా గుట్టపై సరస్వతి పుట్టిన చోటు అని అంటారు. అక్కడే నరహరి మాళ్వా అను మహారాష్ట్రకవి అమ్మవారిని గూర్చి తపస్సుచేసి సుప్రసిద్ధుడైనాడు. వ్యాసుడు, భరద్వాజుడు, గౌతముడు, కశ్యపుడు, విశ్వామిత్రుడు, అంబరీషుడు, జమదగ్ని, వశిష్ఠుడు, అగస్త్యాది మహా మునీంద్రులిట తపస్సు చేశారని ప్రశస్తియున్నది. గుడి నుండి వూళ్ళోకి వెళ్ళే దారిలో చతుర్వేదవతి, చదువులమ్మ అనే చతురస్రాకార స్తంభము ఉన్నది. నాల్గువైపులా అనేక రకాల సంగీత ధ్వనులు వినిపిస్తూ ఉంటాయి. నాల్గువేదాలకు అది ప్రతీక.

## వ్యా సు ని గు డి

అష్ట సరోవర తీర్థమునకు ఒక ప్రక్కన వ్యాసమహర్షి గుడి ఉన్నది. గోదావరి తీరమున శివాలయము ఉన్నది. కొందరు భక్తుల సమాధులు ఉన్నవి. గోదావరి ఒడ్డున యాత్రికులకు స్నానఘట్టము నిర్మాణము చేస్తున్నారు. అష్టతీర్థ సరోవరములో శ్రీ శారదాంబ నిరాకార రూపములోనే ఉన్నదని వ్యాసుడు వచించినాడు. ఈ క్షేత్రమహాత్మ్యము బ్రహ్మాండ పురాణములో బాగా తెలుపబడినది.

మహాభారత యుద్ధము ముగిసిన మీదట వేదవ్యాసుడు ఆత్మ శాంతి కోసం దక్షిణభారతావనికి వచ్చారు. ఇక్కడ గోదావరి తీరమున తపస్సు చేసి ఇసుకతో ఈ మూర్తి నిలిపినారు. కాశ్మీరములోను శ్రీనగర



వాసర క్షేత్రమందలి మహాలక్ష్మి

మందును, రెండవది పుష్కరతీర్థములోను, మూడవది వాసరలోను విలసిల్లుతున్న శ్రీ సరస్వతీమతల్లికి 'సార్థపీఠత్రయవాసినీ' అని వర్ణన ఉన్నది. నాల్గవది శృంగేరి శ్రీ శారదాచంద్రమౌళీశ్వర పీఠము ఆదిశంకరులు స్థాపించినది.

**సరస్వతీ మందిరము**

సరస్వతీమందిరము గోదావరికి తూర్పున ఉన్నది. అమ్మవారు ఉత్తర ముఖముగా ఉన్నది. ఆలయంలోనే శ్రీ మహాసరస్వతీ ప్రధాన పీఠముపై వీణాపుస్తక పాణియై ఉన్నది. గర్భాలయమునకు ముందు దక్షిణ పార్శ్వమున మహాలక్ష్మి విగ్రహము నెలకొల్పబడియున్నది. మహాకాళి విగ్రహము ఆలయము బయట నెలకొల్పబడియున్నది. మహాకాళి విగ్రహము ఎత్తున బడినది. అమ్మవారికి ఎదురుగా శివలింగము, నందీశ్వరుడు గణపతి విగ్రహములు అమ్మవారి పాదుకలు, శ్రీ చక్రము ఉన్నవి. 17వ శతాబ్దమున రోహిల్లాల దండయాత్ర చేశారు. రేణుకాపురం పటేల్ ఆ దుర్మార్గుల దాడిని ఎదిర్చి ప్రస్తుత మందిరాన్ని నిర్మించారు. ఆయన విగ్రహం దేవాలయములో అమ్మవారికెదురుగా ఒక ప్రక్కన ఉన్నది

**జీర్ణోద్ధరణ**

ప్రస్తుతము ఉన్న వ్యాసుని సైకతమూర్తి, శ్రీ సరస్వతీ విగ్రహము — మహాకాళీ మహాలక్ష్మివిగ్రహములు హరిహరరాయ, బుక్కరాయల కాలపు విద్యారణ్య స్వాముల వారిచే మరల స్థాపించబడినవి. మహాలక్ష్మి విగ్రహమును కాశీనుంచి తెచ్చినట్టు ప్రతీతి. ఆలయ ప్రాంగణములో చెట్టుక్రింద దత్తాత్రేయపాదుక లున్నవి. భక్తులు ప్రదక్షిణము నందు ఆ పాదుకల నర్చిస్తారు. శివరాత్రికి, నవరాత్రులకు ఇక్కడ అశేషము భక్తులు వచ్చి అమ్మవారిని దర్శించి కానుకలు అర్పిస్తారు. శృంగేరి జగద్గురు శ్రీ శారదాచంద్రమౌళీశ్వర పీఠాధిపతులు శ్రీ మదభినవ విద్యాతీర్థస్వాముల వారిచే ఈ క్షేత్ర జీర్ణోద్ధరణ కార్యక్రమం కొద్ది సంవత్సరాల క్రితం ప్రారంభమైనది. తిరుమల తిరుపతి దేవస్థానము సత్రము నకు వారు శంకుస్థాపన చేసినారు. రెండున్నర లక్షల రూపాయలతో ఆ సత్రములు రెండుపూర్తి అయినవి. ఆలయం చుట్టు ప్రాకారమండపం నిర్మాణంలో ఉన్నది. మాజీముఖ్యమంత్రి శ్రీ పాములపర్తి వెంకటనరసింహారావు దేవాదాయశాఖామంత్రిగా ఉండగా వాసరక్షేత్ర ఉద్ధరణకు వారి అధ్యక్షతన ఒక సంఘం నియమించారు. అది కాగితముపైనే ఉండిపోయినది. జీర్ణోద్ధరణ కార్యక్రమం మందంగా నడుస్తోంది. కనీసం పది లక్షల రూపాయలతో అమ్మవారికి కొత్తమందిరం, రెండు గోపురాలు నిర్మాణం చేసే ప్రయత్నంలో ఉన్నారు. సాలీనా ఆదాయం 25 వేలనుంచి 30 వేల రూపాయల దాకా ఉంటుంది.

అమ్మవారిని గూర్చి రోజులకొద్దీ, మాసాల కొద్దీ తపస్సుచేసి అమ్మవారి అనుగ్రహాన్ని పొంది భక్తులు ఈప్సితార్థసిద్ధిని పొందుతూ ఉంటారు. అమ్మవారికి చీరెలు, రవికలు, నగలు, కొబ్బరికాయలు సమర్పిస్తూ ఉంటారు. జగద్గురు శ్రీ శృంగేరిస్వాములవారు తమ పర్యటనలో అమ్మవారికి పట్టుచీరెలు, బంగారము, వెండి కానుకలు సమర్పించారు.

తపస్సుచేసిన వారి చేతుల్లో రాగిదమ్మిడీలు, ప్రక్కలలో అరటిపండ్లు, కొబ్బరిచిప్పలు అమ్మవారు పడవేస్తూ ఉంటుందిట. నిలకడగా తపస్సు చేసేవారు అర్చకుల ఇండ్లకు వెళ్ళి మధూకరము చేసుకుంటూ ఉంటారు. మహారాష్ట్ర, ఆంధ్ర, ద్రవిడ, కేరళ, దేశముల నుండి ముఖ్యంగాను, యావత్ భారతదేశము నుండి ఈ క్షేత్రాన్ని దర్శించి భక్తులు జ్ఞాన, వైరాగ్యాలను మనోరథాలను పొందుతూ ఉంటారు.

శ్లో. యాకాళీ కమలాది నారివినుతా యామౌక్తికా భూషణా
యాసృష్టి, స్థితి, నాశకారిణి పరాయాభూత పంచాత్మకా
యానేతీతి నిషేధితాఖిల మయాయా సర్వ ధాత్రీపరా,
సా పుష్ణాతు సరస్వతీ భగవతీ మాం వాసరావాసినీ !



వాసరలోని మహాకాళి

# జానపద సాహిత్య సంపద...

# కపిలిపాటలు

డా॥ ఎస్. గంగప్ప

రోజులు మారుతున్న కొలదీ సాంఘిక వ్యవస్థలోను, పనిపాట్ల లోను మార్పులనేకం కలుగుతున్నాయి. విజ్ఞానశాస్త్రాభివృద్ధి ఈ మార్పులకు అవకాశం కల్పిస్తూంది. యంత్ర ప్రాధాన్యం గల ఆధునిక యుగంలో మానవజీవితం సైతం యాంత్రికంగా మారిపోయింది. దీనివల్ల కొన్నిఅలవాట్లు మరచిపోయి మరికొన్ని కొత్తపద్ధతుల్ని అల వరచుకోవడం జరుగుతూంది.

ఇతర జానపద గేయాలలాగే 'కపిలి' పాటలు ఈనాడు విస్మరించ బడుతున్నాయంటే ఆశ్చర్యపడాల్సిన పనిలేదు. మరి కొంతకాలంలోనే 'కపిలి' అంటే ఏమిటో తెలియని స్థితి ఏర్పడవచ్చు. 'విద్యుచ్ఛక్తి' ప్రయోజనంవల్లా, ఆనకట్టల నిర్మాణం వల్లా, 'కపిలి' ప్రాధాన్యం తగ్గి పోతోంది. 'విద్యుచ్ఛక్తి' లేనిచోట'ఆయిల్ ఇంజన్'ల వల్ల నీళ్లు తోడడం జరుగుతూంది. 'కపిలి' ప్రాధాన్యం తగ్గినకొలదీ 'కపిలిపాటల' ప్రయోజనం సైతం సన్నగిల్లుతుంది.

'కపిలె' అన్న గ్రాంథిక శబ్దానికి 'కపిలి' అన్నది వ్యావహారికరూపం. ఇది రాయలసీమలో ముఖ్యంగా అనంతపుర మండలంలోని వాడుక. కొన్ని రాయలసీమ ప్రాంతాలలోను, సర్కారు జిల్లాలలోను 'మోట' అంటారు. 'కపిలి' తోలేవాళ్లలో ఒకడు బావి బోరిచివరి నుంచి మోకు పట్టుకొని వస్తూ ఉండగా, బాన బావిలోనికి పోతూ ఉంటుంది. ఆ సమయంలో బిళ్ల తిరుగుతూంటే కిర్రుమనే శబ్దం ఉత్పన్నమవుతుంది. దాని ఆరం భంలో ఒబ్బుమీద ఉన్న మరొకడు కపిలబిళ్ల, పొర్లు శబ్దాలు శ్రుతి కాగా పాట అందుకొంటాడు., కపిలి బాన నీళ్లతో నిండడానికి ముంపు తొక్కుతాడు. ముంపు తొక్కడంపూర్తి అయ్యేసరికి పాటసైతంపూర్తి అవుతుంది. వెంటనే ఎద్దుల్ని అదల్చి తోలుతూ, మోకుమీద కూర్చుండి బిళ్ల, పొర్లు శబ్దాలకు తన గొంతు జతచేసి రాగం తీస్తూ, బోరి చివరికి వెళ్లేసరికి కేకవేసి ముగిస్తాడు. ఇది మామూలుగా 'కపిలి పాట' పాడే పద్ధతి. వ్యవధి తక్కువ గనుక రెండేసి పాదాలు ఒక్కొక్క విషయ సం బంధి అయిన పాటగా, దేనికదే స్వయం వ్యక్తం చేసేదిగా ఉంటుంది. ఇది కపిలిపాట స్వరూపం.

రాయలసీమలో ముఖ్యంగా అనంతపురం మండలానికి సంబంధిం చిన ఇతర జానపద గేయాలలాగే 'కపిలి పాటలు' అనేకం సేకరించి, 1958 లోనే 'స్రవంతి' లో ప్రొఫెసర్ తూమాటి దోణప్పగారు వ్యాసం ప్రకటించారు. రాయలసీమ జానపద సాహిత్యానికి ప్రొఫెసర్ దోణప్పగారు గావించిన సేవ అనన్యసామాన్యమూ, ప్రశంసనీయమూను. ఇతర జానపద గేయాలలాగే కపిలిపాటల్ని సైతం సేకరించాను. వాటికి సంబంధించిన పరిశీలనమే ఈ వ్యాసోద్దేశం.

సామాన్యంగా రైతులు తెల్లవారు జామున లేచి సేద్యం పనుల్లో నిమగ్నులు కావడం పరిపాటి. మనస్సుకి, శరీరానికి ఉదయాన ఉత్సాహంగా, ఉల్లాసంగా ఉండి పని బాగా జరుగుతుంది. ఎండ ముండే సమయంలో కంటే ఉదయాన చల్లగా ఉండి కపిలి నీళ్లు బాగా తెములు తాయి. కపిలిబిళ్ల, పొర్లు శబ్దాలతోపాటు కపిలివాని పాట నిశ్శబ్దంగా ఉన్న ప్రకృతిలో ఎంతో మనోహరంగా ఉంటుంది. ఏదేని కార్యారంభంలో తన్నిర్విఘ్నార్థం భగవత్ప్రార్థన చేయడం మనకు పరిపాటి. అదే విధంగా కపిలివాడు సైతం ప్రారంభంలో ఈ క్రింది పాటలు పాడడం, దైవ ప్రార్థన చేసి తనకు సాయం కోరడం జరుగుతుంది. ఆ ప్రార్థన ఇలా ప్రారంభమవుతుంది.

"బావికి నేమొచ్చినాము మేలుకొమ్మా బావి గంగా
బావి గడ్డన బాలలున్నాం బాగా కాపాడు తల్లీ!
"నీళ్లగంగా బావిగంగా పరమటా పాతేటి గంగా
పాతేటికి పోవల్ల గదరా పాలజలకమాడ వల్లా",

"ఏనిగంతా కపిలిమీదా ఎక్కితోలె దొక్కనాడూ
ఆడుదాని బొమ్మలపైనా (15) జాజవాడేదీ కొంతసేపో"

(15. నాదము.)

నాయిక కలయిక తరువాత కలిగిన ఫలితాల్ని ఈ విధంగా చెప్పి వాపోతున్నాడు నాయకుడు—

"(16) బావయ్య వరసవుడూ బాగుంటేమోపాపో
17) కదిరివరసకు పోయీ (18) కెంటయితె మోసాపో"

(16. బాబయ్య ఉరుసు— పెనుకొండలో వెలసిన 'బాబాదుర్గా'లో ప్రతి సంవత్సరం జరుగుతుంది. మహమ్మదీయులకే గాక హిందువులకు కూడా ఈ ఉరుసు ఎంతో పవిత్రమైందిగా పరిగణించబడింది. తండోపతండాలుగా ప్రజలు బాబాదర్గాని దర్శించి తమ భక్తి ప్రపత్తుల్ని ప్రకటించుకొంటారు. హిందూ ముస్లిం సమైక్యానికి పరమ నిదర్శనం. 17. కదిరి నరసింహస్వామిరథోత్సవం— ప్రతి వత్సరం ఫాల్గుణమాసం పౌర్ణమినాడు జరుగు తుంది. దీనినే కదిరి పున్నమి అంటారు. 18. కంటు— శతృత్వం)

ఈ పాటలో బాబయ్య ఉరుసు సమయానికి అన్యోన్యంగా ఉన్న నాయికానాయకులు కదిరివరసకు పోయినందువల్ల వైమనస్యం కలిగిందట. ఇ తెగాదు—

"ఎర్రపిల్లా నిన్నుగూడీ ఎముకలన్నీ (19) ఎరుపోడా
నల్లపిల్లా నిన్నుగూడీ కండలే సింగారమాయో"—

(19. ఏర్పడెను.)

ఎర్రపిల్లను కూడుటవల్ల ఎముకలగూడైపోయాడట! నల్లపిల్ల కలయికతో 'కండలు సింగార'మయ్యాయట పాపం! వానిలో దుస్థితి స్పష్టం చేయబడింది.

పులిజాడ అని సందేహించి వెంటనే అది ఎర్రపిల్లజాడ అని తెలుసుకొని ఒకడు మురిసిపోతున్నాడు—

"పోలేవల్లి గుట్టల్లోనా పోతాదన్న పులిజాడా
పులిజాడ కాదురన్నా ఎర్రపిల్ల కాలిజాడా"

ఈ క్రింది పాటలో ఔపమ్యం ఉచితీ సహజమై ఉంది. మిద్దె మీది మిరపచెట్టు నీళ్లులేక వాడిపోయినవిధంగా మగడు లభించక పోవడం వల్ల మామగారి ఆడుబిడ్డ లేచిపోయిందట.

"మిద్దిమీది మిరపచెట్టు నీళ్లులేక వాడిపోయా
మామగారి ఆడుబిడ్డా మొగుడులేక పారిపోయా."

ఒక స్త్రీ చెప్పిన మాటలను నమ్మి మోసపోయి వాపోతున్నాడు ఒక నాయకుడు—

"ఒంటి ఒంటీ చినుకలవుడు వుంటిరా దానింటి వెనకా
20 దూడదాని మాటలాకీ దుప్పిటీ రుమాలు 21 తొడిసో"

(20. యుక్త వయస్క, 21. తడిసెను.)

తన వూరు మరవవద్దని ప్రియురాల్ని ఈ క్రిందివిధంగా కోరుకొంటాడు ప్రియుడు—

"పోతావే చిన్నదానా పోకవనములా దాటి
మగ్గల్లా మా వూరు మరచిపోతావా"

తన అభిప్రాయం తెలుపవలసిందనీ, నిశ్చయంగా తెలిస్తే 'నిమ్మళంగా' నిద్రపోతాననీ ఒక నాయికతో అంటున్నాడు నాయకుడు—

"ఒస్తానంటే ఒస్తాననవె రాలేదంటే రాలేదనవె
రెండు మాటలు నాకు దెల్పా నిమ్మళంగా నిద్రపోదూ"

పామరుల శృంగారంలో కొన్ని నియమాలుసైతం ఉన్నాయి. ఏదైనా నియమ రహితమైతే అనుచితమే కాదు, పరిత్యజించదగినది కూడ.

"కూడినంకా కూడవల్లా కుర్రప్రాయం చిన్నదాన్ని
విడినంకా విలవలా పెండ్లిగాని చిన్నదాన్ని.
"మునగపువ్వూ ముడువరాదూ ముండపొందుచెయ్యరాదూ
చేతినిండా గాజులుంటే చెయ్యవల్లా చెలియపొందూ.
"పాలుపాలు నీతోపొందూ పాలురా సంసారిపొందూ
ఒద్దుఒద్దూ నీతోపొందూ ఒద్దురా ఒకనాలిపొందూ."

— ఈ నియమాలు ఎంతో ఉచితంగా ఉండి సహృదయ హృదయాల్ని ఆకట్టు కొంటాయి.

ఇంతవరకు నాయకపరమైన విషయాలు ముచ్చటించడం జరిగింది. నాయికపరంగా కూడ ఇలాంటివే గలవు. కుర్రప్రాయం, చేతిలోని కుచ్చుల వెలకోలు చూచి కపిలితోలేవాని పొందు సంపాదించిందట ఒకామె—

"కపిలితోలె చిన్నవాన్ని ఏమిజూచి (22) తెగులుకోనా
కుర్రకుర్ర ప్రాయం చూచీ కుచ్చులూ వెలకోలుచూచీ"

(22. తగులుకొను— ఇతరునితో ఉండిపోవు.)

భర్త మంచివాడైతే భార్య ఎట్లా తిరిగినా ఫరవాలేదు, పైగా సహకరిస్తాడు—

"వానెల్లి సంతకే పొయ్యొ వానకీ వెడనానివచ్చొ
మొగుడేమో మంచోడైతే మంచమిరిపి మంటేశో"

— వానలో తడిసి వచ్చిందని జాలిదలచి, భార్యమీది ప్రేమతో మంచాన్నిసైతం లెక్కచేయక విరిసి చలి కాచుకోడానికి మంటలేశాడట మంచివాడైన నో భర్త!

ప్రియురాలు ప్రియునితో తన కోరిక నిలా వ్యక్తం చేస్తుంది—

"వెలుకోల వారతోగలి చేతుడూగాజాలు పాయా
మద్దిగిరి గాజులొచ్చా ముద్దుగ తొడిగించు మామో"
"(23)దొవ్వసేను దున్నొద్దుమామా దిన్నలెక్క చూడమామా
వూరిముందర తోట వెయ్యరా నీళ్లకొచ్చి నిన్నుచూతూ"
"పొద్దుపొయ్యి నువ్వురార 24) పంతకాగేనీళ్లుపోతూ
జామపొయ్యి నువ్వురార జాజికాయ పరువులేతూ."

(23. దవ్వు. 24. కట్టెల పొయ్యివారనే ఉండే పాంతకాడు.)

ప్రియురాలు ప్రియునితో సంకేతం తెలుపడం గూడ కలదు—

"ఎదురు చుక్కలె పుట్టేనపుడూ ఎర్రగడ్డికి సన్నితేపూ
ముండ్లుతేసి మానికాడా ముచ్చటాడుదాము.

"(25)ఏద్దు మొరుగూ (26) యాటకాదా మెకమొచ్చామెలుకోరా
నెమ్మిలు కమ్మాల మెకమూ నమ్మినట్టు యాటపోరూ".

(25. ఎద్దు మరుగున ఉంటూ ఎరవేసి పక్షులను వేటాడడు. 26. వేట కాదు.)

సంకేతాన్ని గ్రహించిన ప్రియుడు ప్రియురాలి స్థితిని జూచి ఇలా అంటున్నాడు—

"కల్లి క్రింద చేరుకోనీ పుల్లలేల ఏరిసే వేమే
నీ పుల్ల సైగలు మాకు తెలును పిల్ల మొగుడూ ఎల్లనాడూ"

మోహాశృంగారానికి ఉదాహరణలు కోకొల్లలు. కాని విప్రలంభ శృంగారం సైతం లేకపోలేదు. అందుకి క్రింది పాట పరమోదాహరణం:

"నీళ్లకంటూ నేను ఒస్తీ నిన్నుజూడా ఒస్తీగదరా
నీళ్ల రేవులో నీవు లేవూ కంటినీరే కడవనిండా".

—ఆమె కరుణారసపూరితమైన హృద్గతాభిప్రాయం సహృదయ రంజకంగా ఉండి మురిపించ గలుగుతూంది. ఇది నిసర మనోజ్ఞమైన కవిత!

ఈ పాటలు సంభాషణాత్మకంగా కూడ ఉంటాయి. సరిస చతు రోక్తులతో సహృదయ హృదయావర్జకంగా ఉండడం గమనించ దగ్గది. ప్రియురాలు ఉపభర్త—సంభాషణకు—

"పొద్యెంత 27 పానురంగి పోదాము రాపిల్లా
మొగుడొచ్చా పొద్దాయా మొక్కేను పోసామా."

"ఎల లెత్తి నే పాడంగా ఏడనుంటి పిపాపో
నిలువు రాతీ కనుమ లోనా నిలిచి రెండు జాములుంటి."

"గుత్తి సీమా గురికాని బిడ్డా గ్యారమొచ్చా కానవేమె
కాలిసన్నం నీలిగ్యారం(28) కందనెల్ల భాటంటి పాయా."

(27. పసుపువర్ణంగల రొక్కా, 28. కందవపోలు— కర్నూలు)

ఇందులో ప్రామరుల నోట పదజాలం తనకు తానె వచ్చి జాలు వారిపోయి శ్రుతిహితం కావడం మనం గమనించ వచ్చు. నిజమైన కవిత అంటే ఇదే! హృదయం భావనిర్భరమైనప్పుడు భాష తనకుతానే కుదురు కోవడం సహజ కవిత్వానికి నిదర్శనం గదా మరి!

సంభాషణాత్మకమై చమత్కారయుతమైన ఈ క్రింది పాట ఆహ్లాదజనక మనడంలో సందేహం లేదు—

"ఎక్కరాని మానులెక్కి చిక్కితివె నా చేతిలోనా
29)కెలిమిపూలూ (30)దెట్టెకట్ట 31 కెదలకుండాదించుకోరా"

(29. కలువపూలు కావచ్చు, 30. దట్టె— దడి, 31. కదలకుండా).

ఈ క్రింది పాటలో చతురోక్తి సరసమై ఒప్పుతూంది—

"ఇప్ప కుంటే ఏంటిలోనా కొప్పులో పూలాడవేమే
పూలతోట వారసొస్తె కొమ్మునాలి కొప్పునిండా"

ఈ పాటలో సరసోక్తి సరసుల మనసులను కవ్విస్తూంది—

"అక్క చూడి బావ తట్టు ఒక్క మీా సమన్న లేదూ
పూరుకుండు చెల్లెలమ్మ పూసిసీ గడ్డమోడూ".

ఈ పాటలో పరస్పరం మెచ్చుకోలు సైతం కలదు.

"చింతకొమ్మా చిగురు చూడూ చిన్నదొచ్చేంగువుచూడూ
(32 బాలమాను నీడచూడూ బాలుడుండే ఆగువు చూడూ."

(32. అరటిచెట్టు).

ఏద్యచ్చికి వచ్చాక సైతం ఈ పాటలు కట్టినట్టు ఈ క్రింది పాటవల్ల వ్యక్త మవుతుంది—

"(33)పాగొండ క్యారెంటూ కొడుమొడుగు దీపాలూ
రొద్దమూ కచ్చేరి (34) రౌతి పెనుగొండా."

(33. పావగడ, 34. రవళి— శబ్దం.)

ఇట్లే కపిలి పాటలు హృదయావర్జకాలై ఆనందనిష్యందులై ఒప్పుతూండడం ఎంతో కొనియాడదగిన విషయం.

ప్రారంభంలో లాగే కపిలి పూర్తి అయ్యే సమయంలో గూడ దైవభక్తి ప్రకటించ బడింది. అంతేగాదు. 'బావిగంగ'తో ఆరంభమై, 'బావిగంగతో' సెలవు పుచ్చుకోవడం సైతముంది.

"ఎండినామూ చెట్టుకోసీ యెల్లిరారా యెంకటేశా
అరువసీమా కాపులొచ్చిరీ అడిగినట్టు పరము లీరా."

"రాతికట్నం బాయిమీదా రామస్వామి కొలువు దీరా
బడెద్దులు బాయీమీదా బగవంతు కొలువు దీరా."

"(35)నిడుమొట్టు బాయిలోనా ఏడుగురూ అక్కమ్మగారూ
బాయిగడ్డన బాలులున్నాము బద్రంగా కాపాడుతల్లీ!"

"బాయిబాయి బొమ్మప్పకి మా బాయిరా
మాబాయి బొమ్మప్పకీ బంగారు కాసులదండా."

"బాయిగడ్డన పోతన్నకి ఆకుపూజ గట్టించవల్లా
వంకగడ్డన మాదన్నకీ బాయిపూజలు గట్టించ వల్లా."

"(36) యాలలా మె పొద్దులాయె మేము బోతాము బాయిగంగా
మాకు చాలు నీకు మొక్కేము మాకు సెలవు లీయవమ్మా."

35. మట్టు, 36. వేళలాయె.

ఈ విధంగా కపిలి పాటలు ముగుస్తాయి. ఇందులో ఉప్పక మోహసంహారాలు స్పష్టంగా తెలుస్తూనే ఉన్నాయి.

ఇలు కపిలి పాటలలో మొరటు శృంగారమే ప్రాధాన్యం వహించి నప్పటికీ, జానపద సాహిత్యంలో పీటికొక విశిష్ట స్థానముంది. ఈ పాటలలో కవిత్వపు పాలు సైతం అధికంగానే కలదు. జాతి ప్రతిబింబ మైన జానపద సాహిత్యాన్ని పరిరక్షించాల్సిన అగత్యం వింతైనా కలదు. విస్మృతమై పోతూన్న కపిలి పాటలను సేకరించి గ్రంథస్థం చేసి, రాబో తరాలవారికి అందించడం అవసరం. ఇందుకై సాహిత్య విద్యార్థులు కృషి చేస్తారని ఆకాంక్షిస్తున్నాను!

---

# స్నాన సుందరి

## శ్రీ పోచిరాజు శేషగిరి రావు

ప్రాతస్సమ్య యీలల సందడులతో
స్ఫటిక నిర్మల శిలా స్ఫుట తటాకము చెంత
అంచ రెక్కల మించు మించు దీవియ మించు
లలిత సుకుమార మౌ వలిపమ్ము ధరియించి
విచ్చిన గులాబి వలె మెచ్చౌదవు మైచాయ
ముచ్చటగ ముడివైచి, వచ్చెనొక జవరాలు.

వలయములు వలయములు సలిలమున కేళినటు
మలయమారుత మొలయ జలబిందువులు కదలె;
కొన్ని మొగ్గలు తేలె కొన్ని రేకులు విచ్చె
అంటి ముట్టని పూవు లొంటరిగ తూగాడె!
తామరాకుల పైన గోముగా నిలబడిన
నీటి బిందువులతో సొమ్ము, రంగులు విచ్చె.

మింటిపై హరివిల్లు, ఒంటరిగ దిగివచ్చి
ఉదబిందువులలోన కుదురుగా నిలిచె నొకొ!
చెంగలువ రేకకొన్ని, భంగముల తల లూప
ఒయ్యారముల హొయలు పయ్యాటములు సల్ప
వాని కదలికలతో వాని కనుచూపులతో
మధుర నాట్యపు పాల కథలుగా కనుపట్టె.

తనలోను తనపాటు తనకె యువగత మౌనా!
అనునట్లు కనుపట్టె లోనికకయ స్నిగ్ధమగు
ఒక సిగ్గు తెర కప్పి చకిత నేత్రములతో,
సింగార మొలికించు రంగారు లీలలన్,
అరుణారు ణమ్మైన తరుణా ధరమ్ముతో
విరిసె దరహాసమ్ము విరిబోణి కమ్మోడన్.

లోని తలపుల మేలి పూనికలు లీలగా
కనుపట్ట, నరవిచ్చు కనుదమ్ములం దోప
మందగమనమ్ముతో నంద సుందరముగా
తలిరాకు పాదముల కలికి, మెట్లను దిగియె
హోకాలి బంటిగా ఆకాంత నీటిలో
కాలూని నిలబడెను లోలోన మురియుచున్.

తొలి యౌవనపు పొంగు! తొలిప్రణయపు హోరంగు!
తొలి పరిష్వంగ సుఖ మొలసెనో జ్ఞప్తిలో!
తొలి చూపు తీపులో పొలసాడు ప్రణయమ్ము
విరిచెనో! మనసంత గిలిగింతవై రేప
అడుగడుగు దిగుచుండ, వడతి తీయని తలపు
మెట్టుపై మెట్టుగా పెట్టుకొని పై కెక్క—

సుకుమార తను యష్టి ఒకమారు పులకింప
నీట మునిగెను రేమ నీటుగా శిరసెత్తి
తన తనూ లావణ్య మును సోకి యల లేచె
వక్కగా నొత్తిగిలె వక్కనెఱజాణపై
పద్మగంధిని జూచి పద్మమ్ము తలవంచె
కన్నుదోయిని గాంచి విప్పబోయెను కల్వ!

బాల భాను ప్రభలు అలివేణిపై సోకి
వింత రాగము లీనె సంతసము గూర్చుచున్
సిగలోని మల్లియలు సొగరు పరువమ్ముతో
పరిమళింపగ, తోన మురిసె తన్వంగి
జల నిధీశ్వరు రాణి జలతారు వరదాల
అలల నట్టు నీటు దోసి వెలువడెనా సరసిలో!

నల్లనల్లని యురులు పల్లవాధర కురులు
కబరీ భరమ్ముగా సొబగు జార్చుచు నుండె
వేణికా గంధ మిం పూను మల్లెల దండ
తో, సువాసింపంగ నా సుదతి హాయలొలికె
ఈ కేళ కూళిలో లోకమోహన మైన
ఈ విలాసిని జల ప్లావన మొప్పరించె.

స్నాన సౌందర్య మవ్యాజమ్మై విలసిల్లి
ఏణీ నీలోచనకు జాణతనములే గరపె
పులు గడుగ నునుపైన మేలి ముత్యము లోలె
పండు వెన్నెల పంచు నిండు నెలరేక యనగ
వాన వెలిసిన వెన్క లాననగు పూవు వలె
జడులు పడినంతటన్ పుడమిపడతింబోలె:

వాసంత లీలా విలాస చారుత పూను
మాలతీ లత లోలె ఎలనాగ కనుపట్టె
పూల బాలలు నీట లీల వీడ్కోలిచ్చె
దరి నున్న వనలతలు మురిసి స్వాగత మిచ్చె
ఒక గాలి సోల తాకి ప్రకటించె హర్షమ్ము
మెయి లోకటి వినువీధి హాయిగా గనవచ్చె

ఏ లీల రమణియో! లాలసత యెట్టిదో!
ఏ యింట పుట్టెనో! ఏ యింట మెట్టెనో!
ఏ కరము పట్టెనో! ఏ కళల నేర్చెనో!
మెలత చిత్రమున వ్రాతకై ఒలికించు రససిద్ధి!!

# సుప్త చేతన

## శ్రీ యు.ఏ. నరసింహమూర్తి

విశ్వనాథం ఇంజనీరింగు హాస్టళ్ల దగ్గర బస్సు దిగేటప్పటికి రాత్రి 7 గం. అవుతూంది. ఇప్పుడు చూస్తూన్న హాస్టళ్ళు తానెరిగిన పాత హాస్టళ్ళు కాదనుకున్నాడు. తాను చదివేనాటికి ఇదంతా పట్టి దిబ్బ. సుగుణాకరం యూనివర్సిటీలో చదివిన రోజుల్లో ఎలాగుండేదో! అది తెలుసుకొనే అవకాశం విశ్వనాథానికి లేకపోయింది. అదెంత మార్పో! లేత వెన్నెలలో దూరదూరంగా — నిండా కిటికీల గుండావచ్చే దీప కాంతులతో—గుంభనంగా పోకలుపోసిన ఇంజనీరింగుహాస్టళ్ళు అప్పుడే బస్సు దిగిన విశ్వనాథానికి రగులుతూన్న ఇటుక బట్టీల్లా కనిపించేయి.

అంతవరకు పిచ్చి ఆలోచనలతో సతమతమవుతూన్న విశ్వనాథని కిప్పుడు ఆలోచన మలుపు తిరిగింది. మెల్లగా నడుస్తున్నాడు. స్టూడెంట్సు ఇద్దరు ముగ్గురుగా అక్కడక్కడ నడుస్తున్నారు. ఒకరిద్దరు టెర్రస్ మీద కూర్చుని ట్రాన్సిస్టర్ నుండి వచ్చే సంగీతాన్ని వింటున్నారు. హాస్టళ్ళు ఎంత గడబిడగా వుంటాయో అనుకున్న విశ్వనాథానికి అనుభవం కొత్తగా వుంది. ఇక్కడ తానెవరితోనైనా అసలు మాట్లాడగలనా? అనుకున్నాడు మొదట. ఆ సంశయం వదిలింది. ఒక బ్లాకు దగ్గరగా పోయి "చూడు బాబూ! వినయ విహార్‌కు ఎలా పోవాలో చెప్పగలరా?" అని అడిగాడు.

అతను లేచి నిలబడి "మీరు స్ట్రెయిట్‌గా వెళ్తే ఒక క్రాస్ రోడ్ వస్తుంది. అది దాటి మట్టిలోవలోంచి కిందగా దిగి వెళ్తే డైనింగ్ హాల్స్ వస్తాయి. అక్కడడిగితే ఎవరైనా చెప్తారండీ" అన్నాడు చేతిలో పుస్తకం మూసి.

విశ్వనాథం తిన్నగా అతను చెప్పిన గుర్తులనుబట్టి డైనింగు హాల్స్ చేరుకున్నాడు. ఆ ప్రదేశమంతా మహాసంరంభంగా వుంది. స్టూడెంట్సు హడావుడిగా డైనింగుహాల్సులో దూరుతున్నారు. భోజనాలు చేసిన వాళ్ళు బయటకు వస్తున్నారు. కొద్దిమంది అక్కడే అమ్ముతూన్న కిళ్ళీలు నములుతూ సిగరెట్లు ముట్టిస్తున్నారు. అక్కడ విశ్వనాథం దృష్టిని రంగుల అక్షరాలతో వ్రాయబడ్డ పోస్టర్లు ఆకర్షించాయి.

"ఓట్‌ఫర్ బాబూస్ ప్యానల్" అనే అక్షరాలు విశ్వనాథాన్ని ఎక్కువ ఆకర్షించాయి. అప్పుడే భోజనం చేసి వస్తూన్న ఒక విద్యార్థిని ఆపి—

"చూడు బాబు! వినయవిహార్ ఎక్కడ?" అని అడిగాడు.

"మీకెవరు కావాలండీ?"

"సుకుమార్‌బాబు కావాలి"

"ఓహో! దాదా! నాతోరండి" అంటూ తీసుకుని వెళ్ళేడు. తీరా రూముకు వెళ్తే బాబు లేడు. అతని రూమ్మేటు చౌదరి విశ్వనాథాన్ని కూర్చోపెట్టి కుశలప్రశ్న లడిగేడు. ఆ ప్రశ్నలకు సమాధానం చెప్తూ విశ్వనాథం రూమంతా ఒకసారి పరిశీలించేడు. అతనికి ముచ్చటవేసింది. చౌదరి భోజనం చేసివద్దాం పదండన్నాడు, కాని విశ్వనాథం తాను ముందుగా బాబును కలుసుకోవాలన్నాడు. ఇద్దరూ కలిసి అవుట్‌గేట్ వేపు నడిచేరు.

"మా బాబు సంగతులన్నీ మీకు తెలుసునా చౌదరి?" అనడిగాడు విశ్వనాథం.

చౌదరి ముందు సంశయించాడు. తర్వాత "బాబు చాలా తమాషానైన మనిషండి. అతని మనసులో ఏముందో తెలుసుకోడం కష్టం. మేమిద్దరం ఒక రూములో ఉన్నామే కాని ఆత్మీయులం కాలేక పోతున్నాం" అన్నాడు.

"అలాగా! ఈ మధ్య వాళ్ళనాన్న వచ్చిన సంగతి మీకు తెలిదా?"

"బాబు చెప్పలేదండీ! సుగుణాకరంగారే నన్ను లైబ్రరీ దగ్గర కలుసుకుని కొన్ని విషయాలు మాట్లాడేరు. బాబు ఎలక్షన్లలో పోటీ చెయ్యడం ఆయన కిష్టంలేదు. అలాగైతే చదువు మాన్పించేస్తానని నాతో అన్నారు."

"కాని బాబు చదువు మానెయ్యడానికైనా సిద్ధంగా వున్నానని తన సంగతి పట్టించుకోవద్దని వ్రాసేడు" అన్నాడు విశ్వనాథం బాధగా.

"ఈ విషయం నాకు ఒక్కసారికూడా చెప్పలేదు. అసలు అలాంటి లక్షణమే కనబడదు. అతనెప్పుడూ కులాసాగానే కన్పిస్తున్నాడు" అన్నాడు చౌదరి. ఇలా మాట్లాడుతూ వాళ్ళు సన్ అండ్ సీ, సాప్ వీవ్ హోటళ్ళ వెనుకగా వున్న సముద్రపొడ్డుకు చేరేరు.

కొన్ని గజాల దూరంలో ఇసుకలో కూర్చున్న బాబు కనిపించేడు. చేతిలో ఫిల్టర్‌టిప్డ్ సిగరెట్ కాలుతోంది. అతని దృష్టి దూరంగా యారాడకొండ దిగువగా దీపాలంకృతాలైన విశాలమైన భవనాల్లాగున్న రెండు స్టీమర్ల మీద లగ్నమయింది. భోరున ఘోషపెట్టే సముద్రపు హోరు అతనికి పట్టడంలేదు. చల్లని నీటి తుంపరుల తాకిడి అతనిని చల్లార్చలేదు. ఉవ్వెత్తున లేచి విరిగిపడే కెరటాలు అతని మనసు కదపలేదు.

బాబు విశ్వనాథాన్ని చూడగానే సిగరెట్టు పారేసి లేచాడు. "ఏం తాతా! నాన్న రాయబారం పంపించాడా నిన్ను?" అన్నాడు పలకరింపుగా.

బాబు చాలా ఉల్లాసంగా, హుందాగా వున్నాడనుకున్నాడు విశ్వనాథం. "నాన్న పంపకపోతే నేను రాకూడదా యేం!" అంటూ కూర్చున్నాడు. చౌదరి తిరిగి వెళ్ళిపోయాడు.

బాబు తాపీగా కూర్చుంటూ "నీ అంతట నువ్వుగా వచ్చావంటే ఎలా నమ్మేది. కర్మసన్యాసం పుచ్చుకున్నావుగా" అన్నాడు.

"సర్లే దానికేంగాని. నీ సంగతి నాకు అయోమయంగా వుంది. మీ నాన్న సంగతి తెలుసుగా. అతన్ని కాదని నీ చదువు సాగించలేవు."

"తాతా! నేనంత అసమర్థుణ్ణి కాను. స్వతంత్రంగానే చదవగలను. పూర్ డాడీ! తనకి తెలిసిందే లోకమనుకుంటున్నాడు." అన్నాడు నిశ్చలంగా.

"అయినా హాయిగా చదువుకోకుండా నీకీ ఎలక్షన్లెందుకు? నాన్న మాట వినకూడదా?" అన్నాడు విశ్వనాథం అనునయంగా.

"తాతా! నువ్వు ఎన్ని ఉద్యమాల్లో పనిచేసేవో, ఎంత కాలం అజ్ఞాతవాసం చేసేవో నాకు తెలుసు. నువ్వు కూడా ఇలాగంటే ఎలాగ? జీవితంలో వచ్చే అమూల్యమైన అవకాశాన్ని వదులుకుని గోళ్ళు గిల్లుకుంటూ ఉద్యోగమో! ఉద్యోగమో! అని దేబిరించడానికి నేను సుగుణాకరాన్ని కాను."

"మరేం చేద్దామని."

"ఏం చేద్దామనా ? దేశాన్ని ఆకళించుకున్నావా? ఈ రోజు విద్యార్థి ఎక్కడున్నాడో తెలుసా? మాకున్న గిరాకీ దేశంలో ఏవరికీ వుండదు." అన్నాడు ఆకతాయిగా.

"అసందర్భంగా మాట్లాడకు. ఈ కీలుబొమ్మ మనస్తత్వమా నీ బుర్ర కెక్కింది?" అన్నాడు విశ్వనాథం మందలింపుగా.

నేను బొమ్మను కాదల్చుకోలేదు. బొమ్మల్ని ఆడిస్తాను". బాబు ఇంత నిష్కపటంగా మాట్లాడడం చాలా అరుదు.

"బాబూ! నీచంగా మాట్లాడకు. దేశానికి మిగిలిన ఒకే ఒక ఆశకు ప్రతినిధివి కాబోతున్నావు. ఆటవిక తత్వానికి లోబడకు" విశ్వనాథం ఆవేశాన్ని అణచుకుంటూ అన్నాడు.

"అదంతా భ్రమ. నేటి అక్రమలాభార్జనపరు లందరూ నిన్నటి విద్యార్థులే. విద్యార్థి అయినంతలో ప్రతివాడూ నిజాయితీ పరుడు కావాలని నియమంలేదు.' అన్నాడు బాబు తేలికగా నవ్వుతూ.

"ఇంత నిశ్చితంగా మాట్లాడేవాడికి సలహా ఇవ్వలేను. అయితే నాన్నని కాదని నువ్వేలా బతుకుదామనుకుంటున్నావు ?" అన్నాడు విశ్వనాథం విసుగ్గా.

"దేశంలో సుఖంగా ఉండదలుచుకున్నవాళ్ళు కొందరున్నారు. నా బాగోగులు వాళ్ళకు చాలా అవసరం. బుర్రతో బుర్రలు మార్చి ఏదోది పాడుగునా కావాలంటే ఈ పక్కనున్న హోటల్లో గడిపెయ్య గలను" అన్నాడు బాబు నిర్లక్ష్యంగా.

"నిన్ను ఆశయాలు, ఆవేశాలు కమ్ముకున్నాయని పొరపడి ఇంతదూరం వచ్చాను."

"నిజంగా పొరపాటే. ఆశయాల్ని ఆదేశాల్ని నేను కమ్ము కుంటున్నాను" బాబు మాటలలో తొణుకుబెణుకులేదు.

విశ్వనాథానికి మఱి ఆవిషయం మాట్లాడాలనిపించలేదు. తండ్రి మనస్తత్వం ఎలాంటిదో చెప్పి బాబును మళ్ళిద్దామనుకున్నాడు మొదట. కాని ఆ ప్రయత్నం వ్యర్థమని తేలిపోయింది. కాగా విశ్వనాథాన్ని బాధించే విషయమొక్కటే. విద్యార్థిగా తాను జాతీయోద్యమంలో ప్రముఖపాత్ర వహించాడు. దేశంకోసం చదువు మాను కున్నాడు. ఆస్తినంతటినీ వదలుకున్నాడు. ఆశయంకోసం జీవితాన్ని ఖర్చు పెట్టేడు. ఈనాడు బాబు కూడా విద్యార్థే. కాని అతడు విద్యార్థిగా తన జీవితాన్ని గూర్చి ఆలోచించుకుంటున్నాడు. హాయిగా బతకడానికి చదువుచాలదని ఇప్పుడే ఉద్యోగాన్వేషణ ప్రారంభించేడు. బాబు పరిస్థితులతో ఆటలాడుతున్నాడు. అది విశ్వనాథం ఎన్నటికీ సహించలేడు. సముద్రం ఒడ్డున కూర్చున్న అతని శరీరం వేడెక్కింది.

"తాతా! రూముకు పోదాం పద! నాగురించి బెంగపడకు.నీ చిత్త శుద్ధి ఉద్యమాల కాలం చెల్లిపోయింది. ఇప్పుడు మీ వ్యూహాలు పనికిరావు. కొత్తతరం తాకిడికి నువ్వు తట్టుకోలేవు. ఇందులో నా తప్పులేదు" అంటూ నవ్వుతూ లేచి దారి తీసేడు. వెనక నెట్టి సముద్రం విరుచుకు పడుతూంటే బాబు జుత్తు పైకెగరవేసుకుని ముందుకు నడిచాడు. దూరంగా కార్గోషిప్పు హృదయ విదారకంగా ఏడుస్తున్నట్లు బొంయ్‌మని అరిచింది.

భోజనం చేసి రూముకు వచ్చారిద్దరూ. "తాతా! నువ్వీమంచం మీద పడుకో. నేను పక్కరూములోకి పోతాను." అని చెప్పి బాబు వెళ్ళిపోయాడు. చౌదరి ఏవో ప్రోబ్లమ్స్ చేసుకుంటున్నాడు. అతని మంచం పక్కకిటికీరెక్క మీద "పిడిబ్రహ్మ" అనే రాతచూసాడు విశ్వనాథం. నవ్వుకున్నాడు. అప్పుడే ఆపక్క నుంచి వెళ్తున్న స్టూడెంటు "పిడికొట్టు గురూ! యూనివర్సిటీ ఫస్ట్ నీదేలే!" అంటూ వెళ్ళిపోయాడు. చౌదరి ఒకసారి అటువేపు చూసి మళ్ళీ పనిచేసు కుంటున్నాడు.

"వాళ్ళు చదవరు. చదివిన వాళ్ళని చూసి వెటకారం చేస్తారు" అన్నాడు విశ్వనాథం చౌదరివేపు చూస్తూ.

"అదో సరదా అండీ. ఇక్కడ చదవనివాడెన్నడూ ఉండడు. ప్రతివాడూ ఒకడికి తెలియకుండా ఒకడు చదువుతూ వుంటాడు. అలా టవున్లోకి పోయి వస్తాను గురూ! అంటూ లైబ్రరీకి వెళ్ళి తెగ రాసేస్తూ కూర్చుంటారు. చేచ్‌కి పోతాను గురూ! అంటూ జేబులో పుస్తకం పట్టుకు పోతారు. నిద్రొస్తూందోయ్ అంటూ 8 గం.లకే పడుకుని ఏ 2 గం. లకో లేచిపోయి చచ్చేటట్టు చదువుతాడు. ఇంకా కొందరుంటారు. వాళ్ళ కొకటిరెండుసార్లు చదివితే సరిపోతుంది. అలాంటివాళ్ళు బండచదువు చదివితేగాని రానివాళ్ళని చదవనీకుండా గంటల తరబడి కబుర్లు చెప్తూ కూర్చుంటారు. రకరకాలండీ. మీ బాబు సంగతో అతను చదువుతున్నాడని ఎవరూ అనుకోరు. కాని అతను చదివే వేళలు కొన్నున్నాయి." అన్నాడు పుస్తకం మూసేస్తూ.

విశ్వనాథం ఆలోచన మళ్ళీ బాబువేపు మళ్ళింది. మనవడికి తనపేరు పెట్టాలని అతనెన్నడూ అనుకోలేదు. కాని సుకుమార్‌బాబు అనే పేరుమాత్రం అతనికి నచ్చలేదు. సుగుణాకరం భార్య పెట్టిందా పేరు. ఆవిడ ప్రతి విషయాన్ని ఒక సమస్యగా గ్రహించి తీర్పు చెప్తుంది. అది అమలు జరుగుతుంది. తన కొడుకుపేరు వినగానే తెలుగుపేరని తెలిసిపోతే ఎవడూ ఉద్యోగమివ్వడు కాబట్టి—ఆ ఉద్యోగ మిచ్చేవాడికి వీడెవడో తెలియకుండా వుండాలని ఈపేరుపెట్టింది. వాడు కడుపులో పడ్డప్పటి ఈ విషయం నిర్ణయమై పోయింది. తెలివితక్కువ వాళ్ళు మాత్రం ఫాషన్‌కోసం పెట్టిందన్నారు. ఒకటి తర్వాత ఒకటిగా ఉద్యోగాలు పొందడం—ఇవ్వడం అలవాటైన సుగుణాకరం కూడా ఈ కీలకం లేటుగా తెలుసుకున్నాడు. సుమారు ఇరవై సంవత్సరాల కిందటే నేటి ఉద్యోగాలస్థితి కనిపెట్టగలిగినందుకు భార్యను చాలాసార్లు అభినందించాడు.

బాబు బడిలో చదివే రోజుల్లో విశ్వనాథం ఇంటికి చేరుకున్నాడు. అంతకుముందు కొన్ని సంవత్సరాలు అతనెక్కడున్నదీ ఇంటివాళ్లకు తెలియదు. అతని భార్య ఆస్తిపరురాలు. ఆవిడే సుగుణాకరాన్ని పెంచి పెద్దవాణ్ణి చేసింది. ఇంటికి తిరిగి వచ్చిన విశ్వనాథాన్ని ఎవ్వరూ అనాదరణ చెయ్యలేదు. విశ్వనాథం ఎవరి మీదా ఆసక్తి చూపలేదు. అప్పుడప్పుడు బాబు మాత్రం అతని దృష్టికి ఆనేవాడు. సుగుణాకరం భార్య ఎప్పటికప్పుడు బాబుకి తాతవాసన తగలకుండా జాగ్రత్తపడేది. సుగుణాకరం కూడా బాబు విషయంలో శ్రద్ధగా వుండేవాడు.

అలా ఒక కట్టుబాటులో పెరిగిన బాబు కాలేజి మెట్లెక్కగానే బాంబుగా మారేడు. సుగుణాకరం అంచనా తారుమారయింది. కొడుక్కి లోకజ్ఞానం అబ్బడం సుగుణాకరానికి సూదులు గుచ్చినట్లనిపించింది. తన చదువు తన ఉద్యోగం తన బతుకు అనేవి తప్ప విద్యార్థులు సంఘాలు, ఎన్నికలు ఉద్యమాలు ఇవన్నీ వ్యర్థమని నూరిపోసేడు. అప్పటికి సుగుణాకరం ఆరాటం తీరింది. బాబు తమాషా ఐనవాడు వీచిన ప్రతిగాలికీ గడ్డిపోచలా ఎగిరిపోవలసినవాడు కాడు. ప్రాణాయామం అభ్యసించిన యోగిపుంగవుని లాంటివాడు. క్రమంగా శక్తి యుక్తి కూర్చుకుని పాచిక వేద్దామని ఆగేడు. కాలేజీ స్థాయిలోనే పెట్టుబడి పెట్టే తండ్రిమాట కాదంటే వాల్తేరు సముద్రం గాలి పీల్చే అవకాశ ముండదని వెనక్కి తగ్గేడు. ఇవన్నీ గమనిస్తూన్న విశ్వనాథానికి సుగుణాకరం లాంటి వాడికి బాబు ఎలాగపుట్టేడా! అని సందేహం కలిగేది. సమాధానం కూడా తానే చెప్పుకునేవాడు. తనకు సుగుణాకరం పుట్టలేదూ! అనుకుని పుట్టుకలో ఏముంది పీల్చేగాలిలో వుంది అంతా! అనుకునేవాడు.

చౌదరి టేబుల్ లైటు ఆర్పి పడుకున్నాడు. చల్లబడ్డ కిటికీ చువ్వల్లోంచి పువ్వులాంటి వెన్నెల మీద పడుతూంది. విశ్వనాథానికింకా ఆలోచనలు తెగడం లేదు. పాత విషయాలన్నీ కళ్లముందు కదులుతున్నాయి. కిటికీ అవతల ఏవో మాటలు వినిపిస్తున్నాయి.

"మావాళ్లంతా స్టేట్సులో వున్నారు గురూ! సెక్సాసు సంపాదించి ఎలాగైనా నేను కూడా స్టేట్సువెళ్లాలి. లేకపోతే వేస్ట్."

అలా అలా మాటలు దూరమైపోతున్నాయి.

విశ్వనాథానికి విచారం కలిగింది. స్వదేశీ ఉద్యమంలో చేరి కాలేజీ వదిలేసాడు తను. అప్పటికింకా దేశానికి స్వతంత్రమేలేదు. స్వతంత్రం వచ్చి పాతికేళ్ళు దాటినా విదేశాల మీద మోజు వదలలేదు. మనదేశంలో చెయ్యడానికి పనే లేదా? అనుకున్నాడు.

"ఎందుకొచ్చిన రీసెర్చి గురూ! స్కాలర్‌షిప్పా! పాడా! ఎక్కడో లోటు ఉద్యోగం దొరికితే చాలు."

"నీకోసం నాకోసం ఈ దేశంలో ఉద్యోగ మెక్కడుంది?"

"రీసెర్చి పూర్తి చేసినా మళ్లీ ఆ ఉద్యోగం కోసమే వెతకాలిగా" అలా మాటలు దూరమవుతున్నాయి.

సుగుణాకరం ఉద్యోగమెలా సంపాదించాడో తనకు తెలియదు. ఇప్పుడు పెద్ద ఉద్యోగమే చేస్తున్నాడు. మరి అసలు సుగుణాకరానికి తనకి పెద్ద సంబంధమేమీ వున్నట్టు కనబడదనుకున్నాడు విశ్వనాథం.

"ఈ రోజులలో బిజినెస్సు, పోలిటిక్సు ఈ రెండే బాగున్నాయి. రిస్క్ చెయ్యాలేగాని నిముషాల మీద పెద్దవాళ్ళంగావచ్చు" ఇంకెవరో మాట్లాడుకుంటూ పోతున్నారు. ఈ కిటికీపక్క పడుకుంటే తెల్లవార్లూ ఇలా కబుర్లు వినిపిస్తూనే వుంటాయి కాబోలు ననుకున్నాడు విశ్వనాథం.

"కమేండోస్! ఎవరికి అల్టిమేటమ్ ఇచ్చి వస్తున్నారు?" ఎవరో వెటకారంగా.

"మిస్టర్! నీదృష్టి మామీదేనా? ఎందుకీ ప్రచారం? తిన్నగా వుండాలని లేదా?"

"జోక్ గురూ! దానికే అంతకోపమా!" అలా మాటలు దూరమవుతున్నాయి. కొంతసేపటికి స్టూడెంట్ల తిరగడం తగ్గింది. మాటలు వినపడ్డం మానేసాయి. ఆ అరగంట టీకి వెళ్లేసమయం కాబోలుననుకున్నాడు విశ్వనాథం. అలా ఆలోచిస్తూ పడుకున్నాడు. ఎప్పటికో నిద్రపట్టింది.

ఈ రోజు బాగా అలసిపోయి పడుకున్నాడు విశ్వనాథం అతనికి నిద్రపట్టింది. అతని ఆలోచనలకు నిద్రపట్టలేదు. కొంతసేపటికల్లా విశ్వనాథం అమితవేగంతో పెద్ద అఖాతంలోకి జారిపోతున్నాడు. తానేకాదు. ఎందరో మనుష్యులు—ఇళ్ళు—వాకళ్ళు—గుళ్లు—గోపురాలు—పర్వతాలు— అడవులు అన్నీ అంతుకనబడని అఖాతంలోకి జారిపోతున్నాయి. ఇంతవేగంతో అని చెప్పడానికి వల్లకాదు. విశ్వనాథం శరీరమంతా కరెంటు ప్రవహిస్తూన్నట్టుంది. గుండెలు నొక్కుకు పోతున్నాయి. భయం పుట్టింది. విశ్వనాథం గట్టిగా అరుద్దామనుకున్నాడు. గొంతు పెగలలేదు. అనేకసార్లు ప్రయత్నించేడు. అలా ఎంతసేపు ప్రయత్నించాడో! తన పిలుపు ఎవరికీ వినపడక తను అలాగే చచ్చిపోతానేమోనని భయపడ్డాడు.

చౌదరి లేచి లైటు వెలిగించాడు. "విశ్వనాథం గారూ! విశ్వనాథం గారూ!" అంటూ కుదిపి విశ్వనాథాన్ని లేపేడు.

"ఏమిటి అలా మూలుగుతున్నారు?" అన్నాడు ఆందోళనగా

"నిద్రలో ఒక్కొక్కప్పుడు నా కలాగవుతుంది నాయనా! నరాల బలహీనతవల్ల. అలాటప్పుడు ఎవరైనా లేపకపోతే చాలాఇబ్బందవుతుంది. సరేలే మీరు పడుకోండి" అంటూ విశ్వనాథంతిరిగి పడుకోబోయేడు.

"ఈ టేబ్లెట్ వేసుకుని మంచినీళ్లు తాగండి. నీరసం తగ్గుతుంది" అంటూ చౌదరి ఒక మాత్ర, మంచినీళ్లు ఇచ్చి పడుకున్నాడు.

మాత్రవేసుకుని, మంచినీళ్లు తాగి మళ్లీ పడుకున్నాడు విశ్వనాథం. మరి ఆలకిచించకూడదనుకున్నాడు. మనసు కూడగట్టుకున్నాడు. అటుతిరిగేడు. ఇటుతిరిగేడు. కొంతసేపటికి నిద్రలోకి జారుకున్నాడు.

నిద్రపోతున్న విశ్వనాథానికి తన మంచం పక్కనున్న కిటికీలోంచి ఎవరో ఇద్దరు తనవేపు కోపంగా చూస్తూ, వికృతంగా పెడబొబ్బలు పెడుతున్నట్టు కనిపించింది. నిద్రలో విశ్వనాథం లేచి కూర్చున్నాడు. వాళ్లెవరో కాదు! సుగుణాకరం, అతని భార్య తనవంక గుడ్లురిమి చూస్తున్నారు. చూపుడువేళ్ళు తన ముఖం వేపు చూపిస్తూ ఏమో అరుస్తున్నారు.

నిద్రలో విశ్వనాథం లేచి కిటికీ చువ్వల్లోంచి బయటకు చూశాడు. అక్కడ సుగుణాకరం, భార్య కనపడలేదు. అటుచూసేడు. ఇటు చూసేడు. గుప్పుమని వేడిగాలి సముద్రం మీంచి పోకి అతని ఒళ్ళు ఉడికించింది. ఒకసారి రెండుసార్లు—మూడుసార్లు వేడిగాలి కెరటాలు విశ్వనాథాన్ని ఉక్కిరి బిక్కిరి చేసేయి. అక్కడ నిలవలేక పోతున్నాడు. ముఖానికి చేతులు అడ్డం పెట్టుకుని అలాఎంత సేపు నడిచేడో చివరికి సముద్రపొడ్డుకి చేరుకున్నాడు.

సముద్రమంతా కళాపెళా కళాపెళా మరిగిపోతూంది. మరుగు నీటి ఝూంకారాలు, నురుగులు ఎగసిపడుతున్నాయి. అక్కడ సూర్యోదయమవుతూన్నచోట పెద్ద పెట్టున చెవులు చిల్లులు పడేటట్లు బృందగానం ఆలపిస్తున్నారెవరో! ఎందరో! విశ్వనాథం అటువేపు పరుగెత్తడం ప్రారంభించాడు. పరుగెత్తగా పరుగెత్తగా అతని వేలు, లక్షలు జనం కనిపిస్తున్నారు. వారందరూ ఏదో మహోద్యమానికి నడుములు కట్టుకున్నట్టున్నారు. వారిని దాటి ఇంకా ముందుకు చూస్తే విశ్వనాథానికి ఒక యువకుడు కనిపించాడు. ఆవ్యక్తి విశ్వనాథాన్ని ఆకర్షించాడు.

విశ్వనాథం జనసందోహాన్ని తప్పించుకుని ముందు ముందుకు తోసుకు పోయాడు. విశ్వనాథం ఆ యువకుని దగ్గరకు పోతూన్న కొద్దీ జనం పలచబడిపోతున్నారు. ఇంకా దగ్గరవుతూన్న కొద్దీ ఇంకా తగ్గిపోతున్నారు. చివరికి విశ్వనాథం ఆస్థలానికి చేరుకునే సరికలా ఆ యువకుడు అక్కడ ఠీవిగా నిలబడ్డాడు. అతని ముఖం చుట్టూ కాంతిపరివేషం వెలుగులు చిమ్ముతూంది. ముఖం ప్రసన్నంగా చిరునవ్వులు చిలుకుతూంది. అకుంఠితమైన దీక్ష అతని నిలబడ్డపాటు గాను—అచంచల విశ్వాసం అతని చిరునవ్వుగాను విశ్వనాథానికి కనిపించింది.

ఇంకా దగ్గరకు పోయి చూస్తే అతను బాబు! అక్కడ ఒక ఈజిల్‌మీద కేన్వాసుపెట్టి బ్రష్‌తో వర్ణచిత్రం గీస్తున్నాడు. విశ్వనాథం స్పష్టంగా చూసేడు. అది తన బొమ్మే! ఆశ్చర్యం.

బాబు చిరునవ్వు నవ్వుతున్నాడు. సూర్యుడు ఉదయిస్తున్నాడు. విశ్వనాథానికి గభీమని తెలివి వచ్చింది.

''పాచిపిడి కొట్టు గురూ!'' అంటూ తన కిటికీ పక్క నుండే గట్టిగా అరుచుకుంటూ వెళ్తున్నాడొక విద్యార్థి. లేచిన విశ్వనాథానికి టేబిల్‌లైట్ దగ్గర కూర్చుని చదువుకుంటూన్న బాబు కనిపించేడు. బాబు కలలో ఎలా కనిపించేడో నిజంగాకూడా అలాగే వున్నాడు.

''ఏం తాతా! ఇంకా వుంటావా? స్నానం చేసిరా. కాఫీ తీసుకుందాం'' అంటున్నాడు బాబు.

''స్నానం చేసి ఇంటికి పోతాను బాబూ!'' అన్నాడు విశ్వనాథం పరధ్యానంగా. అతను రాత్రి కలలోని స్వప్నాన్ని జ్ఞాపకం తెచ్చుకోవాలని ప్రయత్నిస్తున్నాడు.

---

# నేను మానవుణ్ణయ్యాను!

### శ్రీ వి. ఆర్. గణపతి

ఈ లోకంలోకి నేను మెల్లిగా అడుగేసినప్పుడు,
ఆ క్షణంలో,
నా మెదడు నిండా శూన్యం!
నా హృదయం, అంతకన్నా శూన్యం!!
మంచీ— చెడూ., న్యాయం— అన్యాయం,
సుఖం— దుఃఖం., పాపం— పుణ్యం— లాటి
ఈ రంగుల వలలో నా హృదయం
చిక్కుకు పోలే దప్పుడింకా!!
అప్పుడే అరవిరిసిన పువ్వులాగా,
తామరాకుపై కురిసిన వర్షపు బిందువులాగా,
ఎంతో స్వేచ్ఛగా,
మరెంతో స్వచ్ఛంగా వుండేది!

ఆ మరుక్షణం!
భూలోకపు గాలి వీచింది హోరున!
నాలో ఏదో చేసేసింది జోరున!
అంతే! అంతా అయిపోయింది!!
అప్పటిదాకా దేవుడిలాంటినేను,
రాక్షసుల దగ్గరి చుట్టాన్నయ్యాను!
క్షీరభాండం లాంటి నా హృదయంలోకి,
చిన్నవిషపు బిందువు చిమ్మకు వచ్చిపడింది!
అంతే!
నా హృదయమంతా విషపూరితమై పోయింది!
అప్పట్నుంచే నేను మానవుణ్ణయ్యాను!!

# శ్రీ అరవిందుల పరిణామ సిద్ధాంతము: మనస్సునుంచి అతీతమనస్సువరకు

శ్రీ వి.వి.ఎస్. రామదాసు

ఒకరకంగా చెప్పాలంటే శ్రీ అరవిందుల సందేశం చేతనయొక్క పరిణామం గురించే అనాలి. పరిణామం చెందుతూ మనిషి దివ్యత్వాన్ని పొందడం, సమాజం ఆధ్యాత్మికం కావడం ప్రతి మనిషికీ జన్మలక్ష్యం కావాలని శ్రీ అరవిందుల సందేశం.

ఇంతవరకు పరిణామ్రగతి ఎలా ఉందంటే మొట్టమొదట భౌతిక పదార్థం ఉంది. అది జడం. అది పరిణామం చెంది జీవంతో జంతు లోకం జనించింది. అది జీవ దశ.

జంతువులకు ఆలోచించే మనస్సు లేదు. పరిణామంతో మనస్సు ఆవిర్భవించి ఆలోచించే మనిషి పుట్టాడు. ఇది మానసిక దశ. ప్రస్తుతం మానవుడు ఉన్న దశ. మన పురాణాలలో చెప్పిన అవతార క్రమాలను పరిశీలిస్తే అవి కూడా పరిణామ క్రమంలోనే కనిపిస్తాయి. మొదటిది జలచరమైన మత్స్యావతారం. రెండవది ఉభయచరమైన కూర్మావతారం. మూడవది భూచరమైన వరాహావతారం. నాలుగవది మనిషి జంతువూ కలిసిన నారసింహావతారం. అయిదవది పొట్టివాడైనా గట్టివాడై సర్వలోకాల్నీ ఆక్రమించే విరాట్ రూపం కలిగిన వామనావతారం. ఆరవది రజోగుణ ప్రధానమైన పరశురామావతారం. ఏడవది సాత్త్విక గుణ ప్రధానమైన రామావతారం. ఎనిమిదవది నిర్గుణుడైన కృష్ణావతారం. తరువాతవి రెండూ బుద్ధావతారం, కలికావతారం. కృష్ణావతారం, బుద్ధావతారం, కలికావతారం— ఈ మూడూ ఆధ్యాత్మిక పరిణామంలో మూడు దశలను తెలియచేస్తాయి. కృష్ణావతారంలో ఉపరిమానసం అనేది సాధ్యం అని తెలిసింది. అతీత మానసాన్ని దాటి పరమ ముక్తికి వేరే బాట వేయాలనే ప్రయత్నం బుద్ధావతారంలో జరిగింది. కాని ఆ ముక్తి నివృత్తికి సంబంధించినది కావడంచేత దివి నుండి భువికి దిగి పరిణామాన్ని పూర్తి చేయడం జరుగదు. ఈ లోపం కలికావతారంలో సరిదిద్ది దివ్య పరిణామానికి వ్యతిరేకంగా ఉన్న అసుర శక్తులను నాశనం చేసి దివ్య రాజ్యాన్ని ఈ నేల మీద స్థాపించడం జరుగుతుంది.

భౌతిక పదార్థం నుండి జీవమూ, జీవం నుండి మానసికమైన మనిషి పరిణామం చెందడం జరిగిందని చెప్పడం బాగానే ఉంది. కాని అవి ఎందుకు అలా జరిగాయి? పరిణామం అనే మాట కేవలం ఒక పద్ధతిని తెలియ చేస్తుందే కాని దానికి కారణం చెప్పదు. కారణం తెలుసుకోడానికి మన ప్రాచీన వేదాంతం చెప్పిన పరిష్కారాన్ని అంగీకరించి తీరాలి. అది ఏమిటంటే సచ్చిదానందుడైన పరమేశ్వరుడు తాండవ కేళి సలిపాడు. ఆ నృత్యంలో ఒకే రూపమైన స్వచ్ఛమైన ఉనికి భూత భవిష్యద్వర్తమానాలలో బహు రూపాలుగా కనిపించడం జరిగింది. అదే ఈ లోకం. అలా నృత్యం చేయడంలో ఉండే ఆనందమే ఆనృత్యానికి పరమావధి.

ముక్తసరిగా చెప్పుకోవాలంటే పరమేశ్వరుని లీలలో ఒకభాగంగా సచ్చిదానందం దివి నుండి భువికి దిగివచ్చి భౌతిక పదార్థంలో ఇమిడి ఉంది. అనగా భౌతికపదార్థంలో జీవం యిమిడి ఉందన్న మాట. అలా యిమిడి ఉన్నందువల్లనే భౌతిక దశనుంచి జీవదశకు పరిణామం చెందింది. అదే విధముగా జీవంలో మనస్సు యిమిడి ఉన్నందువల్లనే జీవం నుంచి మనస్సు కలిగిన మనిషి పరిణామం చెందడం జరిగింది.

మనస్సుకంటె ఉన్నతమైన శిఖరాలున్నాయనే విషయం మానవుల అనుభవంలో రుజువవుతూనే వచ్చింది. స్ఫూర్తి అనగా యిన్‌స్పిరేషన్. స్వయంస్ఫూర్తి అనగా యిన్‌ట్యూషన్. దివ్య దర్శనము అనగా రెవలేషన్ అనేవి హేతువాదానికి అందని అనుభవాలు. స్వయంస్ఫూర్తి వల్లనే అనేకమంది సైంటిస్టులూ, గణిత శాస్త్రజ్ఞులూ అనేక నూతన విషయాలను కనిపెట్టారు. కవులూ చిత్రకారులూ యిన్‌స్పిరేషన్ వల్లనే మహాకావ్యాలనూ మహాచిత్రాలనూ రచించ గలిగారు. అదే విధంగా ఋషులు రెవలేషన్ ద్వారా సత్యదర్శనాన్ని పొందారు. ఈ అనుభవాలన్నీ మనస్సుకంటె ఉన్నతమైన స్థాయిలోనివి. అందువల్ల పరిణామం అనేది ఆగకుండా జరుగుతూనే ఉందనేది స్పష్టం అవుతూ ఉంది.

ఇంతవరకు జరిగిన పరిణామం ఆయా స్థితులలో ఉన్నవాటికి తెలియకుండా జరిగింది. యాదృచ్ఛికంగా జరిగింది. అందువల్ల నెమ్మదిగా జరిగింది. అయితే యిప్పుడు మనిషికి తనను తాను తెలుసుకునే జ్ఞానం ఉంది కనుక ఆతని సొంత కృషివల్లనే యికనుంచి పరిణామం జరుగుతుంది. మానవుడు తనను తాను మార్చుకోడానికి ఒక పద్ధతి విధానమూ ఉందని చూపించారు శ్రీ అరవిందులు.

అయితే మానవుడు పరిణామం చెందవలసిన పై మెట్టు ఏమిటి? మానవుడు యిప్పటి మానసిక దశను దాటి అతీత మనస్సును చేరుకోవాలి. చేరుకుని పరమ పురుషుడు కావాలి. అతీత మనస్సును చేరడానికి ముందుగా నాలుగు మజిలీలను గడపాలి.

మానవుడు మానసిక దశను దాటిన తరువాత క్రమంగా ఉన్నత తర మనస్సు అనగా 'హయ్యర్‌మైండ్', ఉద్దీపిత మనస్సు అనగా 'యిల్యూమిన్డ్ మైండ్.' స్వతఃస్ఫురణ మనస్సు అనగా 'యిన్‌ట్యూటివ్ మైండ్.' ఉపరిమనస్సు అనగా 'ఓవర్‌మైండ్'లను దాటి అతీత మనస్సును చేరుకోవాలి.

మనస్సుకూ అతీత మనస్సుకూ మధ్య నొక ప్రకాశవంతమైన మూత బిగించి ఉంది. ఈ మూతను భేదించాలి. అప్పుడు చేతన పైకి వెళ్లడం అతీతమనస్సు క్రిందికి రావడమూ జరగాలి. అతీత మనస్సు క్రిందికి వచ్చినప్పుడు దానివలన ప్రభావితమైన మనసూ, ప్రాణమూ, శరీరమూ ఇప్పటి స్థితికంటె భిన్నంగానూ మెరుగుగానూ ఉంటాయి

ఆ రకంగా ప్రభావితం అయిన మనిషి విరుద్ధ శక్తుల కలయికగా ఉండడు. ఒకే ప్రవాహాన్ని ప్రతిబింబించే అతీత మానసికజీవి అవుతాడు.

ఇక్కడ అతీత మానసచైతన్య లక్షణాలు వివరిస్తాను. మొదటి అంశం—అతీత మనస్సు అనేది పూర్ణజ్ఞానం ఉండే పీఠం. అక్కడజ్ఞానం హేతువాదబద్ధమైనదిగా ఉండదు. ప్రతిసమస్య మీద పూర్వపక్షమూ పరపక్షమూ చర్చించి బేరీజు వేసుకుని సంశయాస్పదమైన పరిస్థితులలో నుంచి సుమారుగా ఇలా ఉంటుందనే సిద్ధాంతం చేయడమే మనస్సు చేసే పని. కాని అతీతమనస్సులో జ్ఞానం తాదాత్మ్యంవల్ల నేరుగా వస్తుంది. తెలుసుకునేవాడూ తెలుసుకోవలసినదీ ఒకటే కావడంవల్ల అతీతమానసజ్ఞానం ఆత్మజ్ఞానం అవుతుంది. రెండవ అంశం ఏమిటంటే మానసిక దశలో ఇచ్ఛాశక్తి ఏదో ఒకటి కోరడం, దానిని సాధించడానికి యాతన పడడం, చివరకు సాధించలేకపోవడం జరుగుతుంది. కాని అతీత మానసిక దశలో ఆత్మచైతన్యం యొక్క శక్తే ఇచ్ఛాశక్తి కావడంవల్ల పరమసత్యానికి సంబంధించి కోరడం, కోరిన వెంటనే సాధించడం జరుగుతుంది. ఎందువల్లనంటే అక్కడ ఇచ్ఛాశక్తీ జ్ఞానమూ ఒకటే కనుక. మూడవ అంశం ఏమిటంటే అతీత మానసిక స్థితి అనేది పూర్ణానందంతో కూడినటువంటిది. అక్కడ కన్నీటి కడలిని దాటిన అనుభవైకవేద్యమైన శాంతి ఉంటుంది. అక్కడసృష్టికి మూలమైన ఆనందమూ ఆ ఉనికికి సంబంధించిన సత్యమూ ఆనందపారవశ్యంలో ఇమిడి ఉంటాయి.

అతీత మానసిక దశలో పరిస్థితి తెలుసుకున్నాం కనుక అక్కడికి చేరేలోగా చేతన చేసే మజిలీలను గురించి కొంత తెలుసుకుందాం.

వీటిని గురించి శ్రీ అరవిందులు తమ దివ్యజీవనం, యోగ సమన్వయం అనే గ్రంథాలలోనూ, సావిత్రి మహాకావ్యంలో అశ్వపతి యోగంలో 'ది కింగ్డమ్స్ అండ్ గాడ్ హెడ్స్ ఆఫ్ ది గ్రేటర్ మైండ్' అనే సర్గలోనూ, 'థాట్ ది పేరాక్లీట్' అనే పద్యరత్నంలోనూ విపులంగా చెప్పారు.

మనస్సును దాటిన తరువాత చేతన ఉన్నతతర మనస్సుకు అనగా 'హయ్యర్ మైండ్'కు చేరుకుంటుంది. ఇక్కడ ఆధ్యాత్మిక భావన, సత్యశక్తి, ఎక్కువ చైతన్యవంతంగా ఉంటాయి. అయినా ప్రకృతి నిరోధంవల్ల ఇక్కడ అనుభవం ఎక్కువసేపు నిలువదు.

అక్కడనుండి చేతన ఉద్దీపిత మనస్సును అనగా 'ఇల్యూమిన్డ్ మైండ్'ను చేరుకుంటుంది. ఇక్కడ చైతన్యం మరింత ఎక్కువయి సత్యతేజంతో సత్యమును చూడడం జరుగుతుంది. ఇక్కడ కూడా దిగువ ప్రకృతి నిరోధం పనిచేయడం వల్ల అనుభవం ఎక్కువసేపు ఉండదు.

ఉన్నతతర మనస్సులోనూ ఉద్దీపిత మనస్సులోనూ విశ్లేషించడం తక్కువ. అవగాహన ఎక్కువ. చీకటి వెలుగుల అనిశ్చిత పరిస్థితి తగ్గి వెలుతురులో సత్యదర్శనం జరుగుతుంది.

అక్కడనుంచి చేతన స్వతఃస్ఫురణ మనస్సును అనగా 'ఇన్ట్యూటివ్ మైండ్'ను చేరుకుంటుంది. అక్కడ మెరుపు మెరిసినట్లు ఒక దివ్య తేజస్సులో పూర్ణసత్యం త్రుటికాలంలో స్ఫురించి మళ్లీ చీకటి అవుతుంది. కాగా మిగిలేది ఆ తేజోమయమైన క్షణం యొక్క జ్ఞాపకం మాత్రమే.

అక్కడనుండి చేతన ఉపరిమనస్సును అనగా 'ఓవర్ మైండ్'ను చేరుకుంటుంది. ఇక్కడ చాలా విశాలమైన పరిధిలో చైతన్యం ఉంటుంది. ప్రవహించే నదిలో నీరు త్రాగుతున్నట్లు, సూర్యుని ప్రకాశవంతమైన కిరణాలలో విహరిస్తున్నట్లు, అనంతకాలంలో ఆదమరచి ఆలోచిస్తున్నట్లు ఉంటుంది. చైతన్యంలో వచ్చిన మార్పువల్ల ఈ ప్రపంచంలో ఉంటూ కూడా దానికి చెందనట్లుండడం అనగా అతీతంగా ఉండడం, ఏదో విశ్వశక్తి యొక్క ప్రేరణ వల్లనే ఆలోచించడం, మాట్లాడడం, కర్మచేయడం జరుగుతూ ఉంటుంది.

ఉపరిమనస్సును దాటిన తరువాత చేతన అతీత మనస్సును అనగా 'సూపర్ మైండ్'ను చేరుకుంటుంది. అతీతమనస్సు గురించి ఇంతకుముందే వివరించాను.

ఈవిధముగా చేతన ఊర్ధ్వముఖ ప్రయాణం చేయడం సాధారణంగా యోగనిద్రలో జరుగుతుంది. కాని ఏకాగ్రసాధన బలాన్నిబట్టి జాగ్రదావస్థలో కూడా ఏక్షణంలోనైనా చైతన్యం అటువంటి ఊర్ధ్వముఖ ప్రయాణం చేయడం జరుగవచ్చునని శ్రీ అరవిందులు ప్రవచించారు.

ఇక్కడ ఒక మాట చెప్పాల్సి ఉంది. ఆధ్యాత్మికం, దివ్యం అనే మాటలు ఉపయోగించడంవల్ల ఇదేదో జీవితానికి సరిపడనిదని జీవితానికి దూరంగా ఉన్న విషయాలని అనుకోకూడదు. సగంమనిషిగా ఉన్నవాడని, పూర్తిగా చేయడానికే సమగ్రమానవునిగా తయారు చేయడానికే సత్యమనస్సుని చేరుకుని జీవితమును ప్రభావితం చేయడానికే వాడడం జరిగింది. ఇప్పటివరకు శాస్త్రజ్ఞులూ మానసిక శాస్త్రజ్ఞులూ, ఆర్థికంగా జరిగే ఉద్యమాలూ మానవజీవితాన్ని సమగ్ర జీవితం చేయడానికి కృషి చేస్తున్నాయి. అదే పనిని అంతకంటే ఉన్నతమైన పద్ధతిలో ఉత్కృష్టమైన పద్ధతిలో శ్రీ అరవిందుల పూర్ణయోగం చేస్తుంది.

అంతకూ మనస్సునుంచి అతీతమనస్సును చేతన చేరుకోవడం యొక్క ప్రాముఖ్యం ఏమిటి? ఏమిటంటే ఇది శ్రీ అరవిందుల పూర్ణయోగంలో ఒకభాగం. పూర్ణయోగంలో మూడు విధాలైన రూపాంతరాలు జరుగవలసి ఉంది. మొదటిది ఆత్మగతమైన రూపాంతరం, రెండవది ఆధ్యాత్మికమైన రూపాంతరం. మూడవది అతీతమానసికమైన రూపాంతరం జరగాలి. అతీతమానసికమైన రూపాంతరంలో చేతన మనస్సునుంచి ఉన్నతతర మనస్సు, ఉద్దీపిత మనస్సు, స్వతఃస్ఫూర్తిమనస్సు, ఉపరి మనస్సులను దాటి అతీత మనస్సును చేరుకోవడం, అతీత మనస్సు క్రిందికి రావడం జరిగి, అతీతమనస్సు క్రింది రావడం జరిగి, అతీతమనస్సు క్రింది స్థాయిలను అనగా ఉన్నతతర మనస్సువరకే కాకుండా దానికి దిగువనున్న మనస్సు, ప్రాణము, శరీరము— వీటన్నిటిని తనకు అనుకూలంగా మలచుకుంటుంది. అప్పటికి మనిషి దివ్య పరిణామం చెందిన వ్యక్తి అవుతాడు. అటువంటి వ్యక్తులు ఆధ్యాత్మిక సమాజాన్ని నిర్మిస్తారు.

ఈ విధముగా మానవుడు దివ్యత్వాన్ని పొందడం, సమాజం ఆధ్యాత్మికం కావడం అనే శ్రీ అరవిందుల సందేశం సఫలం అవుతుంది.

# అక్బర్‌షా రచించిన
# శృంగారమంజరి

శ్రీ బులుసు వేంకటరమణయ్య

అలంకార శాస్త్రానికి ఆకరమని పేరుపొందిన కావ్యప్రకాశంలో 'సద్యః పర నిర్వృతయే' అని రసానుభూతివల్ల కలిగే విగలిత వేద్యాంతరమైన ఆనందమే ప్రధాన ప్రయోజనమని తెలియజేశాడు. కావ్యంలో వ్యంగ్యం ప్రధానమని చెప్పినా, అందులో వ్యక్తమైన రసమే కావ్యాత్మ అని ఆనంద వర్ధనుని అభిప్రాయం. 'వాక్యం రసాత్మకం కావ్యం' అనే సాహిత్యదర్పణ కర్త విశ్వనాథకవిరాజు సిద్ధాంతం కావ్యతత్త్వవేత్తలకు సువేద్యమే!

రసములు తొమ్మిది అని పెక్కుమంది లాక్షణికులు తెలిపి యున్నారు. కొందరు వత్సలరసాన్ని చేర్చి పది రసాలని చెప్పారు. మరి కొందరు స్నేహాన్ని, భక్తినీ కూడా చేర్చారు. భక్తి వాత్సల్యాదులు భావాలని పండితరాజు వివరించియున్నాడు. ఇలా వివిధాభిప్రాయాలు కాని వస్తున్నవి. వీటన్నిట్లోనూ ఏది ప్రధానమనే ప్రశ్న కూడా కలుగక పోదు. కావ్యం కాంతాసమ్మితం కావడం వల్ల రసాలన్నిట్లో శృంగారమే ముఖ్యమైనదని చాలామంది అభిప్రాయం. వివిధ రసాల స్వరూపాలను వివరించేటప్పుడు అందరూ మొదట శృంగారరసాన్నే తీసుకున్నారు.

భోజదేవుడు శృంగారం ఒక్కటే రసమని, తక్కినవి రసాలుకావే కావనీ తన 'శృంగార ప్రకాశం'లో ఈ విధంగా చెప్పియున్నాడు —

'శృంగార వీర కరుణాద్భుత హాస్య రౌద్ర
భీభత్స వత్సల భయానక శాంతనామ్నః
ఆమ్నాసిషుర్దశ రసా న్పరే వయం తు
శృంగారమేవ రసనాద్రస మామ నామః'

ఇతరులైన ఆలంకారికులు రసములు—శృంగారం, వీరం, కరుణ, అద్భుతం, హాస్యం, రౌద్రం, భీభత్సం, వత్సలం, భయానకం, శాంతం అని పది ఉన్నాయని చెప్పి యున్నారు. మేముమాత్రం ఆస్వాదయోగ్యంగా ఉన్న శృంగారం ఒక్కటే రసమని చెప్తున్నాము — అని దీని భావం.

ఆతడు ఇతర రసాలను గూర్చి చెప్తూ అన్న దిదీ.

'వీరాద్భుతాదిషు రసేషు రసప్రసిద్ధిః
సిద్ధా కుతోఽపి వటయక్ష వదా విభాతి,
లోకే గతానుగతి కత్వ వశా దుపేతా
మేతాం నివర్తయితుమేవ పరిశ్రమో నః'.

ఆయితే వీరం అద్భుతం మొదలైనవాటికి రసాలనే ప్రసిద్ధి కావడం 'గతానుగతికో లోకో న లోకః పారమార్థికః' అనే న్యాయాన్ని అనుసరించి యథార్థాన్ని తెలుసుకోక నలుగురూ చెప్పినదాన్ని విని నమ్మి నందువల్లనే. ఎలాగంటే — 'ఆ మర్రిచెట్టుమీద భూతం ఉంది' అని ఎవం ప్రచారం చెస్తే, దాన్ని విని ఇతరులు నమ్మి అక్కడ భూతం ఉన్నదని అనుకుంటారు. ఆ చెట్టుదగ్గరకు వెళ్లడానికి భయపడతారు కూడా. వీరం మొదలైన వాటి సంగతీ అంతే. ఆ అప్రథను పోగొట్ట డానికే మా యీ పరిశ్రమం — అని దీని అభిప్రాయం.

శృంగారానికి ఇంత ప్రాధాన్యం ఉండడం వల్లనే దాని తత్వాన్ని వివరించే గ్రంథాలు సంస్కృతంలో ఎన్నో రచించబడినవి. వాటిలో 'శృంగారమంజరి' ఒకటి. ఈ పేరుతో కొన్ని గ్రంథాలు ఉండవచ్చును. అక్బర్ షా రచించిన గ్రంథాన్ని గురించే ఇచట వివరించబడును.

మన దేశంలో ఉండే ముస్లిం ప్రభువులు, విద్వాంసులు కొందరు తమ మాతృభాషా వాఙ్మయాలనే కాకుండా సంస్కృత భాషావాఙ్మయాలనూ, ప్రాంతీయ భాషావాఙ్మయాలనూ పోషించడం, వాటిలో పాండిత్యాన్ని సంపాదించడం కానవస్తూ ఉన్నది. ఢిల్లీ పాదుషా షాజహాను సంస్కృతంలో సాటిలేని విద్వాంసుడైన పండితరాజును గొప్పగా గౌరవించడం సుప్రసిద్ధమే! షితాబ్‌ఖాను, అమీనుఖాను మొదలైన ప్రభువులు ఆంధ్రప్రబంధాలను కృతిపొంది ఆంధ్రకవీశ్వరులను గౌరవించినట్లు వాఙ్మయాభిమానులకు తెలుసును. ఇలా విద్వత్కవులను పోషించినవారే ఎక్కువ. స్వయంగా పాండిత్యం సంపాదించి గ్రంథాలు రచించినవారు చాలా తక్కువ. అక్బర్ షా సంస్కృతాంధ్రాలలో గట్టి విద్వాంసుడు. ఆతని 'శృంగారమంజరి' వల్లనే ఈ విషయం స్పష్టమవుతున్నది.

అక్బర్ షా పూర్తిపేరు హజరత్ సయ్యద్ అక్బర్ షా హుసేన్. ఇతనికి 'బడే అక్బర్ షా' అనేది ప్రసిద్ధనామం. ఇతనితండ్రి షా రాజు 17వ శతాబ్ది చివర గోల్కొండరాజ్యాన్ని పాలించిన అబుల్‌హసన్ తానాషా (తానీషా)కు మతగురువు. అక్బర్ షా కూడా ఈ గోల్కొండ నవాబునకు గురువుగా ఉండెనట! తండ్రికొడుకు లిద్దరూ గొప్ప విద్వాంసులు. యోగులు. ఉదారహృదయులు!

తాను కవులందరి ప్రశంసకూ పాత్రుడైనట్లు అక్బర్ షా తన గ్రంథంలో—

'ఆకబరు మవచోగోచర
గుణమపి కవయః ప్రశంసంతి,
యత్కాలి తద్గుణ గరిమా
నిర్ణయితుర్గౌరవం తనుతే."

అని చెప్పి యున్నాడు.

ఈయన 'శృంగారమంజరి'ని మొదట తెలుగులో రచించినట్లు, దానిని అనుసరించే తర్వాత సంస్కృతభాషలో వ్రాసినట్లు

'తేనాంధ్ర భాషయాఽయం
రచితః శృంగారమంజరీ గ్రంథః,
న్యాయ వ్యాకరణయుత భూర్వ
న్మకులమణి రంజితాంధ్రి కమలేన.
తద్విరచితాంధ్ర భాషే
కవితాం శృంగారమంజరీ వ్యాయామ్,
సేవధ్వం సురవాణీ
రచితాం రసకోవిదా రసికభృంగాః'

అనే శ్లోకాలవల్ల తెలుస్తున్నది. ఇతడు ప్రభువులకు గురువు కావడం వల్లనే వారితని పాదపద్మములకు నకిరీటంగా నమస్కరిస్తున్నట్లు చెప్పబడింది.

అక్బర్ షా సంస్కృతగ్రంథమే లభించింది. ఈ సంస్కృత గ్రంథాన్నిబట్టే చూడగా తెలుగు గ్రంథం కూడా సాహిత్యశాస్త్రానికే సంబంధించే ఉంటుందని తెలుస్తున్నది.

శృంగారమంజరి లిఖితప్రతులు రెండే లభించాయి. ఒకటి దేవనాగరి లిపిలో మైసూరు ప్రాచ్యగ్రంథాలయంలో ఉన్నది. వేరొకటి తెలుగులిపిలో తంజావూరు సరస్వతీ మహల్ లైబ్రరీలో ఉన్నది. ఈ రెండు ప్రతులకూ కాపీలు వ్రాయించి తెప్పించి పరిశోధించి విపులమైన ఆంగ్లపీఠికతో కూడా సుప్రసిద్ధ పరిశోధక విద్యాంసులు డాక్టర్ వి. రాఘవన్‌గారు ఎడిట్ చేశారు. హైదరాబాదు పురాతత్త్వ పరిశోధనశాఖవారు ఏకవర్ణ, త్రివర్ణ చిత్రాలతోనూ, పురాతత్త్వ శాఖాధ్యక్షులు ఖ్వాజా మహమ్మద్ అహమద్ ఎం.ఏ., ఎల్.ఎల్.బి.గారి పీఠికతోనూ పెద్ద సైజు (డబుల్ క్రౌను)లో అందంగా ముద్రించి ప్రకటించారు.

మైసూరు ప్రతి సమంజసంగా ఉన్నదే కాని, తంజావూరిలో ప్రతిలో గ్రంథకర్తృత్వం తంజావూరి ప్రభువు ఏకోజీపుత్రుడు శాహాజీకి అంటకట్టబడింది. దాని గద్యలో

'ఇతి శ్రీమన్మహారాజాధిరాజ మకుటతట ఘటిత
మణి ప్రభారాజనీరాజిత చరణ యేకోజీరాజవర సుత
శాహరాజ సంగృహీం(?) శృంగారమంజరీ సంపూర్ణమ్.'

అని ఉన్నది. గద్య తప్పులతో ఉన్నది. గ్రంథంలో శాహరాజ ప్రస్తావన ఉండుటవల్ల లేఖకుడు భ్రాంతిపడి ఇలా వ్రాసి ఉండవచ్చును. మూలంలోనే అవతారిక దీనికి విరుద్ధంగా అక్బర్ షాకు సంబంధించే ఉన్నవి.

55 పుటల పరిమితి గల యీ గ్రంథంలో 40 పేజీలు నాయికా నిరూపణానికీ, 4 పుటలు సఖీవివరణానికీ, మూడు పుటలకు పైగా దూతీ నిర్వచనానికీ, రెండున్నర పుటలు నాయకస్వరూపనిరూపణానికీ, రెండు పుటలు రసానికీ ప్రత్యేకించబడినవి. చివర వాత్స్యాయన మతానుసారంగా హస్తిని, చిత్రిణీ, శంఖిని, పద్మిని అనే చతుర్విధ నాయికలను గురించిన లక్షణోదాహరణాలు ఉన్నవి.

గ్రంథకర్త హైందవేతరుడయినా భారతీయ సంప్రదాయాన్ననుసరించి

'గురుం గణపతిం దుర్గాం
వటుకం శివ మచ్యుతమ్,
బ్రహ్మాణం గిరిజాం లక్ష్మీం
వాణీం వందే విభూతయే'.

అని గురువును, దేవతలను స్తుతించాడు. మనవారు తొలుత దేవతలను కొనియాడి, ఆ పిదపనే గురువును స్తుతిస్తారు. ఇందు మొదటనే గురుస్తుతి ఉన్నది. ఇది అక్బర్‌షా గురుభక్తికి తార్కాణం.

తాను పెక్కు లక్షణ గ్రంథాలను పరిశీలించి, అత్యుత్తమంగా దీనిని రచించినట్లు గ్రంథకర్త గ్రంథాదిని ఈ విధంగా చెప్పియున్నాడు.

'రసమంజరీ, ఆమోద, పరిమళ, శృంగారతిలక, రసికప్రియ రసార్ణవ, ప్రతాపరుద్రీయ, సుందర శృంగార, నరసకావ్య, దశరూప, విలాసరత్నాకర, కావ్యపరీక్షా, కావ్యప్రకాశ ప్రముఖ గ్రంథాన్ విచార్య ప్రాచీనగ్రంథేషు యాని లక్షణాని యుక్తియుక్తాని తాని సంగృహ్య అన్యాని పరిత్యజ్య, ప్రాచీనోదాహరణానుసారేణ నాయికా భేదాన్ కల్పయిత్వా, తేషాం లక్షణోదాహరణాని కల్పయిత్వా, పూర్వగ్రంథేషు యాని లక్ష్యాని సంతి తేషాం లక్షణాని రచయిత్వా, యేషా ముదాహరణాని న సంతి తేషా ముదాహరణాని విరచయ్య, యేషాం నామాని న సంతి తేషాం నామాని స్థాపయిత్వా, అయుక్త నామన్యపి యుక్తనామ చ స్థాపయిత్వా, విస్తరకరణస్థలే విస్తరం కృత్వా, సంక్షేపకరణ స్థలే సంక్షేపం కృత్వా సర్వస్థలేషు సాధారణ లక్షణానాం సాధారణోదాహరణాని నిర్మాయ, ప్రాచీన లక్షణేషు యా న్యపయుక్తాన్యుదాహరణాని తాని తత్తన్నాయికా దిస్థలేషు లిఖిత్వా, చర్చాగ్రంథో గద్యరూపో లక్షణ గ్రంథ పక్తికా రూప ఉదాహరణ గ్రంథః పద్యరూపః లక్షణోదాహరణే, నాయికాభేదాః శృంగార హాస్యకరుణ రౌద్ర వీర భయానక బీభత్సాద్భుత శాంతాఖ్య నవ రసేషు శృంగార రసస్య ప్రాధాన్యాత్ శృంగార రసాలంబన విభావా నాయికా నాయకాః, శృంగారరసానుకూలాః సాత్త్వికభావాః, పూర్వోక్త గ్రంథావర్ణిత పద్మిన్యాది జాతయః జాతిసంకరో జాతి భేదాశ్చైవం సమాసేన విశేష నిరూప్యంతే.'

పయి విషయాన్ని బట్టి అక్బర్ షా ఎంత పరిశ్రమచేసి యీ గ్రంథాన్ని వ్రాసినది స్పష్టమవుతున్నది. పై వచనంలో ఉదాహృతాలయిన గ్రంథాలలో ఆంధ్రులు రచించినవీ, ఇతరులు రచించినవీ కూడా ఉన్నవి. 'ఆమోదం' పెక్కుసార్లు ఉటంకించబడింది. అది భానుదత్తుని రసమంజరికి వ్యాఖ్య. కర్త ఆంధ్రుడైన విలకమ్రి రంగశాయి పండితుడు. రసార్ణవమనేది తెలుగురాజు సింగభూపాలుడు రచించిన రసార్ణవ సుధాకరం. ప్రతాపరుద్రీయం కాకతి ప్రతాపరుద్రదేవుని ఆస్థానవిద్వత్కవి విద్యానాథుని కృతి. "నరసకావ్యం" అనేది కావ్యమేమో అనే భ్రాంతి కలుగుతుంది. కాని సందర్భాన్నిబట్టి అది సాహిత్యశాస్త్ర గ్రంథమే అని గ్రహించాలి. అది కీర్తికాయులు మానవల్లి—రామకృష్ణకవిగారు ప్రస్తావించిన సంస్కృత నరసభూపాలీయమయి ఉండినా ఉండవచ్చును.

శృంగారమంజరిలో తరచుగా రసమంజరిలోని విషయాలు విమర్శించబడినవి. చాలా చోట్ల తత్కర్త అయిన భానుదత్తుని మతం పరాస్తం చెయ్యబడింది. కొన్ని విషయాలలో సమ్మతించడమూ కద్దు. 'రసమంజరీ కారః ఇతి కథితవాన్. ఇదమే వాస్మాభిరఙ్గీకృతమ్' అని అక్కడక్కడ చెప్పబడింది. ఈ గ్రంథకర్త ప్రాచీనమతాలలోని అనే

చిత్యాలను చూపి. వాటిని పరిహరించడానికి తగిన లక్షణాలను ఉదాహరణలతో కూడా తెలియుచేయున్నాడు. వాటిలో కొన్ని —

1. రసమంజరీకారుడు ముగ్ధా, మధ్యా, ప్రౌఢా నాయికలను గురించి వివరిస్తూ మధ్యా నాయికలలో 'అతి విస్రబ్ధనవోఢ'ను పేర్కొన్నాడు. కాని, నవోఢ—కొత్తగా వివాహమైనది ముగ్ధ కాగలదు కాని మధ్య కాజాలదు. అతి విస్రంభం ప్రౌఢనాయికయందే ఉంటుంది. ముగ్ధలోగాని, మధ్యలోగాని ఉండనే ఉండదని శాలివి సిద్ధాంతం.

2. రసమంజరీకర్త 'సమాన లజ్జామదనా మధ్యమా' అని మధ్యమకు లక్షణం చెప్పి

'స్వాపే ప్రియానన విలోకన హానిరేవ
స్వాపచ్యుతౌ ప్రియకర గ్రహణ ప్రసంగః
ఇత్థం సరోరుహముఖి పరిచింతయంతీ
స్వాపం విహాతుమపి హాతుమపి ప్రపేదే.'

అని ఉదాహరించియున్నాడు. ఇందులో మధ్యానాయిక కోమల స్వభావం వెల్లడి అవుతున్నట్లు చెప్పాడు. 'నిద్రిస్తే ప్రియుని ముఖం చూడడం కుదరదు. మేల్కొని ఉంటే ప్రియుడు చేతిని పట్టుకొనునని భయము. ఈ విధంగా అనుకుంటున్న నాయిక నిద్రపోనూలేదు, పోకుండ ఉనూ లేదు' అని ఆయి శ్లోకం భావం. ఇందులో కోమలత్వమే వ్యక్తమవుతున్నది. మధ్యానాయిక నాయకుని యెదుట పరుషవాక్యాలు పలుకుతుంది. కోమలత్వం దానికి విరుద్ధం. ఇది శృంగారమంజరిలో నిరసించబడింది.

3. 'విత్తమాత్రోపాధికమైన సకల పురుషానురాగం కలది సామాన్య' అని సామాన్యాలక్షణం రసమంజరిలో ఉన్నది. కాని వేశ్యకు ధనమే ప్రధానం. ఆమెకు అనురాగం ఉండదు. అనురాగం లేని యువతి నాయికగా ఉండుటకు తగదు. అందువల్ల ఈ లక్షణం సరిగాలేదని శృంగారమంజరీకారుడు చెప్పాడు. తనకు ఆదరపాత్రుడైన ఆపేరావకారుడు చెప్పినదాన్ని త్రోసిరాజు చేసి 'అపరిత ఫల నిమిత్తానేక పురుష సంభోగం కలది సామాన్య' అని సముచితమైన లక్షణాన్ని నిర్వచించాడు.

4. స్వీయ, పరకీయ, సామాన్య అనే ముగ్గురు నాయికలూ స్వాధీనపతికాది భేదములను బట్టి స్వాధీనపతిక, వాసకసజ్జిక, విరహోత్కంఠిత, విప్రలబ్ధ, ఖండిత, కలహాంతరిత, ప్రోషితభర్తృక, అభిసారిక — అనే భేదాలను బట్టి) ఎనిమిదేసి విధాలని లక్షణవేత్తలు చెప్పియున్నారు. రసమంజరిలో ఆ ముగ్గురూ పై రీతిగానే కాకుండా 'అన్య సంభోగ దుఃఖిత, వక్రోక్తిగర్విత, మానవతి' అనే భేదాల ననుసరించి మూడేసి విధాలని చెప్పబడినది. కాని అన్య సంభోగ దుఃఖిత, మానవతి అనే భేదాలు రెండునూ కోపం వల్లనే కలగడం వల్ల అవి ఖండితా భేదములే అగుచున్నవి. వక్రోక్తిగర్విత మాత్రం ప్రత్యేకంగా పేర్కొనదగినది. శృంగారమంజరీ కర్త ఈ విషయాన్ని వివరిస్తూ, స్వాధీన పతిక దులైన అష్టవిధనాయికలతో వక్రోక్తిగర్వితను చేర్చి తొమ్మిది విధాలుగా తెల్పి యున్నాడు. శృంగార నాయికలను తొమ్మిదిమందిని చెప్పడం ఇందలి ప్రత్యేకత.

5. విరహోత్కంఠిత లక్షణం రసమంజరిలో 'సంకేతస్థలం ప్రతి భర్తు రనాగమన కారణం చింతయతి సోత్కా' అని ఉన్నది. భర్త (ప్రియుడు) సంకేతస్థలానికి రానందున, ఎందుకు రాలేదో అని ఆత్రంతో ఆలోచనలో మునిగినది విరహోత్కంఠిత అని దీని అభిప్రాయం. ఈ లక్షణం సరిగాలేదని అక్బర్‌షా అంటున్నాడు — వివాహం కాక పూర్వమే దమయంతికి నలునిపై అనురాగం ఏర్పడినందున — ఆమె విరహోత్కంఠిత కావలెను. పై లక్షణం ఆమె విషయమై కుదరుదు. నాయికా నాయకులు ఒక్కచోటనే ఉన్ననూ కార్యవ్యగ్రతవలన విరహం కలగడం స్వాభావికం. అక్కడా ఈ లక్షణం సరిపడదు.

సాహిత్యరత్నాకరంలో 'విరహేణ క్షతోత్కంఠా విరహోత్కంఠితా మతా' అని విరహం మూలంగా ఆతురత కలది విరహోత్కంఠిత అని ఉన్నది. అదీ సముచితంకాదు. ప్రోషిత భర్తృకలోనూ, విప్రలబ్ధలోనూ కూడా ఈ లక్షణం అతివ్యాప్తమవుతున్నది.

నాట్య శాస్త్రంలో —

'అనేక కార్యవ్యాసంగా ద్యస్యా నాగచ్ఛతి ప్రియః,
కామతశ్చైవ దుఃఖార్తా విరహోంత్కంఠితా మతా.'

అని చెప్పబడినదీ సరిగాలేదు. ఏమంటే— కార్య బాహుళ్యం కారణంగా కామం వల్ల దుఃఖించే నాయిక విరహోత్కంఠిత మాత్రమే కాదు. ప్రోషిత భర్తృక, విప్రలబ్ధ కూడా కాగలరు. కావున అతివ్యాప్తి తప్పలేదు.

ప్రతాపరుద్రీయంలోని 'చిరయత్యధికం కాంతే విరహోత్కంఠితోన్మనాః' అనే లక్షణమున్నూ కుదరదు. కాంతుడు జాగుచేయుటవల్ల ఉన్మనస్కత ప్రోషితభర్తృకకు, విప్రలబ్ధకును కలుగుతుంది.

పయి విధంగా విమర్శించి శృంగారమంజరికర్త 'నాయక స్య కార్యాంతర వ్యాసంగా ద్రియుక్తా ప్రియవిరహావతీ విరహోత్కంఠితా' అని నిర్వచించాడు. నాయికా నాయకులు ఒక్కచోటనే ఉన్నా, నాయకుడు కార్యాంతరవ్యగ్రుడై ఉన్నందున ప్రియవిరహం అనుభవించేది విరహోత్కంఠిత అని దీనిభావం. ఇట్టి లక్షణం గ్రహిస్తే అవ్యాప్తిగాని, అతివ్యాప్తిగాని సంభవించవు.

పయి విమర్శనముల వల్ల అక్బర్‌షా పరిశీలన వ్యాప్తి విశదమవుతున్నది.

# ఉప్పొంగెనది

శ్రీ నిఖిల్

ఏనాటికీ ఇంకిపోని ఈ శ్రామిక నది
ప్రవహిస్తూ ఎన్నో యుగాలుగా .........
ఇసుక తుఫానులా దాహాన్ని తీర్చి
నైలునదిని నడిపించిన మీ చేతులు
ఎన్నటికీ ఎండిపోని మీ స్నేహం
ఓల్గా— గంగా — యాంగ్సీ తీరాలను ఒరుసుకొని
గలగలా పారిన పోరాట శక్తి
ఈనాడు కొడవళ్లతో బాటు
తుపాకులు ఎత్తే పంట పొలాలు,
కృష్ణా—గోదావరి కాల్వల పొడవునా
గర్వంగా శ్రమ ఫలంగా పెరిగిన చెట్లు
మనిషి మనిషికి మధ్య
తియ్యని ఫలాలని పంచే
కష్టజీవుల భూమి వేళ్ళు
వేళ తప్పకుండా
ఆకుల ఈనెల సందుల్లోంచి మొలిచే సూర్యులు
ఈ శ్రామిక నదిలోంచి పుట్టి పెరిగి
మట్టూ వెచ్చదనాన్ని పంచి
ఈ భూమి కండలు కరిగించే వాడిదని
మన ఆయుధాలు ప్రతి హింసకోసమని
రోజూ నిర్మలంగా—ఉత్తేజంగా
ఈ మట్టిలోంచి ఉబుకుతున్న
పోరాడే ఊటలు
నిరంతరం ఎండకుండా పారే
కష్ట జీవుల దీర్ఘకాలిక సాయుధ ప్రవాహాన్ని
నా చుట్టూ నీ చుట్టూ
మనసే ఉప్పొంగుతోంది.

# కర్ణాటక ప్రభుత్వ సిల్కులు

ఇప్పుడు సాటిలేని ఆకర్షణీయమైన రంగులలోను,

అందమైన డిజైనులలోను లభించును.



క్రింది చిరునామా వద్ద సంప్రదించండి:—

1. ఫ్యాక్టరి, మనంతోడి రోడ్,
   మైసూరు-8.
2. షో అండ్ సేల్స్ రూం, కె. ఆర్. సర్కిల్,
   మైసూరు.
3. గుప్తా మార్కెట్, కెంపెగౌడా రోడ్,
   బెంగుళూరు-9.
4. 1/10, ఉస్మాన్ రోడ్, టి. నగర్,
   మద్రాసు-17.

# ప్రపంచవ్యవస్థ — వెనుకబడిన దేశాలు

శ్రీ వి. శ్రీరామచంద్ర

పారిశ్రామిక విప్లవారంభ దశలో ఆధునిక అర్థశాస్త్ర పితామహుడు ఆడమ్‌స్మిత్ దేశాల సంపద ఎలా పెంపొందుతుందో వివరిస్తూ ఒక పెద్ద గ్రంథం వ్రాశాడు. ఆయన యీనాడు జీవించి వుంటే, ప్రపంచంలో తొంబదిశాతం ప్రజలను పేదరికం ఎలా పట్టి పల్లారుస్తున్నదో వ్రాసేవాడవునో కాదో చెప్పలేము కానీ, యీ సమస్య నేడు మానవాళిముందున్న అత్యంత విషమ సమస్య అనడంలో సందేహం లేదు. సామాజిక వ్యవస్థలు, ఆచారాలు, మత విశ్వాసాలు, ఆర్థిక అసమానతలు, రాజకీయశక్తులు, వనరుల అందుబాటు, జనాభా పెంపుదల మొదలైన విషయాలను, ఆర్థికాభివృద్ధిమీద వాటి ప్రభావాన్ని వివరిస్తూ అనేక పాశ్చాత్యరచయితలు కొన్ని సిద్ధాంతాలను ప్రతిపాదించారు. రెండవ ప్రపంచ యుద్ధ కాలంనుంచీ ప్రాచుర్యం పొందిన యీ సిద్ధాంతాలు చాలావరకు లోపభూయిష్ఠమైనవే. పేదరికపు పెంపుదలకు వలస పాలన ఎంతవరకూ దోహదం చేసిందో వారెవ్వరూ ప్రస్తావించ లేదు. ఆ సంప్రదాయంలో శిక్షణ పొందిన దేశీయ మేధావులు కూడా చాలావరకూ అదే మార్గాన్ని అనుసరిస్తూ వచ్చారు., ఇంకా అలాగే జరుగుతున్నది. ప్రపంచం నేడొక మహత్తర సంధియుగంలో కొట్టుమిట్టాడుతున్నది. ఆదర్శానుప్రాణితమైన (Value—Free) విధానాలకు, ప్రవర్తనకూ మెచ్చుకోళ్ళు లభిస్తున్నాయి. కలర్ టెలివిజన్ సెట్లు, ఎలెక్ట్రిక్ టూత్‌బ్రష్‌లు, పండిన పంట ఎక్కువై ముక్కలై తినేవారులేక సముద్రం పాలుచేయడం, కోట్లకొలది విలువగల వనరులు వెచ్చించి కుజగ్రహ ప్రదక్షిణలు చేయడం కొన్ని దేశాల సొత్తు. కడుపునిండా తిండి, ఒంటినిండా బట్టలేని బక్కప్రజలు, గుడ్డిలాంతరు వెలుగులో అర్ధాకలితో పుస్తకాలలో కుస్తీపడుతూ జీవితమార్గాన్ని వెదుక్కుంటున్న పిల్లలు మరికొన్ని దేశాల అమూల్య సంపద. అభివృద్ధి పొందిన దేశాల మధ్య ఆర్థిక రాజకియ సహకారానికీ, ఐక్యతకూ మార్గం సుగమ మవుతుంటే పేద దేశాల మధ్య కలతలు పెచ్చరిల్లి సంబంధాలు ఛిద్రమవుతున్నాయి. గాల్‌బ్రెయిత్, మిర్డాల్ వంటి ఏ కొద్ది మంది తప్ప పాశ్చాత్య అర్థశాస్త్రవేత్త లెవరూ యీవిషయాల నంతగా పట్టించుకున్నట్లు కనబడదు. స్వేచ్ఛావిపణి విధానము, మిశ్రమ ఆర్థిక వ్యవస్థ, సోషలిస్టు రాజ్యం అన్న భిన్న వ్యవస్థలలో ఏది సంక్షేమ గరిష్ఠీకరణకు (Welfare Maximization) త్రోవ తీస్తుంది అన్న ప్రశ్నకు సమాధానం ఒక్కొక్క సమాజం యొక్క స్థితిగతుల మీద ఆధారపడి ఉంటుంది. ఆ సమాజ సభ్యుల యొక్క విలువలు విశ్వాసాల మీద కూడా ఆధారపడి ఉంటుంది. అయితే విలువలు నీతిశాస్త్రానికి (Ethics) చెందిన వ్యక్తిగత సూత్రాలనీ అర్థశాస్త్ర సూత్రాలకు, ఆర్థిక విధానాలకు వాటితో పొత్తు ఉండ కూడదనీ కొందరు ప్రముఖులు వక్కాణిస్తున్నారు. మిల్టన్ ఫ్రీడ్‌మన్ వంటి విద్వాంసులు యీ కోవకు చెందినవారు. స్వేచ్ఛా విపణి విలువల కతీతమైనదని ఆయన మతం. కాని స్వేచ్ఛా విపణే విధానం మీది విశ్వాసం కూడా ఒక విలువే కావచ్చును కదా!

వెనుకబడిన దేశాల ఆర్థిక రాజకీయ సమస్యలనూ, ప్రపంచ వ్యవహారాలలో వాటి పాత్రనూ పరిశీలించడం, యీ విషయాలలో మేధావుల దృక్కోణాలను, వారి సిద్ధాంతాలను విశ్లేషించడం యీ వ్యాసం యొక్క ఆశయం. మొదటి భాగంలో ఆర్థిక స్థితిగతులను గురించీ రెండవ భాగంలో రాజకీయ వ్యవహారాలను గురించి ప్రస్తావించడం జరుగుతుంది.

## 1

అభివృద్ధి అంటే ఏమిటి? అభివృద్ధి సాధించడానికి మార్గాలేమిటి? దేశాల మధ్య ఉన్న తారతమ్యాలకు కారణాలేమిటి? అన్న ప్రశ్నలకు మనం ముందు సమాధానం చెప్పుకోవాలి.

ఆర్థికాభివృద్ధికి సాధారణంగా తలసరి జాతీయాదాయం (Per capita Income) యొక్క స్థాయిని ప్రధాన సూచికగా వాడుతూ వుంటాం. దేశాల ఆర్థిక స్థాయీ భేదాలను పోల్చడానికీ గానీ, ఒక దేశంలో కాలక్రమేపి అభివృద్ధిని అంచనా వేయడానికీ గానీ దీనినే వాడుతూ వుంటాం. కానీ యిది కేవలం స్థూల సూచిక మాత్రమే. అవసరమైన అనేక వివరాలు యిందులో మరుగుపడి ఉంటాయి. అభివృద్ధిని కొలిచేటప్పుడు వాటిని కూడా సరిగా పరిగణించాలి. ఒక దేశంలో పలురకాల వస్తువులు ఉత్పత్తి అవుతుంటాయి. ధాన్యం, వస్త్రాలు, ఖనిజాలు, మందులు వైద్యుల సేవలు మొదలైన వాటిని అన్నింటినీ ఒకే మానంతో కొలిచి సమీకరించిన పరిమాణ జాతీయాదాయం. ఈ పరిమాణం ద్రవ్యరూపంలో ఆయా వస్తువుల విలువల మొత్తం అవుతుంది. ప్రతి వస్తువుకూ విపణిలో ఒకవిలువ ఉంటుంది. దీనినే ధర అందాం. ధరలు పెరిగినప్పుడు, వస్తువుల సంఖ్య అదే అయినప్పటికీ, జాతీయాదాయం పెరిగినట్లు కనిపిస్తుంది. అందుకే ఉత్పత్తి అయిన ప్రతివస్తువు యొక్క విలువను ఒకే స్థిరమైన ధరతో నిర్ణయిస్తే తప్ప నిజమైన జాతీయాదాయం ఏవిధంగా మారుతున్నదో చెప్పలేం. అలాగే, జనసంఖ్య పెరిగినప్పుడు జాతీయాదాయం ఒకే స్థాయిలో ఉంటే తలసరి ఆదాయం పడిపోతుంది. జనసంఖ్య పెరుగుదల రేటుకంటె ఎక్కువగా నిజమైన జాతీయాదాయం పెరిగితే తప్ప ప్రజల జీవనస్థాయి పెరగదు. ఉదాహరణకు జనసంఖ్య సాలుకు 2 శాతం చొప్పున, జాతీయాదాయం 3 శాతం వంతున పెరుగుతుంటే, తలసరి ఆదాయం ఒక శాతం మాత్రం పెరిగిన దన్నమాట. ఈ విధంగా ధరలు, జనసంఖ్య యొక్క పెరుగుదల ప్రభావాన్ని తొలగించి వస్తువుల ఉత్పత్తి స్థాయిని సూచిస్తుంది కనుక 'తలసరి యధార్థ జాతీయాదాయం' అభివృద్ధికి సూచికగా వాడబడుతున్నది. వెనుకబడిన దేశాలలో సగటున 1—1½ శాతం చొప్పున యిది పెరుగుతుంటే కొన్ని అభివృద్ధి పొందిన దేశాలలో 4—5 శాతం చొప్పున పెరుగుతున్నది. వెనుకబడిన దేశాలలో జనాభా పెరుగుదల ఎక్కువ కావడం కూడా యిందుకు ఒక కారణము. పారిశ్రామిక దేశాలలో జనాభా పెరుగుదల శాతం చాలా స్వల్పం. అందుచేత

ప్రభుత్వాలు, కొన్ని ప్రభుత్వ సంస్థలు 'యథార్థ జాతీయాదాయపు పెరుగుదల' రేటునే అభివృద్ధి సూచికగా వాడుతున్నాయి అప్పుడప్పుడు. అప్పటికీ యీ రెండు రకాల దేశాల మధ్య తారతమ్యం చాలా హెచ్చుగానే ఉన్నది అన్న విషయం యీ క్రింది పట్టికనుచూస్తే తెలుస్తుంది.

| దేశం | శాతం |
|---|---|
| ప. జర్మనీ | 6.5 |
| జపాను | 6.2 |
| ఇంగ్లండు | 4.2 |
| అమెరికా | 4.8 |
| ఇండియా | 2.8 |
| చైనా | 2.8 |
| బ్రెజిలు | 3.2 |
| ఈజిప్టు | 2.5 |

(ఈ రేటు 1963—66 సం. మధ్యకాలానికి చెందినవి. అన్ని రేట్లూ ఒకే సంవత్సరానికి చెందవు కాని స్థూలమాత్రంగా పరిస్థితిని సూచిస్తాయి.)

అభివృద్ధిని విశ్లేషించేటప్పుడు శాస్త్రజ్ఞులు సాధారణంగా ఆదాయ విభజనను గురించి ప్రస్తావించరు. ఒకవిధంగా చూస్తే యిది పొరపాటు. ఒక సమాజం యొక్క సంక్షేమ స్థాయి (Welfare level) ఆ సమాజం యొక్క ఆదాయం వ్యక్తుల మధ్య ఏవిధంగా విభజింపబడింది అన్న విషయం మీద కూడా ఆధారపడి ఉంటుంది. ఉదాహరణకు ఏ, బి అన్న రెండు దేశాలు తీసుకుందాం. రెండు దేశాల్లో యిద్దరేసి వ్యక్తులున్నారు. ఏ దేశంలో వ్యక్తుల ఆదాయం రు. 10,000, రు. 100 అనుకోండి. బి దేశంలో ఆదాయం రు 4000, రు. 2000 అనుకుందాం. తలసరి సగటు లెక్కనగాని, జాతీయాదాయం లెక్కన గాని ఏ దేశం బి కంటె సంపన్నమైనది. కాని సంక్షేమం దృష్ట్యా బి దేశం మిన్నగా తోచక మానదు. తలసరి ఆదాయం లెక్కలన సుసంపన్న దేశాలైన అమెరికా, జపాను, జర్మనీలలో కూడా పేదరికము, నిరుద్యోగము మొదలైన ఆర్థిక సమస్య లున్నాయి.

ఒక దేశం యొక్క జాతీయాదాయం పెరుగుతుంటే తప్ప, విభజన వలన సంక్షేమ ప్రగతిని సాధించ లేము. అభివృద్ధి చెందిన దేశాలలో ఆదాయ విభజన తారతమ్యాలు (Disparities in income distribution) వెనుకబడిన దేశాలలో కంటె తక్కువగా ఉన్నాయి. అయితే ఏ దేశమైనప్పటికీ, దాని జాతీయాదాయం పెరుగుతున్న కొలదీ తారతమ్యాలు పెరుగుతుంటాయి. అభివృద్ధితోబాటువిడదీయకుండా పెరిగించే యీ తారతమ్యాలను తగ్గించాలంటే కొన్ని ప్రత్యేక విధానాలను అవలంబించవలసి వస్తుంది. అందులో కొన్ని విధానాలు అదనపు ఆదాయాన్ని సరిగా విభజించడానికి ఉపకరించేవి. మరికొన్ని మూలవస్తు సంపదయొక్క యాజమాన్యాన్ని కూడా వికేంద్రీకరించేవి ఈ విధానాలు ఆయా దేశాల ప్రభుత్వాల రూపురేఖల మీద ప్రజల విలువల మీద ఆధారపడి ఉంటాయి.

ఆదాయ విభజనను కొలిచేందుకు ఆర్థిక శాస్త్రజ్ఞులు సాధారణంగా 'లారెంజ్ వక్రరేఖ' (Lorenz Curve) అన్న సాధనాన్ని వాడుతుంటారు.




పైన చూపిన ఎబిసిడి అన్న చతురస్రంలో, ఎ బి వెంట జన సంఖ్యను శాతం లెక్కన, ఎడి వెంట జాతీయాదాయాన్ని శాతం లెక్కన కొలుస్తారు. ఎ సి అన్న సరళరేఖ సంపూర్ణ సమాన ఆదాయ విభజనను సూచిస్తుంది. ఎందుకంటే, ఈ రేఖ మీది బిందువులు ఎ బి మీద ఎంత శాతం ఉంటుందో ఎడి మీద కూడా అంతే శాతాన్ని సూచిస్తాయి. అంటే, 10 శాతం ప్రజలు 10 శాతం జాతీయాదాయాన్ని, 20 శాతం ప్రజలు 20 శాతం జాతీయాదాయాన్ని, యీ విధంగానే మిగిలిన ప్రజలు అనుభవిస్తున్నారని అర్థం. కాబట్టి అందరూ సమానంగా జాతీయాదాయాన్ని పంచుకుంటున్నారన్నమాట. ఎ ఎం సి అన్న రేఖను తీసుకుందాం. దీని ప్రకారం దేశ జనాభాలో 50 శాతం ప్రజలు కేవలం 25 శాతం ఆదాయాన్ని మాత్రమే పొంద గలుగుతున్నారు. మిగిలిన సగం మంది 75 శాతం ఆదాయాన్ని అనుభవిస్తున్నారు. ఇది విభజనలో తారతమ్యానికి సూచిక. ఎ ఎన్ సి రేఖను తీసుకుందాం. దీనిప్రకారం సగం ప్రజానీకానికి కేవలం 10 శాతం జాతీయాదాయం లభ్యమవుతుంటే మిగిలిన సగం మంది 90 శాతం ఆదాయాన్ని పొంద గలుగుతున్నారన్న మాట. ఈ విధంగా ఏసి అన్న సరళరేఖకు ఎంత దూరంగ 'లారెంజ్ వక్రరేఖ' ఉంటుందో తారతమ్యాల అంత హెచ్చుగా ఉన్నాయన్న మాట. ఒక దేశం అభివృద్ధి చెందుతున్నకొద్దీ — అది వెనుకబడిన దేశం కావచ్చు, అభివృద్ధి పొందిన దేశం కావచ్చు — దాని 'లారెంజ్ రేఖ' ఏసికి మరింత దూరంగా పోతుంది. కాబట్టి ప్రగతితోబాటు ఆదాయ విభజన విధానాలను అనుసరించడం కూడా తప్పనిసరి అవుతుంది.

ప్రజల సంక్షేమం, సంతృప్తి కేవలం వస్తు వినిమయం (Material Consumption) మీదనేకాక పలు అంశాల మీద ఆధారపడి ఉంటుంది. జీవితం పట్ల వారి దృక్పథం, ఆలోచనా విధానం వారి ఆశయాలు మున్నైనవి చాలా ముఖ్యమైన అంశాలు. కానీ వాటిని కొలత వేసి లెక్కలోకి తీసుకోవడం చాలా కష్టం. కానీ కొంత కనిష్ఠ పరిమితి వరకూ ప్రతి ఒక్కని జీవనస్థాయి ఎదిగితే తప్ప, యీ విషయాల ప్రాముఖ్యం ఆర్థికాభివృద్ధి లక్ష్యం తరువాతనే పరిగణనలోకి తీసుకోవాలి. కానీ యిటీవల కొందరు పాశ్చాత్య ఆర్థిక శాస్త్రవేత్తలు "ఆర్థికాభివృద్ధిని గురించి మరిచిపోండి. మా ప్రాచీన సంస్కృతి, సంప్రదాయాలను రక్షించుకోవడం అవసరం. అవి ప్రపంచానికి ఎంతో మేలు చేస్తాయి" అంటూ వక్కాణిస్తున్నారు. బాయర్ (Bauer) అన్న ఒకాయన యిలా అంటాడు: "కుటుంబ నియంత్రణ అంటే వైముఖ్యంగల వ్యక్తి తన సంతానం తామర తంపరగ పెరిగితే సంతోషిస్తాడు. అందుచేత సంతానం పెరుగుదల కూడా సంక్షేమ కారకమే. అతన్ని ఆ సంతృప్తి నుంచి దూరం చేయడం మంచిది కాదు." ఇది ఒక విపరీతమైన వాదం. ఒక వ్యక్తి తనకూ, దేశానికీ కావలసిన దేమిటో తెలియని స్థితిలో ఉన్నప్పుడు అదే అభివృద్ధి వ్యక్తి సంక్షేమదాయకం అనడం మసిబూసి మారేడుకాయను చేయడమే. ఇలాంటి అవకతవక వాదాలను ప్రచారం చేసేవారు అభివృద్ధి శాస్త్ర నిపుణులుగా వచ్చి వెనుకబడిన దేశాల మీద పడుతున్నారు. వారినుంచి మనను రక్షించుకోవడం అవసరం. జీవితానికి భౌతికపు విలువలు, ఆధ్యాత్మికపు విలువలూ రెండూ అవసరమే. కానీ వాటి మధ్య సంఘర్షణ ఉన్నదనుకోడం పొరపాటు. నిజానికి వెనుకబడిన దేశాలలో భౌతికపు విలువలు లేకపోవడం, వస్తు వినిమయం ద్వారా జీవనస్థాయిని పెంచుకోవాలన్న ప్రగాఢమైన ఆకాంక్ష లేకపోవడం వెనుకబడినతనానికి కారణాలని కొందరంటున్నారు. ఇది ఎంతవరకు నిజమో పరిశీలిద్దాం.

ఆర్థికంగా అభివృద్ధి పొందడానికి, వెనుకబడటానికి కారణాల చాలా ఉన్నాయి. అందులో ప్రకృతిసిద్ధమైనవి కొన్ని. మానవకృతమైనవి కొన్ని. వాణిజ్య చక్రాలవలెనే మానవ సమాజ చరిత్రలో కూడా కొన్ని పరిభ్రమణాలు తథ్యం. ప్రజాస్వామ్య హక్కులు, పారిశ్రామికాభివృద్ధికి మూల బీజాలు యూరపులోనే మొలకెత్తాయి. అవి క్రమంగా ప్రపంచమంతటా వ్యాపించాయి. కాని యూరపులో అంకురించిన యీ బీజాలు మరికొన్ని దేశాల పేదరికానికి త్రోవ తీసింది. యంత్రాలవలన నానాటికీ పెరుగుతున్న ఉత్పత్తిని అమ్ముకోవడం కోసం విదేశ వ్యాపారంమీద ఆధారపడవలసి వచ్చింది. వలస స్థాపన విదేశ వ్యాపారానికి దోహదం చేసింది. పరిశ్రమల కవసరమైన ముడి సరుకు సరఫరాకు తయారైన వస్తువుల కొనుగోలుకు వలస రాజ్య విధానం చాలా ఉపకరించింది. పాలక దేశాల జాతీయాదాయం, ఉద్యోగావకాశాలు, జీవన ప్రమాణాలు విరివిగా పెరిగాయి. మరొక వంక పాలితదేశాలలో యిందుకు విపరీతంగా తయారైంది. విదేశ పాలకవర్గ ప్రభావంవలన దేశాల ఆర్థికవ్యవస్థలో ఒక ద్వైధీభావం (dualism) నెలకొన్నది. అంతవరకూ ఉన్న సంప్రదాయసిద్ధమైన ఆర్థికవ్యవస్థకూ నూతన ఉత్పత్తి వ్యవస్థకూ సంఘర్షణ ప్రారంభమైంది. పాతవి నశించాయి. కొత్తవి పూర్తిగా నెలకొనలేదు. ఈ పరిస్థితులలో వలస విధానం దేశాల వెనుకబడిన తనానికి ఎంతో దోహదం చేసింది.

ప్రకృతి పరమైన కారణాలను కూడా మనం యిక్కడ పేర్కొనవలసి ఉంటుంది. కాని చిన్న దేశాలలో మాత్రమే వీటి పాత్ర చాలా హెచ్చుగా ఉన్నది. ఉదాహరణకు, ఆరంభదశలో సిలోన్, మలేసియావంటి దేశాలలో తగిన శ్రామిక శక్తి లేదు. అందుచేత చాలాకాలం వరకూ వనరులన్నీ నిరుపయోగం గానే ఉండిపోయాయి. అలాగే పశ్చిమాసియాలో కొన్ని దేశాలలో అంతటా చమురు గనులు నిక్షిప్తం కావడం వలన పంటలు కూడా పండించుకునే భూసార వసతిలేదు. ఏడారులు, మంచుకప్పు వేసుకు పోయిన ప్రాంతాలు యింకా అలాగే ఉన్నాయి. బ్రెజిలు వంటి దేశాలు విస్తీర్ణంలో మనకంటె ఎన్నో రెట్లు పెద్దవైనప్పటికీ, స్వల్పమాత్ర జన సంఖ్యవలన అక్కడ భూమి ఎక్కువ భాగం అరణ్యప్రాంతంగా నిరుపయోగంగా ఉండిపోయింది.

శీతోష్ణ పరిస్థితులు వెనుకబడినతనానికి కారణమని ఒకవాదం ఉన్నది. వెనుకబడిన దేశాలన్నీ దాదాపు దక్షిణార్థ భూగోళంలోనే ఉన్నాయి అందుచేత ఉష్ణదేశాలు ఆర్థికంగా వెనుకబడటం తథ్యం అని యీ వాదంయొక్క సారం. కాని యిందులో అట్టే పసలేదు. ఆఫ్రికా, లాటిన్ అమెరికా ఖండాలలో కొన్ని దేశాలలో ఉష్ణోగ్రత సగటున యూరపువలెనే ఉంటుంది. అమెరికాలో పలు తావులో మరి వేసవి ఉష్ణోగ్రత 100° ఫారన్ హీటునుంచి 110° వరకూ ఉంటుంది. పై వాదాన్ని నిరర్థకం చేయడానికి యీ ఉదాహరణలు చాలు. పైగా యీ సిద్ధాంతంలో ఏమాత్రం సత్యమున్నా, ఉష్ణ దేశాలలో యిప్పటి వరకూ జరిగిన అభివృద్ధి కూడా జరిగి ఉండేదికాదు. ప్రకృతిసిద్ధమైన ఫాటలిజమ్ (Fatalism) ను పూర్తిగా అంగీకరించి మానవ శక్తియొక్క ప్రభావాన్ని విస్మరించడం ఉచితం కాదు.

ఆధ్యాత్మికచింతనకు ప్రాముఖ్యమిచ్చి ఐహిక సుఖ సంపత్తులను నిర్లక్ష్యం చేయడంవలన కొన్ని దేశాలు ఆర్థికంగా కడగండ్లపాలయినా యని కొందరి మతం. ఇది కొంతవరకూ మాత్రమే సత్యం. ఉదాహరణకు వస్తువులను ఉత్పత్తిచేసే అన్ని వర్గాలను వర్ణ వ్యవస్థలో అట్టడుగు వర్గంక్రింద పరిగణించారు. కానీ యీ వ్యవస్థ క్రమేపీ పలుమార్పులు పొందింది. వృత్తులు వర్గాలకు మధ్య ఉన్న సమానార్థకత తొలగిపోయింది. మొదటినుంచీ రెండవ స్థానంలో ఉన్న ఐహికపు విలువలు ముందుకు వచ్చాయి. ఇది అనేక శతాబ్దాల క్రిందటనే జరిగింది. మిల్టన్ సింగర్, ఎమ్. ఎన్. శ్రీనివాస్ అన్న సుప్రసిద్ధ సామాజిక శాస్త్రజ్ఞుల (Sociologists) వాద వివాదాలనుపరిశీలిస్తే యీ విషయంగా స్పష్టంగా ఆధార సహితంగా చూడవచ్చును. ఐహికపు విలువలనుపూర్తిగా నిర్లక్ష్యం చేయడం మన దేశంలో ఏనాడూ జరుగలేదు. మన పురాణాలు, చరిత్ర యిందుకు సాక్ష్యం.

వెనుకబడిన అనేక దేశాలలో వనరులకూ, శ్రామిక శక్తికీ కొదువ లేదు. సక్రమమైన పద్ధతులలో వాటిని వినియోగించుకుంటే ఆర్థికాభివృద్ధి ఆనతి దూరంలోనే కనబడుతుంది. అభివృద్ధి పథకంలో అనేక ఆటంకాలను ఎదుర్కొనడానికి అభివృద్ధి పొందిన దేశాల సహకారం అవసరం. కానీ ఆ దేశాలు యిందుకు అంత ఉత్సాహం చూపడం లేదు. ఇంతవరకూ యిచ్చిన ప్రోత్సాహం కూడా సన్నగిలి పోతున్నది. ఈ పరిస్థితుల నైపథ్యంలో వెనుకబడిన దేశాల సమస్య లేవి? వాటిని వైయక్తికంగానూ, సామూహికంగానూ పరిష్కరించుకొనడానికి మార్గా

లేవి? అందుకు, ముందడుగు వేసిన దేశాలు, ప్రపంచ సంస్థలు చేయవలసిన పనేమిటి? ఈ ప్రశ్నలను క్రింది భాగంలో పరిశీలిద్దాం.

## 2

అభివృద్ధికి మూలధనం అవసరం. మూలధన సమీకరణకు పొదుపు ముఖ్యం. వెనుకబడిన దేశాలలో తలసరి జాతీయాదాయం తక్కువ కావడం వలన అందులో అధికభాగం వినియోగావసరాలకే ఉపయుక్తమై పొదుపు చేయడానికి అవకాశం చాలా తక్కువగా ఉన్నది. అందుచేత స్వచ్ఛందంగా మూలధన సమీకరణకు మార్గం సుగమం కాదు. పోనీ ప్రభుత్వమే పన్నులు, ఇంకా అనేక యితరమార్గాల మూలంగా ప్రజల వద్ద నుంచీ ఆదాయాన్ని సంగ్రహించి ఆర్థికాభివృద్ధికి వినియోగపరచుకొన గలుగుతుందా అంటే అదీ అంతంత మాత్రమే. ఇందుకు రెండు ముఖ్య కారణాలున్నాయి. ఒకటి పన్నుల సేకరణ, విధింపు విధానాలలో లోటుపాట్లు, రెండు, అధిక పన్నుల భారం వలన జీవనస్థాయి పడిపోయి ఉత్పాదక శక్తి సన్నగిల్లే ప్రమాదం ఉన్నది.

ప్రభుత్వం ప్రజలనుంచి సేకరించే పన్నుల మొత్తం జాతీయాదాయంలో 10—12 శాతం వరకు మాత్రమే, ఆర్థికంగా ప్రగతి చెందిన బెల్జియం, స్వీడన్, స్విట్జర్లండువంటి దేశాలలో యీ శాతం 25—30 వరకూ ఉంటుంది. సరైన గణాంక వివరాలను గమనించకుండా, వెనుకబడిన దేశాలలో పన్నులభారం అత్యధికం అని ప్రచారంలోకి వచ్చిన వాదంలో అట్టే పసలేదు. పైగా వెనుకబడిన దేశాలలో ప్రభుత్వాదాయంలో అధికభాగం పరోక్షపు పన్నులద్వారానే సిద్ధిస్తుంది. మనదేశంలో 70 శాతం పైగా ప్రభుత్వాదాయం ఎక్సయిజుసుంకం, అమ్మకపు పన్ను వంటి పరోక్షపు పన్నులవలననే లభిస్తున్నది. ఆదాయపు పన్ను, సంపదమీద పన్నువంటి ప్రత్యక్షపు పన్నులు సమకూర్చే ఆదాయం స్వల్పం. పరోక్షపు పన్నులభారం పెరిగినకొద్దీ ధరలస్థాయి పెరిగిపోవడమేకాక ప్రజల జీవనస్థాయి పడిపోతుంది కూడాను. మరొక వంక, రాజకీయకారణాలను పురస్కరించుకుని అయితేనేమి, పన్నుల సేకరణ వ్యవస్థలో అవినీతివల్లనైతేనేమి ప్రత్యక్షపు పన్నుల మీద ఆధార పడేందుకు అట్టే అవకాశం లేదు. లోటు బడ్జెటు విధానంద్వారా కొత్తగా ద్రవ్యాన్ని ముద్రించి అభివృద్ధి ప్రణాళికల అమలు జరుపుకోవడానికి చాలా ఆటంకాలు ఉన్నాయి. ఒక పరిమితిని అధిగమించి ద్రవ్యాన్ని విడుదల చేసినట్లయితే కేవలం ధరలు మాత్రమే పెరిగి కూర్చుంటాయి కానీ అభివృద్ధికి వనరులను సమకూర్చుకోవడం జరుగదు. ఇటువంటి పరిస్థితులలో విదేశ సహాయం ఒక్కటే శరణ్యం.

విదేశ సహాయం ప్రస్తుతం సాధారణంగా ప్రభుత్వాలనుంచి ప్రభుత్వాలకు మాత్రమే లభిస్తున్నది. ప్రణాళికాబద్ధమైన ఆర్థిక ప్రగతి విధానం అవలంబించడంవలన వెనుకబడిన దేశాలలో ప్రభుత్వాలు నిర్వహించవలసిన పాత్ర యొక్క ప్రాముఖ్యం యినుమడించింది. విదేశ సహాయం కూడా ప్రణాళికా విధానంలో ఒక అంశంగా మలుచుకోవాలంటే దాని మీద ప్రభుత్వంయొక్క అదుపు ముఖ్యం. విదేశ సహాయం రెండు రూపాలలో లభిస్తుంది. ఒకటి ప్రాజెక్టు సహాయం **(Project Aid)** రెండు నాన్‌ప్రాజెక్టు సహాయం **(Non-Projcet Aid)** మొదటిరకం సహాయాన్ని నిర్దిష్టమైన కార్యక్రమాలకు మాత్రమే ఉపయోగించుకోవాలి. సహాయం స్వీకరించే దేశాలు, యిచ్చే దేశాలు కలిసి ఆయా అభివృద్ధి కార్యక్రమాల యొక్క అవసరాన్ని రూఢి పరుచుకుని అందుకు వలసిన వనరులను అంచనావేసి విదేశ సహాయం ఎంత కావలసివస్తుందో తయారు చేస్తాయి. ఈ సహాయాన్ని కేవలం ఆ కార్యక్రమాలక మాత్రమే వినియుక్తం చేసుకోవాలి. రెండవరకం సహాయం యొక్క ఉపయోగవిధానం మీద అట్టే నిర్బంధాలేవీ లేవు. సహాయం స్వీకరించే దేశాలు తమ యిచ్ఛ వచ్చిన వస్తువులను దిగుమతి చేసుకో వచ్చును. కానీ ప్రస్తుతం ప్రపంచ వ్యవస్థలో అమలులో ఉన్న విదేశ సహాయం విధానంలో **Non-Project Aid** యొక్క భాగం చాలా స్వల్పం. అందువలన విదేశ సహాయం యొక్క ఉపయోగంలో వెనుకబడిన దేశాల ప్రభుత్వాలకు స్వాతంత్ర్యం లేదు. ఇందుకు, సహాయం అందించే దేశాలు రెండు కారణాలను పేర్కొంటాయి. ఒకటి, వెనుకబడిన దేశాల జీవనస్థాయి తక్కువ కావడం వలన విదేశ సహాయాన్ని అభివృద్ధి ప్రణాళికలకు వాడకుండా, వినియోగాన్ని అవసరమైన వస్తువుల దిగుమతికి వాడుకునే అవకాశాన్ని వారించడానికి కొన్ని నిర్బంధాలు విధించాలి. రెండు, విదేశ సహాయం వలన అదనంగా జనించే డిమాండు వలన సహాయాన్ని అందించే దేశాల ఆర్థిక వ్యవస్థలో అవకతవకలు రాకుండా చెయ్యాలన్నా యీ నిర్బంధాలు అవసరమే.

వెనుకబడిన దేశాల ఆదాయ విభజనలో తారతమ్యాలు హెచ్చు ఉంటవన్న విషయాన్ని ముందు చెప్పటం జరిగింది. ఈ తారతమ్యాలు ఆయావర్గాల వినియోగ పద్ధతిలో కూడా ప్రతిఫలిస్తుంటాయి. కానీ మార్కెటుయొక్క పరిధి స్వల్పంకావడం వలన 'లగ్జరీ వస్తువుల' శ్రేణికి చెందిన ఎయిర్ కండిషనర్లు రిఫ్రిజిరేటర్లు వంటివాటి ఉత్పత్తికి అక్కడ అననుకూలంగా ఉంటుంది. అప్పుడు వాటిని దిగుమతి చేసుకోవలసి వస్తుంది. దిగుమతి చేసుకోవాలంటే విదేశీ సహాయం తప్పనిసరి. వెనుకబడిన దేశాల ప్రభుత్వాలమీద ఆర్థికంగా బలవత్తరమైన వర్గాల ప్రభావం కొంతవరకూ ఉండటం వలన ఇట్టిషరతులు లేకుండా లభించే విదేశీ సహాయం భోగవస్తువుల దిగుమతికి వాడుకునే ప్రమాదం లేకపోలేదు. ఈ దృష్ట్యా ప్రాజెక్టు సహాయం కొంతవరకూ మేలే!

రెండవ కారణాన్ని మనం కొంత తరచిచూడాలి. ప్రాజెక్టుసహాయం కింద లభించే సహాయం రెండురకాలుగా ఉంటుంది. ఒకటి, సహాయం లభించే ప్రాజెక్టుల కవసరమైన యంత్రపరికరాలు, ముడివస్తువులను సహాయం అందించే దేశాల నుంచే కొనాలన్న నిర్బంధం కొన్నిటి మీద వర్తిస్తుంది. రెండవ రకం, ఒకదేశంనుంచి లభించే సహాయంతో ప్రపంచంలో ఏదేశం నుంచైనా దిగుమతి చేసుకునే వసతి కల్పించేది. ఇందులో సాధారణంగా మొదటిరకం హెచ్చుగా ఉన్నది. ఇందువలన సహాయం స్వీకరించే దేశాలు నష్టపోయే అవకాశం ఉన్నది. ఒకటి, వారి ప్రణాళికలమీద సహాయం అందించే దేశాల ప్రభావం పడుతుంది. ఉదాహరణకు ఒకదేశం యొక్క అవసరాలు, ప్రయోజనం దృష్ట్యా ఉక్కు కర్మాగారం కావలసి వస్తుందనుకోండి. సహాయం అందించడానికి సిద్ధమైన దేశంలో ఉక్కు కర్మాగారానికి కావలసిన వస్తువుల కంటె ఎరువుల కర్మాగారానికి కావలసిన యంత్రాలు అధికంగా

ఉత్పత్తి అవుతున్నాయనుకోండి. అప్పుడు సాధారణ వ్యాపారసూత్రాల ననుసరించి, వారు వెనుకబడిన దేశానికి ఎరువుల కర్మాగారాన్ని నెలకొల్ప వలసిన అవసరాన్ని ఉగ్గడిస్తూ, నచ్చజెప్పడానికి ప్రయత్నిస్తారు. అప్పుడు సమస్య ఏమిటంటే ఎరువుల కర్మాగారం నెలకొల్పడమో లేక విధి లేకపోవడమో! ఈవిధంగా సహాయం అందించే దేశాల ఆర్థిక వ్యవస్థయొక్క ప్రయోజనాల దృష్ట్యా సహాయం స్వీకరించే దేశాల ప్రణాళికలలోని ప్రాధాన్యాలు (Priorities) తారుమారు కావచ్చును. ఒకవేళ వీరి ప్రణాళికల అవసరాలు, సహాయం అందించే దేశాల సరఫరా చేయగలిగిన వస్తువులు ఒకటే అయినప్పటికీ నష్టం మరొక రూపంలో సంక్రమిస్తుంది. సహాయం అందించే దేశంలో వస్తువులు కొనాలన్న నిర్బంధం లేకపోతే, ప్రపంచ వ్యాప్తంగా టెండర్లు తెప్పించి వాటిలో చేసివలన ఖర్చు తక్కువవుతుందో ఆదేశంనుంచి వస్తువులు దిగుమతి చేసుకోడం లాభదాయకంగా ఉంటుంది. ఈ పద్ధతి వలన ఒక్కొక్క ప్రాజెక్టుకు కావలసిన విదేశీసహాయం యొక్క పరిమాణం తగ్గుతుంది. తర్వాత తీర్చ వలసిన అప్పుయొక్క భారం కూడా తగ్గుతుంది. కాని పైన చెప్పిన నిర్బంధం వలన ప్రపంచదేశాలనుంచి టెండరు తెప్పించే అవకాశం లేదు. సహాయం అందించే దేశాలలో ప్రాజెక్టుల కవసరమైన వస్తువుల నుత్పత్తిచేసే పారిశ్రామిక వేత్తలు, తమ వస్తువుల ధరలను మామూలుకంటె 10—15 శాతం కనీసం హెచ్చు చేసి అమ్మజూపుతారు. ఈ ప్రకారం వెనుకబడిన దేశాలు ప్రపంచంలో వ్యాప్తిలో ఉన్న ధరల కంటే హెచ్చు ధరలు చెల్లించ వలసివస్తుంది.

వీటన్నిటికంటె మరొక ముఖ్యసమస్య విదేశ సహాయాన్ని తీర్చివేయడం. ఇక్కడ ఒక విషయం మనం గమనించాలి. సహాయం అంటే యిది సహాయం కాదు, దీర్ఘకాలిక పద్ధతిమీద స్వల్పవడ్డీతో అందజేసే ఋణం మాత్రమే. (అందుచేత ఒకవిధంగా దీన్ని సహాయం అనడం సరికాదేమో కూడా?) అందుచేత సహాయాన్ని స్వీకరించే టప్పుడే తీర్చివేయడానికి కూడా సరైన మార్గాలు ఆలోచించాలి. విదేశ సహాయాన్ని విదేశమారక ద్రవ్య రూపంలోనే చెల్లించాలి. ఎగుమతులను పెంపొందించడం వల్లనే యిది సాధ్యం. కాని వెనుకబడిన దేశాల ఎగుమతుల పరిస్థితి అంతంత మాత్రంగానే ఉన్నది. వ్యావసాయిక రంగంలో ఉత్పత్తి అయిన వస్తువులు గానీ, వాటి మీద ఆధారపడి తయారైన పారిశ్రామిక వస్తువులు మాత్రమే ముఖ్యమైన ఎగుమతులుగా ఉన్నాయి. మనదేశపు ఎగుమతులలో టీ, కాఫీ, సుగంధ ద్రవ్యాలు, గుడ్డలు ప్రధానమైనవి. కానీ యిలాంటి వస్తువులకు ప్రపంచమార్కెట్లలో గిరాకీ పెరుగుదల లేక స్థిరంగా ఉన్నది. పైగా జనుము, నూలు వస్త్రాలు వంటి వాటికి ప్రత్యామ్నాయంగా రసాయనిక వస్తువులు తయారవడంతో వాటి గిరాకీతోబాటు ధరలు కూడా పడిపోయాయి. యంత్రాలు, ఎరువులు, రసాయన ద్రవ్యాలు మొదలైన వస్తువులను కేవలం అభివృద్ధి చెందిన దేశాలు మాత్రమే ఎగుమతి చేయగల స్థితిలో ఉన్నాయి. వాటికి గిరాకీ పెరుగుతున్నది. ధరలు కూడా లాభదాయకంగా ఉన్నాయి. అందుచేత తమ ప్రణాళికలు అమలు జరుపుకొనడానికి అవసరమైన వస్తుసామగ్రిని దిగుమతి చేసుకునేందుకు వెనుకబడిన దేశాలు ఎగుమతుల రూపంలో అధిక మూల్యం చెల్లించ వలసి వస్తున్నది. ఈ పరిస్థితిని మార్చాలంటే ఎగుమతుల స్వరూప స్వభావాలు మారిపోవాలి.

కొన్ని దేశాలలో పరిశ్రమలు యిటీవలనే పెరుగుదల పొంది ఎగుమతి చేయడానికి వలసిన వస్తువులను సరసరా చేసే స్థితిలో ఉన్నాయి. కానీ వాటి ఉత్పత్తి ఖర్చు ఎక్కువ కావడం వల్ల, ప్రపంచ ధరల కంటె కొంచెం ఎక్కువ ధరకు అమ్మితే తప్ప లాభదాయకం కాదు. కానీ ఆ ధరకు కొనేందుకు దేశాలు సిద్ధంగా లేవు. కాబట్టి వెనుకబడిన దేశాల క్రొత్త ఎగుమతులకు అభివృద్ధి చెందిన దేశాలు వాణిజ్య సుంకాలు తగ్గించడం, యింకా యితర చర్యల ద్వారా ప్రోత్సాహం కల్పిస్తే తప్ప అధిక విదేశమారకద్రవ్యం సంపాదించే అవకాశం లేదు. విదేశ ఋణాలను తీర్చివేయడం కష్టతర మవుతుంది. ఇందుకు అభివృద్ధి చెందిన దేశాలు సుముఖంగా లేవు. కోటా నిర్బంధాలు, అధిక సుంకాల వలన తమ మార్కెట్లను వాళ్లు సురక్షితం చేసుకుంటున్నారు. విదేశ ఋణాలు అంద చేయడంతోబాటు, వెనుకబడిన దేశాల ఎగుమతులను ప్రోత్సహిస్తే తప్ప యీ కార్యక్రమం ఫలవంతం కానేరదు.

ఈ సమస్యలన్నింటినీ దృష్టిలో ఉంచుకుని వెనుకబడిన దేశాలు కలిసి కట్టుగా కొన్ని ప్రయత్నాలు సాగించాయి. ఒక వర్గాన్ని రూపొందించి తమ విదేశసహాయ అవసరాలను అంచనావేసి అభివృద్ధిపొందిన దేశాలతో చర్చలకు పూనుకున్నాయి. అనేక అంతర్జాతీయ సమావేశాల అనంతరం, అభివృద్ధి పొందిన దేశాలు తమ జాతీయాదాయం (Gross National Product) లో ఒక శాతం మాత్రం విదేశ సహాయానికి కేటాయించాలని తీర్మానించారు. ప్రపంచంలో వెనుకబడిన దేశాల సంఖ్య చాలా ఎక్కువ కావడం వలన సమావేశాలలో యీవిధంగా తీర్మానించడమైతే జరిగింది కానీ దానిని అమలు జరిపించే శక్తి లోపించింది. ఆచరణలో యీ తీర్మానాన్ని యితర దేశాలు అంగీకరించ లేదు. ఒక్క స్వీడన్ మాత్రం తీర్మానాన్ని అమలు జరపడానికి సుముఖత వెల్లడించింది. స్వీడన్ చిన్న దేశం కావడం వలన, సైనికంగా, ఆర్థికంగా బలవత్తరం కాకపోవడం వలన యీ సుముఖత సమస్యా పరిష్కారానికి ఎంత మాత్రమూ దోహదం కలిగించ లేదు. ముఖ్యంగా అమెరికా, జర్మనీ, జపాను, ఇంగ్లండు, పూనుకుంటే తప్ప పని జరుగదు.

మరొకవంక అభివృద్ధి చెందిన దేశాల మధ్య మరొకరకమైన ప్రతిస్పర్థ చెలరేగింది. సాంకేతిక ప్రగతితో పారిశ్రామిక ఉత్పాదకత పెరిగి జర్మనీ జపాను దేశాలు ప్రపంచ వ్యాపారంలో అధిక లాభాలు ఆర్జిస్తున్నాయి. దీనివలన అమెరికా ఎగుమతులకు పెద్ద దెబ్బ తగిలింది. డాలరు యొక్క విలువ పడిపోయి బంగారం ధర హెచ్చింది. గడచిన ఏడెనిమిది సంవత్సరాలలో, అవున్సు బంగారం ధర 35 డాలర్ల నుంచి 100 డాలర్లవరకూ దాదాపు పెరిగింది. అంటే డాలరు యొక్క విదేశీమారకపు విలువ మూడు రెట్లు పడిపోయిందన్నమాట. ఇందు వలన అమెరికాకు వచ్చే అపఖ్యాతి మాట అటుంచి అమెరికన్ ఆర్థిక వ్యవస్థకే పెద్ద దెబ్బ తగిలింది. అంతర్జాతీయ ద్రవ్య వ్యవస్థకూడా ఒడిదుడుకులకు లోనయింది. జర్మనీ, జపాను దేశాలు తమ ఆర్థిక

విధానాన్ని మార్చుకుని మార్క్ (Marc) ఎన్ (Yen) ల విదేశీ మారకపు విలువను పెంచాలని అమెరికా వాదిస్తున్నది. అమెరికన్ విధానాల వలన ప్రపంచంలో సిద్ధించిన—అవ్యవస్థకు తాము బాధ్యుల మెలా అవుతామని జర్మనీ జపాను వాదిస్తున్నాయి. ఈ సమస్యకింకా గట్టి పరిష్కారం దొరక లేదు. ఇంటిపోరుతో సతమతమవుతున్న యీ దేశాలు వెనుకబడిన దేశాల అవసరాలను పట్టించుకునే స్థితిలో లేవు. కేవలం అంతర్జాతీయరంగంలోనే కాక, పారిశ్రామిక దేశాల అంతరంగిక ఆర్థిక వ్యవస్థలలో కూడా కొన్ని లోపాలు ఏర్పడ్డాయి. తీవ్రమైన నిరుద్యోగ పరిస్థితి, ధరల పెరుగుదల, జీవిత పరిమాణపు తరుగుదల వంటి యిబ్బందులు వీటిలో ముఖ్యమైనవి. అందువలన ఆ దేశాల ప్రభుత్వాలు తమ విధానాలలో కొంత అంతర్ముఖిత్వాన్ని అలవర్చుకుంటున్నాయి. అందుచేత విదేశీ సహాయాన్ని ఎక్కువగా ఆశించడంవలన ప్రయోజనం లేదు.

వెనుకబడిన దేశాలకు యిప్పుడు రెండే మార్గాలున్నాయి. ఒకటి, తమ ప్రగతి యొక్క వేగాన్ని దేశంలోపల లభ్యమయ్యే వనరుల కనుగుణంగా తగ్గించుకోవడం. రెండు, దేశంలోపల మౌలికమైన మార్పులు తీసుకువచ్చి ఎక్కువ వనరులను సమకూర్చుకొనడానికి ప్రయత్నించడం. ఇందులో మొదటిది బాధాకరమైనది. రెండవది దుస్సాధ్యమైనది. ఏ దేశం ఏవిధానం అవలంబిస్తుంది అన్నది ఆదేశపు అంతరంగిక రాజకీయ స్థితిగతులమీద ఆధారపడి ఉంటుంది.

---




వేద యెద పులకించే
మధువులు ఒలికించే
మరో ఉగాది వచ్చిందట
నవ కాంతులు తెచ్చిందట.

ఎల కోయిల కూసిందో
కలమల్లియ పూసిందో
ఏదీ తెలిసి రాలేదు
బాధా వెలిసి పోలేదు.

మామిడ మొగ్గేసిందో
మగువకు సిగ్గేసిందో
ఊహించే తలపు లేదు
వాడి ఒక మనసుకాదు.

మమతను మనసుల్లోకి
సమతను మనుషుల్లోకి
చొప్పించే దారవలేదు.
నేనా ఒక మనిషి కాదు.

కొడిగట్టిన దీపాన్ని
ఒడి కట్టిన పాపాన్ని
చావలేక బ్రతుకుతున్న
కాబోయే శవాన్ని
జీవచ్ఛవాన్ని.

---

# బ్రహ్మజ్ఞాన కళానిధి

## శ్రీ కేతవరపు వేంకటరామకోటిశాస్త్రి

ఈశ్వరార్చన కళాశీలుడనని శృంగార నైషధమున శ్రీనాథుడు తనను గురించి చెప్పుకొనెను. ఆయన మరియు తనను గురించి కొన్ని విశేషణములు చెప్పుకొనెను. బ్రాహ్మీదత్త వరప్రసాదుడు మొదటిది. ఉరు ప్రజ్ఞావిశేషోదయా జిహ్మస్వాంతుడు రెండవది. అభ్యర్హిత బ్రహ్మాండాది మహాపురాణచయ: తాత్పర్యార్థ నిర్ధారిత బ్రహ్మజ్ఞాన కళా విధానము నాల్గవది. మూడవదైన ఈశ్వరార్చన కళాశీలమును మిగిలిన వాటితో కలిపి విచారింప నక్కరలేదా? మిగిలిన మూడును కాక ఈ ఒక్కటే ఆయన ఆత్మీయతకు నిదర్శన మగునా? ఆ నాలుగు నాల్గు కోణములు. ఏకోణమునుండియైన చూచుటకు వీలుండవచ్చును. మొత్తము మీద నాల్గు కోణములనుండి చూచిన గాని శ్రీనాథుని ఆత్మీయతా లక్షణము సమగ్రము కాదు.

మొదటి విశేషణము ఫలితమును చెప్పుచున్నది. బ్రాహ్మీదేవి చేత దత్తము చేయబడిన ఒకానొక నిధిరూపమైన ప్రసన్న భావము కలవాడు. బ్రాహ్మీశబ్దము సప్తమాతృకాశక్తులలో మొదటిదానికి సంకేతము. జగన్మాతయొక్క సృష్టి క్రియాశక్తి బ్రాహ్మీదేవి. ఆమె తనయందున్న శక్తిని శ్రీనాథునకు దత్తము చేసినది. అది వాని యందు తరుగుబోని ప్రసాదలక్షణముగా నున్నది. అనగా శ్రీనాథుడు ప్రసాద లక్షణ లక్షితమైన సృష్టిక్రియాశక్తియొక్క అనుగ్రహ ఫలములను కలవాడని యర్థము. రెండవది: ఉరు ప్రజ్ఞావిశేషమనగా ఒక అతిమానవమైన విషయ పరిజ్ఞాన లక్షణము. దానియొక్క ఉదయమునకు అనగా ఆవిర్భావమునకు చక్కని అనుకూలమైన వాగ్వ్యాపారాకృతియైన మనస్సు కలవాడని. శ్రీనాథునకు అతిమానుషమైన ఒకనొక యెఱుక యున్నది. తన యెఱిగిన దానివి చక్కగా ఆవిర్భవింప చేయగల స్వాంతమున్నది. స్వ నతీతి స్వాంతం. స్వ నశబ్దే. ఆయన ప్రజ్ఞావిశేషమును ఆయన మనస్సు శబ్దరూపమున చక్కగా ఆవిష్కరించును. ఇక నాల్గవది: పూజింపదగినవియు కొనియాడ దగినవియునైన బ్రహ్మాండాది మహాపురాణములున్నవి. ఆయా పురాణములను తదర్థములను విడివిడిగా చూచినచో అవి అనేక విధములుగా నుండు. స్థూలముగా కొన్ని శైవపురాణములు. కొన్ని వైష్ణవ పురాణములు. మరికొన్ని శాక్తేయపురాణములు. లోపల విడివిడిగా చూచినచో ఒకచోట భక్తి, ఒకచోట జ్ఞానము, ఒకచోట యోగము, ఒకచోట కర్మవిషయము, ఒకచోట ఉపాసన, ఒక్కొక్కచోట ఒక్కొక్క దైవము. ఒకచోట రాజనీతి. ఒకచోట వర్ణాశ్రమ ధర్మములు. ఒకచోట స్వర్గ నరకాది ఊర్ధ్వలోకములు—మరొకచోట అధో లోకములు—ఈ విధముగా నుండును. ఇట్లివన్నియు భిన్న భిన్నములుగా కనిపించుచున్నందున, తాత్పర్యార్థము విచారింపవలయును. తాత్పర్యార్థమనగా వైదిక శబ్దతాత్పర్య నిర్ణయమున కయ్యెడు ఉపక్రమోపసంహారాది షడ్విధ లింగములచేత నిశ్చితము చేయబడినదని యర్థము. తాదృశమైన తాత్పర్యార్థము చేత మరియు నాయా పురాణములు వేనికవిగా నున్నప్పుడు ఆయా పురాణ తాత్పర్యార్థముల సముదాయమునుండి ఇదికదా బ్రహ్మజ్ఞానవిషయము అని పృథక్కరించెడు చాకచక్యమునకు శ్రీనాథుడు నిధి యన్న మాట. కళ అనగా ఆ చాకచక్యమే.

ఇప్పుడు ఈశ్వరార్చన కళాశీలము. ఈశ్వరుని యొక్క అర్చన కళాశీలము నెరిగినవాడని యర్థము. శివార్చనయే ఒక కళ. శ్రీనాథుడు ఆ కళా స్వభావము తెలిసినవాడు. శివార్చన ఒక కళయా? అర్చన—అది బాహ్యమైన ఒక క్రియావిశేషము. అది జీవునకు సుఖము నిచ్చుచున్నది గనుక కళ. మరియు నది ఒకానొక కర్మవిశేషముగా చెప్పుచున్నాము గనుక కళ యనగా అందలి కౌశలమని చెప్పవచ్చును. అర్చన భక్త్యంగమైన దేవతా విషయక కర్మకాండము. భక్తి గౌణమని, ముఖ్యమని రెండు విధములు. అర్చన గౌణభక్తిలోనిదే. ముఖ్యభక్తియైన ఈశ్వర విషయకానురాగ చిత్తవృత్తి విశేషమున కభివ్యక్తి అర్చన రూపముగా నుండును. ఏతచ్చిత్త వృత్తి విశేషమును మరియు పెంచుటకు గౌణ భక్తి తప్పదు. అనగా అనుష్ఠానమంత ముఖ్యమన్న మాట.

ఈశ్వరార్చనయు: కళాశీలమును కలవాడు ఈశ్వరార్చన కళాశీలుడు కావచ్చును కదా? అప్పుడు కళాశీలుడనగా కళయే శీలముగా కలవాడు. కళ యనగా నేమి? ఈశ్వర శబ్ద సహచర్యముచేత కళా శబ్దము ఈశ్వరిని చెప్పగలుగుచున్నది. కళావత్యైనమః. కళారూపాయైనమః. కళాత్మికాయైనమః కళానాథాయైనమః కళానిధయేనమః (ల. స. నా. 327, 328, 611, 612, 797) జాగ్రత్స్వప్న సుషుప్తుల యందును మరియు తురీయమునందును గల కళలన్నియును వరుసగా శక్తి, శివశక్తి శివ రూపములు. ఈ మూడవస్థలయందును శ్రీనాథుని మనస్సిట్లు కళాత్మకముగా నున్నదా? కాక వైరాగ్యము, మముక్షుత్వము, సమాధి, విమలమైన మనస్సు, సదసద్వస్తు నిర్ధారణ అనెడు తురీయావస్థా కళలే స్వభావముగా కలిగియున్నాడా? శ్రీవిద్య షోడశ కళా విద్య కదా! శ్రీవిద్యయే అనగా శ్రీవిద్యోపాసనయే స్వభావముగా అయినవాడా శ్రీనాథుడు? కావచ్చును. కళాశీలము శాక్తము. ఈశ్వరార్చన శైవము. అంతశ్శాక్తము. బహిశ్శైవము. శ్రీనాథు డచ్చమైన అద్వైతి. అద్వైతులకు వైష్ణవము వేరు కాదు. ఈశ్వరార్చన కళాశీలుడనగా అర్థమిది.

శ్రీనాథుడు బ్రహ్మజ్ఞాన నిష్ఠ కలవాడు. అనగా అద్వితీయ పరబ్రహ్మమును జ్ఞానమయుడుగా నెరిగిన మహాబుద్ధిమంతుడు. తానెరిగిన ఆ సంప్రదాయమును బ్రహ్మాండాది నానాపురాణచయ తాత్పర్యార్థ నిర్ధారణముగా చెప్పినాడు. అది మరియు తరువాత విచారింపబడును. శ్రీనాథుడు అద్వితీయ పరబ్రహ్మము శివశక్త్యాత్మకముగా నున్నదని తెలిసికొనినాడు. శివుడు ప్రకాశాంశ. శక్తి అంతర్లీనము. కళాశీలమును పెంచుకొనుటచేత శక్తిమంతుడై శ్రీనాథుడు ఈశ్వరార్చనపరుడైనాడు. అనగా శ్రీవిద్యోపాసనాత్మకముగా శివార్చనయన్న మాట. బ్రహ్మజ్ఞానమును ఈశ్వరార్చన కళాశీలమును ఒకటి. శ్రీవిద్యోపాసనచేత పరాభట్టారిక యొక్క బ్రాహ్మీశక్త్యనుగ్రహమునకు పాత్రుడైనాడు. తనయందీ

బ్రహ్మశక్తి యున్నదన్న సంపూర్ణమైన ఆత్మప్రత్యయముతోనే, శ్రీనాథుడు శృంగార నైషధమును వ్రాసినాడు. ఆ విషయమును ఆయనయే తనను గురించి "ఆంధ్ర భాషానైషధాబ్జభవుడు" (1—8) అని చెప్పుకొనినాడు. ఆ వరావాగ్దేవత యొక్క అనుగ్రహము వలన ఉరు ప్రజ్ఞావిశేషమును మరియు దాని అభివ్యక్తికి తగిన చక్కని శబ్దములను శబ్దించెడు స్వాంతమును ఆయనకు వశమైయున్నవి. ఈ విధముగా వరమును ప్రజ్ఞయును ఒకటి.

శ్రీనాథుని యందు బ్రహ్మజ్ఞానము, కళాశీలము రెండును అంతర్వాహినులు. జ్ఞానవిగ్రహమైన శ్రీదేవి శ్రీనాథుని యందున్న ప్రేరక శక్తి. ఈశ్వరార్చన క్రియారూపము గనుక బాహ్యమునకు కనిపించును. ప్రజ్ఞావిశేషమునకు ఆవిష్కారమున్నది గనుక అదియు బాహ్యమునకు కనిపించును. అంతరంగికమైన ఆ ప్రేరణశక్తి వలన బాహ్యమునకే క్రియాకలాపమున్నది. ఇదంతయు బ్రాహ్మీదత్త వరప్రసాదమనుట కర్తృత్వమును జగన్మాతయందు చెప్పుటయే. ఆమెకు తానొక సాధనము. తనవల్లనే ఇదంతయు అయినట్లు కనిపించుచున్నది. ఈ కనిపించుచున్న దానివెనుక బ్రాహ్మీదత్త వరప్రసాదమున్నది.

అంతరంగిక శక్తుల యేకత్వమునకు వలెనే బాహ్య క్రియాకలాపములయిన ఆయన ఈశ్వరార్చనయు, ఆయన ప్రజ్ఞావిశేషము యేకరూపముననే పర్యవసించినవి. శ్రీనాథుని కృతులే కదా ఆయన క్రియలు. అన్నియును ఈశ్వరాత్మకములే. నైషధమున నలుడు త్రినేత్రుని అవతారము, దమయంతి త్రిపురసుందరీదేవి అవతారము. ఆ విధముగా అదొక ప్రతీకోపాసనా ప్రతిపాదక కావ్యము. ఇక హరవిలాసము, భీమఖండము, కాశీఖండము — అవి శైవము లని వేరుగా చెప్పనక్కరలేదు. అందువలన శ్రీనాథుని కృతులన్నియును ఆయన ఈశ్వరార్చనకు దర్పణములు. నైషధమునందు కళాశీలము యొక్క ఆవిష్కృతి యున్నది.

మొత్తము మీద శ్రీనాథుని ఈశ్వరార్చన కళాశీలములకు వాగర్థ వృష్టిహేతువైన పరస్పరానుప్రవిష్టమైన శివశక్తి బ్రహ్మమే ధ్యేయము.

ఏకోరుద్రస్సర్వ భూతేషు గూఢో
మాయా రుద్రో సకలో నిష్కలశ్చ
స ఏవ దేవీ నచ తద్విభిన్నా
హ్యేతి జ్ఞాత్వా హ్యమృతత్వం వ్రజంతి.

శ్వేతాశ్వతరము.

## 2

ముముక్షువులకు వేదాంతాధ్యయనము వల్ల కలిగెడు విచారప్రయోజకమైన జ్ఞానము నాలుగంతస్తులమీద చెప్పబడుచున్నది. 1. తత్త్వమసీత్యాది పదములను శ్రవణము చేయుటవలన ముందు తత్పదార్థము యొక్కత్వం పదార్థము యొక్కయు జ్ఞానముకలుగును. ఇత్యాది యనుట చేత అహం బ్రహ్మాస్మి ప్రజ్ఞానంబ్రహ్మ ఆనందంబ్రహ్మ సోహం —ఈ మహావాక్యములన్నియు గ్రహింపబడుచున్నవి. అనగా, ముందు మహావాక్యమునందలి పదముల యొక్క లోతుపాతుల తోడి యర్థము తెలియవలయును. ఈ దృశమైన జ్ఞానము మొదటి అంతస్తు. 2. ఈ మహావాక్యములయందలి పదముల అన్యోన్య సంబంధ విచారణము ఆ తరువాతి అంతస్తులోనిది. ఇవన్నియు సమానాధికరణములు. విశేష్య విశేషణ సంబంధ బంధములు. అహం బ్రహ్మాస్మి తత్త్వమసీత్యాదులను సమానాధికరణములుగా విచారించుటలో జీవబ్రహ్మసంబంధ విషయమున సమన్వయమునకు చూచెడు జ్ఞానము రెండవ అంతస్తు. 3. అందు విరుద్ధాంశములుగా కనిపించిన జగత్కర్తృత్వాదికముల ఆటంకములు నశించుటకు హేతువయిన జ్ఞానము మూడవ అంతస్తు. ఈ విధముగా మహావాక్య గత పద పదార్థ విచారణముచేత పద పదార్థ సామర్థ్యము వలన వచ్చెడు అర్థత్రయ జ్ఞానము కలుగుచున్నది.ఇక మిగిలినది వాక్య జ్ఞానము. 4. వాక్యమునకు పద పదార్థ సామర్థ్యము లొంగియే యుండును. అనగా పద పదార్థముల స్వారములు వాక్యము యొక్క స్వార్థమునందు పర్యవసింపవలసినవే కాని పృథగస్తిత్వము కలవికావు. కనుక మహావాక్యముల యొక్క స్వార్థబోధనమునే తాత్పర్య నిర్ధారణ మనుచున్నారు. మహావాక్యమునందలి పదముల స్వార్థ నిరూపణము శక్తి నిరూపణమనియు, ఆ పిమ్మట ఆ మహా వాక్యము యొక్క స్వార్థ నిరూపణమును తాత్పర్య నిర్ధారణమనియు పూర్వాచార్యులు చెప్పియున్నారు.

శ్రీనాథుడు తాత్పర్యార్థ నిర్ధారిత బ్రహ్మజ్ఞాన కళానిధినని చెప్పుకొన్నప్పుడు వాని మనస్సునందు బ్రహ్మజ్ఞానము యొక్క చతుర్విధాత్మకత్వము భాసించుచున్నదనియే చెప్పవలయును. మరి బ్రహ్మాండాది కుహా పురాణచయమును పేర్కొనుచున్నాడేమి? అందు వేదాంత వాక్యార్థములున్నవా? పురాణేతిహాసము లన్నియును వేదార్థోప బృంహితములు. భగవంతుడు వ్యాసుడుగా అవతరించి కదా ఆయా పురాణములను రచించినాడు? ఒక్కొక్క పురాణము ఒక్కొక్క మహావాక్యము. వాక్యమునందు పదములకు వలెనే పురాణములయందు విషయములు. వాక్యము యొక్క స్వార్థమైన తాత్పర్యమునకు వలెనే పురాణము యొక్క స్వార్థమైన తాత్పర్యము. అన్ని పురాణములును కలిసి ఒక మహావాక్యము. అప్పుడు పురాణములన్నియు పదతుల్యములు. ఈవిధముగా బ్రహ్మాండాది మహాపురాణచయమునకు తాత్పర్యార్థమున్నది. వేదాంతార్థములు పురాణముల యందు భంగ్యంతరముగా కథార్థములుగా చెప్పబడియున్నవి. అందువలన పురాణముల తాత్పర్యార్థము బ్రహ్మజ్ఞానమునందే పర్యవసించుచున్నది. వట్టి వేదాంతార్థములను విచారించుకొను వానికి పురాణము లక్కరలేకపోవచ్చును. వేదాంతార్థములను కథార్థములుగా చేసి ప్రబోధింపవలసివచ్చినప్పుడు పురాణముల నాశ్రయింపక తప్పదు. భారతీయ కావ్య వాఙ్మయమంతయు పురాణేతిహాసములమీద అంతగా ఆధారపడి యుండుట కదియే హేతువు. భారతీయ కవులు మహా వాక్యతాత్పర్యార్థక ప్రబోధము నభిలషించియే కావ్యములు వ్రాసిరి.కనుకనే పురాణేతిహాసముల నుండి వస్తువులను వారు స్వీకరించినది. వస్తువు పదము వంటిది. వస్తుశక్తిని వాక్యతాత్పర్యార్థముగా నిరూపించుటయే కావ్యకళగా భారతీయులు భావించిరి. వేదాంతార్థములు కథార్థములుగా కల్పింపబడిన పురాణములు కావ్యవస్తువులను కవులకు పుష్కలముగా సమర్పించినవి. అందువలననే పురాణవిజ్ఞానమును పూర్వులంతగా సంభావించినది. "బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాన నిరతు"డని నన్నయ్యగారు గౌరవమని భావించుటచేతనే కదా చెప్పుకొన్నది! ఆ సంప్రదాయముననే శ్రీనాథుడు బ్రహ్మాండాది మహాపురాణచయ తాత్పర్య నిర్ధారిత బ్రహ్మజ్ఞాన కళానిధినని చెప్పుకొనినాడు. అన్ని పురాణములును వేదార్థోప బృంహితములే అయినప్పుడు నన్నయ శ్రీనాథు లిరువురును ఒక్క బ్రహ్మాండ పురాణమునే ఏల పేర్కొనిరి? బ్రహ్మాండ చరితోక్తత్వాత్ బ్రహ్మాండ మితి కీర్తితమ్ — బ్రహ్మాండము యొక్క చరిత్రలు ఈ పురాణము నందు ముఖ్యముగా చెప్పబడినందున ఇది బ్రహ్మాండ పురాణము. "ఈ పురాణము చదివిన యెడల మనపూర్వులేయేరీతి వర్తించిరో, ప్రపంచమెట్లెట్లభివృద్ధి నొందెనో, మనుష్యుల యాచారము లెట్లెట్లు మారినవో

తెలియగలవు" — అని ఆంధ్ర బ్రహ్మాండ పురాణకర్తలు బ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు తమ గ్రంథము సంపాదకీయ భూమిక PPXXX లో వ్రాసినారు. సృష్ట్యాదినుండీ ద్వాపరము వరకు మూడు యుగముల మీద మానవుల ప్రవృత్తి యెట్లు పరిణమించినదో ఈ బ్రహ్మాండపురాణమునందు అనేక కథల రూపమున వ్యాఖ్యానము చేయబడియున్నది. ఇది ఈ పురాణమునందున్న విషయము కావచ్చును. ఇదే పురాణములకెల్లను శ్రేష్ఠమైనదా? లేక పురాణములలో ఇదే మొదటిదా? నన్నయ్యగారుగాని, శ్రీనాథుడుగాని ఏ ఉద్దేశ్యముతో ఆ వాక్యములను వ్రాసియుందురు? అవలీ పురాణ గ్రంథములనుద్దేశించియే వారు మాట్లాడిరా? వారి మనస్సులయందు విధేయాంశము మరేదైన కూడ ఉండియుండునా? ఉండి ఉండవచ్చును. బ్రహ్మాండమును విచారింపవలయును. బ్రహ్మత్వమును అండత్వమును ఏకాధిష్ఠితములే కనుక అది సమానాధికరణమే యగును కాని, వ్యధికరణము కాదు. అప్పుడు తత్త్వమసీత్యాది వాక్యముల వంటిదే బ్రహ్మాండమన్న వాక్యమును అగుచున్నది. బ్రహ్మాండమనగా ఈ సమస్త సృష్టియును అనికదా అర్థము! ఇందలి జీవకోటి అంతయును పిండాండముల మొత్తము. వైదికమైన హిరణ్యగర్భ శబ్దార్థబోధకముగానే హిరణ్యాండ బ్రహ్మాండ శబ్దములును వాడుకలోనికి వచ్చినవి. బ్రహ్మాండ శబ్దము బ్రహ్మసత్యం జగన్మిథ్యావాదము నుపలక్షించుట లేదుకదా !

ఆదిసరి. బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాన నైరంతర్యమనగా నేమి? బ్రహ్మాండము మొదలుగాగలిగిన అనేకములయిన పురాణ వేదాంత వాక్యముల యొక్క ఏకరూప విజ్ఞాన ప్రవాహ లక్షణములు తెలిసినతనము. అనగా సర్వవేదాంత ప్రత్యయ రూప పరిజ్ఞానమని యర్థము. విజ్ఞాన నిరతియనగా ఏకరూపమైన విజ్ఞానమని యర్థము. విజ్ఞానము ఆనందాది పదములకువలెనే అనగా సత్య, ఆత్మ, పూర్ణ పదములెట్లో అట్లే బ్రహ్మ స్వరూప ప్రతిపాదన ప్రతిపత్తి మాత్రమే. బ్రహ్మము ఏకమగుట వలన తత్ప్రతిపాదన ప్రయోజన రూపమైన తద్ధర్మము కూడ ఏకరూపమే. వేదాంత వాక్యముల యందు నానాత్వముండవచ్చును గాని వేదాంత వాక్యవిజ్ఞానమునందు నానాత్వముండుటకు వీలులేదు. వాక్యము యొక్క స్వార్థము అన్వయము మీద వచ్చెడు తాత్పర్యము కదా? నానారూపములుగానున్న మహా వాక్యార్థముల అన్వయము మీద కదా తాత్పర్యబోధ కలుగుచున్నది? అది యేకరూపమే కదా! అట్లు బ్రహ్మము విజ్ఞానధర్మద్వారమున నన్నయ్యగా రుపాసించెను.

శ్రీనాథుడు బ్రహ్మాండాదికమునకు అభ్యర్హితమన్న విశేషణము నుపయోగించినాడు. సత్యే—సాధౌ—విద్యమానే—ప్రశస్తే—అభ్యర్హితే చ సత్. ఇవన్నియును సచ్ఛబ్దమునకు పర్యాయపదములు. అభ్యర్హితమనగా మిక్కిలి పూజ్యమైనదని యర్థము. పరమ సంపూజితమైనదని యర్థము. ఎందువలన? అది సుప్రశస్తమైనది గనుక. అని ఎవరు చెప్పిరి? అది తెలియబడుచునే యున్నది. అది ఎప్పుడును విద్యమానమే. ఎవరికి? సాధువులకు. వారి సాధన ఏ విషయమున? సత్యమునందు. సత్యాన్వేషణతత్పరులైన సాధువులకు విద్యమానమగుచు సుప్రశస్తమును, అభ్యర్హితమును అయిన, బ్రహ్మాండము మొదలుగా గలిగిన మహాపురాణ వాక్య సమూహము మీద సమన్వయము వలన వచ్చెడు తాత్పర్యార్థము చేత నిర్ధారితమైన అనగా భేదజ్ఞానము నశించునట్లుగా నిశ్చయింపబడిన ఏకాకారమైన బ్రహ్మప్రతిపాదన ప్రయోజనాత్మకమైన జ్ఞానకళకు శ్రీనాథుడు తాను నిధి ననుచున్నాడు. కళయనగా విద్య. బ్రహ్మవిద్యానిష్ఠుడని యర్థము. ఈ బ్రహ్మవిద్యయే అభ్యర్హితము. ఈ బ్రహ్మవిద్యను పొందవలెననగా బ్రహ్మాండాది మహాపురాణ వాక్యసముదాయ తాత్పర్యార్థ నిర్ధారణమే మార్గము. ఆ మార్గమున తానును నన్నయ్య గారికి వలెనే పరిశ్రమించి బ్రహ్మవిద్యానిష్ఠుడైనట్లు శ్రీనాథుడు ప్రకటించినాడు. నన్నయ్యగారికి మహాభారత రచనకును శ్రీనాథునకు శృంగార నైషధ రచనమునకును ఈ బ్రహ్మవిద్యావేతృత్వ మవసరమా? అత్యంతము అవసరము. బ్రహ్మజ్ఞానమెందుకు? బ్రహ్మమును పొందుటకు. బ్రహ్మము జ్ఞేయము. అనగా ఉపాస్యము. జ్ఞానము తదుపాసనము. ఉపాసనమునకు ఉపాస్యమే ఫలము. జ్ఞానమునకు జ్ఞేయమే ఫలము. శృంగార నైషధమునందున్నది శ్రీ విద్యోపాసనమే కదా? నలు డుపాసకుడు. దమయంతి శ్రీదేవి. కావ్యమంతయు ఉపాసన రూపము. నలదమయంతుల కథ పురాణ ప్రసిద్ధమైన మహాభారతము నందున్నది. దానిని శ్రీ హర్షుడు బ్రహ్మప్రాప్తికి ఒకానొక మార్గముగా భావించినదానిని శ్రీనాథుడందుకొని ఆంధ్ర భాషయందు నిర్మించినాడు. ఆయన అంతటి బ్రహ్మవిద్యావేత్త కనుకనే ఇంతటి మహాకావ్యమును స్వస్థాన వేషభాషాత్మకముగా నిర్మించినాడు. అనగా స్వస్థాన వేషము వేయబడిన భాషయని యర్థము. తత్సము భాష యంతయును స్వస్థాన వేషభాషయే.

శ్రీనాథుని అభ్యర్హిత బ్రహ్మాండాది మహాపురాణచయ తాత్పర్యార్థ నిర్ధారిత బ్రహ్మజ్ఞాన కళానిధానమన్న మహావాక్యమున కిదంతయు తాత్పర్య నిరూపణము.

# నిరంతరద్వయం

**శ్రీ మధురాంతకం రాజారాం ★**

**క్రి**సంకాంత పుట్టేంటికి పుడాయించిన చలికాలపు రాత్రుల్లో నాకు పుస్తకమొకటే శరణ్యం. ఆరోజు రాత్రి నాచేతికి దొరికిన పుస్తకం బుర్రను కాస్త వేడెక్కించిందనే చెప్పాలి. రాత్రి పన్నెండు గంటలు దాటివుంటుంది. అసలే చిన్నగది కావడం వల్ల లోపల గాలి కదలడంలేదు. లేచి వెళ్ళి కిటికీ తలుపు తీశాను. మంచుసోనల మసక వెన్నెల్లో లోకం ఒక నిశ్చల కాసారంలా వుంది. కొలనులో తామర మొగ్గల్లా వీధి దీపాలు మాత్రం వెలుగుతున్నాయి. చల్లగా ఒకగాలి కెరటం వచ్చి సోకేసరికి శిరోభారం కూడా తగ్గినట్టు తోచింది.. గ్లాసుడు మంచినీళ్ళు త్రాగి పడుకుందామన్న ఆలోచనలో వుండగా, నాకు కనిపించిన విశేషం ఒకటి కొద్ది నిమిషాలపాటు నన్నాకిటికీ దగ్గర అలాగే నిల్చోబెట్టింది.

నగరం శివార్లలో వున్న మారుమూల పేట మాది. చెరువు అంచుదగ్గర చివరినీటిపాయ లాంటిది. నగరగర్భంలో ఓకారుషెడ్డు కట్టుకోడానికయ్యే ఖర్చుతో యిక్కడొక పెంకుటిల్లు నిర్మించుకోడం సాధ్యమవుతుంది. అక్కడ అరుగుపైన పెట్టుకునే పెట్టె దుకాణానికి చెల్లించుకోవలసివచ్చే అద్దెడబ్బులకు యిక్కడొక సుమారు పాటి యిల్లు కాపురానికి దొరుకుతుంది. మార్కెట్టుకు, బజార్లకు, హోటళ్ళకు, సినిమాలకు ఎంతదూరంగా వుంటే అంతమంచిదన్నది మా చింతలపేట నివాసులకు ఒంటపట్టిన వేదాంతం. నగరం తన చేతులు సాచి యింతగా విస్తరించక పూర్వం యిదంతా సాగుకు లాయకీ గాని పొరంబోకుబీడుగా పడివుండేదట. గడచిన పాతికేళ్ళ కాలంలో అబీడు ఈ వాడగా మారింది. వంద పెంకుటిల్లు, అంతకు రెట్టింపు పూరిపాకలు, తుమ్మిచెట్లలో, ఆముదం చెట్లల్లో అక్కడక్కడా కొన్ని గారమిద్దెలు, అత్యవసరంగా కావలిసివచ్చే వస్తువులను కొనుక్కునే సదుపాయాలకోసం వీధి కొకటి రెండు బంకంగళ్ళు, యింతమాత్రమే మావాడ సౌభాగ్యం. ఈ చింతలపేట గూడా తమ సామ్రాజ్యంలో ఒకభాగమేననీ నిరూపించడానికన్నట్టుగా పురపాలక సంఘం వారిక్కడ అయిదారు వేదబావులు త్రవ్వించారు. నీటి తర్వాత వాళ్ళకు నీడ చాలా ముఖ్యమైనదిగా తోచివుండాలి. పేటకు నడుమ ఒకగుట్టలా పడివుండిన ప్రదేశాన్ని చదునుచేసి, అక్కడొక పార్కును ఏర్పాటు చేశారు. పగటిపూట సోమరిపోతులకు విశ్రాంతి నిలయంగానూ, పిల్లలకు క్రీడా వేదికగాను ఉపకరించే ఆపార్కు రాత్రుల్లో మాత్రం రైలు నిలవని స్టేషన్‌లా నిర్జనంగా వుండడమే మామూలు. కిటికీ తలుపు మూసి వెనక్కు మరలచుకున్న క్షణంలో ఆకాపార్కు తాలూకు పిట్టగోడ దావున, కానుగచెట్టు నీడక్రింద పూలతెప్పలా తెల్లటికారు ఒకటి కనిపించింది. చింతలపేట చిల్డ్రన్స్ పార్కు దగ్గర ఒక కారు! కూరగాయల పాదులో క్రోటన్ మొక్కలా యిది విడ్డూరమే!

నా పరిజ్ఞానం అనుమతించినంతలో చింతలపేట పురజనులకు కారు అనేది ఒక వస్తువిశేషం. రోడ్లపైన అది రయిమంటూ దూసుకుపోతుందని మాత్రం వీళ్ళు ఎరుగుదురు. అంతకు మించి వీళ్ళకు దానితోగానీ, దానికి వీళ్ళతోగానీ పనికలిగి వుండదు. పూర్వకాలంలో రాజులైన వారు ఎవడికొంపమైనా గుండం వేయదలచుకుంటే వాడికొక ఏనుగును బహూకరించేవారట! గజరాజానికి మేత అందివ్వలేక వాడి పని అణగారిపోయేదట! అయితే మా చింతలపేట వారులు వివేకవంతులు. 'బాబూ! నీకొకకారు' అంటూ ఒక వదాన్యశేఖరుడు యివ్వజూచినా 'బాబ్బాబూ! నీకొక నమస్కారం' అంటూ పారిపోగలరేగానీ, దాని దరిదాపులకైనా వెళ్ళరు. పోనీ యిక్కడున్నవారి బంధు సత్తముడికెవడికైనా కారుండగూడదా అన్న అనుమానానికి ఆస్కారం లేకపోలేదు. అయినా యింత దూరం కారుపైన వచ్చిన వ్యక్తి యిక్కడ కారుదిగి నడుచుకుంటూ వెళ్ళి ఈరాత్రివేళ మకాం చెయదగిన యిల్లేదీ నావూహ ప్రసరించినంతలో నాకు స్ఫురించడం లేదు. ఆయాకారణాలవల్ల నాపాలిటికాకారు అర్ధరాత్రపు వింతగా, అర్థంగాని పజులుగా, నా వూహాశక్తిని అవహేళన చేసే గూఢవిషయంగానే దృగ్గోచరమైంది.

వెళ్ళిపడుకున్నాను. నిద్రపట్టింది. ఉదయం నిద్రలేవగానే నిత్యకృత్యాలు మొదలు. ఆఫీసు ఫైళ్ళ అలజడిలో తలమునిచిన తర్వాత మిగిలిన సర్వ విషయాలూ విస్మృతి పథంలో పడిపోతాయి. సాయంకాలం ఆఫీసునుంచీ రీడింగు రూముకు వెళ్ళి, అదికట్టేసిన తర్వాత హోటల్లో భోజనం చేసి, వనిలో వనిగా సినిమా గూడా చూచుకుని అర్థరాత్రి తర్వాత గృహోన్ముఖుడి నయ్యాను. పార్కు యింకొక వందగజాల దూరంలో వుందనగా హఠాత్తుగా నాకు కారు సంగతి జ్ఞప్తికి వచ్చింది. తలపైకెత్తి ముందుకు చూద్దును గదా, అదేచోట, అదేకారు, అదేతీరులో కనిపించింది.

దగ్గరగా వెళ్తున్న కొద్దీ ఈ కారు రహస్యమేమిటో విచ్ఛేదనం చేసి పారెయ్యాలన్న కుతూహలం నాలో బలపడసాగింది.

అద్దానికి వెనుక మినుకు మినుకుమని వెలుగుతున్న నిప్పురవ్వ ఒకటి, దాని వెనుక లీలగా ఒక మానవాకృతీ కనిపిస్తున్నాయి.

పలకరించడానికి ఒక మిష గూడా దొరికినట్టయింది.

జేబులోంచి సిగరెట్టు పెట్టె తీసి, అందులోనుంచి సిగరెట్టు తీసేసరికి సరిగ్గా నేను కానుగచెట్టు నీడలో వున్నాను. అక్కడ ముందుకు వేసిన కాలును మళ్ళీ వెనక్కు తీసుకుంటూ కారులోపలికి తొంగిచూచి "అగ్గిపెట్టె వుంటే యిస్తారా?" అన్నాను.

గాజుతలుపులు బిగించి వుండడం వల్ల అతడికి నామాటలు స్పష్టంగా వినిపించినట్టు లేదు. అయినా వాలకాన్ని బట్టి నాయింగితాన్ని గ్రహించినట్టుగా అతడు కిటికీ కడ్డంగా వున్న గాజుతలుపును క్రిందికి దించాడు. దృఢమైన హస్తం వెలుపలికి వచ్చింది—వ్రేళ్ళ సందున అగ్గిపెట్టెతో సహా!

'తేంక్స్' చెప్పాను. 'నోమెన్షన్' అన్నైనా అనలేదు మహానుభావుడు.!

సిగరెట్టు వెలిగించుకున్నాను. ఇక అగ్గిపెట్టె వాపసు చేయడమే తరువాయి. 'ముహూర్తం మించిపోతోంది, ఆలాతిసే అవకాశం జారిపోయినట్టే' నని మనసులోని కుతూహలం గోల పెడుతోంది.

సమయానికి దారం దొరకాలి. ఉచ్చువెయ్యాలి. విసరాలి. విసిరిన ఉచ్చు దేనికి తగులుకోవాలో దానికి తగులుకోవాలి. సంభాషణను కొనసాగించి, అంతర్యాన్ని వెలికి లాగడంలో యింత తతంగమూ

వుంది. అది నిజంగా ఒక కళ! నాకు కళాస్వరూపమైతే తెలిసింది గానీ కళాసాధనకు ఉపక్రమించేదారి ఏమిటో తెలియడంలేదు!

అయితే నా ప్రయత్నానికొక్కింత సులువును చేకూరుస్తూ యిక్కడొక తమాషా జరిగింది.

రోడ్డు వైపు కిటికీకి చేరువగా జరిగివచ్చి అగ్గిపెట్టెకోసం చేయిచాస్తూ అతడు "ఏమండీ! ఈ ప్రాంతంలో ఎక్కడైనా మెడికల్ షాపులున్నాయా?" అన్నాడు.

నేను విస్తుపోతూ అతడి ముఖంలోకి పరకాయించి చూచాను. అలా చూచినందువల్ల నాకు తెలిసింది అతడి ఆకారాన్ని గురించిమాత్రమే! అతడి ఉద్దేశమేమిటో నాకింతింతమాత్రంలో అర్థమయ్యేటట్టులేదు. అయినా అదే తెలుస్తుంది లెమ్మనుకుని" "ఎందుకండీ! ఏంకావాలి మీకు?" అన్నాను.

"బుర్ర బద్దలైపోతూవుంది. పట్టుగ్గరతో పెరికినట్టుగా నరాలు గుంజుతున్నాయి. తలను తీసుకెళ్ళి ఏరైలు చక్రాలక్రింద వుంచేసినా బాగుండిపోవు ననిపిస్తోంది........."

'ఎంతమాటెంతమాట'—అంటూ నొచ్చుకున్నాను. చింతలపేటలో అసలు మందుల షాపులే లేవు. నగరంలోనైనా ఈవేళప్పుడు మెడికల్ షాపులు తెరవబడివుండడం అనుమానమే! అలాగని తలకాయను తీసుకెళ్ళి రైలు చక్రాల కప్పగించవలసిన పనేమీలేదు.....

మరేం చేయాలని ప్రశ్నిస్తున్నట్టు అతడు నిస్సహాయంగా నావైపు చూస్తున్నాడు.

"మాయిల్లిక్కడి కెంతో దూరంలో లేదు. నాగదిలో తల నొప్పికి రెండు మూడు రకాల మందులున్నాయి. ప్రస్తుతానికింట్లో నేను తప్పితే మరెవ్వరూ లేరు గూడా!"

గుదిగుచ్చి చెప్పిన ఈ మూడు కారణాలు అతడిచేత నా ప్రతిపాదనను అంగీకరింప జేశాయి.

గదిలోకి వెళ్లేదాకా మాయిద్దరి మధ్య నెలకొన్నది మౌనమే. లైటువేశాను. వాలుకుర్చీలో కూచోమన్నాను. అంజనం తెచ్చియిచ్చి కణతలకు పట్టించమన్నాను. మాత్రలు మింగాలంటే వేడి నీళ్ళుండాలి. అందుకని స్టౌ ముట్టించాను.

"చూచారా ! నామూలంగా మీకు లేనిపోని శ్రమ......"

క్షమాపణకు అడ్డు తగిలాను— "పరవాలేదు. మీరేం మొగమాటపడకండి. పుట్టుకతోనే మానవుడు సంఘంపైన ఆధారపడుతున్నాడు. కష్టనష్టాల్ని గానివ్వండి, సుఖసంతోషాలను గానివ్వండి, అతడు తోటిమనుషులతో కలిసి పంచుకోక తప్పదు. అంతెందుకు! మీరీగదిలో అడుగుపెట్టి అయిదు నిమిషాలైనా కాలేదు. నేను మిమ్మల్ని గురించి ఆలోచించడం మొదలు పెట్టి ఈక్షణానికి యిరవై నాలుగ్గంటలు దాటింది. బహుశా నాలాగే మీ పోలికను గమనించిన వాళ్ళు మరి కొందరు వుండనే వుంటారు. కిటికీలు బిడాయించుకుని ఒంటరిగా మీ పాటుకు మీరు కారులో కూర్చుని, అంతటితో ప్రపంచంతో సంబంధాలు తెగిపోయినట్టు భావించడముంది చూచార్రా,అది పంచాంగాన్ని చింపి ప్రోగులు పెట్టి, యిక నక్షత్రాలు లేవనుకోడం లాంటిదే......"

ఇకలాభం లేదన్నట్టు అతడు అడ్డంగా తలాడిస్తూ "అలాగా?" అన్నాడు. ఆతరువాత దాదాపు స్వగతంలా తన భావాల్ని మాటల్లోకి అనువదించడానికి ప్రయత్నించాడు. "అయితే నేనింకొక ఆశ్రమం చూచుకోవలసిందే! చెబుతున్నాగా! రేపటి నుంచి ఈ ప్రాంతాల్లో కనిపించను......"

అందుకు దారితీసిన కారణాలేమిటో తేలకపోయినా, అతడి పరిస్థితి ఏమిటో నాకు బోధపడినట్టయింది. వ్యక్తి చువ్వలా చలాకీగా వున్నాడు. విలువైన దుస్తులతో, నలిగినా చెదిరిపోని క్రాపింగుతో మట్టసమైన వేషం కొనతేలిన ముక్కు, పెదవుల ముడివడేతీరు, ఆలోచించినప్పుడల్లా కళ్ళు కుంచించుక పోయే వైఖరి, ఫాలతలంలో తొంగిచూచే నొక్కులు, వీటితో గూడిన ముఖ భంగిమ అతడిపట్టుదలను మాత్రం సూచిస్తుంది. పిలవగానే నాగదికి రావడానికి సిద్ధపడడంతో అతడు తొందరగా నిర్ణయాలు తీసుకోగలడని అవగతమైంది. మనిషి ప్రయోజకుడనీ, బాగా సంపాదిస్తున్నాడనీ అనుకోడానికి సందేహం అక్కర్లేదు. కలిసికట్టుగా ఈ వివరాలన్నింటినీ ఉపోద్ఘాతం క్రింద జమకట్టుకోవచ్చు. ఇకపైన అసలు కథలోకి వెళ్ళడమే తరువాయి.

స్టౌ మీద నీళ్ళు కాగాయి. కాగిన నీళ్ళను గిన్నెలోనుంచి గ్లాసులోకి వంచుకున్నాను. నిస్సహాయస్థితిలోవున్న అర్భకుడిలా అతడు నోరు తెరిచాడు. ఏకధమ్మున రెండు మాత్రలు మింగించేశాను.

కుర్చీ తీసుకొచ్చి వాలు కుర్చీకి దగ్గరగా వేసుకుంటూ "రాత్రుల్లో మీరు యింటి దగ్గర పడుకోవడం లేదా?" అన్నాను.

నిండుగా గాలిపూరించిన రబ్బరు బెలూను పైన గుండు సూదిని దించినట్టే అయింది. గుప్పెడు గుండెలో దాగివుండిన వేదన తుపానులా ప్రిదిలిపోయింది.

"పడుకోవాలనే అనుకుంటాను, పగలంతా నా వుద్యోగంతోనే నాకు సరిపోతుంది. చీకటి పడగానే యింటికి వెళ్తాను. చెబితే మీరు నమ్మరు! పెళ్ళామన్న పేరుతో నాకొక ఆడమనిషి వుంది. ఆవిడతో ఒకటి రెండు గంటలసేపటికన్నా ఎక్కువసేపు సహజీవనం చేయడం సాధ్యం కాదు. ఇది ఏడెనిమిదేళ్ళ అనుభవం మీదట తేలిన సంగతి.........."

"అయ్యో పాపం!" అంటూ సానుభూతి ప్రకటించకుండా వుండలేక పోయాను.

"అయ్యోపాపమని ఒకసారి చెబితే చాలదు. ఈ దవుర్భాగ్యుడి కోసమని మీరు మీసానుభూతిని వందతోనో, వెయ్యితోనో గుణించాలి. ఎందుకులెండి మేష్టారుగారూ! నాజీవితంలో ఘోరమైన పొరబాటు జరిగి పోయింది........"

ముఖాన్ని రెండు చేతులతోనూ కప్పుకుని భోరున ఏడ్చేయవలసిన అవస్థే అది! అంతపనీ చేయకుండా అతడు ముఖాన్ని అవతలికి త్రిప్పుకున్నాడు.

"తలనొప్పి పోగొడతానని తీసుకొచ్చి మరింత ఎక్కువచేసేటట్టున్నాను. మన్నించండి. మీకిష్టంలేకపోతే నాకేమీ చెప్పొద్దు" అన్నాను.

"అబ్బే, కాదండీ మేష్టారుగారూ! ఎవరితోనైనా చెప్పుకోక పోతే నాకు 'రిలీఫ్' కలిగేటట్టు లేదు. నేనెవరినో మీరెరుగరు. ఎవరో నాకూ తెలియదు. అర్ధరాత్రి వేళ ఆపద్బాంధవుల్లా నాకు దొరికారు. వేసినగరంలో అడుగుపెట్టి పదేళ్ళు కావస్తున్నాయి. వ్యాపారసరళిలో మాత్రమే నేను పరిచయాలు పెంపొందించుకుంటూ వచ్చాను. నా గోడేమిటో వివరించి, పరిష్కారమార్గమేదైనా చెప్పమనడానికి నాకొక్క ఆత్మీయుడైనా లేడు......"

"పరిష్కారం చెప్పగలననిగాదు. మీకభ్యంతరం లేకపోతే చెప్పండి. శ్రద్ధగా వినగలను. నాకూ తెలుసుకోవాలనేవుంది" అన్నాను.

"ఇక్కడికి ఆరవై మైళ్ళదూరంలో ఏనుగు మల్లమ్మకొండల కటు వైపున మామిళ్ళపాడనే వూరుంది. అదే మావూరు. నేనీ పట్నానికొచ్చినప్పటికి మా అమ్మ సజీవంగానే వుండేది. పుణ్యాత్మురాలు! నేనిక్కడ నావిరవాకాన్ని వెలిగించకముందే తాను కళ్ళు మూసింది. మాది సమిష్టి కాపురం. పెత్తనం మామేనమామగారిది. మానాన్నగారు పోగానే వున్న నేలా నట్రా తెగనమ్ముకుని వచ్చి మా అమ్మ అన్నదమ్ముడి పంచలో చేరింది. ఆడబ్బు నాయన స్వంతపద్దుల క్రింద జమచేసుకున్నాడు. మా అమ్మను పాకీరీమనిషి క్రింద లెక్కగట్టుకున్నాడు. ఎటొచ్చీ నేను చదువుకోడమూ, నాకు చదువు రావడమూగూడ మా మామయ్య పాలిటికి మింగరాని ముద్దలుగా వుండిపోయాయి. నాలుగుమైళ్ళదూరం గుట్టలకడ్డం పడి వెళ్ళి నేనొక పూరిపాక హైస్కూల్లో చదువుకునేవాణ్ణి. హైస్కూలు చదువు వల్ల నాకు సర్టిఫికెటు అయితే దొరికింది గానీ, లోకజ్ఞానం మాత్రం అబ్బలేదు. ఆచదువు ముగిసినప్పటి నుంచీ మళ్ళీ ఆయిదారేళ్ళదాకా నేను మామేన మామగారి పొలాలపైన పెద్ద పాలేరుగా మాత్రమే వ్యవహరించాను. 'మందుడు', 'జడుడు' అని మనం పద్యాల్లో చదువుకుంటాంగదండీ! అప్పట్లో ఆబిరుదులన్నీ నాకు అనువర్తించేవే! అదృష్టమనుకోండి, దురదృష్టమనుకోండి, నాకక్కడినుంచీ ఎక్కడికైనా పారిపోయి, అంతకంతా మరుగా బతికే అవకాశాలకోసం అన్వేషించాలన్న బుద్ధి పుట్టింది. పోయినవి పోగా ఆనాటికింకా మా అమ్మదగ్గర మిగిలి వున్న ఒకేఒక మూడుతులాల బంగారపు గొలుసు. ఆ గొలుసును జేబులో వేసుకుని నేను దేశంపైన పడ్డాను. నేనెక్కిన బస్సు నన్ను తీసుకొచ్చి ఈ పట్నంలో దిగవిడిచింది......"

గ్లాసులో మిగిలివున్న నీళ్ళను ఒక గుక్కలో ఖాళీ చేసి అతడు మళ్ళీ కొనసాగించాడు.

"గొలుసు నమ్మగా వచ్చిన నాలుగు వందలరూపాయలు ఎన్నాళ్ళకని సరిపోతాయి? పొట్టగడవడంకోసం నేనేదైనా పని చేయవలసి వచ్చింది. మనిషి ఎంతటి దిక్కుమాలినవాడుగా నైతే వున్నాడో అంతగా ఆతణ్ణి నికృష్టపరిస్థితుల వూబిలో తొక్కి పెట్టాలని కుంటుంది లోకం. హోటంలో నాకు డెబ్బయి అయిదు రూపాయల కొలువు దొరికింది. కడుపునిండా తినాలనుకుంటే ఆమొత్తం రెండు పూటల భోజనానికైనా చాలదు. అందుకని కుంపటొకటైన స్వయంపాకం చేసుకోడానికి వీలుగా ఎక్కడైనా వో చిన్నగది అద్దెకు దొరుకుతుందేమో నని వెదుకుతున్నాను. వెంకట్రామయ్య గారని వో రిటయిర్డు శిరస్తాదారు. బతుకులో ఆతగాడిపన్నీ కమిట్‌మెంట్సు! పరిష్కారంకోసం ప్రయత్నించిన పాపానపోలేదు మహానుభావుడు. కుప్పలు కుప్పలుగా అప్పులు చేశాడు. పిత్రార్జిత మైన యింటిని గూడా తాకట్టుక్రింద పెట్టేశాడు. ఇంటినిండుకూ అమ్మాయిల్ని కన్నాడు. నాగజముడుపొదలకు మల్లే సమస్యల్ని పెంచుకుంటూ కూచోడమే అతడిపని. ఎరగకపోయి నేనతడియింట్లో వీధి వైపున వున్నగదిలో అద్దెకు దిగాను. ఇందాకా నేను పెళ్ళామన్న పేరుతో వో ఆడమనిషి అన్నాను గదండీ! ఆవిడ ఈదశలోనే నాకు తారసపడింది. ఎవరోగాదు. సదరు రిటయిర్డు శిరస్తాదారుగారి పెద్దమ్మాయి...."

శిరోభారం తగ్గిందీ లేనిదీ బుజువు చేసుకోడానికన్నట్టుగా ఆతడు మెడకీలుపైన తలను అటూ, యిటూ త్రిప్పిచూచుకున్నాడు. "తలనొప్పి తగ్గింది మీరు పర్మిషన్ యిస్తే సిగరెట్టు కాల్చుకుంటాను" అన్నాడు. ఒకసారి పొగపీల్చి వదిలేసరికి ఆ ముఖంలో కాసా ఉత్తేజం చోటు చేసుకుంది.

"చిన్నప్పటినుంచీ నేను పుస్తకాలపురుగుని లెండి! ముఖ్యంగా ప్రేమ అనే పిచ్చి భావం ఆవయసులో నాహృదయానికి గిలిగింతలు పెడుతూండేది. ప్రేమ గుడ్డిది. అంటే మనమొక వ్యక్తిని ప్రేమించ గలమంతే గానీ, అలా ప్రేమించడానికి కారణాలేమిటో చెప్పమంటే చెప్పలేమన్న మాట! ప్రేమకంటే అపురూపమైనదీ, అమూల్యమైనదీ, దివ్యమైనదీ యింకొకటి లేదు. ప్రేమకోసం అవసరమైతే సర్వప్రపంచాన్నీ ధిక్కరించాలి. ఇంకా మాట్లాడితే ప్రేమకోసం ప్రాణత్యాగం చేసినా తప్పులేదు .... ఇలా ప్రేమపిచ్చిలో ఇద్దీ కొట్టుక పోతుండగా నాచేతికేదో దొరికింది. బిగ్గరగా కౌగిలించుకున్నాను. తీరా అంతపనీ చేశాక తెలిసింది........."

"ఏమని?"

"అది ఈత మొద్దని!"

ఈ చివరిమాట నాపైన హెచ్చరికలా పనిచేసింది. కథకుడూ కథానాయకుడూ ఒక్కడే అయినప్పుడు శ్రోత జాగ్రత్తగ నుసలు కోవాలి. లేకుంటే కథలోని ఒకానొక పాత్రపైన అతడికున్న కోపం శ్రోతపైకి మళ్ళే ప్రమాదం వుంది. అందుకని మరింత జాగరూకుడుగా వుండడానికి ప్రయత్నిస్తూ "ఉండండుండండి! మొట మొదట్లోనే చెప్పవలసిన విషయం ఒకటి బాకీపుండిపోయింది. మీపేరేమిటో చెప్పారు కారు" అన్నాను.

"నాపేరు సత్యనారాయణ. అందరూ 'సత్యం' అని పిలుస్తారు. స్వాతిశయమనుకోకపోతే చెబుతాను. నాది సార్థకనామధేయమనే నేననుకుంటాను. జీవితానికి సంబంధించిన ఎంతో సున్నితమైన విషయాలను గురించి గూడా నేనెంత నిష్కర్షగా ... మాట్లాడగలనో మీరు గమనించే వుంటారు. ... ఉపోద్ఘాతమెందుకు. ... పెద్దమ్మాయి ... ఆమె ... జనంతోనే. నన్నెరిగిన వాళ్ళకందరికీ నామాటపైన, ...

తిరుగులేని నమ్మకముందని, చెప్పుకోడానికి నేను గర్విస్తాను. మామూలు ఏజంటుగా నేను డిపార్టుమెంటులో ప్రవేశించాను. ఇప్పుడు నానెల సరి ఆదాయం వెయ్యిరూపాయలు. జీవితం ఒక పొగరుబట్టిన గుర్రంలాగానే నాకెదురైంది. కళ్ళెం బిగబట్టి దాన్ని నేను నా అదుపులోకి తెచ్చుకోగలిగాను. కానీ ఏంలాభం? రచ్చలో గెలిచాను. ఇంట్లో చిత్తు చిత్తుగా ఓడిపోయాను...."

"చూడండి సత్యంగారూ! ఎప్పుడు లేచినా రాళ్ళవంకదగ్గరే తెల్లవారినట్లు మీరెక్కడ ప్రారంభించినా మీ ఆవిడ దగ్గరికొచ్చి ఆగిపోతున్నారు. అక్కడినుంచీ మీకథ ఒక అంగుళమైనా ముందుకు సాగడం లేదు ........."

నేనెంత ఖచ్చితంగానైతే నా అభిప్రాయాన్ని ప్రకటించానో, అంతగా అతడు తన ఆక్రోశాన్ని వెలిబుచ్చాడు.

"ఏంచేయమంటారండీ మేష్టరుగారూ! సముద్రంలో నుంచీ పైకి లేచే పెద్ద రాయి ఒకటి వుంటుందనుకోండి. బయల్దేరిన ప్రతి అలా దానికి మోదుకుని తిరిగి వెళ్ళిపోతుంది. నా బ్రతుకులోనూ జరుగుతున్నదదే! అది నాజీవిత ప్రవాహానికెదురైన పెద్ద కొండపేటు. ఆశలకు హద్దు. ఆశయాలకు ఫుల్‌స్టాపు. నా ఉరవడికి ఆనకట్ట. అక్కడ నాతలను దానికేసి మోదుకోవాలని మాత్రమే అనిపిస్తుంది, ముందుకు వెళ్ళడానికి వీల్లేక, మరేం చేయాలో తోచక! మరింత స్పష్టంగా చెప్పేస్తున్నాను మీకు! ఒక ఆడదానికి భర్తగా వుండడానికి బొత్తిగా పనికిరాని మగవాడు, ఆ మగవాడికి భార్యగా వుండడానికి సుతరామూ పనికిరాని ఆడది—యిలాతలంపైన యిలాంటి జంట ఒకటి వుంటుందనడానికి తార్కాణం మాకాపురమే ననుకోండి! అంతెందుకు! మీరు నావయసెంతుంటుందనుకుంటారు?"

"ఎంతో ఎక్కువ! మీ వయస్సు ముప్పైకి లోపే" అన్నాను.

"ఆవిడవయసు ముప్పై అయిదు. ఎంతలేదన్నా నాకన్నా అయిదేళ్ళు పెద్దది........"

"అరరే పాపం!" నొచ్చుకున్నాను.

"అంతటితో ఏముంది? తానేమో శాకాహారి. నాకాచప్పిడి తిండి సయించదు. నాలిక కాస్త పదునెక్కాలంటే నాపాలిటికి హోటళ్ళే శరణ్యం. ఒక్క ఆహారంలోనేగాదు. ఆచారాల్లో గానీ, అభిరుచుల్లో గానీ పొంతన లేదంటేనమ్మండి. దేవుడనే పెద్దమనిషిని స్వయానా ప్రక్కింటివాడుగా భావించడం నాకు గిట్టదు. ఆమాట చెబుతే నన్ను నాస్తికుడని ఎద్దేవా చేస్తుంది. నేను సినిమా అంటే తాను పేరంటం అంటుంది. కాసేపు డాబాపైన పడుకుందామంటే ఎల్లకాదు, గదిలో పరుపు వేసేశానంటుంది. మాట మాటకూ తెగులే! నాటి మాటికి రగడే! నువ్వు చెప్పడమేమిటి, నేను వినడమేమిటి అన్న ధీమా చాలా వుందిలెండి! అప్పటికి తనేమో పెద్ద ఆఫీసరైనట్టు, తన గృహ సామ్రాజ్యంలో నేనొక అల్పప్రాణినైనట్టు వ్యవహరిస్తే ఎలా భరించడమో చెప్పండి........" ఏడుపు మొగం పెట్టి అతడు దిక్కుచూపులు చూడసాగాడు.

నాలో వుక్రోషం పెల్లుబికింది. మానవ జాతిలో వున్నవల్లా ఆడా, మగా అంటూ ప్రముఖ వర్గాలు రెండే! నాదైన మగజాతికి యింకొక వర్గం ద్వారా జరిగే ప్రతి అవకాశాన్నీ, ప్రతి అన్యాయాన్నీ నా సర్వశక్తులూ వినియోగించి ఎదుర్కోవాలన్న పట్టుదల, బాహాటంగా చేతల రూపంలో గాక పోయినా, అంతరంగాన ఆలోచనల రూపంలో నాలో పుష్కలంగా వుండనే వుంది. అందువల్ల పై వర్గ సంఘర్షణలో ఘోరంగా ఓడిపోయిన నాతోడి సోదరుడికి కాస్త ఉత్సాహాన్ని అందించి, ఒక్కింత జలాన్ని నూరిపోసి మళ్ళీ ఒకసారి అతణ్ణి పోరాటానికి ఆయత్తం చేయడం నాకు అవశ్య కర్తవ్య మని పించింది.

"చాదస్తం కాకపోతే ఏమిటండీ మీరు! మగమహారాజులు మీరు! మీకీ పేలతనం పనికిరాదు. ఇలాంటి గడ్డు సమస్యలకున్న పరిష్కారం ఒక్కటే! మీకు తెలియందేమీ గాదు......"

ఎగరవేసిన బంతిని అందిపుచ్చుకున్నట్టుగా అతడు నామాటకు అడ్డు తగిలాడు—"విడాకులేగదండీ! ఇచ్చేశాము. ఆముచ్చట గూడా చెల్లింప బడింది గనుక మేమిప్పుడు చట్టరీత్యా భార్యాభర్తలం గూడా కాము!"

ఈ సారి నేను తెల్లబోవడం మాత్రమే జరిగింది. తేరుకోవడం జరగలేదు.

"ఈ నేరానికి గాను కోర్టువారు నాకు విధించిన నెలసరి జుల్మానా రెండువందలా యాభై రూపాయలు....." అతడింక పిదప ఏడవడమే తరువాయి.

జుల్మానా అంటే ఏమిటో నాకర్థమైంది. కానీ ఒకవైపున జీవనాంశం చెల్లిస్తూ, యింకొకవైపున ఆవిడగారినింకా స్వగృహంలోనే వుంచుకోవలసిన అవసరమేమై వుంటుంది? ఈ 'మిస్టరీ' ఏమిటో నాకణుమాత్రమైనా అంతుపట్టడం లేదు.

ఎలాగైనా ఈ సత్యనారాయణ అనే వ్యక్తి కుశాగ్రబుద్ధి మాత్రం గాకపోలేదు. అతడు నాయింగితాన్ని చప్పున గ్రహించాడు. ఇంతదూరం వచ్చాక యిక చెప్పక తప్పదనుకున్నట్టుగా 'అసలేం జరిగిందంటే మేష్టరుగారూ!' అంటూ ఉపక్రమించి నాసందేహానికి సమాధానం చెప్పసాగాడు.

"రెండేళ్ళపాటు బుద్ధిగానె భరణం చెల్లిస్తూ వచ్చాను. ఇంతలో ఈ కారు గొడవొకటి వచ్చిపడింది. ఎలాగైనా సరే, ఏనాటికైనా సరే స్వంతకారుపైన తిరగాలన్నది నాజీవితాశయం. అయిదేళ్ళపాటు నెలొకటికి రెండువందల యాభై చొప్పున చెల్లించుకుంటే ఈ కారు నాకు స్వంతమైపోతుంది. భోజనానికి, యింటద్దెకు, పై ఖర్చులకు నాసంపాదనలో మూడు పాతికల ముప్పాతిక వంతు సరిపోతుంది. మిగిలిన పాతిక వంతు ఆదాయాన్ని కారుపైకి మళ్ళించడం తప్పని సరై పోయింది. అందుకని బువ్వకోసమని అవ్వను తెచ్చుకున్నట్టుగా మళ్ళీ తనవొచ్చి యింట్లోనే వుండిపొమ్మన్నాను. విడాకులు కోరింది తాను కాదు గదా! ఖుషీగా వుంటానంటూ తరలి వచ్చేసింది. ఫలిత మేమిటంటే మేష్టరుగారూ, ఇప్పుడు నా జీవితమనే నాణానికి లక్షణంగా బొమ్మా బొరుసూ గూడా అమరినట్టయింది. బొమ్మేమో కారు. బొరుసేమో పోరు. కారుకోసం మాజీవనం పోరుపడలేక మళ్ళీ ఈ పోరులోనే పలాయనం!"

దాదాపుగా తెల్లవారుజాము గావచ్చింది. నేరాన్ని ఒప్పుకున్న తర్వాత కటకటాల్లోకి వెళ్ళడానికి ఉద్యుక్తుడయ్యే ఖైదీలా అతడు పైకి లేచాడు. సాగనంపడంకోసం వీధిగుమ్మందాకా వెళ్ళాను. మెట్లుదిగి, వీధిలో అడుగుపెట్టి అతడు చీకట్లోకి, మంచులోకి జారుకోగా, నేను తిరిగి వెళ్ళి నాగదిలో ప్రవేశించిన తర్వాత స్ఫురించింది—' నేనతడి చిరునామా అడిగి తెలుసుకోలేదని!

ఒక మనిషిని గురించిన జ్ఞాపకాలు యింకొక మనిషిని అంత, సులభంగా వదిలిపెట్టవు. చలికాలపు రాత్రుల్లో కిటికీ తలుపులు తెరిచినప్పుడు, రోడ్డుపైన తెల్లటికారు కనిపించినప్పుడు, భార్యాభర్తల మధ్య పొసగని కాపురాలను గురించి విన్నప్పుడు సత్యనారాయణ మెరుపులా జ్ఞప్తికొస్తుండేవాడు.

పల్లెలు పేటలుగా, పేటలు పట్టణాలుగా, పట్టణాలు మహానగరాలుగా మారడం నాగరికతా పరిణామంలో ఎంతటి ముఖ్యమైన విషయమైనప్పటికీ అందువల్ల మనిషికీ మనిషికి మధ్య సంబంధాలు పలచబడిపోయే ప్రమాదం మట్టుకూ లేకపోలేదు. మహానగరంలో వేర్వేరు ప్రాంతాల్లో నివసిస్తున్న యిద్దరు మిత్రుల్ని బేటీచేసి ఒకరికోసం ఒకరు వెదుక్కుంటూ వెళ్ళినప్పుడు తప్పితే, మరెప్పుడైనా వాళ్ళు యాదృచ్ఛికంగా రోడ్లపైన కలుసుకున్న సందర్భముందేమో అడిగి చూడండి! అలా ఎప్పుడూ జరగలేదన్న ప్రత్యుత్తరం వస్తే ఆశ్చర్య పడవలసిన అవసరం లేదు.

కాలమనే సముద్రంలో సంవత్సరాలు బిందువులు. నాలుగేళ్ళు గడచి పోయాయన్న మాటకేం గానీ, సత్యనారాయణ కోసం నేను వలుపుతూన్న అన్వేషణ ఫలించింది. అయితే ఈసారి అతడు కనిపించడం అర్ధరాత్రి తర్వాత మాత్రం గాదు. అర్ధరాత్రికి బాగా ముందుగా తొమ్మిదికీ, పదికి మధ్య బ్రహ్మాండమైన ఒక ఎగ్జిబిషన్‌లో కాళ్ళరిగిపోయేటట్టుగా తిరిగివచ్చి, కాళ్ళీడ్చుకుంటూ మెల్లగా బస్‌స్టాపు వైపు నడుస్తున్నాను. పేవ్‌మెంటు ప్రక్కన వందలకొలదిగా ఆగివున్న కార్లలో ఓ తెల్లటి కారు కనిపించింది. లోకంలో తెల్లకార్లకేం కొదవ? నాకు కనిపించిన తెల్లటి కారే సత్యనారాయణ కారు కావడమన్నది వెయ్యి పర్యాయాల కొక్కసారి సంభవమైతే కావచ్చు,కాకనూ పోవచ్చు. కారును దాటుకుని ఈవలకు రాబోతుండగా స్టీరింగు చక్రం వెనుక సీటుకు చేరగిలబడి. సిగరెట్టు కాల్చుకుంటున్న ఓ వ్యక్తి కనిపించాడు. అదేభంగిమ! అదే సిగరెట్టు కాల్చే తీరు! చూచిన మరుక్షణంలోనే అతణ్ణి పోల్చుకోగలిగాను.

కారులోకి తొంగిచూస్తూ "సత్యనారాయణగారే గదండీ! నమస్కారం!" అన్నాను.

అతడు కారు తలుపు తెరచుకుని పేవ్‌మెంటుపైకి వచ్చేశాడు. నాముఖంలోకి పరిశీలనగా చూస్తూ "మీరు...... మీరు......" అని కొద్ది క్షణాలపాటు పెళ్ళు నమిలాడు. నిప్పులాంటి జ్ఞాపకాలపైన ఏవేవో ప్రాపంచిక విషయాలు నివురులా పేరుకపోవడం వల్ల. ఒకటి రెండు నిమిషాల పునస్మరణతో నివురు రాలిపోయి అతడి జ్ఞాపకం నిప్పులా మెరిసిపోసాగింది.

"మన్నించండి మేష్టరు గారూ! కులాసాయే గదండీ! ఆగదిలోనే వున్నారా?" అంటూ అతడు పరామర్శ ప్రారంభించాడు.

నిరాఘాటంగా సాగిపోతున్న అతని ప్రసంగానికి వెనుక, నాబుర్రలో రైళ్ళు పరుగిడుతున్నాయి. నగరం శివార్లలోని ప్రశాంత ప్రదేశాలు మునుపటికతని రాత్రి మజిలీలుగా వుండేవి. అలాంటి చోట్లల్లో ఉనికి సందేహాలకు దారితీస్తుందని, యిప్పుడు పద్ధతి మార్చుకున్నాడేమో! జనసమ్మర్దంతో నిండిన ప్రదేశాల్లో ఎంతసేపు కారాపుకున్నా అడిగే వాళ్ళుండరు. రణగొణధ్వనికి అలవాటు పడితే నిద్ర పోగలగడం గూడా అసాధ్యమేమీగాదు. అతడిప్పుడు నిమగ్నుడై వున్న సాధన అదేనేమో!

"ఇంతకూ అంతకూ నాకు తలనొప్పి వచ్చేస్తుందంటే నమ్మండి మేష్టరుగారూ! ఇందాకా ఎగ్జిబిషన్‌లో తిరుగుతుండగా జివ్వు జివ్వుమంటూ ఒంటిచెంప తలనొప్పి ఆరంభమైంది. రెస్ట్ తీసుకుంటే అదే పోతుందని చక్కాయిలా వచ్చేశాను. ఈ మధ్య ఒక డాక్టరుగారి దగ్గరకు వెళ్తే ఆయన కళ్ళజోడు కొనుక్కోమన్నాడు. తీసుకొచ్చి యింట్లో పెట్టానంతే! దాన్ని మాయింట్లో, వున్న సిసింద్రీ ఎక్కడ వుండనిస్తాడు! అదిగో—మాటలోనే వచ్చేశాడు..........."

"ఎలాగైనా మంచి బుద్ధిమంతుడే! అక్కడున్న వినోదాలన్నీ వీడి పాలిటికి కాసుకు కొరగాకుండా పోయాయి. నాన్నారి దగ్గరకు, నాన్నారి దగ్గరికంటూ ఒకటే గోల! వెళ్ళరా బాబూ!"

తల్లి దగ్గరినుంచి అదొక హేలగా ఆబిడ్డ తండ్రి భుజం మీదికి దాటుకున్నాడు.

బిడ్డకోసం ఎగ్జిబిషన్‌లో కొన్న ఓ విమానం బొమ్మను కారులో నుంచి పైకి తీశాడు సత్యనారాయణ. "బాబూ! కాసేపు దీనితో ఆడుకో నాన్నా! నేనిదిగో, ఈ మామయ్యతో గూడా వెళ్ళి ఓ 'టీ' త్రాగి యిప్పుడే వచ్చేస్తాను..... బుద్ధిగా ఆడుకుంటావు గదూ!" అంటూ బిడ్డను కారులో తల్లికి ప్రక్కనున్న సీటు పైన కూచోబెట్టాడు.

"తొరగా ఒచ్చెయ్యాలి" హెచ్చరిస్తున్నాడు కుర్రాడు.

హోటల్లో కూర్చున్న అయిదు నిమిషాలకు వేడి వేడిగా టీపీటిని చప్పరిస్తూ "కారుపైన కంతులన్నీ చెల్లించేశారా?" అని అడిగాను.

"ఓ చెల్లించేశానే! చెల్లించేశాను గానండి మేష్టరుగారూ, ఇప్పుడాకారం లేనే నాకు మొఖం మొత్తిపోయింది. బాబ్బాబూ, ఎక్కడైనా ఓ బేరం చూచి పెడుదురూ! అమ్మేయాలనుకుంటున్నాను. ఎంతకాలమని అద్దె యిళ్ళల్లో వుండగలం చెప్పండి. స్థలం కొనిపెట్టి రెండేళ్ళయింది. ముచ్చటగా ఓ చిన్నయిల్లు కట్టుకోవాలనుకుంటున్నాను. ఏనాటికైనా మనిషి ఓయింటివాడు కావాలి గదండీ! ఏమంటారు!"

మిగిలివున్న కాస్త తలనొప్పి వెల్లా చెదరై పోయేటట్టు సత్యనారాయణ గలగలా నవ్వసాగాడు.

# చాణక్యుని వాస్తవకథ

## శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి

ప్రాచీన భారతీయ మహామాత్యులలో మహామేధావి, ప్రయోగ కుశలుడు, నీతిశాస్త్ర గ్రంథరచయిత చాణక్యుని గురించిన కథలలో ముద్రారాక్షసము ప్రసిద్ధము. నందులమీద కోపము గొని వారిని వారి సహాయులను తన నీతి ప్రయోగముచేత నిర్మూలించి చంద్రగుప్తునికి రాజ్యమిప్పించిన నీతి కోవిదుడని ఈ నాటక మందలి కథ. ఈతని జీవితలక్ష్యము పదవీ కాంక్ష గాదనియు, పగతీర్చుకొనుటయే యనియు, తన్ను అవమానపరచిన వారిని నిర్మూలించుటయే యనియు అది నెఱవేర్చుకొని యాతడు రాజ్య రక్షణకు మరియొకనిని తన నీతి వైభవముచే నియమించి తపోవనము నాశ్రయించెననియు, శపథ నిర్వహణమునకు ఉదాహరణభూతుడనియు, అతికోపనుడనియు, ఏకొద్ది పాటి అవమానమును గాని సహింపడనియు, ఇతనిని గురించి లెక్కలేని కథలు కనబడుచున్నవి. వాని నన్నిటిని కలిపి ఈ నాటక కథతో పోల్చి చూడగా, నిజముగా ఈ నాటక కథ కవి కల్పితమో, లేక లోకమున వారు వారు చెప్పుకొనుటలో మారిపోయి నాటక కవి కాలమునకు ఈ రూపము వహించినదనియో తలంపవలసి యున్నది. పైగా నాటకము గాన రసోచితముగా పాత్రశీలానుగుణ్యముగా కవి మార్పులు చేయుటకు ఆలంకారికులు సమ్మతించియే యున్నారు. కవి విశాఖదత్తుడు చాణక్య చంద్రగుప్తులకు సమకాలికుడుగాడు, కొన్ని వందల సంవత్సరములు తర్వాతివాడు. కావున ఈ విషయము పరిశోధింపదగినది.

ఈ కథకు ఆకరములు పురాణములు అగునో కావో తెలియదు గాని నందుల వినాశము, చంద్రగుప్తుని అభ్యుదయము, చాణక్యుని సహాయము గల కథలు పురాణము లందేగాక కథాసరిత్సాగరమందును, బృహత్కథామంజరి యందును, సంస్కృత వాఙ్మయమందు హితోపదేశ పంచతంత్ర కామందకాది గ్రంథములందును కలదు. అర్థశాస్త్రము అతనిదే దొరకియున్నది. చాణక్యనీతియని యొక శతకమును, సంకలన గ్రంథములలో ఉదాహరణములును కలవు. కాని బృహత్కథ ననుసరించిన కథలును, తారానాథాది ప్రాచీన బౌద్ధ చరిత్రకారుల రచనలును, జైనుల కథలును ఈ నాటక కథకు భిన్నములు.

చరిత్రకారుడైన విన్సెంటు స్మిత్తు పురాణములను పరిశీలించి మత్స్యపురాణము ఆధారముగా, నవ నందులు కౌటిల్యునిచే నిర్మూలింపబడి చంద్రగుప్తుడు రాజుగా చేయబడెనన్నాడు. చంద్రగుప్తునికి రాజ్యమిప్పించునంతవఱకు ఏ ఆధార గ్రంథముగాని వ్యత్యాసముగా చెప్పుటలేదు గాని చాణక్యుడు రాక్షసుని సాధించి తెచ్చి చంద్రగుప్తునికి మంత్రిగా కూర్చుటయు, తాను చివర మంత్రిత్వమును వదలి తపోవనమునకు పోవుటయు శంకింపదగియున్నది. ఈ ప్రమాణము లేవిగాని ముద్రారాక్షస కథకు మూలములనుటకు పనికిరావు. ఈ నాటకేతివృత్త మంతయు నాటక కవియొక్క సొంత అద్భుత కల్పన యని విమర్శకుల యభిప్రాయము. కొందఱు రాక్షసుడను పేరును బట్టి, ఎవడయిన నట్టివాడు లేనిచో ఆపేరేల వచ్చును? అట్టిది కవి కల్పన కాదు. చరిత్రయే యని వ్రాసినారు. ఇందులకు సమర్థకముగా ఢుంఢి రాజ వ్యాఖ్యను ప్రాచీనముగ ఉదాహరించినారు. ఢుంఢి రాజు పూర్వకథయని వ్రాయుచు రాక్షసుడు నందులకు కులక్రమాగత మంత్రి యని తెలిపెను.

కాని ఇచ్చటనే ఒక సందేహము. రాక్షసుడని ఎవడును పేరు పెట్టుకొనడు గదా! ఇతడు దక్క వాఙ్మయమందు రెండవ రాక్షసుడు కూడ కానరాడు గదా! అట్లు పేరుపెట్టుకొనుట లేనిచో కవి వాడి యుండడని వారభిప్రాయపడిరి! కాని చాణక్యుని వాస్తవ చరిత్ర చేత కూడ దీనిని శంకింప వలసియున్నది.

చంద్రగుప్తుడు తన చివరి దినములలో భద్రబాహువను జైనాచార్యునితోను ఆతని పంద్రెండు వేల శిష్యులతోను దక్షిణాపథమునకు వచ్చి మైసూరులో శ్రావణబెళగొళ మను చోట నివసించెనని జైన గ్రంథములు చెప్పుచున్నవి. చంద్రగుప్త పురములును దక్షిణాపథమున చాల గలవు. తన కుమారునికి బిందుసారునికి రాజ్యమిచ్చి తాను వానప్రస్థుడాయెనట. టిబెట్టు చరిత్ర కారుడు తారానాథుడు కౌటిల్యుని, చంద్రగుప్తుని నుండి ముగ్గురు చక్రవర్తులకు మంత్రియని వ్రాసినాడు. అతి కఠినుడట, తూర్పు పడమటి సముద్రముల నడిమి దేశము నంతటిని తన రాజునకు సాధించి, పదునాఱుగురు దుర్గపాలకులను వారి మంత్రులను నిర్దాక్షిణ్యముగా చంపించెనట. హేమచంద్రుడును, కౌటిల్యుడు బిందుసారుని మంత్రి యనెను. ఆర్యశ్రీ మంజుకల్పమను బౌద్ధ గ్రంథము చాణక్యుడు చాల దుష్టుడనియు, ముగ్గురు రాజులకు (చంద్రగుప్త, బిందుసార, అశోకులకు) మంత్రియనియు తెలుపుతున్నది. త్రికాండ శేషమను నిఘంటువు చాణక్యునికి వాత్స్యాయనుడనియు, ద్రవిడాచార్యుడని పేర్లు గలవని చున్నది. పదునారుగురు దుర్గపాలకులను చంపి పూర్వ పశ్చిమ సముద్ర మధ్యమున నుండు రాజ్యమును జయించుట ఉత్తర హిందూస్థానమున కుదురదనియు, కాబట్టి అది దక్షిణాపథ దిగ్విజయముగా నుండు ననియు, ఇందులకు అనుకూలముగా మామూలనారను తమిళ కవి, సంఘ వాఙ్మయమునాటివాడు మధుర వఱకు మౌర్యులు దండెత్తి వచ్చిరనియు, వారు దుర్మార్గులనియు (వంబ మోరియర్) వ్రాయుట చూడదగినదనియు, ఇది బిందుసారుని కాలమునకు క్రీ. పూ. 278 కి సరిపోవుచున్నదనియు సుప్రసిద్ధ చరిత్ర కారులు శ్రీ సత్యనాథ అయ్యరుగారు అభిప్రాయ పడినారు. అప్పటికే చోళ చేర పాండ్య రాజులు బలిష్ఠులై కాళింగులతో సముద్రయానాది స్పర్ధలచే పోరాడు చుండిరి.

ఇట్లు ముగ్గురు చక్రవర్తులకు మంత్రిగా వెలుగొందిన చాణక్యుని గురించి గ్రీకు రాయబారి మెగాస్తనీసు ఒక్క యక్షరము కూడ వ్రాయలేదు. చాణక్యుడు మెగస్తనీసు వచ్చి పోయినయనంతరము మంత్రియై యుండిన యెడల చంద్రగుప్తుని రాజ్య ప్రాప్తికి కారకుడెట్లు కాగలడు? ముందే యై యుండినయెడల బౌద్ధుల చెప్పినవన్నియును త్రోసి వేయవలసి వచ్చును. చాణక్యుని మీద అంత గొప్ప వాఙ్మయముండుటచేత ఆతడేమో చారిత్రక పురుషుడే, నాడుండినవాడే, కాని ఏలనో మెగాస్తనీసు చెప్పలేదు. పైగా మెగాస్తనీసు గ్రంథము మనకు పూర్తిగా దొరకలేదు గదా!

బౌద్ధుల కథల కనుగుణముగా నున్నది కథాసరిత్సాగరమందలి కథ. పూర్వనందమంత్రి శకటాలుడు. అతని కాలమున నందుని శరీరమున పరకాయ ప్రవేశము చేసిన యోగనందుని పూర్వ శరీరమును దహించి, అసలు నందుని కుమారుని పక్షమువలంబించిన కారణమున శకటాలుని అతని నూర్గురు కొడుకులను యోగనందుడు అంధ కూపమున త్రోయించుటయు, శకటాలుని కంటియెదుటనే ఆ కుమారులు మరణించుటయు, ఏదో కారణాంతరమున శకటాలుడు క్షమింపబడి, బంధ విముక్తుడై, చాణక్యుని సంపాదించి, ఆతని సాయమున యోగనందుని నిర్మూలించి, పూర్వనందకుమారుని చంద్రగుప్తుని రాజ్యమునందు ప్రతిష్ఠించి, చాణక్యుని మంత్రిగా నిలిపి తాన పుత్ర శోకము చేత తపోవన మాశ్రయించెనని కలదు.

ఈ కథలో శకటాలుని చర్యలకును, వైరాగ్యమునకును చాలినంత కారణములు కలవుగాని ముద్రారాక్షసమున చాణక్యుని తపోవనాభిగమనము వట్టి ఆచార్యము, తాను శ్రోత్రియుడు కాబట్టి. ఢుండిరాజు చెప్పినకథలో నూర్గురు చనిపోవుట కలదు గాని వారు మంత్రి కుమారులుగారు. నందవంశీకుడైన సర్వార్థ సిద్ధికి నవకోటీశ్వరుడనియు, మహాధనికుడనియు ప్రసిద్ధియట. పెద్దభార్య, రాణి, సునంద, సుక్షత్రియ; రెండవది మురశూద్ర, సునందకు తొమ్మండుగురు (నవనందులు) కుమారులు, మురకు మౌర్యుడు కుమారుడును జనించిరట. తర్వాత మౌర్యునికి చంద్రగుప్తునితో చేరి నూర్గురు కుమారులును జనించినారట. తర్వాతి కథ శకటాలుని కథవలెనే సాగినది. అంధకూపమున పడుట, వారిలో చంద్రగుప్తుడు మాత్రమే మిగులుట, ఏదో కారణమున విడుదల పొంది చాణక్యుని ఆశ్రయించుట మొదలైన తర్వాతి కథ తెలిసినదే.

ఎక్కువగా వ్యాసమును పెంచుకొని పోవుట అనవసరము. ఇవన్నియు చూడగా ఒక యథార్థము తోచుచున్నది. చాణక్య, విష్ణుగుప్త, కౌటిల్యాది నామములచేత ప్రసిద్ధుడైనాడు గొప్ప పండితుడు, నీతిశాస్త్రవేత్త, బుధుడనియు సర్వజ్ఞుడనియు, అతి కోపియేగాక పగదీర్చుకొనుటలో మొనగాడనియు తెలియుచున్నది. పైగా నీతిశాస్త్ర గ్రంథకర్త.

(1) "ఇయ మిదానీ మాచార్య విష్ణు గుప్తేన మౌర్యార్థేషడ్భిః శ్లోక సహస్రైః సంక్షిప్తా" (దశకుమార)

"సుకృతం విష్ణుగుప్తస్య
మిత్రాప్తిర్భార్గవస్యచ
బృహస్పతే రవిశ్వాసో
నీతి సన్ధి స్త్రిధాస్థితః" (ఎక్కడిదో)

జయమంగళ కామ సూత్ర వ్యాఖ్యలో చాణక్యుడొక గూఢాక్షలిపి కారకుడట ——

"కౌటిలీయ మిదం కాదేః
స్వరయో ర్హ్రస్వ దీర్ఘయోః,
బిన్దూష్మణో ర్విపర్యాసాద్
దుర్బోధమితి సంజ్ఞితమ్. "

(2) చాణక్యుని చంద్రగుప్తుడో శకటాలుడో ఆశ్రయించి తెచ్చిరిగాని ఆతడు కులక్రమాగత మంత్రికాడు. నీతి ప్రయోగములేదు.

"చాణక్యనామ్నా తేనాథ శకటాల గృహే రహః
కృత్యాం విధాయ సహసాస పుత్రో నిహతోనృపః"
"యోగానందే యశఃశేషే పూర్వనంద సుతస్తతః
చంద్రగుప్తః కృతో రాజ్యే చాణక్యేన మహౌజసా"
"యస్యాభిచార వజ్రేణ వజ్రజ్వలన తేజసా
పపాతామూలతః శ్రీమాన్ సుపర్వా నంద పర్వతః"

(3) చాణక్యుడు చంద్రగుప్తుని తర్వాత కూడ బిందుసార అశోకచక్రవర్తులకు మంత్రిగా నుండి వారి దక్షిణాపథ విజయములకు తోడ్పడి యుండెను.

(4) రాక్షసుడను మంత్రియుండినట్లు ముద్రారాక్షస మొక్కటే చెప్పుచున్నది గాని ఆ కథ మరియెందును కానరాదు. విశాఖదత్తుడు చాల తర్వాతివాడు గాన కథలో తారుమారు లేర్పడి యుండవచ్చును. వానికి తోడు కవియు రాక్షసుడనగా మహాసమర్థుడను నర్థమును గ్రహించి యుండవచ్చును. కుటిలమతిగాన కౌటిల్యుడని యుండలేదా. పైగా అభిజ్ఞానశాకుంతలమున ముద్ర ఒక విధమున నుపయోగపడగా అదే ఇందు మరియొక విధముగా నుపయోగపడినట్లు కవి కల్పించి యుండవచ్చును

ఫలితార్థము చాణక్యుడు చంద్రగుప్తుడు రాజైన వెంటనె తనస్థానమును మఱియొకనికి అప్పగించి పోక తానే మంత్రిగా చిర కాలముండెను. ఆతడు పోవుటయు, ఆ నాటకకథ అంతయు నమ్మదగి యుండలేదు.

---

# శుభాకాంక్ష

## 'మనశ్రీ'

ఏనాడైనను మోముపై నగవు చిందింపంగ లేనట్టి దు
ర్దీనావస్థఁ గలట్టి వారల మనఃక్లేశమ్ముఁ బోగొట్టి, య
త్యానందమ్మును గల్గఁజేసి, జనులంతా ప్రస్తుతింపంగ, నీ
'యానందా'బ్దమొసంగుఁగాక శుభ సౌఖ్యంబుల్ కృపాచిత్తయై.

# బండారు తమ్మయ్య-వీరశైవ వాఙ్మయ సేవ

## శ్రీ సముద్రపు శ్రీమహావిష్ణువు

'విమర్శకాగ్రేసర', 'ఇతిహాస సామ్రాట్', 'ధర్మభూషణ', 'శివ శరణ' 'శైవసాహితీసార్వభౌమ' 'సోమసాహిత్యాచార్య' బిరుదాంకితులు, ఆంధ్ర, సంస్కృత, కన్నడ వాఙ్మయనిధులు, పరిశోధనా ప్రకాండులు, వీరశైవ సాహిత్య ప్రామాణికులు, శివశ్రీ బండారుతమ్మయ్యగారు 24—9—1891న తూర్పుగోదావరి జిల్లా, అమలాపురంతాలూకా, గంగలకుర్తి అగ్రహారంలో జన్మించిరి. తండ్రి లింగయ్యగారు. తల్లి పట్టెమ్మగారు.

తమ్మయ్యగారు అమలాపురం ఉన్నతపాఠశాలలో చదివి మెట్రిక్యులేషన్ పరీక్షయం దుత్తీర్ణులయిరి. సత్ప్రవర్తనమునకే గాక తెలుగు, చరిత్ర, భూగోళము మున్నగు విషయములలో ప్రత్యేక బహుమతులు పొందిరి.

1908 వ సంవత్సరం తమ్మయ్యగారు రెవిన్యూ డిపార్టుమెంటులో గుమాస్తాగా చేరిరి. 1923 వరకు సమర్థవంతంగా తమ విధులను నిర్వహించి పై అధికారుల మెప్పు గొందిరి. 1923 లో లేబర్‌ఇన్‌స్పెక్టరుగా నియమింపబడిరి. తరువాత రెవిన్యూ ఇన్‌స్పెక్టరుగా, అప్పర్‌డివిజన్ గుమాస్తాగా, రెవిన్యూడివిజనల్ ఆఫీసు హెడ్‌గుమాస్తాగా, తాలూకా హెడ్ అకౌంటెంటుగా, హుజూర్ హెడ్‌అకౌంటెంటుగా ప్రమోషన్లు పొందుచు 1946 వరకు పనిచేసిరి. పింఛను తీసికొనుటకు ఒక వారము ముందుగా కిర్లంపూడి ఎస్టేటు మానేజరుగా నియమింపబడిరి. 1951 వరకు ఆ బాధ్యతలు నిర్వహించి పదవీ విరమణ చేసిరి.

### భాషాభిమానము

మాతృభాషయగు తెలుగునందు, సంస్కృతమునందును సహజాభిమానంగల తమ్మయ్యగారు విరామములేని ప్రభుత్వోద్యోగములో నుండి కూడ స్వయంకృషితో మాతృభాషా జ్ఞానాన్ని అభివృద్ధిచేసుకొంటూ సంస్కృతభాష నభ్యసించిరి. పండితుల సలహాలతోను, సహాయముతోను సంస్కృత భాషాధ్యయనం చేసి, అందు మంచి పాండిత్యము గడించిరి.

తమ్మయ్యగారు వీరశైవ కులజులు. శివదీక్షాపరులు. ఇష్టలింగోపాసకులు. అయినను యితర మతముల యెడ వీరికి ఎక్కువ గౌరవము, సహనభావము కలదు. అందువలననే అన్ని మతముల వారు, శాఖలవారు, వీరిని గౌరవించిరి. వీరశైవుడనగా శ్రేష్ఠమగు శివభక్తుడని నిర్వచించి ఆమేరకు జీవితయాత్ర సాగించిరి. వీరశైవులకు గల నీతిప్రధానమగు సదాచారము, శివాచారము, లింగాచారము, భృత్యాచారము, గణాచారములను పంచాచారములను అనుసరించి జీవించిన సత్పురుషులు, తమ్మయ్యగారు. శైవప్రముఖులు, భాషాసేవకులు, సాహితీబాంధవులు శ్రీ టి. హెచ్. యమ్. సదాశివయ్యగారు తమ్మయ్యగారి మిత్రులు. వీరి సహాయంతో అనేకములగు సభలలో నుపన్యసించి, వీరశైవ మత వాఙ్మయ వ్యాప్తిని గావించిరి.

తమ్మయ్యగారు శ్రీ చిదిరె మఠము వీరభద్రశర్మగారి ప్రియశిష్యులు, ముఖ్యస్నేహితులు. 'విద్యారత్న', 'విద్యానిధి' బిరుదాంకితులు శ్రీ వీరభద్రశర్మగారు, పండితశిరోమణులు, కాశీ క్షేత్రంలో వేదతీర్థ స్మృతితీర్థ, కావ్యతీర్థ, ధర్మాచార్య సాహిత్యవిశారద పరీక్షలయం దుత్తీర్ణులయి వచ్చి సికింద్రాబాదులో వీరశైవ గురుకులమును, శివగ్రంథ మాలికను స్థాపించి, విభూతి అనుపేరుతో ఒక సారస్వత మాసపత్రికను నిర్వహించి శైవమత సేవయు, సారస్వతసేవయు గావించిరి. తరువాత శ్రీ శర్మగారు, వీరశైవ పంచాచార్య పీఠములలో నొకటియైన శ్రీ జగద్గురు కాశీ విశ్వారాధ్య జ్ఞానసింహాసనమునకు పట్టాభిషిక్తులయి కొలది కాలమునకు శివైక్య మొందిరి. వీరు తమ్మయ్యగారికి శైవవాఙ్మయ వ్యాప్తిలో ముఖ్య సహాయకులుగా నుండిరి.

సారస్వతసేవ ద్వారా మతసేవచేసిన మహనీయులు తమ్మయ్యగారు. వీరి మతసేవ, సారస్వతసేవ విస్తరణకే ప్రయోజనకారి అయినది గాని, తర్కములకు, వైవిధ్యములకు దారితీయలేదు. ఈ మతాభిమానమే అడుగునపడియున్న శైవసాహిత్యాన్ని వీరిచే వెలికి తీయించి ఆంధ్రప్రజల కందించగలిగింది. కన్నడభాషయందును పాండిత్యము సంపాదించి కర్ణాట సాహిత్యమునందుగల శైవసిద్ధాంతములను ఆంధ్రులకు అందింపచేసిన వీరు ఆంధ్ర వీరశైవులకు చిరస్మరణీయులు.

మొదట తమ్మయ్యగారి రచనా వ్యాసంగము వ్యాసముల రూపముననే జరిగెను. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రిక, త్రిలింగ, భారతి, సమదర్శని, కళ, పరిశోధన, వెడ్డవాణి, విభూతి, శ్రీశైలప్రభ, శ్రీశైలజ్యోతి, సారస్వత సర్వస్వము మున్నగు పత్రికలలో అసంఖ్యాకములగు వ్యాసములను అర్ధశతాబ్ది కాలమునకు పైగా పాఠకుల కందించిరి. ఈ వ్యాసములు ఎక్కువ వీరశైవ మతోద్ధారకులగు భక్తుల జీవితములకును శివకవుల రచనలకును సంబంధించిన సాహిత్యవిమర్శనా వ్యాసములు. ఇందు ముఖ్యమయినవి ఈ క్రింది విషయములపై నున్నవి.

1. కర్ణాట దేశమున జనించిన వీరశైవ మతోద్ధారకుడగు బసవేశ్వరుడు.

2. ఆంధ్రదేశమున శైవమతవ్యాప్తి నొనరించిన మల్లికార్జున పండితారాధ్యుడు.

3. నన్నెచోడుని కాలము — గురు స్మృతిత్వము.

4. పిడపర్తి కవులు.

5. ధూర్జటి యాధ్యాత్మికత.

6. నూరయగారి మల్లన — రాజశేఖర చరిత్రము.

7. శివకవి గౌరనమంత్రి — అతని కృతులు.

కాకినాడ శ్రీ నిర్మల శైవసాహితీ గ్రంథమాలిక వారు ఈ వ్యాసములను సంపుటములుగ ప్రకటించిరి.

### విమర్శన గ్రంథములు

వీరశైవ మతోద్ధారకుడగు బసవేశ్వరుని సమకాలికుడును, నన్నయ-తిక్కనల మధ్యకాలము వాడును, వీరశైవ—వాఙ్మయ-ప్రవర్తకు

ము, ద్విపద ఛందస్సులో జానుతెనుగున బసవపురాణము, పండితారాధ్య చరిత్ర మొదలగు మొదటి స్వతంత్రకావ్యములు రచించినవాడును అయిన పాల్కురికి సోమనాథుని గూర్చి తమ్మయ్యగారు విశేషపరిశోధనలు గావించి ఒక సమగ్ర విమర్శనాగ్రంథమును రచించిరి. ఈ గ్రంథము ద్వారా మరుగునపడియున్న ఒక మహాకవిని వెలుగులోనికి దెచ్చిరి. ఈ గ్రంథమును మదరాసు, ఉస్మానియా విశ్వవిద్యాలయముల వారు ఎం.ఏ. పరీక్షకును, ఆంధ్ర విశ్వవిద్యాలయము వారు బి.ఏ., భాషాప్రవీణ పరీక్షలకును పాఠ్యముగా నిర్ణయించిరి.

కవి సార్వభౌముడు, తెలుగు పంచకావ్యములలో నైదవదియైన శృంగార నైషధకర్త, ఆంధ్రవాఙ్మయ చరిత్రమున ఒక యుగకర్త, హరవిలాసము, భీమఖండము, కాశీఖండము, శివరాత్రిమాహాత్మ్యము కృతుల ద్వారా శివభక్తిని, వీరశైవమతమును వ్యాప్తిగావించిన ప్రవక్త. శ్రీనాథ మహాకవిని గూర్చి శ్రీ తమ్మయ్యగారు సమగ్ర విమర్శనా గ్రంథములను రచించిరి. అందు శ్రీనాథుని శీలము అను శీర్షికలో శ్రీనాథుడు ధనలోలుడు, స్త్రీలోలుడు అని వినవచ్చు అభిప్రాయములను సహేతుకముగా ఖండించిరి. శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు ఈ గ్రంథమునకు మున్నుడి వ్రాయుచు "శ్రీనాథుడు శృంగారియను యపప్రథను పూర్తిగ వాఙ్మయ ప్రపంచమున లేకుండజేసిరి" అని వ్రాసిరి.

స్వతంత్ర భావములతో, గ్రామ్య శైలిలో నీతిబోధకములగు పద్యములను ఆంధ్రుల కందించిన కవి యోగి వేమన. సుబోధకములు, హాస్యమిళితములగు నీకవి పద్యములు తెలుగువారు ఆబాలగోపాలము వల్లించుచునే యున్నారు. వేదాంతిగ, సంస్కర్తగ కవిగ పేరొందిన ఈ మహనీయుని చరిత్రను ఆయన కవితయందలి విశిష్టతను వివరముగా పొందుపరిచిరి. వార్ధక్యము వలన ఈ గ్రంథమును వీరి పెద్ద అల్లుడగు శ్రీనాగికట్టు కోటయ్యగారి సహాయముతో పూర్తిచేసిరి.

సవివరముగను, సహేతుకముగ నుండు తమ్మయ్యగారి విమర్శనా సరళి, పాఠకునికి సుబోధకముగా నుండి కావ్యరసాస్వాదనకు సహాయకారిగ నుండును.

## సంస్కృతానువాద గ్రంథములు

స్వయంకృషితో సంస్కృతభాష నభ్యసించి అందు పాండిత్యమును సంపాదించిన తమ్మయ్యగారు కాళిదాసు ప్రథమకావ్యమగు రఘువంశమును తెలుగులోని కనువదించిరి. ఇది వీరి ప్రథమగ్రంథరచన ప్రయత్నము.

తమ్మయ్యగారు గ్రాంథిక భాషావాది. ఆయన గద్యరచనా పాటవం ప్రత్యేకమైనది. పండితుల ప్రశంసలకు పాత్రమైనది. ఈ గ్రంథము సంస్కృత పదభూయిష్ఠమైనను రసవంతముగా శైలిలో నడచినది. ఆంధ్ర విశ్వవిద్యాలయమువారీ గ్రంథమును బి.ఏ., [illegible] భాషాప్రవీణ పరీక్షలకును, మదరాసు విశ్వవిద్యాలయమువారు బి.ఏ., విద్వాన్ పరీక్ష-

కును, అణ్ణామలై విశ్వవిద్యాలయమువారు ఇంటరు పరీక్షకును పాఠ్యముగా నిర్ణయించిరి. ఈ గ్రంథమును గూర్చి 1929వ సంవత్సరములో ఉమర్ ఆలీషా కవిగారు తమ అభిప్రాయము నిట్లు వ్రాసిరి.

"పరసోద్భాషిత కాళిదాస రఘువంశం బాంధ్ర గద్యన్ మనో హరలీలన్ రచియించి కన్నడనిడె విద్యార్థుల్, కవుల్,పండితుల్ పరమోత్సాహముతో సెబాసనగ మా బండారుతమ్మయ్య బం ధుర పాండిత్య నిదర్శనంబిది జగత్పూజ్యంబు గాకుండునే".

సంస్కృతపు పాలు కొంత తగ్గించి సుందరమైన శైలిలో ఈ గ్రంథము ననువదించిరి. ఉదాహరణకు రెండు వాక్యములు.

"అచ్చటి దారులందు గడ్డకట్టిన మంచు కాలివేళ్ళను మడమలను బాధించుచున్నను గిన్నెరాంగనలు ఏ లుద పిరుందులయి, బాలిండ్లయు బరువు దుర్భర మగుటచే వడిగా నడువనేరక తమ మందగతిని మార్పలేకుందురు'

"నిసర్గ వాత్సల్యరసోఖని సిక్తయు, సాంద్రప్రమోదా మృత ప్రపూర పరిపూర్ణయు నగు నామె యంకతల మునకు మారుడాలోహించి నంత నామె పయోధ రముల నుండి క్షీర ప్రసేక ముద్గమించెను."

ఈ కావ్యము ఉస్మానియా విశ్వవిద్యాలయములో పి.యు.సి. పరీక్షకు, ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు భాషా ప్రవీణపరీక్షకు పాఠ్యముగా నిర్ణయించిరి.

## ఇతర గ్రంథములు

మడివాలు మాచయ్య చరిత్రము : మహిమాన్వితుడగు వీరశైవ భక్తుని చరిత్ర.

వృషాధిప శతకం : పాల్కురికి సోమనాథుని వృషాధిప శతకమును సవ్యాఖ్యానముగ వారి పెద్దలు నూతికట్టు కోటయ్యగారితో కలసి ప్రక టించిరి.

కర్ణాట సాహిత్యమున వీరశైవమతమునకు ప్రత్యేక స్థానము కలదు. కన్నడకవుల ప్రభావ మాంధ్ర సాహిత్యము నందును, ఆంధ్రకవుల ప్రభావము కన్నడ సాహిత్య మందును కన్పించుచున్నది. వీరశైవవాఙ్మయ మును సంపూర్ణముగా నెరుగుటకు యీ యుభయభాషల పరిచయము అవసరము. తమ్మయ్యగారు కన్నడభాషయందును పండితులు.

శక్తి విశిష్టాద్వైతము : ఇందు కన్నడసాహిత్యములోని వీరశైవ మతసిద్ధాంతము విపులీకరింపబడినది.

ఆంధ్ర వీరశైవ వివాహవిధి: వీరశైవ వివాహవిధులను గూర్చి యిందు విపులీకరింపబడినది.

ఈ రెండు గ్రంథములును కాశీ జంగమవాడీ మఠమువారు ప్రకటించిరి.

పాల్కురికిసోమనాథుని చతుర్వేదసారము, పాల్కురికి సోమనాథుని లఘుకృతులు, పిడుపర్తి సోమనాథుని ప్రభులింగలీల వీరిచే పరిష్కరింప బడిన గ్రంథములు.

నావిళ్ళవారిచే ప్రకటింపబడిన బసవపురాణమునకు వీరు వ్రాసిన పీఠిక అమూల్యమైనది. తమ్మయ్యగారు 1957 నుండి 1960 వరకు ఆంధ్రరాష్ట్ర వీరశైవ సంఘము పక్షమున ప్రచురింపబడిన 'స్వధర్మ' అను మాసపత్రికకు సంపాదకులుగా నుండిరి.

తమ్మయ్యగారి రచనావ్యాసంగమంతయు గద్యరూపములోనే జరిగి నది. అయినను పద్యకవిత్వంలో కూడ కొన్ని రచనలు గావించిరి.

ఆంధ్రమలయ రాజస్వమము, భరతధాత్రి, కళ్యాణపురీప్రశంస బసవేశ్వరుడు, రెడ్డిపౌరుషము, చాటూక్తిముక్తావళి, శీర్షికలలో పద్య ములు 'వ్యాసావళి' ప్రథమభాగములో చేర్చి ప్రకటింపబడినది.

తమ్మయ్యగారు 1911 సంవత్సరములో మద్రాసులో ఆంధ్ర సాహిత్యపరిషత్తు నెలకొల్పబడినప్పటినుండి పరిషత్తు సభ్యులుగా నుండిరి. కవి సార్వభౌమ శ్రీ పాదకృష్ణమూర్తిశాస్త్రిగారు 1965 లో నిర్యాణ మైన తరువాత శ్రీ తమ్మయ్యగారు పరిషదధ్యక్షులుగా నెన్నుకొనబడిరి. ఆ మరణాంతము ఆ పదవిలో కొనసాగిరి. 3—5—1956 న కాకినాడలో షష్టిపూర్తి సన్మానసభ ఆంధ్రసాహిత్యపరిషత్తు వారు జరిపించిరి. ఈ సందర్భములో షష్టిపూర్తి సన్మానసంచిక వెలువడెను.

1960 సం.లో కాకినాడ దివ్యజ్ఞాన సమాజ భవనములో సప్తతి సన్మానసభ జరుపబడెను.

కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా, పామర్రులో నెలకొల్పబడిన భారత సమితివారు 1961 నుండి తమ్మయ్యగారి జన్మదినోత్సవములను ప్రతి సంవత్సరము జరిపిరి.

24—8—68 తేదీన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు, అకాడమీ విశిష్ట సభ్యత్వము, సువర్ణపతకము యిచ్చి సన్మానించిరి. ఈ సందర్భములో చదివిన ప్రశంసాపత్రములో "శ్రీ తమ్మయ్యగా రాంధ్ర, కన్నడ, సంస్కృతములం దద్వితీయ విద్వత్తును సంపాదించిన విపశ్చిద్వ రేణ్యులు. వారి విమర్శన మెంత నిశితమైనదో యంత వైదుషీ విలసిత మైనది. వారిశైలి వోజః ప్రసాదగుణముల కన్యోన్యవైరుద్ధ్యము నాపి మేకాశ్రయత్వము కల్పించి నట్టిది" అని ప్రశంసించిరి.

అర్ధశతాబ్దికి పైగా ఆంధ్రభాషామతల్లికి ముఖ్యముగా వీరశైవ వాఙ్మయమునకు రచయితగా, కవిగా, విమర్శకునిగా అమూల్యమైన సేవలు చేసి 15—12—70 న లింగైక్యము నొందిరి.

కాకినాడ శైవసాహితీసమితివారు వీరి స్వీయచరిత్రను ప్రక టించిరి.

బండారుతమ్మయ్యగారు ఆంధ్ర వాఙ్మయపథంలో సదా వెలు గొందు దివ్య జ్యోతి.

---

# పాతికేళ్ల పురావస్తు పరిశోధన - తెలంగాణా

శ్రీ తేరాల సత్యనారాయణ శర్మ

తెలుగుదేశము గురించియు, తెలుగురాజుల గురించియు, తెలుగు వాఙ్మయము గురించియు పరిశోధన గావించు వారికి హైదరాబాదు రాజ్యములోని తెలంగాణ యొక బంగారుగని వంటిదని, మొట్టమొదటి సారిగా వ్రాసి యులను మేల్కొల్ప దానికి తానే శ్రీకారముజుట్టి నాందీ వాక్యముబల్కినవారు కీ. శే. కొమఱ్ఱాజులక్ష్మణరావు పంతులు గారు. అది ఈ శతాబ్దములోని తొలి పావు భాగమునాటి మాట. ఆనాటికి తెలంగాణ మంతయు విరిగిన గుడి—గోపురాలతో, పూడిన శిథిల—ప్రాకారాలతో మూగవోయిన భాషా వేషాలతో తన ప్రాభవమునంతయు కోలుపోయి నిజాం ఛత్రచ్ఛాయల క్రింద నిలచివున్నది. పరిశోధనలకే కాదు— ఒకరి నొకరు సరిగా పలకరించుకొనుటకే వీలులేని దా కాలము. అట్టి సమయములో నడుము కట్టుకొని పంతులుగారు పరిశోధనకు పూనుకొనుటయే గాక అప్పటికి బలమునందుకొనుచున్న గ్రంథాలయోద్యమమునకు సహితము చేయూత నిచ్చిరి. వీరి కన్నిటను అప్పటి మునగాల రాజా శ్రీ నాయని వేంకటరంగారావు, పింగళి వేంకట్రామారెడ్డి గారల వంటి ఉదారులును, శేషాద్రిరమణకవుల వంటి పండితులును తోడ్పడి ముందుకు పోవుటకు అవకాశము గలిగించిరి.

ఇట్లు పంతులుగారి కృషి కార్యరూపము ధరించి ఫలింప నుండగా వారు అకాల మరణమునకు గురియై తీరని నష్టము సంభవించినది. కాని తక్కినవారు దీని నట్లేయాపక వారి నాదర్శముగా గైకొని వారి స్మృత్యర్థముగా హైదరాబాదునందు 'లక్ష్మణరాయ పరిశోధకమండలి' స్థాపింపబడి కొన్ని విలువగల శాసనములను ప్రచురించిరి. వీటిలో పంతులుగారు స్వయముగా పరిష్కరించిన వోరుగంటి చిత్తాపుఖాను (సీతాపతి) శాసన మొకటి ప్రముఖమైనది.

## నలుగురు పండితులు

చరిత్రాన్వేషణమే జీవిత ధ్యేయముగా పెట్టుకొని అహ రహము పరిశ్రమించి గణుతికెక్కిన చారిత్రక పండితులలో అగ్రేసరులయినవారు లక్ష్మణరావు పంతులుగారును, నిలుకూరి వీరభద్రరావుగారును, మారేమండ రామారావుగారును, శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారును ప్రధానులు. ఇందులో మొదటి ముగ్గురు కీర్తిశేషులు. తుదివారైన శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారు నేటి కెనుబదేండ్లు దాటిన వృద్ధాప్యములో నుండి సహితము నిరంతరమైన అన్వేషణ సాగించుట మన అదృష్టము ఈ నలుగురును నిర్దాణమైన తెలంగాణ ప్రాంతములోని చరిత్ర విశేషముల నెన్నింటినో వెలికితీసి చాటిన ఖ్యాతి గడించినవారే అగుట మరియొక విశేషము.

## స్వాతంత్ర్యమునకుముందు ఉత్సాహము

లక్ష్మణరాయ పరిశోధకమండలి కృషి ఇట్లు కొనసాగుచుండగనే రాజమహేంద్రవరములోని 'ఆంధ్రేతిహాసిక పరిశోధకమండలి' వారు వోరుగంటి పట్టణములో కాకతీయ వర్ధంత్యుత్సవము జరిపి ఒక సంచికను ప్రచురింప దలచిరి. అప్పటి పరిస్థితులలో నిజాం ప్రభువు నుండి దీని కనుమతి లభించుట మిక్కిలి కష్టమైనను పట్టుదలతో దానిని సాధించి 1931 మార్చి నెలలో దిగ్విజయముగా దానిని జరిపి సంచికను ప్రచురించిరి. అయితే అంతకుముందుగనే కాకతీయ చరిత్రముపై విశేషమైన పరిశ్రమనుజేసి, ఆ విషయమున పట్టాము పుచ్చుకున్న మారేమండ రామారావుగారు దీనికంతయు కార్యభారము వహించి కాకతీయసంచికను సహితము తమ సంపాదకత్వమున వెలువరించిరి.

ఇదంతయు తెలుగు వారిపైన పెక్కు నిర్బంధములు కొనసాగు చున్న కాలములో, చారిత్రక విషయములపైన భక్తిశ్రద్ధలు అంతగాలేని కాలములో ప్రజల నుత్తేజపరిచినదన్న ప్రజలలో అణగారియున్న సంస్కృతి అభిలాష, స్వాతంత్ర్యేచ్ఛ అనుట కెట్టి సందేహము కలుగదు. ఆనాడు వెల్లిబికిన ఇట్టి ఉత్సాహమే పలు ప్రాంతములకు ప్రాకి వాఙ్మయము వంటి తక్కిన రంగములలో కొంత కృషి జరుగుటకు అవకాశ మిచ్చినది. కీ.శే. సురవరము ప్రతాపరెడ్డిగారి సంపాదకత్వములో వెలువడిన 'గోలుకొండ కవుల సంచిక' వారే స్వయముగా రచించిన 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర' మొదలైన వాటి కన్నిటికి పై సభలు కొంత దీప్తి గలిగించినవని చెప్పవచ్చును. అయితే పరాధీన వ్యవస్థలో క్రుమ్ముతున్న జాతి ఉత్తేజమగుటలో స్వాతంత్ర్యపు ముందు కాలమునాడు కానవచ్చిన ఉత్సాహము వేరు, స్వాతంత్ర్యము తరువాత పాతికేండ్లలో నేటికి గానవచ్చు చున్న ఉత్సాహము, జరుగుతున్న కృషి చాలా వేరు. మిక్కిలి అంతర మున్నది. దీనికి కారణము ప్రజలు—ప్రజాప్రభుత్వము. ప్రజాప్రభుత్వ కాలములో రాజకీయములందు బాల్గొన్నంత చురుకుగా ప్రజలుగాని, వారి నాయకులుగాని లేదా ప్రభుత్వముగాని పురావస్తు పరిశోధనల వంటి విశేషములపై తగిన శ్రద్ధ జూపలే రనుటకు ఈ పాతికేండ్ల కాల చరిత్ర కన్న వేరే చూపవలసిన పని వుండదు. మన ఆంధ్రప్రదేశ్ విషయములో ముఖ్యముగా తెలంగాణా ప్రాంత విషయము వచ్చునరికి ఇది మరీ విచారింపవలసి వచ్చుచున్నది.

## పాతికేండలో జరిగిన దేమిటి?

పంతులుగారి మాటలలో చెప్పవలెనన్న చరిత్రను దెలుసుకొనుటకు తెలంగాణములోని బంగారపు గనుల నెన్నింటినో త్రవ్వవలసి యున్నది. కాని వాస్తవములో జరిగిన దేమిటి? సాగరు నిర్మాణమువల్ల తప్పనిసరి యగుటచే అక్కడ త్రవ్వకాలు కొన్ని సాగించి ఆ పరిసరాలలోని పురావస్తు విశేషాలను మాత్రము కొంత వెలికిదీయుట జరిగినది. కాని రాష్ట్రపు నలుమూలలా విస్తరించి ఇప్పటికే అధికభాగము చేతికందకపోవుచున్న అసంఖ్యాకమైన శాసనములు సేకరించుటకు ప్రభుత్వము పూనుకొనలేకపోవుచున్నది. గుడులయందును, చెరువు లందును, మైదానము లందును తండోపతండములుగా లభించు చారిత్రకాధారములు, శిల్పకళ నుట్టిపడు దేవాలయశిల్పము, చారిత్రకమైన కట్టడములు, వివిధ నాణెము లెన్నో అనుదినము శిథిలమగుటయో, అంతరించిపోవుటయో జరుగుచునే వున్నది. అసలు ప్రభుత్వమువైపునుండి తెలుగుదేశములో వర్ధిల్లిన వివిధ రాజవంశముల గురించిగాని, ప్రాచీన మధ్యయుగ, తరువాత కాలములలోని చరిత్ర నిర్మాణములకై సంకల్పమైనను కానవచ్చుట లేదుగదా. ఈనాటికి తెలుగు దేశములోని కొన్ని ముఖ్యరాజవంశముల చరిత్ర లేదా సాంఘిక చరిత్రకు చెందిన పెక్కు విషయములు విస్మృత ప్రాయములై ప్రజల కందబాటులోనికి రాకనే యున్నవి.

భాషా వాఙ్మయ విషయములందు పరిశోధనా స్థితి గూడా ఇట్లే యున్నది. అడపా దడపా కొన్ని ప్రకటనలు గానవచ్చుట దప్ప తెలంగాణా

కును, అణ్ణామలై విశ్వవిద్యాలయమువారు ఇంటరు పరీక్షకును పాఠ్యముగా నిర్ణయించిరి. ఈ గ్రంథమును గూర్చి 1929వ సంవత్సరములో ఉమర్ ఆలీషా కవిగారు తమ అభిప్రాయము నిట్లు వ్రాసిరి

"పరసోద్భాషిత కాళిదాస రఘువంశం బాంధ్ర గద్యన్ మనో
హారలీలన్ రచియించి కాన్కనిడె విద్యార్థుల్, కవుల్,పండితుల్
పరమోత్సాహముతో పఠింపనగ మా బండారుతమ్మయ్య బం
ధుర పాండిత్య నిదర్శనంబిది జగత్పూజ్యంబు గాకుండునే".

సంస్కృతపు పాలు కొంత తగ్గించి సుందరమైన శైలిలో ఈ గ్రంథము ననువదించిరి. ఉదాహరణకు రెండు వాక్యములు.

"అచ్చటి దారులందు గడ్డకట్టిన మంచు కాళ్ళ వేళ్ళను
మడమలను బాధించుచున్నను గిన్నెరాంగనలు
ఏ లుద పిరుందులయు, బాలిండ్లయు బరువు దుర్భర
మగుటచే వడిగా నడువనేరక తమ మందగతిని మార్చలేకుందురు"

"నిసర్గ వాత్సల్యరసౌఖని షిక్తయు, సాంద్రప్రమోదా
మృత ప్రపూర పరిపూర్ణయు నగు నామె యంకతల
మునకు కుమారుడాలోహించి నంత నామె పయోధ
రముల నుండి క్షీర ప్రసేక ముద్గమించెను."

ఈ కావ్యము ఉస్మానియా విశ్వవిద్యాలయములో పి.యు.సి. పరీక్షకు, ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు భాషా ప్రవీణపరీక్షకు పాఠ్యముగా నిర్ణయించిరి.

## ఇతర గ్రంథములు

మడివాలు మాచయ్య చరిత్రము : మహిమాన్వితుడగు వీరశైవ భక్తుని చరిత్ర.

వృషాధిప శతకం : పాల్కురికి సోమనాథుని వృషాధిప శతకమును సవ్యాఖ్యానముగ వారి పెద్దలుడు నూతికట్టు కోటయ్యగారితో కలసి ప్రకటించిరి.

కర్ణాట సాహిత్యమున వీరశైవమతమునకు ప్రత్యేక స్థానము కలదు. కన్నడకవుల ప్రభావ మాంధ్ర సాహిత్యము నందును, ఆంధ్రకవుల ప్రభావము కన్నడ సాహిత్య మందును కన్పించుచున్నది. వీరశైవవాఙ్మయము సంపూర్ణముగా నెరుగుటకు యీ యుభయభాషల పరిచయము అవసరము. తమ్మయ్యగారు కన్నడభాష యందును పండితులు.

శక్తి విశిష్టాద్వైతము : ఇందు కన్నడసాహిత్యములోని వీరశైవ మతసిద్ధాంతము విపులీకరింపబడినది.

ఆంధ్ర వీరశైవ వివాహవిధి: వీరశైవ వివాహవిధులను గూర్చి యిందు విపులీకరింపబడినది.

ఈ రెండు గ్రంథములును కాశీ జంగమవాడి మఠమువారు ప్రకటించిరి.

పాల్కురికిసోమనాథుని చతుర్వేదసారము, పాల్కురికి సోమనాథుని లఘుకృతులు, పిడుపర్తి సోమనాథుని ప్రభులింగలీల వీరిచే పరిష్కరింప బడిన గ్రంథములు.

వావిళ్ళవారిచే ప్రకటింపబడిన బసవపురాణమునకు వీరు వ్రాసిన పీఠిక అమూల్యమైనది. తమ్మయ్యగారు 1957 నుండి 1960 వరకు ఆంధ్రరాష్ట్ర వీరశైవ సంఘము పక్షమున ప్రచురింపబడిన 'స్వధర్మ' అను మాసపత్రికకు సంపాదకులుగా నుండిరి.

తమ్మయ్యగారి రచనావ్యాసంగమంతయు గద్యరూపములోనే జరిగి నది. అయినను పద్యకవిత్వంలో కూడ కొన్ని రచనలు గావించిరి.

ఆంధ్రమలయ రాజస్తవము, భరతధాత్రి, కళ్యాణపురీప్రశంస, బసవేశ్వరుడు, రెడ్డిపౌరుషము, చాటూక్తిముక్తావళి, శీర్షికలలో పద్యములు 'వ్యాసావళి' ప్రథమభాగములో చేర్చి ప్రకటింపబడినది.

తమ్మయ్యగారు 1911 సంవత్సరములో మద్రాసులో ఆంధ్ర సాహిత్యపరిషత్తు నెలకొల్పబడినప్పటినుండి పరిషత్తు సభ్యులుగా నుండిరి. కవి సార్వభౌమ శ్రీ పాదకృష్ణమూర్తిశాస్త్రిగారు 1965 లో నిర్యాణమైన తరువాత శ్రీ తమ్మయ్యగారు పరిష దధ్యక్షులుగా నెన్నుకొనబడిరి. ఆ మరణాంతము ఆ పదవిలో కొనసాగిరి. 3—5—1956 న కాకినాడలో షష్టిపూర్తి సన్మానసభ ఆంధ్రసాహిత్యపరిషత్తు వారు జరిపించిరి. ఈ సందర్భములో షష్టిపూర్తి సన్మానసంచిక వెలువడెను.

1960 సం.లో కాకినాడ దివ్యజ్ఞాన సమాజ భవనములో సప్తతి సన్మానసభ జరుపబడెను.

కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా, పామర్రులో నెలకొల్పబడిన భారత సమితివారు 1961 నుండి తమ్మయ్యగారి జన్మదినోత్సవములను ప్రతి సంవత్సరము జరిపిరి.

24—8—68 తేదీన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు, అకాడమీ విశిష్టసభ్యత్వము, సువర్ణపతకము యిచ్చి సన్మానించిరి. ఈ సందర్భములో చదివిన ప్రశంసాపత్రములో "శ్రీ తమ్మయ్యగా రాంధ్ర, కన్నడ, సంస్కృతములం దద్వితీయ విద్వత్తును సంపాదించిన సవ్యసాచి రేణ్యులు. వారి విమర్శన మెంత నిశితమైనదో యంత వైదుషీ విలసిత మైనది. వారిశైలి వోజః ప్రసాదగుణముల కన్యోన్యవైరుధ్యము వాపి మైత్రీశయత్వము కల్పించి నట్టిది" అని ప్రశంసించిరి.

అర్థశతాబ్దికి పైగా ఆంధ్రభాషామతల్లికి ముఖ్యముగా వీరశైవ వాఙ్మయమునకు రచయితగా, కవిగా, విమర్శకునిగా అమూల్యమైన సేవలు చేసి 15—12—70 న లింగైక్యము నొందిరి.

కాకినాడ శైవసాహితీసమితివారు వీరి స్వీయచరిత్రను ప్రకటించిరి.

బండారుతమ్మయ్యగారు ఆంధ్ర వాఙ్మయపథంలో సదా వెలుగొందు దివ్య జ్యోతి.

# పాతికేళ్ల పురావస్తు పరిశోధన - తెలంగాణా

## శ్రీ తేరాల సత్యనారాయణ శర్మ

తెలుగుదేశము గురించియు, తెలుగురాజుల గురించియు, తెలుగు వాఙ్మయము గురించియు పరిశోధన గావించు వారికి హైదరాబాదు రాజ్యములోని తెలంగాణ యొక బంగారుగని వంటిదని, మొట్టమొదటి సారిగా రాష్ట్రీయులను మేల్కొల్పి దానికి తానే శ్రీకారముజుట్టి నాందీ వాక్యముపల్కినవారు కీ. శే. కొమఱ్ఱాజులక్ష్మణరావు పంతులు గారు. అది ఈ శతాబ్దములోని తొలి పావు భాగమునాటి మాట. ఆనాటికి తెలంగాణమంతయు విరిగిన గుడి—గోపురాలతో, పూడిన శిథిల—ప్రాకారాలతో మూగవోయిన భాషా వేషాలతో తన ప్రాభవమునంతయు కోలుపోయి నిజాం ఛత్రచ్ఛాయల క్రింద నిలచివున్నది. పరిశోధనలకే కాదు— ఒకరి నొకరు సరిగా పలకరించుకొనుటకే వీలులేని దా కాలము. అట్టి సమయములో నడుము కట్టుకొని పంతులుగారు పరిశోధనకు పూనుకొనుటయే గాక అప్పటికి బలమునందుకొనుచున్న గ్రంథాలయోద్యమమునకు సహితము చేయూత నిచ్చిరి. వీరి కన్నిటను అప్పటి మునగాల రాజా శ్రీ నాయని వేంకటరంగారావు, పింగళి వేంకట్రామారెడ్డి గారల వంటి ఉదారులును, శేషాద్రిరమణకవుల వంటి పండితులును తోడ్పడి ముందుకు పోవుటకు అవకాశము గలిగించిరి.

ఇట్లు పంతులుగారి కృషి కార్యరూపము ధరించి ఫలింప నుండగా వారు అకాల మరణమునకు గురియై తీరని నష్టము సంభవించినది. కాని తక్కినవారు దీని నట్లే యాపక వారి నాదర్శముగా గైకొని వారి స్మృత్యర్థముగా హైదరాబాదునందు 'లక్ష్మణరాయ పరిశోధకమండలి' స్థాపింపబడి కొన్ని విలువగల శాసనములను ప్రచురించిరి. వీటిలో పంతులుగారు స్వయముగా పరిష్కరించిన వోరుగంటి చిత్తాపుఖాను (సీతాపతి) శాసన మొకటి ప్రముఖమైనది.

### నలుగురు పండితులు

చరిత్రాన్వేషణమే జీవిత ధ్యేయముగా పెట్టుకొని అహరహము పరిశ్రమించి గణుతికెక్కిన చారిత్రక పండితులలో అగ్రేసరులయినవారు లక్ష్మణరావు పంతులుగారును, చిలుకూరి వీరభద్రరావుగారును, మారేమండ రామారావుగారును, శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారును ప్రధానులు. ఇందులో మొదటి ముగ్గురు కీర్తిశేషులు. తుదివారైన శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారు నేటి కెనుబదేండ్లు దాటిన వృద్ధాప్యములో నుండి సహితము నిరంతరమైన అన్వేషణ సాగించుట మన అదృష్టము. ఈ నలుగురును నిద్రాణమైన తెలంగాణ ప్రాంతములోని చరిత్ర విశేషములనెన్నింటినో వెలికితీసి చాటిన ఖ్యాతి గడించినవారే అగుట మరియొక విశేషము.

### స్వాతంత్ర్యమునకుముందు ఉత్సాహము

లక్ష్మణరాయ పరిశోధకమండలి కృషి ఇట్లు కొనసాగుచుండగనే రాజమహేంద్రవరములోని 'ఆంధ్రేతిహాసిక పరిశోధకమండలి' వారు వోరుగంటి పట్టణములో కాకతీయ వర్ధంత్యుత్సవము జరిపి ఒక సంచికను ప్రచురింప దలచిరి. అప్పటి పరిస్థితులలో నిజాం ప్రభువు నుండి దీని కనుమతి లభించుట మిక్కిలి కష్టమైనను పట్టుదలతో దానిని సాధించి 1931 మార్చి నెలలో దిగ్విజయముగా దానిని జరిపి సంచికను ప్రచురించిరి. అయితే అంతకుముందుగనే కాకతీయ చరిత్రముపై విశేషమైన పరిశ్రమనుజేసి, ఆ విషయమున పట్టామ పుచ్చుకున్న మారేమండ రామారావుగారు దీనికంతయు కార్యభారము వహించి కాకతీయసంచికను సహితము తమ సంపాదకత్వమున వెలువరించిరి.

ఇదంతయు తెలుగు వారిపైన పెక్కు నిర్బంధములు కొనసాగుచున్న కాలములో, చారిత్రక విషయములపైన భక్తిశ్రద్ధలు అంతగాలేని కాలములో ప్రజల నుత్తేజపరిచినదన్న ప్రజలలో అణగారియున్న సంస్కృతి అభిలాష, స్వాతంత్ర్యేచ్ఛ అనుట కెట్టి సందేహము కలుగదు. ఆనాడు పెల్లుబికిన ఇట్టి ఉత్సాహమే పలు ప్రాంతములకు ప్రాకి వాఙ్మయము వంటి తక్కిన రంగములలో కొంత కృషి జరుగుటకు అవకాశమ నిచ్చినది. కీ.శే. సురవరము ప్రతాపరెడ్డిగారి సంపాదకత్వములో వెలువడిన 'గోలకొండ కవుల సంచిక' వారే స్వయముగా రచించిన 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర' మొదలైన వాటి కన్నిటికి పై సభలు కొంత దీప్తి గలిగించినవని చెప్పవచ్చును. అయితే పరాధీన వ్యవస్థలో మ్రగ్గుతున్న జాతి ఉత్తేజమగుటలో స్వాతంత్ర్యపు ముందు కాలమునాడు కానవచ్చిన ఉత్సాహము వేరు, స్వాతంత్ర్యము తరువాత పాతికేండ్లలో నేటికి గానవచ్చుచున్న ఉత్సాహము, జరుగుతున్న కృషి చాలా వేరు. మిక్కిలి అంతరమున్నది. దీనికి కారణము ప్రజలు—ప్రజాప్రభుత్వము. ప్రజాప్రభుత్వ కాలములో రాజకీయములందు బాల్గొన్నంత చురుకుగా ప్రజలుగాని, వారి నాయకులుగాని లేదా ప్రభుత్వముగాని పురావస్తు పరిశోధనల వంటి విశేషములపై తగిన శ్రద్ధ జూపలేరనుటకు ఈ పాతికేండ్ల కాల చరిత్ర కన్న వేరే చూపవలసిన పని వుండదు. మన ఆంధ్రప్రదేశ్ విషయములో ముఖ్యముగా తెలంగాణా ప్రాంత విషయము వచ్చుసరికి ఇది మరీ విచారింపవలసి వచ్చుచున్నది.

### పాతికేండలో జరిగిన దేమిటి?

పంతులుగారి మాటలలో చెప్పవలెనన్న చరిత్రను దెలుసుకొనుటకు తెలంగాణములోని బంగారపు గనుల నెన్నింటినో త్రవ్వవలసి యున్నది. కాని వాస్తవములో జరిగిన దేమిటి? సాగరు నిర్మాణమువల్ల తప్పనిసరి అగుటచే అక్కడ త్రవ్వకాలు కొన్ని సాగించి ఆ పరిసరాలలోని పురావస్తు విశేషాలను మాత్రము కొంత వెలికిదీయుట జరిగినది. కాని రాష్ట్రపు నలుమూలలా విస్తరించి ఇప్పటికే అధికభాగము చేతికందకపోవుచున్న అసంఖ్యాకమైన శాసనములు సేకరించుటకు ప్రభుత్వము పూనుకొనలేకపోవుచున్నది. గుడులయందును, చెరువు లందును, మైదానము లందున తండోపతండములుగా లభించు చారిత్రకాధారములు, శిల్పకళ నుట్టిపడు దేవాలయశిల్పము, చారిత్రకమైన కట్టడములు, వివిధ నాణెము లెన్నో అనుదినము శిథిలమగుటయో, అంతరించిపోవుటయో జరుగుచునే వున్నది. అసలు ప్రభుత్వమువైపునుండి తెలుగుదేశములో వర్ధిల్లిన వివిధ రాజవంశముల గురించిగాని, ప్రాచీన మధ్యయుగ, తరువాత కాలములలోని చరిత్ర నిర్మాణములకై సంకల్పమైనను కానవచ్చుట లేదుగదా. ఈనాటికి తెలుగుదేశములోని కొన్ని ముఖ్యరాజవంశముల చరిత్ర లేదా సాంఘిక చరిత్రకు చెందిన పెక్కు విషయములు విస్మృత ప్రాయములై ప్రజల కందుబాటులోనికి రాకనే యున్నవి.

భాషా వాఙ్మయ విషయములందు పరిశోధనా స్థితి గూడా ఇట్లే యున్నది. అడపా దడపా కొన్ని ప్రకటనలు గానవచ్చుట దప్ప తెలంగాణా

ప్రాంతములోని తాళపత్ర గ్రంథసేకరణ, ప్రాచీన పత్రములు మొ|| లైన వాటిని గ్రామముల నుండి సేకరించుట జరుగనే లేదు. కేవలము ప్రభుత్వ ప్రకటనలు జూచి అట్టి వస్తువు లున్నవారు, రాజధానికో లేక మరియొక స్థలమునకో తమకు తాము వెళ్ళి సమర్పింతురని భావించుట కష్టము. గ్రామ గ్రామమును విద్యాశాఖలోని బలగముద్వారా ప్రభుత్వమే ఈ పనికి పూనుకోవలసి యున్నది.

## క్రమబద్ధము లేక జరిగే పని

పురావస్తు పరిశోధనా విషయములో ప్రభుత్వము ఏమీ చేయటము లేదని చెప్పటం కాదు. కాని చేసినంతవరకైనను అది ఉపయోగం లేక ప్రజల కందుబాటులోకి రాక నష్టం జరుగుతున్నదనేదే గమనించవలసిన ప్రధాన అంశం. శాఖాపరంగా ప్రభుత్వం తన మనుష్యులను బంపి కొంతవరకు శాసనప్రతులను తదితర చారిత్రక సామగ్రిని సాధ్యమైనంతవరకు తెప్పిస్తున్నది. కాని అంతవరకైనను సేకరించినవి దశాబ్దాలైనను ప్రచురణ మగుట లేదు. ఇది కేవలం ధనాభావమా — అన్నట్టూ కనిపించదు.

మ్యూజియం గాలరీ వుంది. తెలంగాణా మొత్తంలో రాజధానిలోను, నిన్న మొన్న సిద్ధమైన నాగార్జునకొండపైని వస్తుప్రదర్శనశాల తప్ప కనీసం జిల్లా కొక్కటి చొప్పున యైనా ప్రదర్శనశాలలు కల్పించలేదు. కాబట్టి ప్రజలకు వాటిని దర్శించే అవకాశంగాని లేక చదువుకునే వీలుగాని లేదు. అభిరుచి, ఆపేక్షల వంటివి ప్రజలకు కలిగే అవకాశం తప్పక ప్రభుత్వమే కలిగించాలి గదా.

## హానికరమైన భాషా సంకరం

రాష్ట్ర పురావస్తుశాఖవారు ప్రచురిస్తున్న శాసనగ్రంథాలు చూస్తే ఒక ఘోరం కన్పిస్తుంది. మన ప్రాంతంలో శాసనాలన్నీ అది సంస్కృతం గాని, తెలుగు గాని, కన్నడం గాని ఒకటి రెండు తప్ప అత్యధిక భాగం తెలుగులిపిలో వున్నవి. దానినిబట్టి తెలుగు ఎంత ప్రాచీనమైనదో తెలియుటేగాక అప్పటి పరిపాలకులు వ్రాయుటకు కాగితం లేకపోయినా సరే, కఠినశిలల పైనైనా సరే తెలుగులో శాసనాలు చెక్కించి, తెలుగు భాషను ప్రజల కతిసన్నిహితంగా వుండేటట్లు గావించారు. మాటల్లో తప్పితే చేతల్లో చూపలేని మనవారి సిద్ధాంతాలు ఈ ప్రచురణలలో కానవస్తుంటాయి. కేంద్రప్రభుత్వమటువంటిది శాసనం ఏ భాషలో, ఏలిపిలో వుంటే ఆ విధంగా ప్రకటించగా మనవారుమాత్రం దానిని వికృతంచేసి, లిపి పూర్తిగా మార్చి తెలుగును 'రోమను లిపిలో' అచ్చువేస్తున్నారు. అంటే ఇక నుంచి ఇంగ్లీషులో నుండి తెలుగు చదువాలి గాని, తెలుగును— తెలుగుగా చదువుట వీలుపడదన్నమాట. ఇది ఎంత అనర్థకరమో వేరే చెప్ప పనిలేదు.

ఈ విధానం ఎవరికి లాభమో, ఏ ప్రయోజనమో లిఖిత పూర్వకంగా కొన్ని సంవత్సరాలక్రిందటే ప్రభుత్వాన్ని అడగటం జరిగినది. సందిగ్ధంలోపడి వారు దీనికి సమాధానం ఇవ్వలేదు గాని ముఖతా మాత్రం అందులోని పండితులు కొందరు ఇవి అంతర్రాష్ట్రీయంగా—అంతర్జాతీయంగా పనికివచ్చే పని అంటున్నారు. రాష్ట్రవాసులకు పనికిరాని ఈ అంతర్జాతీయ ఖ్యాతి మనకు బోధపడదు. అసలు ఈ లాంటివి క్రింది దశలో ఏమి జరుగుతున్నదో పట్టించుకునే పెద్దలు కనిపించలేదు.

## ప్రాచీన పత్రాలు—పరిశోధనా శాఖ

ఇది ఈమధ్యనే మన కడ పుట్టినశాఖ. లక్ష్యమేమిటో, కార్యకలాపాలేమిటో మనకు తెలియరాలేదు. అయినా చరిత్ర పరిశోధకులకు "పారితోషికా" లిస్తామంటూ దీని ప్రకటనలు వస్తున్నాయి. అదిగూడా ఇంగ్లీషులోనే వ్రాయాలట. తెలుగు వద్దు. ఆపైన పారితోషికం గూడా పి. హెచ్. డి. పొందిన వారికే నట. ఇదంతా వింటుంటే నవ్వాలో లేక ఏడవాలో తెలియటం లేదు. ఒక వంక రాష్ట్ర అధికారభాష 'తెలుగు' అని అంటారు. ఉన్నత విద్య తెలుగులో చెప్తున్నా మంటారు. చరిత్రలు—పరిశోధన మాత్రం ఇంగ్లీషులో కావాలంటారు. ఇందులో ఏది నిజమో భగవంతుడికే తెలియాలి. లేదా ఆయనే దిగివచ్చి ఈ ప్రభుత్వానికి సలహా యైనా ఇవ్వాలి.

పోని ఇంగ్లీషుదే ఇప్పుడు 'రాజ్యం' అనుకుందాము. భారతదేశంలో రెండవ స్థానంలో వున్నది తెలుగు గదా— ఆ దృష్ట్యానన్నా దయదలచి స్థానం కల్పించ వచ్చునే.

## ఇప్పటికైనా కర్తవ్యం

మన రాష్ట్రప్రభుత్వం వారు ఇప్పటికైనా మేల్కొని పురావస్తుశాఖను, తత్సంబంధమైన ఇతర శాఖలను సంపూర్ణంగా సంస్కరించవలసియున్నది. ఇవి ఇప్పటికే నిష్ప్రయోజనంగా, పనికిరానివిగా మారిపోయినాయంటే సరిదిద్దుకొనుట మంచిదికాని బుజాలు తడుముకుంటే లాభంలేదు. ఇందులో ప్రధానమైన కొన్ని మార్పులు (1) మ్యూజియం శాఖనుండి శాసన విభాగాన్ని—పరిశోధన ప్రచురణలను పూర్తిగా తొలగించి స్వతంత్రశాఖను చేసితీరాలి. (2) ఇతర శాఖల నుండి సంబంధం లేని అధికారులను తెచ్చి శాస్త్రవేత్తలకు అడ్డుగా నిలపటం, శాస్త్రవేత్తలపైన శాస్త్రవేత్తలుగాని వారికి పెత్తనం ఇవ్వటం అభ్యుదయానికి లేక ఆరోగ్యానికి సరిపడే విషయాలు గావు.

(3) అదేపనిగా ఉద్యోగకాలాన్ని పొడిగించటంకాని, యోగ్యత కలవారు, సమర్థులు లభించగలిగినప్పటికి తెలంగాణా ప్రాంతానికి కొన్ని ఉద్యోగాలు కేటాయించి వాటిని భర్తీ చేయకపోవటం లేదా అట్టివారికి ప్రోత్సాహం లేకపోవటం సరియైన పనులు గావు. పైగా అపనమ్మకం కలుగడానికి దారితీస్తుంది.

అసలు మనకు మనుషులు ముఖ్యంగాని ప్రాంతాలు గాదు. అయితే రాజకీయాలవల్ల కేటాయింపులు వచ్చినవి. మళ్ళీ మళ్ళీ వస్తున్నవి. పోతున్నవి. అయితే తీరా ఆశ చూపి ఇపుడు అన్నీ మరచిపొమ్మంటే ఏమి జరుగుతుందో—

(4) ఏమి జరిగినా ఈ పురావస్తుశాఖలకు పటిష్ఠమైన కొన్ని సలహాసంఘాలు నియమించి ఇప్పటినుండి అయినా దీనిపనులు మిక్కిలి వేగిరముగా జరిగే విధానం చూడాలి.

(5) రాష్ట్రం మొత్తంమీద ఒకే ఉద్యోగ కార్యాలయం గనుక దీని కృషిని ఎప్పటికప్పుడు సమీక్షించే పై విధానం కానవచ్చుట లేదు. ఇదికూడా మంచి పద్ధతికాదు. శాశ్వతమైన గట్టి సలహాసంఘముంటే ఈపని కట్టుదిట్టంగా జరిగి అభివృద్ధి కనపడుతుంది. అట్లా జరుగుతుందని మనమందరము ఆశిద్దాము —

# "ఆనంద" నందనము

## శ్రీ బులుసు వేంకటేశ్వరులు

"ఆనందా!" అభినందనంబులు శుభాహ్వానంబు సుస్వాగతం
బౌ నీ యాగమనంబు మా ప్రజల కెంతే నందమున్ గూర్చుతన్!
శ్రీనంద వ్రజసుందరుం డఖిల సద్బృందావనీ సర్వశో
భా నిష్యంది దయారసంబు కురిపింపన్ నీపయిన్ మాపయిన్.

దాటితి మా "ప్రమాది" నెటో దైవకటాక్షముచేత నీవయిన్
మాటికి నీ కటాక్షమును దబ్బున మాలగ పొందగందు మీ
పాటులు చాలు మా కిక శుభంబు లొసంగుము సర్వసౌఖ్య సం
తోషమిటెట్టి కమ్మ సార్థకము పే రగునట్లు ముదం బొసంగుమా!

పేరులు నేతిబీర లయి పెంపును గోల్పడు కాల మిద్ది నీ
పే రటు కాక సార్థకత బెంపు వహింపగ నిమ్ము విశ్వ వి
స్తార యశంబు నంది బహుసంపదలన్ విలసిల్లునట్లుగా
భారత భూమి నాంధ్రిని గృపన్ నవవత్సరమా! యొసర్చుమా.

అఱువది వత్సరంబులకు నవ్వల నొక్కట వచ్చి పోవు నీ
చరితము పే మెరుంగుదుము చంచల జీవితముల్ స్థిరంబులా?
కరమున కంది యున్న యధికారము దుర్వినియోగమైన నీ
తరమొకొ దాని నిల్పుకొన్న దక్షణమే పతనంబు గాంచవే?

కాలమహాస్వరూప మనగన్ బరతత్త్వము; కాలదేవతా
లీల సమస్తమున్; జగము లీనమగున్ బొడమున్ సువృద్ధి యౌ
గాలముచే; సమస్తమును గాలమహా విసర్ప దష్టమౌ
బేలవు కాక చక్కని వివేకమునన్ మరి కీర్తి నందుమా.

కాలమహాప్రవాహమును గట్టగ శక్యమె యెంతవారికిన్?
జాల ననాద్యనంత మది సర్వభయంకరలీల బాఱెడిన్
కాలవిదుల్ తలంచి బహుకల్పయుగాదిక భేద భావనన్
స్థాలముగాగ నద్దాని గనుచున్ విభజించిరి చిత్ర భంగులన్.

వింతగ గల్పకల్పములు విశ్రుతరీతిని నెన్నియొప్పు మ
న్వంతరముల్ యుగంబులు ననంతశతాబ్ద దశాబ్ద లేగె నీ
వెంత? తలంప నీ బ్రదుక దెంత? క్షణంబున వచ్చిపోవు నీ
వింతయు గర్వమందక సుఖించి సుఖింపగ జేయుమీ మమున్.

పదవులు శాశ్వతంబులొకొ? వచ్చితి విప్పుడు నీవు పూర్వ మీ
పదవిని విఱ్ఱవీగి యనవద్యత బచ్చినవార లెందఱో
మది దలపోయుమీ క్షణము మాత్రమె నీ బ్రదుకిందు దీనికై
మదము ముదంబు రెండును భ్రమంబులె శాశ్వత మేది ధాత్రిపై?

# "ఆనంద" నందనము

## శ్రీ బులుసు వేంకటేశ్వరులు

"ఆనందా!" అభినందనంబులు శుభాహ్వానంబు సుస్వాగతం
బౌ నీ యాగమనంబు మా ప్రజల కెంతే నందమున్ గూర్చుతన్!
శ్రీనందవ్రజసుందరుం డఖిల సద్బృందావనీ సర్వశో
భానిష్యంది దయారసంబు కురియింపన్ నీవయిన్ మానసంబున్.

దాటితి మా "ప్రమాది" నెటో దైవకటాక్షముచేత నీవయిన్
సూటిగ నీ కటాక్షమును చుబ్బన మాఱగ పొందగందు మీ
పాటులు చాలు మా కిక శుభంబు లొసంగుము సర్వసౌఖ్య సం
త్తోటివి కమ్ము సార్థకము పే రగునట్లు ముదం బొసంగుమీ!

పేరులు నేతిబీర లయి పెంపును గోల్పడు కాల మిద్ది నీ
పే రటు కాక సార్థకత బెంపు వహింపగ నిమ్ము విశ్వవి
స్ఫార యశంబు నంది బహుసంపదలన్ విలసిల్లునట్లుగా
భారత భూమి నాంధ్రిని గృపన్ నవవత్సరమా! యొనర్పుమా.

అఱువది వత్సరంబులకు నవ్వల నొక్కటి వచ్చి పోవు నీ
చరితము మే మెఱుంగుదుము చంచల జీవితముల్ స్థిరంబులా?
కరమున కంది యున్న యధికారము దుర్వినియోగమైన నీ
తరమొకొ దాని నిల్పుకొన్న? దక్షణమే పతనంబు గాంచవే?

కాలమహాస్వరూప మనగన్ బరతత్త్వము; కాలదేవతా
లీల సమస్తమున్; జగము లీనముగున్ బొడమున్ సువృద్ధి యౌ
గాలముచే; సమస్తమును గాలమహోపసర్ప దష్టమౌ
వేలుపు కాక చక్కని వివేకమునన్ మని కీర్తి నందుమా.

కాలమహాప్రవాహమును గట్టగ శక్యమె యెంతవారికిన్?
బాల ననాద్యనంత మది సర్వభయంకరలీల బాఱెడిన్
కాలవిదుల్ తలంచి బహుకల్పయుగాదిక భేద భావనన్
స్థూలముగాగ బుద్ధిం గనుమున్ విభజించిరి చిత్ర భంగులన్.

వింతగ గల్పకల్పములు విశ్రుతరీతిని నెన్నియొప్పె మ
న్వంతరముల్ యుగంబులు ననంతశతాబ్ద దశాబ్ద లేగె నీ
వెంత? తలంప నీ బ్రదుక దెంత? క్షణంబున వచ్చిపోవు నీ
వింతయు గర్వమందక సుఖించి సుఖింపగ జేయుమీ మనమున్.

పదవులు శాశ్వతంబులొకొ? వచ్చితి విప్పుడు నీవు పూర్వ మీ
పదవిని విఱ్ఱవీగి యనవద్యత జచ్చినవార లెందఱో
మది దలపోయుమీ క్షణము మాత్రమె నీ బ్రదుకిందు దీనికై
మదము ముదంబు రెండును భ్రమంబులె శాశ్వత మేది ధాత్రిపై?

# ఆంధ్రపత్రిక ఆనందనామ సంవత్సరాది సంచిక

పొలుపుగ వందిమాగధుల బోలి శుకంబులు కోకిలంబులున్
పలుమఱు నీ జయధ్వనులు పల్కుచు నున్నవటంచు గర్వమా?
పలుకును వర్షవర్ష మవి వచ్చినవా రెవరైనఁగాని ప
క్షులకు స్వభావ మయ్యదియె గొప్ప యటంచుఁ దలంపబోకుమా!

స్తుతియును నింద యొక్కటిగఁ జూచుకొనంగని మేలుచేయు టే
యితరులకున్ స్వభావమయి యేవిధ మైన భయంబు లేక శా
శ్వత మగు మోదవార్నిధిని జక్కగ దేలుచుఁ దేలఁజేయుచున్
స్తుతమతు లైనవారిని విశుద్ధచరిత్రము నిల్పుకోఁదగున్.

ఆనందంబున విశ్వమంతయును ని నృత్యంతమున్ మెచ్చు న
ట్లే నీ వంది సుఖంబు మా కొసఁగుమీ యింపారుసౌఖ్యంబులన్
దీనావస్థ దొలంచి రాష్ట్రమునకున్ దేశంబు సౌభాగ్యదం
బౌన ట్లెంతయు జూడుమీ ప్రియముగా నానందసంవత్సరా!

అతులిత మద్భుతంబు పరమామృతశక్తి గలట్టియాంధ్ర భా
రతి రమణీయకాంతిని విరాజిలుఁగాక! సహస్రధా భవ
న్నుత పరిపాలనంబున వినూత్న గతిన్ గవిలోక మెల్ల నీ
ప్సిత ఫలసిద్ధి నందుత! విశేషముగా నవవర్ష రాజమా!

# శృంగారము — అశ్లీలము

## శ్రీ పులిచెర్ల సాంబశివరావు

మానవునకు భగవంతు డొసగిన వరము పవిత్ర వరము ప్రేమ. ప్రేమకు అందరు నొకటే! తరతమ భేదము లుండ వచ్చును. తారతమ్యము లుండవు!

ప్రేమకు తరువాతి మెట్టు ప్రణయము. ప్రణయము శృంగార సంబంధి. శృంగారము రసరాజము!

అమలిన శృంగారము అన్నింటికంటె గొప్పది. ఇది కావ్యేతి వృత్తమునకు తగినది. ఏకాంత సేవలో వేంకట పార్వతీశ్వర కవులకు సర్వమును ప్రేమకొరకు వలె కనుపట్టినది. చెట్టునకు మొగ్గ తొడిగెడు గుణము, కోకిల ఈలరక పాడుకొనుచుండుట, ఇన కరములలో వేడి యుండుట— సర్వము ప్రేమ మయముగా వారికి దోచినది.

ఈ సుఖంబును గష్టంబు నెందు కొరకు?
ఈ భవంబును నాశంబు నెందుకొరకు?
ఈ జగంబున నిన్నియు నెందుకొరకు?
ప్రేమకొరకు ప్రేమకొరకు ప్రేమకొరకు!

ఇట్టి ప్రేమ భావములు వ్యాపించినచో మానవులలో నీర్ష్యా మాయల కిక తా వెక్కడ? ప్రేమభావములు ప్రణయభావములకు దారి తీయును. ప్రణయము ఆరాధనకు తావొసగును. ఆరాధనవలని పర మాత్మ పరమ స్వరూపము సాక్షాత్కరించును. ప్రణయారాధనము మానవుల నున్నతుల నొనర్చును.

ఆమె పద సన్నిధాన దివ్య స్థలాన
నాక కల్లోలినీ పదన్యాసమునకు
దర వినత మైన హర జటా భరము వోలె
నతుడ నయ్యు
మహో మహోన్నతి వహింతు!

అని ఆరాధనలో వేదుల సత్యనారాయణశాస్త్రిగారు గర్వించిరి.

కావ్యములలో ప్రధానరసముగ వీర శృంగార రసములలో నొకటి యుండ వలెను. నియమము గాదు. కాని ఈ రసములు ప్రధానములుగ నున్న కావ్యములే ప్రసిద్ధి నందినవి. ఈ రెంటిలో వీరముకన్న శృంగారమే ప్రీతిపాత్రమైనది. శృంగారము లలితమైనది. మానవత్వమున కిదియే దగ్గర!

శృంగారము ధర్మ మార్గమున సాగవలెను. లౌకికమైన మానవ జీవితమందును, అలౌకికమైన కావ్యములందును నిది పాటింప దగిన ప్రథమ లక్షణము. శృంగార సంబంధమైన చర్య లనేకము నిజముగ చేయబడవచ్చును. కాని అవి గోప్యముగ నుంచబడును. ఆ చర్యలు లోక కళ్యాణహేతువులేయైనను బయటకు ప్రదర్శింపరానివే! కావ్యము లందలి శృంగార ఘట్టములు నింతే! లోక కళ్యాణార్థము శృంగార లీలలను వర్ణింప వచ్చును. కాని మితి యుండును. మితిలేని అవేల శృంగార వర్ణనలు గర్హ్యములు.

శృంగార భావములను వర్ణించునపుడు కవికి జాగ్రత్త అవసరము. అందమైన భావములనే కాక, అందమైన శబ్దములను గూడ నుపయోగించుట యందు శ్రద్ధ చూపవలెను.

శృంగార రస స్వరూపము నాధునికులు సరిగా నర్థము గావించు కొనకపోవుటచే పెక్కు అవక తవకలకు పాల్పడు చున్నారు. ఆధునికుల ననసేల? ప్రాచీనులును పప్పులో కాలువేసిరి. "రతి ప్రభవః శృంగారః" అని పొరబడినవారు ప్రాచీనులే కదా!

శృంగారము సంభోగ శృంగారమనియు, విప్రలంభ శృంగార మనియు రెండు విధములుగ జెప్పబడినది. కథ కవసరమైనచో నీ రెండును వర్ణింపదగినవే! సంభోగ శృంగార వర్ణనమున జాగరూకత వహింపకున్న నశ్లీలము పొడసూపును.

'అశ్లీలము' అన్నిటియందును ఉండును. అన్నిటికంటె ముఖ్యము శృంగార సంబంధమైన అశ్లీలము.

నిత్య జీవితమున కొందరకు అశ్లీల శబ్దము లూత పదములుగ నుండును. అట్టి పాత్రలను రచనలో వర్ణింపవలసి వచ్చినపుడు ఆయా యూత పదములను నిలుప వచ్చును. దాని వలన పాత్ర స్వభావము కన్నులకు కట్టినట్లగును. కాని అవి సహజమై యుండవలెను. కవి తనకై తాను ఇట్టి పాడుమాటల నుపయోగింప రాదు. వ్రీడ, జుగుప్స, అమంగళముల కాకరమైనచో నది అశ్లీల మగును. అసభ్యార్థము స్ఫురించుట కవకాశమున్న శబ్ద ప్రయోగము సైత మశ్లీల మగును. అశ్లీల పదములను వినుట అశుభదాయకమని పూర్వులు భావించిరి. అందువలన నట్టి భావములు జెప్పవలసి వచ్చినప్పుడు, ఆ యర్థము నిచ్చు అప్రసిద్ధ శబ్దముల నుపయోగింప వలెను. అసభ్యార్థ మున్నను లోకములో మంచి యర్థముతో వాడబడు శబ్దములు అశ్లీలములు కావు. కమలయోని, భగిని మొదలగున విట్టివి. శివలింగము సంగతి వేరుగ జెప్పనక్కరలేదు.

సురత వర్ణనమునందును, శాంతరసము ప్రధానముగాగల కావ్యములందును అశ్లీలము దోషముగాదందురు. నే నంగీకరింపను. ఈ దోష మెచ్చటనైనను దోషమే!

సురత వర్ణనలే యశ్లీలములు. వానిని కావ్యములందు ప్రత్యేకముగ వర్ణింప నవసరము లేదు. కథ కది యవసరమైనవు డొక మాటతో కొట్టివేయదగునే గాని ప్రత్యేకాశ్వాస మవసరము లేదు. శాంతరసమును విజయ వంతముగ నిర్వహించుటకు అశ్లీల మడ్డు వచ్చును. కావున నచటను నిది తగదు.

ఒక స్త్రీ వర్ణన పద్యమును జూడుడు.

ప్రబల వక్షోజ హేమ కుంభములు సూచి
లలిత రోమావళీ రజ్జు లతిక జూచి
నాభికూపంబు జూచి నా నయన యుగము
తృప్తి వహియించు చున్నది దీనియందు.

ఇందలి అవయవ వర్ణన సామాన్య శబ్దములతో జేసినచో రోత పుట్టింప వచ్చును. అశ్లీల మనిపింప వచ్చును. "పట్టంగ బసలేని పలచని లేగౌను బిగువు జన్నుల ప్రేక మెగసియాడ" అను పద్య మంద మంతయు 'చన్నులు' అను మాటతో చెడినది.

సంభోగ శృంగారమును సైతము సహితముగా ఏ కవి యెట్లు వర్ణించెనో చూడుడు.

అవిలాసాలస విభ్రమం బకృత గాఢాలింగనం బప్రవీ
ణ వచోగుంభన మస్ఫురత్తరుణ దంతచ్ఛాయ మాపీడితో
ష్ఠ విశేషామృత మప్రకృష్ట రతి చేష్టంబయ్యు నవ్వాల మౌ
గ్ధ్య వికారంబది రాజడెందమునకుం గావించె నానందమున్.

మన ప్రాచీన సాహిత్యమున శృంగారము మితిమీరిన ఘట్టములు పెక్కు కలవు. వాని నేదో విధమున సభ్యములుగా చేయుటకు కొందరు ప్రయత్నించు చుందురు. ప్రబంధముల నిండ సంభోగ శృంగారము పలుచోటుల వర్ణితమైనది.

కటితటం బెత్తియెత్తి క్రిందటికి బరపి
లోనుగా దానిపై యంచుతోన సరగ
పొక్కిలి గడించి పట్టి మూపునను జేరిచి
వదలి వరు మూరుకొనుచు లేవంగ గడిగె.

ఇట్టి పద్యములు మనకు కొల్లలుగా గలవు. ఇంకను:—

సురత పారవశ్యంబుల జొక్కి జొక్కి
కేళినిద్రా సుఖంబుల దేలి తేలి
మేలుకొని బాహ్యరతికేళి మించి మించి
దంపతులు క్రీడ సల్పిరి తనివి వనక.

ఇట్టి పద్యముల సంగతి వేరుగ జెప్పవలెనా?
ఇట్టి యసభ్య పద్యము లన్నియు నశ్లీలములే!
అధునికాంధ్ర సాహిత్యకారులు వీనిని నిరసించినారు. బాగున్నది.

ఆధునికాంధ్ర సాహిత్యమున, మన ప్రాచీన సాహిత్యమున కంటె నసభ్యముగ నుండు అశ్లీలము చోటు చేసికొనుచున్నది. పూర్వపు అశ్లీలము కొందర కానందము ప్రసాదించెనేమో! నేటి అశ్లీల మందరకు నసహ్యముగ నున్నది.

'నగ్నముని' కొజ్జాల కామకేళి నిట్లు చూపిరి:—

"కుళ్ళిపోయిన పుచ్చిపోయిన
తమ పయోరియా పళ్ళతో పెదవులు కొరికి కొరికి
వాళ్ళ కుష్టు చేతులతో రొమ్ములు పిసికి పిసికి గెంతారు
తొడలు నలిపి నలిపి
అ[illegible]మువంలో గర్భగుడిలో వేళ్ళు దోపిదోపి
ఒళ్ళంతా కసిగా తొక్కి తొక్కి
వాళ్ళ జబ్బు రసినంతా ఒంటిమీద కార్చి కార్చి తుళ్ళారు.'

ఇట్లు వ్రాయుట సభ్యము కాదు. కావున అశ్లీలము.

వ్యవస్థను మార్చుటకు ప్రయత్నింప వచ్చును. తప్పు లేదు. వారి యిచ్చ వచ్చిన రీతిని కవిత్వము వ్రాయ వచ్చును. తప్పు లేదు. అసలు వ్రాయకుండ నుండవచ్చును. తప్పు లేనే లేదు. అశ్లీలముగా మాత్రము వ్రాయ రాదు. "భూమి భగవంతుడి నడుస్తున్న లుంగీలో పొగుతున్న ముసలి వరిబీజంలా వున్నది". ఇట్టి వాక్యములను కవిత్వముగా ప్రచార మొనర్చినచో ప్రజ లసహ్యించుకొందరు. కవుల భావములను ప్రజలు వినరు. వా రాశించిన మార్పు సంఘమున రాదు!

ఏ మార్పును మనము కోరుచున్నామో దానిని ముందు మన మాచరింప వలెను. ప్రాచీన సాహిత్యమునం దశ్లీలము లున్నవని చెప్పుచు, తిరిగి మన మశ్లీలములతో కవన మల్లుట తప్పుగదా!

# వేదంలో, ఆయుర్వేదంలో గర్భనిరోధ ప్రక్రియలు

శ్రీ తిరుమల రామచంద్ర

"దశాస్యాం పుత్రా నాధేహి
పతి మేకాదశం కృధి".

"ఓ ఇంద్రుడా, ఈమెకు పదిమంది పుత్రులను కలిగించు, భర్తను ఈమె పదకొండవ కుమారునిగా చూచుకొనేట్టు చేయి" అనే ఈ మంత్రాన్ని మనం వివాహాలలో వధువును ఆశీర్వదిస్తున్నప్పుడు వింటూంటాము. "ప్రజ యాహి మనుష్యః పూర్ణః, సుప్రజాః ప్రజయా భూయాస్మ"— సంతానంతోనే మానవుడు పరిపూర్ణుడు. సంతానం తోనే మంచి పౌరుడు అవుతాను—మొదలయిన వేదవాక్యాలు సంతానం ముఖ్యమని తెలిపేవి; శుభకార్యాలలో ఆశీర్వాదాలుగా వేదవిత్తములు పలికేవి. వేదాన్ని అనుసరించే భారతాది పురాణేతిహాసాలూ సంతాన ప్రాముఖ్యాన్ని తెలిపాయి.

"ఏష్టవ్యా బహవః పుత్రాః
యద్యేకోపి గయాం వ్రజేత్".

చాలామంది పుత్రులు కలగాలని కోరాలి. వారిలో ఒక్కడైనా గయకు వెళ్ళి పితరులకు ఉత్తమగతులు కలిగిస్తాడో ఏమో!—అని భారతం చెబుతున్నది.

కాని, సరిగా పరిశీలిస్తే, సంతతి అనవసరమన్నవారూ, సంతతి విచ్ఛిన్నకారులూ మన పూర్వమంత్రకర్తలలో ఉన్నట్టు కానవస్తుంది. చతుర్వేదాలలో ఒకటయిన అధర్వవేదమే క్లీబత్వోపాదక, సపత్నీ విబర్హణమంత్రాలను, మూలికలను స్తుతించింది.

"గర్భాదం కణ్వం నాశయ
పృశ్నిపర్ణి సహస్వ"

(కాండ—2, సూక్త—24, మంత్ర—3)

ఓ పృశ్నిపర్ణీ గర్భాన్ని తినివేసే క్రిములను నాశనం చేయి—అని ఉద్ఘోషించిన అధర్వవేదమే ముష్కనాశనమంత్రాన్ని ఈ విధంగా గానం చేసింది:—

"ఆవృత్యత: శిఖండినో
గంధర్వ స్యాప్సరా పతే
భినద్మి ముష్కావపి యామి శేపః"

(కాం—4, సూ—37, మం—7)

అజశృంగి అనే మూలికను ఉద్దేశించి చెప్పిన మంత్రమిది. "హే అజశృంగి, నీటిలో సంచరించే మూలికారాజమా, నీ సహాయంతో తలపై శిక్కని కుచ్చుతో నాట్యంచేసే గంధర్వుని ముష్కాలను పగులగొడుతాను. ప్రజననాంగాన్ని కూడ నాశనం చేస్తాను" అని ఈ మంత్రం అర్థం. క్లైబత్వకారకమైన మరికొన్ని మంత్రాలూ ఉన్నాయి:—

"త్వం వీరుధాం శ్రేష్ఠతమ
భిశ్రుతా స్యోషధే!
ఇమంమే అద్యపురుషం
క్లీబ మోపశినం కృధి.
క్లీబం కృత్వోపశిన
మథో కురీరిణం కృధి
అథాస్యేంద్రో గ్రావభ్యాం
ఉభే భినత్వాండ్యౌ
యౌ తేవాండ్యౌ దేవకృతే
యయో స్తిష్ఠతి వృష్ణ్యం
తేతే భినద్మి
శమ్యయా ముష్కౌ
అధిముష్కయో:
యథా నడం కశిపునే
స్త్రియో భిందంత్యశ్మనా
ఏవాభినద్మి తేశేపో
ముష్కౌ అధిముష్కయో:"

(కాం—6, సూ—138, మం—13)

ఈ మంత్రం ఏ ఓషధిని సంబోధిస్తుందో తెలియదు. దీని అర్థమిది:— "హే ఓషధీ శ్రేష్ఠమా, నేను చెప్పే ఈ పురుషుణ్ణి నపుంసకుని గాను, వశునిగాను చేయి. ఇతని అధఃకాయం నిష్ప్రయోజనమయ్యేటట్టు చేయి. ఇంద్రుడు ఇతని ముష్కాలను రెండురాళ్ళతో నలగగొట్టనీ. ఈ ముష్కాలు ప్రజననశక్తి గలవి. ఈ కర్రతో ఆ ముష్కాలను నలగగొడుతాను. స్త్రీలు చాపలు అల్లడానికి రెల్లును ఏ విధంగా నలగగొడుతారో ఆదేవిధంగా ముష్కాల మీది ప్రజననాంగాన్ని నలగగొడుతాను."

సపత్నీ వినాశక మంత్రాలలో విచిత్రమైనవి ఉన్నాయి. ఒక మంత్రం ఉత్తానపర్ణ అనే మూలికను ఇలా స్తోత్రం చేస్తుంది:—

"ఉత్తానపర్ణే సుభగే
దేవ జూతే సహస్వతి,
సపత్నీం మే పరాణుద
పతిం మే కేవలం కృధి".

(కాం—3, సూ—18, మం—2)

"హే ఉత్తానపర్ణా, నీవు చాల అందమైనదానివి, దేవతలతో ప్రశంసింపబడిన దానివి. నా సవతిని నాశనం చేయి. నా పతిని ఒంటరిగా— దానినుంచి ఒంటరిగా చేయి."

స్త్రీ గర్భాశయ చికిత్సా రూపమైన మంత్రాలు కవితామయంగా ఉంటాయి. వాటిలో ఒకదాని ఉదాహరిస్తున్నా:—

"ఇమా యాస్తే శతహిరాః
సహస్రం ధమనీ రుత,
తాసాంతే సర్వాసాం మహం
అశ్మనా బిల మప్యధాం.

వరం యోనే రవరం తే కృణోమి
మా త్వా ప్రజా బభూ. న్మోతసూనుః
అస్వం త్వా ప్రజసం కృణోమి
అశ్మానం తే అపిధానం కృణోమి."

(కాం—7, సూ—35, మం—3)

నీ నూరు శిరలనుంచి, వేయి ధమనులనుంచి రక్తం స్రవించకుండా పాటి రంధ్రాలు మూసివేస్తాను. నీ ప్రజలు నష్టం కాకుండా, పిల్లలు చెడిపోకుండా యోనిబిలాన్ని రాతితో మూసివేస్తాను. నీకు నష్టం కలుగ కుండా రాతికోట — కడుతాను అని ఈ మంత్రం గర్భరక్షణను వివరిం చింది. నరాలజ్ఞానం మొదలయిన విషయాలు గమనింపదగినవి.

దేవరాతాపరనాముడైన శునశ్శేపుడు ఇంద్రుణ్ణి సంతోష పెట్ట డానికి చేసిన స్తోత్రంలో ఒకమంత్రం ఉంది:—

"అయ ముతే సమ తసి
కపోత ఇవ గర్భధిం
వచః తచ్చి న్న వో శకసే".

(కాం—20, సూ—45, మం—1)

"ఓ ఇంద్రుడా, నీవు కపోతంవలె వ్యాపిస్తున్నావు, గర్భాలలో" అని దీని అర్థమయివుంటుంది. ఈ మంత్రం వృత్రాసుర జననానికి సంబంధించిన ఒక గాథను తెలుపుతున్నదేమోనని నా అనుమానం. వృత్రా సుర గాథ భారత భాగవతాలలో ఉన్నదే. అసురమాత అయిన దితి దేవ రాజయిన ఇంద్రుని జయించగల మహావీరుడయిన కుమారుని కందామని కశ్యప ప్రజాపతితో వరం పొంది, గర్భిణి అయి, ఒకనాడు మంచంమీద తలవైపు కాళ్ళు, కాళ్లవైపు తలచేసి వెల్లకిల పడుకొన్నది. అంతటి మహా వీరుడు పుడితే తనకు ఏమి ముప్పు వస్తుందో అని భయపడిన మాయావి ఇంద్రుడు ఆమె గర్భాశయ ద్వారం నుంచి గర్భంలో ప్రవేశించి గర్భ పిండాన్ని ముక్కలుగా చేస్తాడు. అయినా, ఆ పిండం బలమైంది గనుక, వృత్రాసురునివంటి మహాబలుడు పుట్టాడు. పైనపేర్కొన్న మంత్రం వృత్రాసుర గర్భపిండచ్ఛేదన గాథను ధ్వనిస్తున్నదని నా భావన.

ఋగ్వేదంలో "బహుప్రజా: నిర్ఋతిమావివేశ" అనే మంత్రాన్ని యాస్కాచార్యుడు వ్యాఖ్యానిస్తూ, ఎక్కువమంది పిల్లలు గలవాడు నరకం పొందాడని స్పష్టపరచినట్లు ఉస్మానియా విశ్వవిద్యాలయం సంస్కృతశాఖాధ్యక్షులు డాక్టర్ బొమ్మకంటి రామలింగశాస్త్రిగారు నాకు తెలిపారు.

పై ప్రమాణాలన్నిటినీ బట్టి వేదకాలంలోనే క్లీబతాపాదక యోగాలు, గర్భ విచ్ఛేదకోపాయాలు ప్రజలకు తెలుసునని, శత్రువినాశా నికి వాటిని సాధనాలుగా వాడేవారని మనం నిశ్చితంగా అనుకోవచ్చు.

స్మృతులు గూడ కొన్నికొన్ని సందర్భాలలో గర్భనిరోధాన్ని, సంతాన నిరోధాన్ని సూచించినట్లు తెలుస్తుంది. "రాజుకు పట్టమహిషి యందు సంతానం ఎక్కువగా వుండరాదు. ఎక్కువకలిగితే, వారు రాజ్యంకోసం పరస్పరం కీచులాడితే, రాజ్యం విచ్ఛిన్న మవుతుంది. ఇతర భార్యలు ఎంతమందిని కన్నా రాజ్య విచ్ఛేదావకాశంలేదు" అని మనువు రాజచర్యలో హెచ్చరించినట్లు గుర్తు. ఇది సంతాన పరిమితికి ఒకవిధంగా దారిచూపి నట్టే కదా!

పుత్రకామి అయిన పురుషుడు ఋతుకాలంలో భార్యాసంగమం చేయాలని, తదితర కాలాలలో కేవల రతి దృష్టితో చేయాలని చేయ వచ్చని స్మృతులన్నీ చెప్పాయి.

"ఋతు కాలాభి గా మీ స్యాత్
స్వదార నిరతస్సదా,
పర్వ వర్జం వ్రజేచ్చైనాం
తద్వ్రతో రతికామ్యయా."

(మను, అధ్యా—3, శ్లో—15)

సంతానం కోరే పురుషుడు స్వదార నిరతుడయి ఋతుకాలంలో ఆమెను సంగమించాలి. కేవల రతి సుఖానికైతే, పర్వదినాలు వదలి క్రీడించ వచ్చు — అని అర్థం. కాని, ఈ ఋతుకాలం ఎన్నాళ్లన్న విషయంలో మత భేదాలున్నాయి. కొందరు పదహారునాళ్లని, కొందరు పన్నెండునాళ్లని అన్నారు. మనువు ఈ ఋతుకాలం పదహారు రాత్రులన్నాడు. మొదటి నాలుగు నాళ్ళు, పదకొండవ, పదమూడవరాత్రులు నింద్యాలని, తక్కిన పదమూడురాత్రులు ప్రశస్త మయినవని అన్నాడు.

"ఋతు స్స్వాభావికః స్త్రీణాం
రాత్రయః షోడశ స్మృతాః,
చతుర్భిరితరైః స్సార్థం
అహోభిః తద్వి గర్హితైః
తాసామాద్యాః చతస్రస్తు
నిందితైకాదశీ చయా,
త్రయోదశీచ శేషాస్తు
ప్రశస్తా దశ రాత్రయః."

(మను 3—46, 47)

యాజ్ఞవల్క్యుడు "షోడశర్తు నిశాఃస్త్రీణాం" (1—79) పదహారు రాత్రులేనని అనగా,దీనిని"సవ రజోదర్శన దివసా దారభ్య షోడశా హోరాత్రకః"— రజోదర్శనం మొదలు పదహారు పగలు రాత్రులు అని విజ్ఞానేశ్వరుడు వ్యాఖ్యానించాడు.

తర్వాతి వైద్యక గ్రంథకారులు కొందరు ఈ మతాన్నే అనుస రించారు.

"ఋతుకాలమందు షోడశరాత్రం యావత్. యదుక్తం హారీతే షోడశో దివసో ఋతుకాల ఇతి" అని శరీరవ్యాఖ్యాత చక్రపాణి దత్తుడు వ్యాఖ్యానించాడు. (శారీరం—2).

"ఆర్తవ స్రావ దివ సాత్
ఋతు ష్షోడశ రాత్రయం,
గర్భగ్రహణ యోగ్యస్తు
సవివ సమయః స్మృతః"—

(భావప్రకాశిక)

ఋతుకాలం కాక తక్కిన దినాలలో రతికామ్యతో భార్యను పొంద చ్చును కాని, దానిని కూడ మానుకొని, కేవలం ఋతుకాలంలోనే పొందే వాడు ఏ ఆశ్రమమువాడైనా బ్రహ్మచారే నని మనువు ఉద్ఘోషించాడు.

"నింద్యాస్వష్టాసు చాన్యాసు
స్త్రియో రాత్రిషు వర్జయన్,

"బ్రహ్మచార్యేవ భవతి
యత్ర తత్రాశ్రమే వసన్".
(మను 3—20)

కాని, సుశ్రుతుడు మాత్రం ఈ ఋతుకాలం పన్నెండు రాత్రులని అన్నాడు. సూర్యుడున్నప్పుడు పద్మం వికసించినట్లు, నారీ గర్భాశయ ద్వారం విచ్చుకొనివుండి, గర్భాధాన క్షమమవుతుందని, సూర్యాస్తమయం తర్వాత పద్మం ముకుళించినట్లు యోని సంకోచిస్తుందని, కనుక గర్భాధాన క్షమంకాదని వివరించాడు.

"ఋతుస్తు ద్వాదశరాత్రం భవతి. దృష్టార్తవో దృష్టార్తవో వ్యస్త్యేకే భాషంతే.

పీన ప్రసన్న వదనాం
ప్రక్లిన్నాత్మముఖ ద్విజాం,
నరకామాం ప్రియకథాం
స్రస్తకుక్ష్యక్షి మూర్ధజాం,
స్ఫురద్భుజ కుచ శ్రోణి
నా భ్యూరు జఘన స్ఫిచం,
హర్షౌత్సుక్య పరాం చాపి
విద్యా ద్ఋతుమతీ మితి.
నియతం దివసే తీతే
సంకుచత్యంబుజం యథా,
ఋతౌ వ్యతీతే నార్యాస్తు
యోనిస్సంవ్రియతే తథా.
యుగ్మేషు చ పుమాన్ ప్రోక్తో
దివసే ష్వన్యథా అబలా,
పుష్పకాలే శుచిస్తస్మాత్
అపత్యార్థీ స్త్రియం వ్రజేత్."
(3—6 7 8 9 12)

వైద్యులలో ప్రాచీన తముడైన సుశ్రుతుని వాక్యాలు, స్మృతి వాక్యాల అపత్య నిరపేక్షమైన రతికి అనుమతించాయి. గనుక, అనపత్యత పాపమూ, దుర్గతి కరమూ కాదని ప్రాచీనులు భావించక పోలేదని స్పష్టపడుతున్నది.

ఇక ఆయుర్వేదశాఖ అయిన కామశాస్త్రం క్లీబీకరణ గర్భపాత, గర్భనిరోధాలను కోకొల్లలుగా చెప్పింది. రాజులు, శ్రీమంతులు భోగినులను ప్రత్యేకంగా ఉంచుకునేవారు గనుక, వారు సంతానవతులయితే తమ సుఖానికి భంగమనే దృష్టితో ఈ పద్ధతులను ప్రవేశపెట్టారనే వాదం వుంది. ఈ వాదమే అంగీకరించినా, కొందరికి "ప్రజయాహి మనుష్యపూర్ణః" అన్నది మరికొందరికి లేదా అన్న ప్రశ్న ఉదయిస్తుంది. రాజుల భోగాలకై కొందరు తమయువ్వనాన్ని ధ్వంసం చేసుకోక వంధ్యలుగానే వుండాలి. మరి కొందరు వారికి వెట్టిచాకిరీ చేయడానికి బానిసలను కనాలి— ఇది పద్ధతి. ఏమైనా కామాన్ని ఆహారంవలె శరీరధారణ హేతువుగా నిర్వచించిన కామశాస్త్ర గ్రంథాలు మాత్రం నిర్భయంగా గర్భనిరోధ యోగాలు చెప్పాయి. "శరీరస్థితి హేతుత్వాత్ ఆహార సధర్మాణోహికామాః" (వాత్స్యాయన కామసూత్రం—అధికరణం—1, అధ్యాయం—2, సూత్రం—46.)

వాత్స్యాయనుడు రతిని అపత్యఫలంగాను, సుఖఫలంగాను స్మృతికారులకు అవిరోధంగా నిర్వచించాడు. "ద్వివిధం రతం అపత్య ఫలం, రతిఫలంచ" (అధి—7, అధ్యా—2, సూ—1.) రతి రహస్యం గర్భ చాలనాది యోగాలు ఎన్నో తెలిపింది. వాటిలో కొన్ని ఇవి :—

ఆమలా మలాంజనయుతా
పీతా శీతాంబునా హారీతి,
గర్భ స్స్రుతో భగ నిహితం
ఘృత మధుయుక్తం పలాశ బీజంవా,
తండుల జలేన పీతం
మూలం జ్వల నస్యవా జయంత్యావా,
గర్భస్సం భగ నిహితం
లవణం కటుతైల యుక్తంవా.
శైవం కేసర బీజం
మూలం వా చంపకస్య వా కణయా,
గర్భం రుణద్ధి పీతం
కటు తైలం వా జరు త్యధయా.
(పరి—5, శ్లో—60, 61 62)

మోదుగ విత్తులు, చిత్రమూలం, చిరికూరం, జయంతి అవనూనె మొదలయినవి ఉష్ణవీర్యాలు గనుక గర్భపాతకరాలన్న విషయం చెప్పనక్కరలేదు.

నిత్యాతేయ తంత్రం గర్భస్తంభనం గురించి కొన్ని యోగాలు చెప్పింది. గర్భస్తంభనమంటే, గర్భం రాకుండా చేయడం.

'ఏరండబీజం ఋత్వంతే
భుక్తం స్తంభన గర్భకం,
కటి బద్ధం హేమమూలం
గర్భ స్తంభకరం పరం.
సిద్ధార్థ మూలం శిరసి
బద్ధం కాంతం రమేత్తయా,
న గర్భం ధారయేత్సా స్త్రీ
ముక్తే న లభతే పునః
ధుతూర మూల చూర్ణం తు
యోనిస్థం స్తంభనం మతం,
తండులీ మూల తోయేన
దేయం తండుల వారిణా.
ధూమితో యోని రంధ్రేషు
నింబకాష్ఠేన యుక్తితః
ఋత్వంతే దీయతే తత్ర
గర్భ దుఃఖ వివర్జితా.'
(చతుర స్తంభన పటలం)

ఋతుస్నానం తర్వాత ఆముదాలు తినాలి. నడుముకు గన్నేరు వేరు కట్టుకోవాలి. ఆవవేళ్ళ తలకు కట్టుకోవాలి. ఉమ్మెత్తవేళ్ళపొడి యోనికి పూసుకోవాలి. చిరికూరవేళ్ళ బియ్యం కడుగుతో తాగాలి. వేపచెక్కతో యోనికి ధూపం వేసుకోవాలి— గర్భదుఃఖం వుండదు. ఈ యోగాలు ఎంత ఉన్నా రసవీర్యవిపాకాలు కలవో వైద్యులకు తెలుసు.

నాగార్జునుని దని సంప్రదాయంగా చెప్పే కచ్ఛపుట తంత్రంలో గర్భస్రావణ యోగాలు ఎన్నో ఉన్నాయి.

గర్భపాతానికి వాత్స్యాయన కామసూత్ర వ్యాఖ్య పురుషార్థప్రభలో వ్యాఖ్యాత మాధవాచార్యుడు ప్రసక్తానుప్రసక్తంగా కొన్ని యోగాలు చెప్పాడు :—

"సింహాండ దుగ్ధవాదాయి
ఫాల దేశే విలేపయేత్,
అపూర్ణ మథవా పూర్ణం
క్షణాద్గర్భం విముంచతి.
నక్లేశోనాపి సమ్మోహః
నరోగాది భయం క్వచిత్
నవా ప్రసవ దుఃఖాని
నవా హాని విధాయకం.
గృహస్థానాం సుఖకరో
యోగోయమతి దుర్లభః
కూచి మారేణ మునినా
కృపయా పరికీర్తితః"

"బ్రహ్మజెముడు పాలు నొసట పూసుకుంటే చాలు—కడుపు దిగిపోతుంది. ప్రమాదం లేదు. గృహస్థులకు మంచిది. కూచిమారుడు దీన్ని చెప్పాడు." అంటాడు ఈ వ్యాఖ్యాత.

రెండవది :—

"వాస్తుకస్య తు బీజాని
కర్షమాత్ర ప్రమాణతః
గృహీత్వా సేటు కార్త్యేన
జలేన సహ సంపచేత్,
అర్ధావశేషంతు పిబేత్
గర్భపాతో భవేద్ధ్రువం.
అయం యోగా నదేయస్స్యాత్
దుష్టానాం ప్రీతయే కదా."

మూడవది :—

"కటు తుంబీం బీజియుతాం
నీరేణ సహ పేషయేత్
యోనౌ ప్రలేప మాత్రేణ
క్షణా ద్గర్భం విముంచతి.
వేణ్వాః స్పర్శః తాలు కంఠ
మూలం స్నుక్క్షీర లేపనం,
భూం లాంగలికీ తుంబీ
సర్ప త్వక్కుష్ఠ సర్షపైః
పృథక్ ద్వాభ్యాం సమస్తైర్వా
యోని ధూపనలేపనం,
ఉష్ట్ర కంటక మూలంతు
ఉదకే పరిలేప యేత్.
హాటకస్య చ పిష్టాయాః
ధూమాద్గర్భం విముంచతి."

ఎప్పుడో ఒకప్పుడు గర్భపాతం సంగతేకాక నిరంతరం గర్భదుఃఖమే లేకుండా వంధ్యగానే వుండడానికి యోగాలు చెప్పాడు జ్యోతిరీశ్వరాచార్యుడు పంచసాయకంలో,

"పలాశ క్షీర ద్రుమయోః ఫలాని
పుష్పాణ్యథో శాల్మలి పాదపస్య,
మధ్యేన మాసార్ధ దినం నిపీయ
వంధ్యా భవే న్నిశ్చిత మేవ నారీ.
ఫలం కదంబస్యచ మాక్షికాని
తుషోదకేన త్రిదినం నిపీయ
స్నానావసానే నియమేన చాపి
వంధ్యామవశ్యం కురుతే హలేన.
కర్షద్వయం రాక్షస వృక్షబీజం
సప్తాహ మాత్రం సితశాలివారా,
రతౌ నిపీతం మృగశాబకాక్ష్యాః
వంధ్యాత్వ మేతన్నియతం కరోతి."

(తృతీయ సాయకం)

కల్యాణ మల్లుడు అనంగ రంగంలో వంధ్యాత్వయోగాలు కొన్ని చెప్పాడు :—

"గుడం ప్రతైహో యువం ఖాదేత్
పలమాత్రం తు నిత్యశః
మాసార్ధం సా భవేత్ వంధ్యా
యావదాయుర్న సంశయః
తుషతోయేన పంక్త్యాధ్య
మూలమగ్ని తరూద్భవం,
పుష్పవనే త్రిదినం
పీత్వా వంధ్యాభిజాయతే.
చందనం సర్వపాశ్చాత్ర
శర్కరా సమ భాగశః
పీత్వా తండుల తోయేన
రామారక్తం విముంచతి
రక్తో భూరుహ బీజాని
పలార్ధం తండులాంభసా,
ఋతౌ పీతంతు సప్తాహం
వంధ్యాంకుర్వాన్న సంశయం."

(షష్ఠస్థలం — 73—76.)

ఈ చర్చను బట్టి మన పూర్వులు గర్భపాత సంతాన నిరోధాలను మహాపాపంగా భావించలేదని, స్మృతికారులు కొందరు నిషేధించినా, జనం దానిని అంతగా పాటించలేదని స్పష్టం. కామసూత్రకారులు కొందరికి మాత్రమే చెప్పిన పద్ధతులు నేడు అందరికీ అన్వయించడంలో తప్పు లేదని భావిస్తున్నాము.

ప్రాచీనకాలంలో మనదేశంలోనేకాక ఇతర నాగరికత చెందిన దేశాలలోను సంతాననిరోధ సాధనాలు వాడుకలో వున్నట్లు విల్ డూరెంట్ చెప్పిన మాటలు ఉదహరిస్తాము:—

"In 1850 B. C. many contraseptimes were prescribed by Egyption doctors in Kahom Pepyres" (P P 183 Medical History of Controsepters by Norman Himes quoted by will Durent in his Our Oriental Heritage.)

చెయ్యాలి. జపమూ తపమూ చెయ్యాలంటే ఉత్తమ కుల సంజాతుడై ఉండాలి.

శే.తం :— అయ్యబాబోయ్! ఎన్ని నిబంధనలు! తీగ కదిలిస్తే డొంకంతా కదిలినట్టుంది వ్యవహారం!

శాస్త్రి :— మరి 'నా ఋషిః కురుతే కావ్యం' అని వూరికే అన్నారా?

శే.తం :— అంటే ఏమిటండి శాస్త్రిగారూ?

శాస్త్రి :— ఋషికానివాడు కావ్యం వ్రాయలేడు. వ్రాయ కూడదు — అని దాని అర్థం.

శే.తం :— వేదవాక్కు! మరి అల్లాటప్పా వాళ్ళంతా కావ్యాలు రాసేస్తే అవి పురుషార్థాల్ని ఎలా ప్రబోధిస్తాయి? ధర్మాన్ని ఎలా సంస్థాపిస్తాయి? ఒరే శేఖరం! నువ్వు గుట్టుగా కాలేజీ చదువులు చదువుకో. కవిత్వమనీ, కాకరకాయనీ అసలు చదువుకు నీళ్ళొదులు కోకు. ఆ విద్యలు మనకు వంటబట్టవు.

శాస్త్రి :—ఒక సత్కార్యాన్ని నిర్వహించేముందు నిష్ఠగా, నియమబద్ధంగా నిర్వహిస్తేనే అది సత్ఫలితాన్నిస్తుంది. లేకుంటే అది మనకే కాదు—లోకానికీ ప్రమాదమే! యజ్ఞం ఉంది. దాన్ని శాస్త్రసమ్మతంగా చేస్తేనే విశ్వశ్రేయస్సు నిస్తుంది. అన్యథా అదే విశ్వప్రళయానికి హేతు వవుతుంది. కవిత్వం కూడా యజ్ఞంలాంటిది.

## 2

(కళాశాల ఆవరణలో పండిత పరమేశ్వరశాస్త్రికి సన్మాన సమావేశం)

ప్రిన్సిపాల్ :—ప్రియమైన విద్యార్థినీ, విద్యార్థులారా! పండిత కవి శ్రీమాన్ పరమేశ్వరశాస్త్రిగారిని గురించి కొత్తగా పరిచయం చేయ నక్కరలేదు. ఆంధ్రదేశంలో వీరి నెరుగనివా రుండరు. ఒక సమయం వీరి నెరుగకపోయినా వీరి రచనలతో పరిచయం లేని వారుండరు.

సభలో నుంచి :— నేనున్నాను.

ప్రిన్సిపాల్ :— (విననివాడివలె) వీరు కవిసార్వభౌములు. శతాధిక గ్రంథకర్తలు. ఆంధ్రదేశం వీరిని కనకాభిషేక, గజారోహణలతో గౌరవించింది. కేంద్ర, రాష్ట్ర అకాడమీలు పోటీలుపడి వీరి ననేకమార్లు సత్కరించాయి. పూర్వకవులంతా కలిసి వీరిరూపంలో అవతరించినట్టు పండిత లోకం భావిస్తున్నది. కొన్ని యుగాలతర్వాతగాని ఇంతటికవి జన్మించడు.

సభలో :— కొన్ని యుగాలముందు ఉండవలసినవాడు ఇప్పుడు పుట్టి మా ప్రాణాలు తీస్తున్నాడు.

ప్రిన్సిపాల్ :— ఈ సంవత్సరం నోబెల్ బహుమతి కూడా వీరికే వస్తుందని పైవర్గంలో చాలామంది ఎదురుచూస్తున్నారు. (సభలో నుంచి:—పైవర్గంలో ప్రయత్నాలేమైనా జరుగుతున్నాయేమో!, మరొక కంఠం :— ప్రయత్నించేవాళ్ళకెంత వాటా?) ఇక మహాకవులు శ్రీమాన్ పరమేశ్వరశాస్త్రిగారు తమ అమూల్యమైన ప్రసంగాన్ని వినిపిస్తారు. నిశ్శబ్దంగా విని ఆనందించవలసిందిగా కోరుతున్నాను.

సభలో :— అమూల్యమేమీకాదు. దానికిమూల్యం నూటపదార్లు.

కవి :— సారస్వత బంధువులైన పెద్దలారా, పిన్నలారా: ఇలాంటి సన్మానాలు నాకేమీ కొత్తకాదు. నన్నిట్లా సన్మానించాలని మీరు సంకల్పించుకోవడం అంతా దైవకృప! (సభలో :— ఆ కృపగాడెవడుమధ్యలో.) ఈనాటి కిట్లా జరగాలని నా జాతకంలో ఉంది కాబట్టి, దానికి దైవ సంకల్పం తోడైనది కాబట్టి, మీకంతా పరిస్థితులు సమకూడి యీ భావం దృఢపడింది కాబట్టి—నాకీ సన్మానం ఇక్కడ జరుగుతోంది.

(సభలో:— జాతక కవిరత్నా! నీ 'బట్టీ' ఉపన్యాసం ప్రారంభం లోనే బోరు).

సరే! అసలు విషయానికి వస్తాను. సరస్వతీ సంబంధమైన దానిని సారస్వత మంటున్నాము. ఒకడు సరసునికి సంబంధించినది సారస్వత మెందుకు కాకూడదని కొత్త నిర్వచనం చెప్పవచ్చు. (కొత్త అయినదంతా సత్యమని శాస్త్రం చెప్పదు. (సభలో:—అది చెప్పినా మీలాంటివారు ఒప్పుకుంటారా స్వామీ?) మనకు కొన్ని నమ్మకాలున్నాయి. నమ్మకాల మీదే లోకం నడుస్తోంది. (సభలో:—మీరు సన్మానాల మీద నడుస్తున్నట్టు.) నమ్మకాలనే సంప్రదాయమంటున్నాము. సాహిత్యానికీ, సంప్రదాయానికీ ఎడని లంకె ఉన్నది. సంప్రదాయాన్ని గౌరవించని వాడికి సాహిత్యం కొరుకు పడదు. తన తల్లి యెవరో, తండ్రి యెవరో పిల్లవాడికి తెలియదు. నలుగురూ ఈమె నీ తల్లి, ఇతడు నీ తండ్రి అంటే నమ్ముతాడు. లోక వ్యవహారం ఇట్లా ఉంటుంది. ఒక పిల్లవాడుంటాడు. వాడు లోక వ్యవహారాన్ని నమ్మడు. గౌరవించడు. 'మీరు చెబుతున్నవాళ్ళే నా తల్లిదండ్రులని ఏమిటి రుజువు?' అని విడ్డూరంగా ప్రశ్నిస్తాడు. అలాంటివాడినిగురించి లోకం ఏమనుకుంటుంది? వాడికేదో పిచ్చిపట్టిందని, భగవంతుడు అందరికీ యిచ్చిన బుద్ధి వాడికివ్వలేదని జాలిపడుతుంది. సంప్రదాయమనేది ఇట్లా ఉంటుంది. సంప్రదాయంతోకూడిన సాహిత్యమే శివప్రదమవుతుంది. శివమనేది శక్తిసంబంధమైన ఒక లీల. అది సాహిత్యానికెట్లా సంభవిస్తున్నది? ఇది మహారహస్యం. అయినా ఎరిగినవాణ్ని కాబట్టి చెబుతున్నాను. ఒకచోట సాహిత్యానికా లీల సహజసిద్ధంగా సంభవిస్తుంది. మరొక చోట కవిచేత దానికా శక్తి ఆపాదింపబడుతుంది. ఇట్లా ఎందుకు జరుగుతుంది?— విశ్వశ్రేయస్సు కోసం. విశ్వ శ్రేయస్సంటే. . . .

(సభలో కలకలం)

ఒకడు :— స్వామీ! ఏమి మీ లీల?

మరొకడు :— మీ ఉపన్యాసం ఆపడమే ప్రస్తుతానికి మాకంతా శ్రేయస్సు.

వేరొకడు :— అంతా మాటల గారడీ!

ఇంకొకడు :— గారడీ కాదు— స్టంటు. నేలవిడిచిన సాము.

ఒకడు :— (లేచి, గట్టిగా) స్వాములూ! తొందరగా సన్మానం ముగించండి.

కవి :— ప్రిన్సిపాలుగారూ! ఏమంటోంది ప్రజ?

ప్రిన్సి :— తొందరగా మీకు సన్మానం చేయమంటోంది.

కవి :— సరే! కానివ్వండి. జనవాక్యంతు కర్తవ్యం.

(విద్యార్థులంతా లేచి వెళ్ళిపోతారు)

* * * *

(సన్మానానంతరం పరమేశ్వరశాస్త్రి ప్రత్యేకమైన గదిలో విశ్రాంతి తీసుకుంటున్నాడు. శేఖర్ ప్రవేశం.)

శేఖర్ :— (వినయంగా) నమస్కారం సార్! మీ ఏకాంతానికి భంగం కలిగిస్తున్నందుకు క్షమించండి.

కవి :— రా నాయనా. ఎవరు నువ్వు?

శేఖర్ :— ఈ కాలేజీ విద్యార్థినే సార్! సభలో విద్యార్థులు కొందరు అల్లరి చేశారు. అందుకు నేను చాలా చింతిస్తున్నాను.

కవి :— బ్రహ్మచారీ శత మర్కటః అన్నారు. ఏం చేస్తాం? అది వారి వయసు లక్షణం.

శేఖర్ :—మా విద్యార్థులలో ఒక ముఠా ఉంది సార్! వాళ్ళెప్పుడూ అంతే. అప్పటికీ మీరెంతో సహనం వహించారు. గతంలో ఇలాగే ఒక కవి ఉపన్యసిస్తుంటే ఈ ముఠా గొడవ చేసింది. అప్పుడా కవి మండి పడి 'మీకు నా ఉపన్యాసం వినే యోగ్యత లేదు. మీకు ఉపన్యాసం ఇవ్వడానికి రావడం నాదే బుద్ధి తక్కువ!' అని వేదిక దిగి వెళ్ళారు.

కవి :— అంతా దైవలీల.

శేఖర్ :— హాల్లో పార్టీ జరుగుతుంటే, మీరిక్కడ ఒంటరిగా కూర్చున్నారేం సార్?

కవి :— మాకు కొన్ని నియమాలున్నాయి నాయనా! ఎక్కడపడితే అక్కడ, ఏదంటే అది పుచ్చుకోవడం మా కలవాటులేదు.

శేఖర్ :— మంచి అలవాటు సార్!

కవి :— మంచి కుర్రాడిలా ఉన్నావు. ఏం చదువుతున్నావేమిటి?

శేఖర్ :— బి.ఏ. చదువుతున్నాను సార్!

కవి :— మంచిది. బాగా చదువుకో.

శేఖర్ :—మీరు సభలో మంచి మంచి సంగతులు చెప్పారు సార్! మీ ఉపన్యాసం ఇంకా వినాలనిపించింది. ఇంతలో రవిడీముఠా అడ్డు వచ్చింది. ఏకాంతంలోనైనా మీనుంచి కొన్ని మంచి మాటలు వినాలని వచ్చాను సార్!

కవి :— కవిత్వం రాస్తున్నావా?

శేఖర్ :— కష్టపడి, గణాలు లెక్కిస్తూ, కొన్ని పద్యాలు రాశాను సార్! అవి మీలాంటి పెద్దలకు చూపిస్తే అన్నీ తప్పులే అన్నారు. తప్పులు లేకుండా పద్యాలు రాయడం ఎలా సార్?

కవి :— ప్రారంభంలో అలాగే ఉంటుంది. సాధన చెయ్యాలి. తినగ తినగ వేము తియ్యనవుతుంది. సాధన చెయ్యగా చెయ్యగా ఏ కార్యమైనా సులభమవుతుంది.

శేఖర్ :— తప్పులు రాస్తే నరకం పోతారని —మా యింటికి మామూలుగా వచ్చే పంచాంగ శాస్త్రుర్లు చెప్పారు సార్!

కవి :— ప్రారంభంలో తప్పులు చెయ్యకుండా నేర్చుకోవడం ఎవరికి సాధ్యం?

శేఖర్ :—ఛందస్సులో మరణ గణాలు ఉన్నాయని చెప్పాడు సార్!

కవి :—తెల్సినా, కూర్చుంటే—మరణ గణాలే యేమి, గ్రహణ గణాలుకూడా ఉంటాయి. నీకు పద్యాలు రాయాలని ఉత్సాహం ఉంది. అది చాలు. ఆ భయాలూ, సంకోచాలూ అన్నీ వదిలిపెట్టి సాధన చెయ్యి. భగవంతుడు నీకు అండగా ఉంటాడు.

శేఖర్ :— సాధన ఎలా చెయ్యాలి సార్?

కవి :— ముందు ఛందస్సు నేర్చుకో. రోజూ ఒకటో, రెండో పద్యాలు క్రమం తప్పకుండా రాస్తూ ఉండు. మొదట నువ్వు ఛందస్సును వెతుక్కోవాలి. తర్వాత అదే తన్నుతాను వెతుక్కుని నీ వెంట వస్తుంది.

శేఖర్ :—ఈ పద్యం చూడండి సార్! మీ ఉపన్యాసం విన్న తర్వాత రాశాను.

కవి :— ఏదీ చదువు?

శేఖర్ :— యుక్తియుక్తమై విలువైన ఊహతోడ
సాహితీవేత్తలకు వెల సంతసమ్ము
మీ ఉపన్యాస ధారయే మేలితరము
పిల్ల కుంకల అల్లరికెల్ల గలదె!

కవి :— తేటగీతి పద్యం రాశావు. బాగానే ఉంది. యతిగణాలు తప్పలేదు. కాని భావం అన్వయం కుదరలేదు. అయినా ఫరవాలేదు. ప్రారంభ దశలో భావం ఎలా ఉన్నా, ఏ ఛందస్సునైనా సాఫీగా నడపడం అభ్యాసం చెయ్యి. అప్పుడే నీకావిద్య కొంతకుకొంత అలవడుతుంది. కవులు వాడిన ఛందస్సంతా ఒకటే! అదే ఛందస్సును నన్నయ్య ఒకలాగా నడిపిస్తాడు. తిక్కన ఒకలాగా నడిపిస్తాడు. శ్రీనాథుడు ఒకలాగా, పోతన ఒకలాగా, పెద్దన ఒక లాగా—ఒక్కొక్కరు ఒక్కో పద్ధతిలో నడిపిస్తారు. అంటే, అందరి పద్యాల్లోని ఛందస్సు ఒకటే అయినా, దాన్ని తమ సొంతం చేసుకున్నారన్న మాట. అలా సొంతం చేసుకోగల శక్తిగలవాడే కవిగా రాణిస్తాడు. ఛందస్సు తనకు బాగా వలిగి, సొంతమై సొంపుగా వినిపించే ఏ భావమైనా సులభంగా పొదిగించవచ్చును. అలా పొదిగించిన భావం శాశ్వతంగా రాణిస్తుంది.

శేఖర్ :—అయితే కవుల పద్యాలలోని విశేషాలను కొంత వివరించి చెబుతారా?

కవి :—సుప్రసిద్ధకవులు రాసిన పద్యం ఎక్కడ విన్నా అది ఫలానా కవిదని గుర్తుపట్టగలం. ఇది ఎలా సాధ్యమవుతోంది? ఛందస్సు మీద అధికారం సంపాదించిన కవి ముద్ర పద్యంమీద అలా ఉంటుంది. దాన్ని శైలి అంటాము. ఒక్కో కవి పద్యాన్ని ఒక్కో విధమైన శైలిలో నడుపుతాడు. ఆ శైలి ఆ కవి వ్యక్తిత్వాన్ని ప్రదర్శించేదిగా ఉంటుంది. తిక్కన పద్యం రాస్తాడు. అందులో ఛందస్సు ఉండదు. అంటే లేదని కాదు. ఉంటుంది. దాన్ని మనం వెతికితే కాని కనిపించదు. తిక్కన చెప్పదలచిన భావాన్నంతా వరసగా చెప్పేసి దాని ముద్దుమీద ఒక్క దెబ్బ కొడితే అది ఏదో ఒక పద్యరూపంలో ఎగిరి కూర్చుంటుంది. పోతన్న పద్యం రాస్తాడు. అలాకాదు. యతి దగ్గర పదం విరిగిపోతుంది. పాదంచివరిభాగం తెగిపోతుంది. దానివల్ల పద్యానికొక తూగు, సొగసు వస్తుంది. పోతన పద్యం మనం చదవకముందే నేను పద్యాన్ని అని చెప్పుకుంటుంది. తిక్కన పద్య శైలిలో ప్రౌఢత్వం ఉంది. పోతన పద్యశైలిలో సరళత్వం ఉంది.

శేఖర్ :— ఎవరి శైలి మంచిదంటారు?

కవి :—నువ్వు కవిగా అడిగితే ఎవరి శైలి నీకు మంచిది కాదు. 'హీన విద్య లెన్ని యైనను కులవిద్యకు సాటిరా'వన్నాడు గువ్వల చెన్నడు. 'స్వధర్మే నిధనః పరధర్మో భయావహః' అన్నాడు శ్రీకృష్ణభగవానుడు. మంచిదో చెడ్డదో నీ శైలే నిన్ను రక్షిస్తుంది. పాఠకుడిగా అడిగా వంటే సమాధానం వేరుగా ఉంటుంది.

శేఖర్ :— నన్ను పాఠకుడిగానే భావించి చెప్పండి.

కవి :— తిక్కన్న పద్యశిల్పం అనుకరించదగిందికాదు. పద్యశిల్పానికి నన్నయ్య, శ్రీనాథుడు, పోతన్నలను పరిశీలించాలి. వారి పద్యశైలిలో ఒక లయ, సంగీతం ఉంటుంది. తిక్కనలో నాటక శిల్పాన్ని, పాత్ర పోషణను తరచి చూడాలి. అది అనితరసాధ్యం. శ్రీనాథుడు సీస పద్యంలో, తిక్కన కందపద్యంలో, వేమన ఆటవెలదిలో సిద్ధహస్తులు. పద్యం రాయాలంటే — నేడైనా, రేపైనా దానికొకటే లక్ష్యం — అది సరాసరి ప్రజల నాలుకల మీదికి వెళ్ళాలి. పోతన, వేమన గ్రంథాలు తగులబెట్టినా ప్రజలమధ్యనుండి వాళ్ళని తొలగించలేము.

ప్యూను :— (ప్రవేశించి) కవిగారూ సార్! అయ్యగారు మిమ్మల్ని తీసుకు రమ్మన్నారండి.

కవి :— ఎవరు?

శేఖర్ :—ప్రిన్సిపాలుగారు మిమ్మల్ని రమ్మంటున్నారని ప్యూను వచ్చాడండి. ఇక నేను సెలవు తీసుకుంటాను సార్!

కవి :— మంచిది. నీ పేరేమిటన్నావు?

శేఖర్ :— శేఖరండి.

## 3

(గదిలో పదయంతో శేఖర్ లేచి లైటు వేసుకుని ఏదో రాసుకుంటున్నాడు. రూంమేటు రమణ పడుకుని ఉంటాడు.)

రమణ :—(ముసుగు తీసి) ఏమిట్రా శేఖరం? వేళాపాళా లేకుండా లేచి లైటువేసుకుని కూర్చున్నావు?

శేఖర్ :— (పలకడు).

రమణ:—మళ్ళీ ఏదైనా ఆవేశం కట్టలు తెంచుకున్నదా? నీ పిచ్చి పిడిగాను ఆ సిగరెట్ ప్యాకీ, అగ్గిపెట్టె ఇలా పడెయ్. పగవాడికి కూడా ఈ రచయిత బాధవద్దురా బాబూ! రచయితగా పాటు పడటంకన్నా అద్దం పడ అమ్మాయిని పోయిగా ప్రేమించేసి, కాలం కలిసిరాక ఆమె అందు లేక, కలిసివచ్చి చెంపమీద ముద్దు పెట్టుకుంటే— వెర్రిగా విరహ గీతాలు పాడుకోవడంలోనైనా ఎంతో సుఖం ఉంది.

శేఖర్ :— (సిగరెట్ అగ్గిపెట్టె అందిస్తూ) పిగరెట్టుకు వేళా పాళా లేదు. ఇంద రమణా!

రమణ :— థాంక్స్. ఏదీ, ఆ మాట మళ్ళీ అను.

శేఖర్:— ఏమిటి? వేళాపాళా లేదన్నదేనా?

రమణ:— అదికాదు. 'ఇంద రమణా' అన్నమాట. నువ్వు ఆ మాట అంటుంటే 'ఇందిరా రమణా' అన్నట్టుంది నాకు.

శేఖర్ :— ఛీ! నీ కెప్పుడూ అమ్మాయిల గొడవే!

రమణ :—అందులో ఉన్న మజా నీకేం తెలుసోయ్! ముఖంమీద పడని ముంగురులనూ, భుజంమీదినుంచి జారని పైటచెరగునూ మాట

శారద :— (కాయితం చూచి) ఎక్కడిదీ పద్యం?

శేఖర్ :— నేనే రాశాను.

శారద :—అమ్మో! కవివై పోతున్నావన్నమాట! ఇంతవరకూ నాకీసంగతే చెప్పలేదే?

శేఖర్ :— ఎలా చెప్పాలో తెలీక. . . .

శారద :— గుడ్. అయితే కవిత్వంలో పడి చదువుకు స్వస్తి చెబుతావా?

శేఖర్ :— లేదు మేడమ్! చదువు తర్వాతే ఈ ప్రయత్నం. కావాలంటే నా మార్కులు చూడండి.

శారద :— చూస్తున్నాను. ఇంతవరకు నీ మార్కులకేమీ ఢోకాలేదు. అయినా ఏ పరిస్థితుల్లోనూ చదువుకు ఈ కవిత్వాన్ని ఆటంకం చెయ్యకు. 'కవి ముఖేన కావ్యం రమ్యం' అన్నారు. దీన్ని నువ్వే చదువు.

శేఖర్ :— (కాయితం తీసుకుని సిగ్గుపడుతూ) నాకు పద్యం చదవడం రాదు మేడమ్!

శారద :— (చిరుకోపంతో) చదవడంరాదుకానీ రాయడం మాత్రం వచ్చునేమిటి?

శేఖర్ :— మీరు క్లాసులో ఛందస్సు చెప్పారు. మీరు చెబుతుంటే కవిత్వం రాయడమంటే ఇంతేనా అనిపించింది. రాయాలనిపించింది. ఇప్పో ఒప్పో రాసేసు న్నాను.

శారద :— మంచిదే. చదువు.

శేఖర్ :— (గొంతు సవరించుకుని)

కన్నుబొమలు వంచి కమలాక్షి సంధించె
చూపు తూపుగుండె నాటి గురిని
వింటి దెబ్బతిన్న విహగమ్ము కైవడి
తన్నుకొనియె మనసు తాపగతిని.

శారద :— అమ్మో, ప్రేమ కవిత్వం రాశానన్నమాట! అవునూ, ఇలాంటి పద్యం నాకు వినిపించ వచ్చా?

శేఖర్ :— (కంగారుగా) సారీ మేడమ్! తప్పైపోయింది క్షమించండి మేడమ్! (లేవబోయాడు).

శారద :— (నవ్వుతూ) రాసేప్పుడు లేని కంగారు ఇప్పుడెందుకు? కూర్చో. ఒక్కటడుగుతాను నిజం చెప్పు.

శేఖర్ :— అడగండి.

శారద :— ఎవరా కమలాక్షి?

శేఖర్ :— (గొంతులో వెలక్కాయ పడ్డట్టు) ఏదో ఊరికే. . .

శారద :— ఊరికే అని ప్రారంభించిందే చివరికి గొంతుకురి అవుతుంది. పోనీ 'కమలాక్షి' అంటే ఏమిటో తెలుసా?

శేఖర్ :— కమలముల వంటి కన్నులు కలది.

శారద :— కమలాలవంటి కన్నులెక్కడైనా చూశావా?

శేఖర్ :— మీరు చెప్పే పాఠంలో. . . .

శారద :— పాఠంలో విన్నావేకాని, నిజంగా చూడలేదన్నమాట.

శేఖర్ :— పద్యంలో ఛందస్సు తప్పులున్నాయేమో. . . .

శారద :— కవిత్వమంటే ఒక్క ఛందస్సే అనుకున్నావా?

శేఖర్ :— శంఖంలో పోస్తేనే గదా తీర్థం అవుతుంది? ఛందస్సులో చెప్పితేనేగదా కవిత్వమవుతుంది!

శారద :— ఛందస్సులో చెప్పింది మాత్రమే కవిత్వమైతే, నేడు కవిత్వం రాస్తున్న చాలామంది కసలు ఛందస్సే రాదు! వచ్చినా దానిలో రాయరు. వాళ్ళు రాసేది కవిత్వం కాకపోతున్నదా?

శేఖర్ :— (ఆశ్చర్యంగా) ఛందస్సు లేకుండా కవిత్వం ఉందా?

శారద :— ఉందని చెబుతున్నాగా! నీలాగే ఇప్పటి యువకవులా ఛందస్సులో రాస్తే అదెలా కవిత్వమవుతుంది? అని సందేహిస్తున్నారు.

శేఖర్ :— ఛందస్సు లేకుండా కవిత్వం రాసే కవులున్నారంటున్నారు కదా—మచ్చుకి ఒకరిద్దర్ని చెప్పండి?

శారద :— ఒకరిద్దరేమిటి, ఖర్మ! ఇప్పుడు రాస్తున్న వాళ్ళదంతా ఛందస్సులేని కవిత్వమే!

శేఖర్ :— అలా అయితే మా పాఠ్యపుస్తకాల్లో అలాంటి కవిత్వం ఒక్క పాఠంకూడా లేదే?

శారద :—పాఠ్య పుస్తకాలు వేరు. ప్రపంచ పద్ధతులు వేరు. పత్రికలు చదవాలి.

శేఖర్ :— అయితే కాలేజీ చదువులు నిత్యజీవితంలో కాసుకు పనికిరావంటారు.

శారద :— ఆ మాట నేననకూడదు. నీ కవిత్వం చదువు.

శేఖర్ :— ఇంక నేను చదవను.

శారద :— ఏం?

శేఖర్ :— నాది కవిత్వం కాదు.

శారద :— అలా అనకు. ఆ పద్యం అనుభవం మీరిన కవిచేతికింద తయారైనట్టుంది. చిత్రమైన భావన ఉంది. పద్యం సరళంగా సాగిపోయింది. తప్పులేమీలేవు. అయితే 'కన్నుబొమలు వంచి. . .'అన్నచోట 'కన్నుబొమల వింట కమలాక్షి సంధించె' అని మారిస్తే మరింత స్పష్టత వస్తుంది. అలాగే ఉంచినా ఇబ్బందిలేదు. అస్పష్టత కూడా ఆధునిక కవితాగుణాల్లో ఒకటిగా చలామణి అవుతోంది. అలాగే మరికొన్ని పద్యాలు రాసి, ఒక శీర్షికపెట్టి ఏదైనా పత్రిక్కి పంపు. తప్పక వేస్తారు.

శేఖర్ :— మొదట మీ మాటలతో అదిరిపోయాను. మీ సలహాలు తప్పక పాటిస్తాను. అందుకే అన్నారు ఉరిమే మేఘమే అమృతం వర్షిస్తుందని.

శారద :— మాటల్లో కూడా కవి వని రుజువు చేసుకుంటున్నావు.

4

(రమణ సిగరెట్ కాలుస్తూ, పత్రిక తిరగేస్తూ, గదిలో అడుగు పెడతాడు.)

రమణ :— ఒరే శేఖర్! నీ పద్యాలు పత్రికలో వచ్చాయిరా. కంగ్రాట్యులేషన్స్.

శేఖర్ :— (ఆతృతగా) నిజంగా?

రమణ :—సందేహమెందుకు? చూసుకో. (అని పత్రిక ఇస్తాడు)

శేఖర్ :—(గబగబా చదివి) అచ్చులో చూస్తుంటే ఇవి నేను రాసినవేనా అని సందేహం కలుగుతోంది.

రమణ :— నీ కవిత్వం అచ్చుకెక్కితే నీకే ఆశ్చర్యంగా ఉందా? ఎటూ గోదాలోకి దిగేశావు. ఇక ఆలస్యం చేస్తే ప్రయోజనంలేదు. నిర్విరామంగా కవిత్వం రాయాలి. ఏ పత్రిక తీసుకున్నా నీ కవిత్వమే నిండాలి. ఏమంటావు?

శేఖర్ :— నీ ఆశీర్వాదబలముంటే —

రమణ :— అస్తు. అవునూ, ఈమధ్య మేడమ్ దగ్గరకెళ్ళావే— ఏమన్నది? నా గొడవలో పడి అడగడమే మరిచాను.

శేఖర్ :— ఈ పద్యాలే సరిచూచిపెట్టింది. మొదట మాటలతో అదరగొట్టేసింది. ప్రశ్నలమీద ప్రశ్నలు గుప్పించింది. ఆ ప్రశ్న లెలాంటివంటావు? అన్నీ సమాధానంలేని ప్రశ్నలే! నా బుర్ర తిరిగిపోయింది. ఎందుకు వచ్చానా అనిపించింది.

రమణ :— కోతలు కోస్తున్నావేమిట్రా?

శేఖర్ :— తాత కెవడైనా దగ్గులు నేర్పుతాడా? నీముందు నేను కోతలు కోయటమేమిటి? నా పద్యం విని ఏమన్నదో తెలుసా? నేను ప్రేమ కవిత్వం రాశానుట. ప్రేమకవిత్వం తనకు వినిపించవచ్చునా? అని ప్రశ్నించింది.

రమణ :—ఏమిటి? కథ అడ్డం తిరిగిందే! ఈ సంగతులన్నీ ఇంతవరకెందుకు చెప్పలేదు?

శేఖర్ :— (నవ్వుతూ) మొదట నీలాగే నేనూకంగారు పడిపోయాను. పిమ్మట ఆమే నా భయాన్ని పోగొట్టింది. ఛందస్సొకటే కవిత్వం కాదు. అయినా నీలో కవితాశక్తి ఉంది. ఆ పద్ధతిలోనే మరికొన్ని పద్యాలు రాసి ఏదైనా పత్రిక్కి పంపు అంది.

రమణ :—(పగలబడినవ్వి) వోరి వెర్రినాగన్నా! మేడమ్ మొదట నిన్నెందుకు అదరగొట్టిందో ఇప్పుడు తెలిసింది.నిన్ను తన శిష్యుడిగా చేర్చుకోవటానికి తగినవాడివో, కాదో అని నిన్ను పరీక్షించింది. తర్వాత నీ నిష్కాపట్యాన్ని గుర్తించి సలహా యిచ్చింది. మేడమ్ బాగా చదువుకున్న వ్యక్తి. సాహిత్యం గురించి ఆమెకు తెలిసినంతగా చాలామందికి తెలియదు. సంప్రదాయాన్ని ఎంత కూలంకషంగా అధ్యయనం చేసిందో, ఆధునిక సాహిత్యాన్ని కూడా అంత సునిశితంగా పరిశీలించిన, పరిశీలిస్తున్న వ్యక్తి. కొంతమంది ఉంటారు—వారికీ నిఘంటువులూ, లక్షణశాస్త్రాలూ తప్ప మరేమీ అక్కరలేదు. జీవిస్తున్న కాలాన్ని మరచి, నేలవిడిచినసాము చేసే వాళ్ళంటే నాకు వళ్ళమంట. మేడమ్ అలాంటిదికాదు. శాస్త్ర సంప్రదాయంతోపాటు ఆధునిక ప్రయోగ విజ్ఞానం తెలిసిన మేధావి.అలాంటి వాళ్ళంటే నాకు చాల గౌరవం. ఆమె శిష్యరికం నీకు చాలా అవసరం.

శేఖర్ :— ఏవో అనుకున్నా. నీకూ చాలా విషయాలు తెలుసన్నమాట!

రమణ :— నాకు అవసరంలేకపోయినా అవన్నీ నీకోసం తెలుసుకుంటున్నాను. నా మిత్రుడు ఒక గొప్పకవి అని చెప్పుకోవడం నాకు మాత్రం గర్వంకాదేమిటి? ఒకసారి మేడమ్ ఆధునిక కవిత్వాన్ని గురించి క్లాసులో వివరిస్తూ అంది—గురజాడ అప్పారావు ఆధునిక సాహిత్యానికి వాల్మీకి లాంటివాడు. ఆయన కవిత్వంలో జాతీయత, ఆత్మపరత, వాస్తవికత ప్రధాన గుణాలనీ, తర్వాత ఆ గుణాలే దేనికది విడిపోయి ఒక్కొక్క ఉద్యమంగా రూపుదాల్చాయనీ!జాతీయత—జాతీయకవిత్వోద్యమంగానూ, ఆత్మపరత—భావకవిత్వోద్యమంగానూ, వాస్తవికత—అభ్యుదయ కవిత్వోద్యమంగానూ విస్తరించాయట! ఆ మాటలు నా మనస్సులో అలాగే నాటుకుపోయాయి. ఆధునిక సాహిత్యంలోని మూలతత్వాన్ని అరటి పండొలిచి చేతికిచ్చినట్టు వివరించింది. ఎందుకు చెబుతున్నానంటేఆమెకు సాహిత్యం మీద ఉన్న అవగాహన, అధికారం అలాంటివి. నువ్వు ప్రాచీన కవిత్వాన్ని గురించి చాలా చదివి వున్నావు. నీకింకా ఆధునిక సాహిత్యంతో మంచి పరిచయంలేదు. నువ్వు మేడమ్ దగ్గరికెళ్ళి ప్రాచీన సాహిత్యంలోని సంప్రదాయపు విలువలనూ, ఆధునిక సాహిత్యంలోని ప్రయోగ రహస్యాలనూ వివరంగా తెలుసుకో. కవి అన్నవాడు కాలానికన్నా ఒకడుగు ముందు ఉండాలన్నారు. ముందు—మాట ముందు రోజులు నిరూపిస్తాయి. నువ్విప్పుడు కాలంతోపాటైనా నడవడానికి ప్రయత్నించు. తొందరగా దేశం చేత గుర్తింపబడతావు. దేశానికింత మేలు చేయగలిగినవాడవవుతావు. వెనుకడుగు వేశావో, లోకం మాట అటుంచి—ముందు నేను నిన్ను బ్రతకనివ్వను.

శేఖర్ :— రాయటం ప్రారంభిస్తే నువ్వూ—గొప్ప కవి వయ్యేట్టున్నావు.

రమణ :— అర్హత తెలియకుండా ప్రవర్తించేటంత వెర్రివాణ్ని కాను నేను. చెప్పటం తప్ప, చేయటం నాకు చేతకాదని నాకు తెలుసు. భగవంతుడు నీకు రాసేశక్తి యిచ్చాడు. నాకు మాట్లాడే శక్తి యిచ్చాడు. దానితో తృప్తిపడి ఎవరికి చేతనైన కళలో వాళ్ళు పరిశ్రమించడం మంచిది. నాకు చేతనైన కళతో నీలోని కళను ప్రేరేపించడం మనకూ, లోకానికీక్షేమం.

* * * *

శేఖర్ :— ఈసారి పద్యాలు కాదు. మీ దగ్గిర కొన్ని విషయాలు నేర్చుకోవడానికి వచ్చాను.

శారద :— నీ పద్యాలు పత్రికల్లో బాగా అచ్చవుతున్నాయి కదా!

శేఖర్ :— మీ చలవ! ఇప్పుడు ఆధునిక కవిత్వాన్ని గురించి, కవులను గురించి, వచన కవిత్వం గురించి తెలుసుకోవాలని వచ్చాను.

శారద :— అంటే—ప్రాచీన కవిత్వాన్ని గురించి కూలంకషంగా నేర్చుకున్నావన్నమాట!

శేఖర్ :— కూలంకషంగాకాదు గానీ, ఏదో కొంతకు కొంత చదువుకున్నాను. ఆధునిక కవిత్వాన్ని గురించి ఆమాత్రం గూడా తెలీదు.

శారద :— కొంతకు కొంత — అంటే?

శేఖర్ :— భారత భాగవతాలు పూర్తిగా కాకపోయినా అక్కడక్కడా ప్రధానమైన ఘట్టాలు చదివాను. వేదంవారి వ్యాఖ్యతో శ్రీనాథ నైషధాన్ని, రాయల ఆముక్తమాల్యదనూ చదివాను. మనుచరిత్రనూ, వసు చరిత్రనూ చదివాను. ముద్దు పలుకుల ముక్కుతిమ్మన్న పారిజాతాపహరణమునూ, ప్రతిపద్య చమత్కృతితో కవిత్వపు పస చూపిన చేమకూర విజయవిలాసాని చదివాను.

శారద :— తెనాలి రామకృష్ణయ్య కవిత్వమేమీ చదవలేదా?

శేఖర్ :— నిగమశర్మోపాఖ్యానం చదివాను.

శారద :— పాండురంగవిభుని పదగుంభనంబు — అన్నారు. దానికేకాదు, ఇంకా చాలా విషయాలకు అతని పాండురంగ మాహాత్మ్యం

శ్రద్ధగా అధ్యయనం చేయవలసిన గ్రంథం. సరే, కవులూ కావ్యాల పేర్లు చెప్పి చదివినానంటే సరిపోదు. ప్రాచీన కవిత్వతత్త్వం ఏమిటి? అది ఎన్నిరకాలు? వాటి ప్రభావ ప్రయోజనాలేమిటి?— తెలుసుకున్నావా?

శేఖర్ :— ప్రాచీన సాహిత్యమంతా వేదవాఙ్మయమూ, పురాణాలూ, కావ్య ప్రబంధాలూ అని మూడు భాగాలుగా విడదీయవచ్చునని తెలుసుకున్నాను. వేదం ప్రభుసమ్మితంగా, పురాణం సుహృత్ సమ్మితంగా, కావ్యం కాంతాసమ్మితంగా తమ ప్రభావాన్ని చూపుతాయని విన్నాను. పురాణ కవిత్వం ఆముష్మిక చింతననూ, కావ్య ప్రబంధాలు ఐహికపర నిర్వృతినీ— ప్రాచీన కవిత్వం సామూహికంగా విశ్వశ్రేయస్సునే ప్రధాన ప్రయోజనంగా కలిగినవనీ తెలుసుకున్నాను.

శారద :— అదే విధంగానే ఆధునిక కవిత్వం ఎన్ని విధాలుగా విభజించవచ్చునని తెలుసుకున్నావు?

శేఖర్ :—జాతీయ కవిత్వం, భావ కవిత్వం, అభ్యుదయ కవిత్వం అని విన్నాను. వీటి గురించి వివరంగా వినాలని కుతూహలపడుతున్నాను.

శారద :— ఏ కవిత్వమైనా ఆత్మాశ్రయ గుణం ఇంతో అంతో కలిగి ఉంటుంది. అసలు కవిత్వం యొక్క లక్షణం ఏమిటో తెలుసా?

శేఖర్ :— ఏది కవిత్వమనే సంగతి కవులందరికీ తెలుసు. ఎలాంటిదో చెప్పమంటే ఎవరూ చెప్పలేరట. అయినా, చాలామంది చెప్పటానికి ప్రయత్నించారు. లయబద్ధమైన భావప్రకటన— అని చెబితే ఛందోబద్ధ కవిత్వాని కాలక్షణం సరిపోవచ్చు. వచనంలోగూడా కవిత్వం వస్తున్న నేటి కాలంలో ఆ నిర్వచనం సరిపోదు. బుద్ధిద్వారా ప్రకటింపబడ్డ స్పష్టమైన ఉద్రేకమే కవిత్వమని నేడు లక్షణం చెప్పుకోవచ్చు ననుకుంటాను.

శారద :— చాలాదూరం ఆలోచించి ఉన్నావన్నమాట. ఇవన్నీ కాలానుగుణమైన నిర్వచనాలు. 'వాక్యం రసాత్మకం కావ్యం' అన్న నిర్వచనం త్రైకాలిక సత్యం. రసవంతంకాని వాక్యం ఏనాటికీ కవిత్వంకాదు. రసానికీ —ఆత్మాశ్రయ గుణానికీ సన్నిహితమైన ఒక లంకె ఉంది. ఆత్మాశ్రయ గుణమే ప్రధానంగా కలిగింది భావకవిత్వం. అందువల్ల భావకవిత్వమంటే —వట్టి కవిత్వం ముద్దు. భావకవిత్వమంటే ఒక్క ప్రేమ కవిత్వమనే భ్రాంతి చాలామందిలో ఉంది. అది తప్పు. భక్తి కవిత్వం, ప్రకృతి కవిత్వం ప్రేమ కవిత్వం—అంతా కలిసి భావ కవిత్వంగా వ్యవహరింపబడుతోంది. అసలు జాతీయోద్యమ కవిత్వంలో ఆత్మాశ్రయగుణమే ప్రధానంగా వుంటుంది. ఆత్మాశ్రయగుణం ఉన్నచోట వేడీ, వేగమూ ఆవేశమూ ఎక్కువగా ఉంటాయి. జాతీయోద్యమ కవిత్వంలో ఇదే మనకు కనిపిస్తుంది.

శేఖర్ :— ఈ కవిత్వాన్ని రచించిన కొంతమంది కవులను చెప్పండి. వారి పుస్తకాలు సంపాదించి చదువుకుంటాను.

శారద :— జాతీయోద్యమంలో కొట్టుకుపోనివారు ఆనాటి కవుల్లో ఎవరూ లేరు. అయితే బలంగా తమ గొంతుల్ని పలికించినవారు కొందరు లేకపోలేదు. రాయప్రోలు, విశ్వనాధ, తుమ్మల, జాషువా—ఇంకా చాలామంది ఉన్నారు. భావ కవిత్వం మూడు రకాలుగా ఉంటుందనుకున్నాము గదా, ఈ రకమైన కవిత్వం ఈయనే రాశాడని విభజించి చెప్పడానికి వీల్లేదు. భావ కవి అన్న ప్రతిఒక్కడూ కొద్దో గొప్పో ఈ మూడురకాల కవిత్వాల్లోనూ వ్రేలుపెట్టక పూరుకోలేదు. ఇది ఎవరితో ప్రారంభమై, ఎవరితో ముగిసిందన్న ప్రశ్నకన్నా, తనకవిత్వ పటుత్వంచేత దేవులపల్లి కృష్ణశాస్త్రి ఈ ఉద్యమానికి నాయకుడుగా ప్రకాశించాడు. ఈయన తర్వాత ప్రముఖంగా వినిపించే పేరు బసవరాజు, వేదుల, నాయని, అబ్బూరి, తల్లావఝుల — ఇంకా మహా మహా పండితులంతా ఈ కవిత్వం వినిపించారు. భావ కవిత్వం మీద తిరుగుబాటుగా వచ్చింది అభ్యుదయ కవితోద్యమం. దీని స్థాపకుడు శ్రీ శ్రీ. అభ్యుదయ కవిత్వం సామాజిక ప్రయోజనం ప్రధానంగా కలది. సామ్యవాదం దీని ధ్యేయం. సమ సమాజ నిర్మాణం దీని లక్ష్యం.

శేఖర్ :— ఈ కవిత్వం రాసిన వారి పేరు చెప్పండి.

శారద :— ఒకరా? ఇద్దరా? నేను చెప్పితే సాయంత్రం ఎంతమంది పేర్లు చెప్పగలను. అభ్యుదయ కవిత్వం ఎంతోమంది రాశారు. రాస్తున్నారు. ఈ ఏడాది శ్రీశ్రీ అభ్యుదయ రచయితల సంఘం నుంచి వీడిపోయి, విప్లవ రచయితల సంఘం అధ్యక్షుడయ్యాడు. ఈ సంఘంలో కొడవటిగంటి, రా.వి.శాస్త్రి, కె.వి.రమణారెడ్డి, వరవరరావు ఇంకా మొదలు పేర్లతో చాలామంది ఉన్నారు. రక్తపాత విప్లవమే విరసం ధ్యేయం. ఐతే రచయిత 'నిమగ్నుడు' కావాలా 'నిబద్ధుడు' కావాలా అని ఇంకా వీరిలో వీరే వాదులాడుకుంటున్నారు. ఒక స్పష్టమైన అవగాహన వీరికింకా ఏర్పడలేదు. అది ఏర్పడేవరకు వేచి చూదాం. వీరి కవిత్వం చూసి ప్రజలు మొదట బెదురుకుపడ్డారు. దాని తత్వం తెలుసుకున్నారేమో— ఇప్పుడు మామూలైపోయింది. దీనికి ఈ రచయితలను అరెస్టు చెయ్యడం, కవిత్వాన్ని నిషేధించడం—మొదలైనవికూడా కొంతకారణం కావచ్చు. విప్లవ కవిత్వం కంటే దీనికిముందువచ్చిన దిగంబరకవిత్వం ప్రజల్ని మరీ పిచ్చిగా ఆకర్షించింది. ఇది ఆరుమందితో లేచిన దుమారం. వీరిది నబాయింపు కవిత్వం. కొంతమంది తిట్టు కవిత్వమని కూడా అన్నారు. వీరికి సమాజంలో ఏదీ నచ్చకపోయినా, సమకాలీన సమాజంలోని కుళ్ళును మాత్రం బాగా ఎత్తి చూపించారు. మూడు కవితా సంపుటులు వెలువరించిన పిమ్మట— తప్పుచేసినట్టు లెంపలేసుకుని వెక్కిళ్ళు పెట్టుకుని—విప్లవ కవుల్లో కలిసిపోయారు. ఈమధ్య 'చేతనావర్తం' కవులని నలుగురు వెలసి రెండు కవితాసంపుటులు ప్రచురించి ఉన్నారు. ఏ సిద్ధాంత రాద్ధాంతాలతో నిమిత్తం లేకుండా ప్రయోజనకరమైన మంచికవిత్వం ఎట్లా రచించవచ్చో వీరు నిరూపించారు. పోతే శ్రీశ్రీ విడిపోయాక అరసం ఆరుద్ర, దాశరథి, అనిసెట్టి మొదలైనవారిచేత పునరుద్ధరింపబడింది. 'వాసో' ఈ సంఘం అధ్యక్షులు. ఈ సంఘంలో ఇంకా కుందుర్తి, సోమసుందరం, సి.నా.రె., పలకా, కె. సభా, మధురాంతకం, శీలా వీర్రాజు, నాగభైరవ, తె.రామలక్ష్మి, వాసిరెడ్డి సీతాదేవి, నవనీ నిర్మల ప్రభావతి ఇంకా సుప్రసిద్ధులెందరో ఉన్నారు. దేశంలోని రచయితలంతా అటు విరసంలోనో, ఇటు అరసంలోను సభ్యులైపోయారు. వీరు వాదులాడుకోవడంలో పోటీపడకుండా సాహిత్య సృజనలో పోటీపడితే దేశానికెంతో మేలు చేసినవారవుతారు. ఆంధ్రసాహిత్య భవిష్యత్తు ఎలా ఉంటుందో వేచిచూద్దాం.

శేఖర్ :— నాకొక్క సందేహం. ఇన్నాళ్ళు వచనం రాసేవాడు రచయిత అనీ, పద్యం రాసేవాడు కవి అనీ వ్యవహరిస్తూ వచ్చాము. ఇప్పుడు 'వచనపద్యాలు' రాసేవాడి నేమని పిలవాలి?

శారద :—మీటర్‌తో నిమిత్తమేముంది? ఎట్లారాసినా కవిత్వం కవిత్వమే! కవిత్వం రాసేవాడు కవి. కథ రాసేవాడు కథకుడు. వ్యాసం రాసేవాడు విమర్శకుడు.

శేఖర్ :— నవల రాసేవారి నేమనాలి?

శారద :— నవలలో గూడా కథ ఉంది కదా!

శేఖర్ :— మన ప్రాచీన కవులు చంపూ కావ్యాలని రాశారు— పద్యాల నడుమ గద్యంకూడాచేర్చి! మొదట్లోనేను ఆగద్యాన్ని మీది పద్యాలకు వివరణేమో అనుకున్నాను. చదివితే ఏముంది? గద్యం కూడా పద్యంతో పాటు సమానంగా కథను నడిపేదిగా తెలుసుకున్నాను.వచనానికి పద్యంతో సమానమైన విలువ యివ్వడం సమంజసమే నంటారా?

శారద :— నువ్వేమో పద్యంతో సమానమైన గౌరవం గద్యాని కివ్వడం అన్యాయ మంటున్నావు. అంతర్జాతీయ సాహిత్యంతో సంబంధ మున్న ఆధునికులేమంటున్నారో తెలుసా? గద్యంతో సమానమైన గౌరవం పద్యానికంట గట్టటం అదెట్లా సాధ్యం? — అంటున్నారు. దీనికేమనాలి?

శేఖర్ :— ఇది మరీ విచిత్రంగా ఉంది.

శారద:— ప్రాచీన సాహిత్యమంతా పద్యం రాజ్యం చేసింది. ఆధునిక సాహిత్యంలో వచనం కిరీటం ధరించింది. యుగానికీ, యుగానికీ విలువలు మారిపోతూంటాయి. పూర్వం పద్యం గద్యానికింత చోటిస్తే నేడు గద్యం విశ్వరూపసందర్శి పద్యాన్ని మింగేసింది. గద్యానికి అధికారం మన సాహిత్యంద్వారా లభించలేదు. ఆంగ్ల సాహిత్య ప్రభావంతోనే వచనానికి ఔన్నత్యం లభించింది. వ్యావహారిక భాష కావ్యభాష కావడంతో వచన కవిత్వం విధిగా ఆచరణ యోగ్యమూ, సాధ్యమూ అయింది.

## 5

### (కొంతకాలం తర్వాత)

శారద:—శేఖర్! ఈకొద్ది కాలంలో కవిగా ఇంత పేరు తెచ్చుకుంటావనుకోలేదు.

శేఖర్ :—ఈ మోడున చిగురింపజేసింది మీరారు. ప్రాణాలు పోయి సర్వస్వమిది మీరారు. ఆ కీర్తి అంతా మీదిది.

శారద :— నేను వనమాలిని మాత్రమే! మొక్కలో జీవశక్తి ఉంటేనేకదా వనమాలి సేవలు ఫలిస్తాయి.

శేఖర్:—ఈ మాసం ఒక సాహిత్య పత్రికలో నామీద విమర్శ వ్రాశారు.

శారద:— చూశాను. అందువల్లే నీ కీర్తి పెరిగిందంటున్నాను.

శేఖర్ :—నన్ను విమర్శిస్తే, కీర్తి పెరగటం ఎట్లా అవుతుంది?

శారద :—కాసిన చెట్టుకే రాళ్ళదెబ్బలు. కీర్తివస్తేనే విమర్శ వస్తుంది. విమర్శతో నీ గిరాకీ పెరుగుతుంది. వివాద విమర్శ వచ్చిందంటే అర్థమేమిటి? దేశం నిన్ను గురించి ఆలోచించవలసినంత ఎత్తుకు పెరిగావన్న మాట!

శేఖర్ :— ఏమైనా విమర్శలో న్యాయం లేకపోలేదు.

శారద :— దోషరహితమైన కార్యం లోకంలో లేదు.

శేఖర్ :— విమర్శలో ఒక విషయం — నా రచనల్లో ఒక దృక్పథం లేదట.

శారద:— ఒక విషయమేకాదు, ఆ విమర్శకు అసలు విషయమే అది. కవితా, వనితా, లతా—ఇవి మూడూ ఒక ఆధారం లేకుండా నిలబడలేవు. లతకుమల్లే—ఆధునిక యుగంలో కవిత్వం ఒక సిద్ధాంతాన్ని, వనిత ఒక ఉద్యోగాన్ని ఆధారం చేసుకుని నిలబడాలనేది ఆ విమర్శకుని అభిప్రాయం.నువ్వు నిత్యజీవితంలో నిన్ను కదిలించే సంఘటనలమీద కవిత్వం రాస్తున్నావు. అంటే అనుభవం నీ కవిత్వానికి ఆధారం. అదీ ఒక దృక్పథం కాదంటావా?

శేఖర్:—నా మీద అభిమానంతో అనుభవాన్ని సమర్థిస్తున్నారు.

శారద :— ఏ లక్ష్యమూ లేకుండా రచన చెయ్యడం కన్నా మంచిదో, చెడ్డదో ఒక లక్ష్యాన్ని ఏర్పరచుకోవడం మంచిది—విశ్వనాధకుమల్లే! ఒక లక్ష్యమనేది ఏర్పరచుకునేముందు అది మంచిదా, చెడ్డదా అని ఆలోచించడం మంచిది—శ్రీశ్రీకి మల్లె!

శేఖర్ :— కవిత్వానికి మంచిశైలి ఉంటే చాలనుకున్నాను ఇన్నాళ్ళు. పండితకవి పరమేశ్వరశాస్త్రి గారు కూడా అదే చెప్పారు.

శారద :— ఆ శైలివల్లే దేశంచేత ఇంత తొందరగా గుర్తింపబడ్డావు. సద్యః పరనిర్వృతి కావ్యప్రయోజనంగా ఉన్నకాలంలో శైలికి ప్రాధాన్యత ఉండేది. సామాజిక సందేశం కవిత్వ ప్రయోజనమైనప్పటి నుంచి కవితావస్తువు ప్రాధాన్యత వహిస్తోంది. వస్తు ప్రాధాన్యత అన్నప్పుడు కవికి స్పష్టమైన ఒక దృక్పథం అవసరం. భాష, ఛందస్సు, భావం — ఈ మూడింటూ బావి తరానికి మార్గదర్శకమై, ప్రజా సామాన్యానికి సన్నిహితమైన ఒక స్పష్టమైన అభిప్రాయానికి రావాలి.

శేఖర్ :— ఎలాంటి బాష శ్రేష్టమైనదంటారు?

శారద :— వాడుక బాష నేడు సాహిత్య సామ్రాజ్యాన్ని పరిపాలిస్తోంది. ఇందులో సందేహం లేదు. వాడుక బాషను స్వీకరించాక విధిగా వచన ఛందస్సే దాని కనుకూలమైన వాహిక. వాడుక భాషలో శార్దూల మత్తేభాలు నడువవు కదా! ప్రజల భాషను స్వీకరించినప్పుడు ప్రజల సమస్యలను గురించి రాయటమే శ్రేష్టమైన మార్గం. ఈ పద్ధతిలో లోకవర్తనం తెలిసినవాడూ, సక్రమమైన రాజకీయ చైతన్యం ఉన్నవాడు ఉత్తమ సాహిత్యాన్ని సృష్టిస్తాడని పెద్దలు చెబుతున్నారు. రాజకీయ చైతన్యమంటే రాజకీయ పార్టీలకు రచయిత బానిస కానక్కరలేదు. సాహిత్యం మనుషుల ప్రవృత్తులను విశదపరచి మనిషిని ఉన్నతుని చేస్తుంది కాబట్టి, రచయిత ప్రజాశ్రేయస్కరమైన సిద్ధాంతానికి బద్ధుడై ప్రజలపక్షం వహించి తన రచనలు సాగించాలి.

శేఖర్ :— ఈ విషయం అందరికీ తెలిసిఉంటే ఎంత బాగుండేది?

శారద :— సిద్ధాంతం తెలిసిన అందరూ కవులైపోరు. కవి అయిన వాడికి ఒక లక్ష్యం ఉంటే అతని కృషి లోకానికి ఉపకారి అవుతుంది.

శేఖర్:—పోనీ, ఈ రహస్యం మీరప్పుడే నాకైనా చెప్పిఉంటే— ఈ విమర్శ రాకుండా ఉండేది.

శారద :— బంగారం అగ్నిలో పుటంపెట్టితే దాని విలువ తగ్గదు. పైగా పెరుగుతుంది.

---

# వారణాసి

## శ్రీ శనగన నరసింహ స్వామి

([illegible] హరిజనుడు క్రొత్త గబ్బిలమును కాశీ విశేషములను గూర్చి ప్రశ్నించుట.)

బ్రహ్మకును బ్రహ్మభవునకు భవుడు హరికి
హరియు వాణికి వాణియా ఆదిమౌని
కాళిదాసుని కూర్మి చకార కుక్షి
వ్యాసు డుపవాసముల గాసి వడడు కాదె?

చండీ శాలయ పూజా
పండితులై యాత్రికులను భయపెట్టి సదా
దండిగ విత్తము పిండెడి
పండాలు సుఖంబె వారి పడతులు సుఖమే?

విపుల సుఖవాటి ఆనంద విపిన వాటి
హరుని పరదేవతా త్వము నపహసించు
వేదవేదాంగవేత్తల వెక్కిరించి
కంఠములు నొక్కుచున్నాడె డుంఠి రాజా?

అంచితమైన జీవితము నందర భాగము చూఱవెట్టి ఆ
ర్జించిన శాస్త్రవిద్యలకు సిద్ధఫలంబుగ పండితుల్ సమ
ర్థించుచు నుందురే శశికిరీటుని పీట యుగాలనుండికా
[illegible] కులాది భేదముల దెచ్చి వివాద సభా ముఖమ్ములన్?

ముసలితనమున సంసారమును త్యజించి
[illegible]ంగ గట్టున గడుపు విప్రంగములు
[illegible] గణోజ్వల దివ్య విమానమెక్కి
[illegible] [illegible] బొందితోడ?

[illegible] భగమండెడ [illegible]
సౌలోర్వగలేక వగచు [illegible] [illegible]
దెగ దిట్టి విశ్వపతి నిజ
నగరంబున నుండి వెడల నడచునె యిపుడున్?

ఆత్మజలముల దోగు మర్త్యాళి దొనగు
లెఱిగి గర్భాన దాచి యే మెఱుగనట్లు
కాలగతు పట్టణము దరి గట్టులొరసి
పాఱు చున్నదె గంగా స్రవంతి నేడు?

జలనిధి తుంగభంగముల సంఘము లంబరమంట పొంగి క్ష్మా
వలయము ముంచునాడును సుపద్రవ మందక శాశ్వతంబుగా
నిలిచి మునీంద్ర సన్నుతుల నిర్వృతి గాంచెడి కాశికా పురీ
తిలకము నీకు నిత్యమును దివ్యసుఖంబులు సంఘటించునే?

కన్నులలో దయారసము క్రమ్మ కుచ ధారుల చేరదిల్పి తా
నన్నము పెట్టునంట జగదంబ మహేశ్వరి అన్నపూర్ణ, నా
అన్నలు తమ్ములున్ త దమలామృత భోజన భిక్ష కర్హులై
మన్నన గాంతురే అతిథి మండలిలోపల కాశికాపురిన్?

వారణసీ విశేష విభవ శ్రవణంబున మామకీన వి
స్ఫారపుటంగజాలముల పారము మేల్కొను, జాలువారు వి
స్ఫార విలోచనంబుల నపారముగా ప్రమదాశ్రుధారలా.
హారము లేకయే కఱకుటాకలి చిచ్చు శమించ చిత్రమై!

(నా 'నవభారతము' నుండి)

# విద్యుద్విహంగం

## (రూపకం)

## శ్రీ మిరియాల రామకృష్ణ

**ప్రయోక్త:** ఎప్పుడూ లేని విచిత్రం ఒకటి కనిపించింది! కళ్లను మిరుమిట్లు గొల్పుతోంది! చూపుల్ని మరమత్తు చేస్తోంది! అదిగదిగో ఆకాశాని కెగిరిపోతోంది!

**ప్రేక్షకులు:** ఏదీ? ఏదీ? ఎక్కడుంది? ఏమిటదీ?

**ప్రయోక్త:** కళ్ళు విప్పుకుని చూడండి! అదిగో! రంగురంగుల కాంతి గోళంలా నక్షత్రాలమొగ్గల మధ్య వెన్నెల పువ్వులా కొండకొనమీద మంచు జెండాలా అదిగో! అద్భుతంగా కనిపిస్తోంది! ఇంతకీ చెబుతున్నాను ఇవాళ ఒక విద్యుద్విహంగం ఎగురుతోంది! నాకు కనిపిస్తోంది దాని రెక్కల పల్లకీలో కూచున్న పెళ్లికూతురులా ప్రపంచం! నేను చూస్తున్నాను దాని చూపుల్లో లాస్యం చేస్తున్న భవిష్యత్తుని! దేని కోసమో వెదుకుతున్న మనిషీ! దీన్ని నిదానంగా చూడు! ఎందుకోసమో ఎగురుతున్న శేముషీ! దీన్ని విశేషంగా చూడు! నాగరకతా గాథ రచిస్తున్న మనిషీ! దీని కోసం అధ్యాయం మార్చు!

**ప్రేక్షకులు:** సందేహంలేదు! అది విద్యుద్విహంగం! ఆశల్ని వెలిగిస్తున్న అఖండ దీపం లాగుంది! మరి దాని కాళ్లకింద ఆ నీడ లేమిటి? ఆ నీడల కింద ఆ చీడ లేమిటి?

**ప్రయోక్త:** పోల్చుకోండి! అవి అన్యాయాలు! అవి అనాగరకతలు! దాని కాళ్లకింద వేలాడుతున్న నిర్జీవ భూతాలు! క్రిమి సంఘాతాలు!

**ప్రేక్షకులు:** అద్భుతంలో అపశ్రుతి! ఆనందంలో అపశకునం!

**ప్రయోక్త:** ఆ విహంగం వేగాన్ని అవే తగ్గిస్తున్నాయి! దాని గోళ్లలో వేలాడుతున్నాయి అణ్వస్త్రాలు! అమృతభాండం పక్క రగులుతున్నాయి అగ్నిగుండాలు!

**ప్రేక్షకులు:** ఆ పక్షి అలా ఎంతవరకూ వెడుతుంది? ఆకాశంలో అది దేన్ని వెదుకుతోంది?

**ప్రయోక్త:** దాని అన్వేషణ సువర్ణ నదీతటం కోసం! నాలుగుముఖాల మనిషిని చూసి రావాలని ఆకాశమంత ఎత్తయిన ఆది పురుషుణ్ని పిలవాలని మూడుకళ్ళు మెరిసే మహాశక్తిని చూడాలని పొదుగునుంచి తేనెలు పిండే ఆవుల్ని స్పృశించాలని కొమ్మలతో బంగారం పూసే చెట్లమీద వసించాలని.

**ప్రేక్షకులు:** అందుకోసమా దాని అన్వేషణ! దాని అన్వేషణ ఫలిస్తే. .

**ప్రయోక్త:** స్వర్గమే కిందికి దిగి వస్తుంది! స్వప్నమే వాస్తవంగా మారుతుంది.

**ప్రేక్షకులు:** అంత అదృష్టం అదింకా ఎంతదూరం? దాని ప్రయాణం ఎలా సాగుతోందో . . . .

**ప్రయోక్త:** చెబుతున్నాను! దాని ప్రయాణంలో కాలదూరాలు కలిసిపోతున్నాయి! దాని వేగంలో కాలం పొట్టిదై పోతున్నది! దాని చూపులు ఆగామిని అనుగమిస్తున్నాయి! ఆకాశం బట్టబయలై పోతోంది! వెలుగులు ఎదురుగా వస్తున్నాయి! గతకాలంలా మండే ఎండను దాటి వర్తమానంలా వణికించే మంచును నీడి భవిష్యత్తులా ఆశగొల్పే చందమామపై దిగి ఇంకా పైకి చూస్తే అక్కడ ఇంకేమీ విచిత్రాలు కనిపించ లేదు! ఎక్కడా సృష్టికారకుడెవడూ గోచరించ లేదు!

**ప్రేక్షకులు:** అతను కనిపిస్తే ఏమిటి ప్రయోజనం? సగం మనిషిని సగం రాక్షసిని నేల మీద ఎందుకుంచావయ్యా అని అడుగుతుందా?

**ప్రయోక్త:** అడిగితేమాత్రం అతను చెబుతాడా? లీలానాటక సూత్రధారిగా చిరునవ్వు నవ్వుతాడేమో!

**ప్రేక్షకులు:** అని అనుమానం వేసినట్లుగా విద్యుద్విహంగం మళ్లీ వెనక్కు తిరిగి . . . .

**ప్రయోక్త:** తిరిగింది. అచ్చమైన మనిషిని అవని మీదే వెదుకుదాం పోనీ అని కిందికి దిగుతోంది!

**ప్రేక్షకులు:** అది కిందికి దిగుతూ చందమామనుంచి తెస్తున్న వస్తువు లేమిటి?

**ప్రయోక్త:** ఏం తెస్తుంది? అంత సుధాకర ప్రపంచంలో రాళ్ళు తప్ప దానికి మరేం దొరికాయి? ఇప్పుడెందుకో అత్యంత విభ్రాంతంగా కూస్తున్నది!

**ప్రేక్షకులు:** దేన్ని చూసి ఆ విభ్రాంతి? ఎందుకు కలుగుతోంది అశాంతి?

**ప్రయోక్త:** ఇక్కడ ఈ భూలోకంలో ఈలోగా సంస్కృతిని సముద్రంలోకి విసురుతున్నారు! పుస్తకాల్ని మంటల్లోకి గెంటుతున్నారు! పురావస్తువుల్ని తిరిగి భూమిలో పూడుస్తున్నారు! అనుభూతుల్ని కాలికింద తొక్కుతున్నారు! కత్తులు పట్టుకుని కాంతారంలో తిరుగుతున్నారు! అహింసమీద చచ్చినపాములు పడవేస్తున్నారు! అహంతకు ఆహ్వానం పలుకుతున్నారు! ద్వేషం నూరుకుంటున్నారు!

**ప్రేక్షకులు:** ఇవన్నీ చూసేనా విద్యుద్విహంగం విషాదంగా కూస్తున్నది! ఇదంతా ఇక్కడ మనకి ప్రత్యక్ష మవుతున్నది!

**ప్రయోక్త:** కాలం మారిందనే నినాదం రాసి అనుభూతిని గురించి మాటాడ వద్దంటున్నారు! ఆయుధం పట్టుకుని అక్షరాలు రాస్తున్నారు! నగరాలు వదిలి నగాలెక్కుతున్నారు!

మూడోకన్ను మొహంమీద గీసుకుంటున్నారు! శ్మశానం లోంచి అచ్చమైన మనిషి పుట్టాడని జోస్యం పలుకుతున్నారు!

ప్రేక్షకులు: అయితే ఇందులో రైటెంత? రాంగెంత? ఏది సత్తు? ఏది అసత్తు? మీ వ్యాఖ్యానం వివరించండి!

ప్రయోక్త: సమతకోసం ఈ మమత! స్వార్థం ఒళ్ళు చీరడానికి ఈ సన్నాహం! అచ్చమయిన మనిషి తొడుక్కున్న ఆచ్ఛాదనం కత్తిరించడానికి ఈ తాపత్రయం! ఇదంతా మంచిదే!

ప్రేక్షకులు: అయితే ఈ విధ్వంసాన్ని, హింసను మీరు సమర్థిస్తున్నారు!

ప్రయోక్త: లక్ష్యాన్ని సమర్థిస్తున్నాను! కాని మార్గాన్ని ఖండిస్తున్నాను! అందుకే విద్యుద్విహంగం విషాద సంగీతం!

ప్రేక్షకులు: అయితే ఏ మార్గం ఇష్టం! ఆ మార్గం ఎందుకు భ్రష్టం!

ప్రయోక్త: ఎవడో కోపోద్రిక్తుడు కనిపెట్టిన అడ్డదారి అది! ఈ దారిని విద్యుద్విహంగం అభిమానించదు! ఇది అడ్డదారి మాత్రమే కాదు— అగ్నిదారి కూడాను! ఇందులో అచ్చమనిషి అవతరిస్తాడనడానికి రుజువు లేదు! సర్వనాశనం దీని పర్యవసానం! అదిగో అలా వినండి! ఇప్పుడు విద్యుద్విహంగము హృదయంగమంగా పాడుతున్నది!

ప్రేక్షకులు: ఎవరిని చూసి హృద్యంగా అనవద్యంగా ఇప్పుడు కూస్తున్నది?

ప్రయోక్త: ఎవరు ఆలోచనలు సులోచనాలుగా పెట్టుకున్నారో వాళ్లను చూసి! వాళ్ల అక్షరాల్లోనూ ఉంది ఆయుధాల పదును! ఆయుధాలే అక్షరాలు కావు! అక్షరాలే ఆయుధాలు కాకపోవు! కాని అవి ప్రాణభంజకాలు కావు! మనోరంజకాలైన వింత శస్త్రాలు! అతిదుష్టంగా పెరుగుతున్న స్వార్థవ్రణాన్ని కబుర్లు చెబుతూనే ఖండించే అక్షరాయుధాలు! పశ్చాత్తాప కషాయం పోసే ఔషధాలయాలు! ఏ అక్షరాలకు రాజకీయ శాసనాల పదును ఉందో ఆ అక్షరాలు! చరిత్ర నేర్పిన పాఠాలు వల్లించి అంతరాత్మ అందించే సంకేతాల్ని కూర్చి గోరువెచ్చదనాన్ని అనుభూతికి అందించి సమైక్య సహజీవనం, సమతా సహచారణం మనచేత మింగిస్తారు! మానవతాసీతను మహాగ్ని శిఖలోకి దింపి సురక్షితంగా రామరాజ్యానికి చేరుస్తారు! వీళ్లను చూసి అతిమనోహరంగా కూస్తున్నది పక్షి!

ప్రేక్షకులు: అంటే మా కర్థం కావడం లేదు! మంచి మాటలతో మత్తు వదులుతుందని తోచడం లేదు! అంటువ్యాధిని నిర్మూలించనిదే ఆగుతుందా? దుష్టతను చంపనిదే...

ప్రయోక్త: చంపడం పెట్టుకుంటే ఒకరినొకరు చంపుకోవడమే మిగులుతుంది! చంపే అధికారం అన్ని చేతులకూ లేదు! ఇంతకూ ఇప్పుడు ఎవడు దుష్టుడో ఎవడు శిష్టుడో రుజువు కావడం లేదు! అరిషడ్వర్గాలకు లొంగి అచ్చ మానవుడు కూడా దానవుడుగా మారుతున్నాడు! సామ్యవాదం కోసం ప్రతినబట్టిన కొడవలి బంగారం దొరకగానే కొయ్యబారి పోతున్నది! నిన్నటి కోపోద్రేకి నేడు ఊసరవెల్లి అవుతున్నాడు! ఆత్మపరిశీలన గావించి నప్పుడల్లా అన్యాయమని ఏదీ అనిపించదు! మరో మాటలో చెప్పాలంటే అంతా రాజకీయం! మానసాల మలినపాలను కడగడం ధ్యేయం! మనస్సు పెంచుకునే సర్పశృంగాల్ని మనోహాని లేకుండా తెగ గొట్టడం న్యాయం! రహస్యంగా దాచుకున్న ఖజానాలను విరాగంతో బయటికి తెప్పించడం ప్రమేయం!

ప్రేక్షకులు: అయితే అంబరచుంబి హర్మ్యాల మాట ఏమిటి?

ప్రయోక్త: అంబరచుంబి హర్మ్యాల మీద ఆఫీసులు తెరిపించండి! ధర్మశాలలు నెలకొల్పండి! పూరిగుడిసెల పెంకుటిళ్లుగా మార్చడానికి సంకల్పించండి! కుబేరుడొక అంతస్తు కిందికి దిగుతాడు! కుచేలుడొక అంతస్తు పైకి ఎక్కుతాడు! సమతాలోకం మన సంకల్పం!

ప్రేక్షకులు: సంకల్పం సరసంగా ఉన్నది!

ప్రయోక్త: సరసమైన సంకల్పాన్ని చూసి వాళ్లు విరగబడి నవ్వుతున్నారు! వ్యక్తుల్ని ఆస్తుల్ని ధ్వంసం చేసి మేడల్ని మిద్దెల్ని కూల్చివేసి కసినీ అక్కసునూ తీర్చుకోవాలనుకుంటారు!

ప్రేక్షకులు: పోనీ కసిత్వం కవిత్వంలో ఉండనక్కరలేదా?

ప్రయోక్త: కసిత్వం పాత్రగతంగా ఉండవచ్చు! కవిత్వం దాన్ని ప్రమాదం లేకుండా మార్చాలి!

ప్రేక్షకులు: అదెలాగ?

ప్రయోక్త: అదే చెప్తాను! వధ ఎప్పుడూ వధకే దారి తీస్తుంది! హంతకుడు తిరిగి హతుడవుతాడు!

ప్రేక్షకులు: మన పురాణాల్ని అవమానించడం కాదా ఇది!

ప్రయోక్త: అవి ఆదర్శాలుగా మానవుడి బుద్ధిలోంచి వెలువడ్డ కథలు! అదీకాక దుష్టత పరిపక్వమయినప్పుడు అది ఆత్మహత్యనే చేసుకుంటుంది! అందుకు అవకాశమివ్వాలి మనిషి! యుగధర్మం గుర్తించాలి మనిషి! ఈ సత్యాన్ని కవిత్వం ధ్వనించాలి!

ప్రేక్షకులు: అయితే కవిత్వం న్యాయాన్ని పంచుతుందా?

ప్రయోక్త: వ్యాయామాన్ని స్ఫురింపజేస్తుంది! వ్యక్తి స్వయంకృషి వల్ల సంపన్నుడవుతాడు. యశశ్చంద్రికలతో మళ్ళీ ఉదయిస్తాడు! దొంగ, హంతకుడు శిఖరాల నెక్కి బోయి లోయల్లో జారిపోతాడు! ఇదే మానవుడికి స్ఫురించాలి కవిత్వంలోంచి!

ప్రేక్షకులు: అంటే కవిత్వం శ్రమవాదాన్ని బోధించాలనేనా?

ప్రయోక్త: బోధించకూడదు. సుకుమారంగా బాధించడం ద్వారా వ్యంజించాలి! కవిత నిద్ర లేపకుండానే లేపే కవిత! కవిత కోరిక తెల్పకుండానే తెల్పే కవిత!

ప్రేక్షకులు: రాజకీయాలు ఈ పని చెయ్యలేవా?

ప్రయోక్త: రాజకీయాలు వ్యంజించవు. అడిగిన వాటిని ఇస్తాయి! చేయని వాటిని చేయిస్తాయి! కవిత అడగని వాటిని కూడా ఇస్తుంది! కవిత ఉదయిస్తే చీకట్లను పొమ్మని ఎవరు చెబుతున్నారు? కవిత ధ్వనిస్తే సిగ్గు పడని శిరస్సు ఎక్కడున్నది! తనకు కావలసిన వాటిని రాజకీయాల నుంచి నిర్భయంగా అడిగే హక్కు మనిషి కుంది! అలా అడిగే వివేచన కలిగించడం కళాకారుడిగా కవి బాధ్యత. ఆ కర్తవ్యం గుర్తించినవాణ్ణి చూసి విద్యుద్విహంగం చేస్తున్నది హార్దధ్వని.

ప్రేక్షకులు: ఈ ధ్వని ఉన్నన్నాళ్ళూ మాకు అనుభూతి కలుగుతూనే ఉంటుంది!

ప్రయోక్త: కవిత్వం ఉన్నన్నాళ్ళూ ఈ 'ధ్వని' కూడా వినబడుతుంది!

---

# అధిక్షేపము - కవితానిక్షేపము

## శ్రీ దాశరథి

(పారసీ కవులలో మరుపురానివాడు ఫిరదౌసీ. ఇతడు క్రీస్తుశకం పదవ శతాబ్దం వాడు. ఇతని పూర్తి పేరు అబుల్ ఖాసిం హసన్ ఫిరదౌసీ. అరవై వేల పద్యాలుగల ఇతని మహాకావ్యం 'షానామా' పర్షియన్ రాజుల ఇతిహాసం. అమరమైన ఈ కావ్యం విలువ తెలుసుకోలేని ఆ నాటి రాజు సుల్తాన్ మహమూద్ ఫిరదౌసీని అవమానించాడు. ఆ అవమానం కవిని కవ్వించింది. అధిక్షేప కావ్య రచనకు ఉపక్రమింపజేసింది. అందులోని ఒక భాగమే ఈ కవిత.)

కాల గర్భాన చనిన భూపాలకులను
కలముతో బ్రతికించిన కవిని నేను
ఏనువలె నేను వారి పేరెత్తి పిలువ
తమ సమాధుల వెడలిరి ధరణిపతులు.

వాత హతికిని కాలప్రవాహమునకు,
లగ్ని, వర్షపాతమునకు భగ్నములగు
సౌధములను నిర్మించు రాజన్యుతోడ
కావ్య నిర్మాత నిక పోల్పగా తరంబె!

నా మహాకావ్య సౌధ శృంగములపైన
గాలికిని వానకును అధికారమేది?
కాలమును కట్టి పడవేయ గలుగు శక్తి
నా కలాన కొసంగి యున్నాడు "ప్రభువు".

రాజునం దుదాత్తత లేనిరోజు వచ్చె
స్వామిలోన ఔదార్యమ్ము చచ్చిపోయె
మౌక్తికమ్ము గొనగలేని శుక్తిలోన
శూన్యమే గాని, కనిపించు నన్యమెట్లు?

ముండ్ల తీవెకు ద్రాక్షలు మొలుచునొక్కొ!
జముడు పొదలోన పండునే జామపండ్లు?
నాక వన వాటికలలోన నాటగానె
పాప భూరుహములు పుణ్యఫలము లిడునె?

పరిమళ ద్రవ్యముల నమ్మువాని చేర
పరిమళమ్మంటి తీరు నీ వస్త్రములకు.,
బొగ్గులమ్మెడి వానితో పొందుసేయ
వదనముల నిండ నిండును మసియెుకండె

చిరుతపులి మచ్చ లెవ్వరు చెఱుప గలరు?
యేన్గు నెవ్వరు తెలుపు గావింపగలరు?
క్షుద్రుడగు వాని గుండెలె ముద్రపడిన
హీనతను మాపజాలు టెవ్వాని తరము?

పులిని వను నీవు మేకగా తలచినావు
యేనుగులతోడ తొక్కింప నెంచినావు
జ్ఞానకాంతుల వెదజల్లజాలు నేను
మానవున కెవ్వనికి లొంగబోను లెమ్ము!

అరువది వేల పద్యముల వర్లిన కావ్యము, మౌక్తికప్రజ
మ్మరయ ధరిత్రి శాశ్వతత నందవలెన్ కవితా మహత్తుతో
నరపతి కంకితంబగుట న్యాయముకాదు., "ప్రవక్త" పాద పం
కరహములందు నిర్భీతిని కానుకగా, భవభంజకమ్ముగా·

* * *

"సౌందర్యాధిదేవత" (షానామా నుండి)

యవనికాభ్యంతరమ్మున యువతి మోము
భాను బింబమ్మకన్నను భాసురమ్ము.,
కొమ్మ, సొగసైన యేన్గుదంతమ్ము బొమ్మ,
తరుణి తనువల్లి మహిత మందార వల్లి.

నెలత బుగ్గలు లేత దానిమ్మపూలు
ఆమె పెదవులు జ్వలియించు అగ్ని శిఖలు
పడతి చనుదోయి రజత కుంభమ్ము లౌర!
కనులు కాటుకపిట్ట రెక్కలను బోలు

ఆమె మైతావి కస్తూరి నతిశయించు
గొలుసు గొలుసులు గొలుసులు వెలది కురులు
కాంత పది వ్రేళ్లు పది వెండి కలము లౌర!
ఎవరి పాలాన నేమి లిఖించ గలవొ!

చందమామపై కస్తూరి చల్లినపుడు
యెవ్వరైనను చూచిరో! యే వెలుంగు,
నా చెలియ మోముపై వ్రాలి నాట్యమాడు
నీలి కురులను చూడ రారేల మీరు?

మళై : వర్షం

తుఱవి : విడవడమున్ను త్యజించడమున్ను

తూయ : పరిశుద్ధత

తూక్కు : బంగారు పెచికలున్ను తూచడమున్ను ఆశ్చర్యరుం భారముం వేలాడడమున్ను పొడవడమున్ను విచారించడమున్ను

తూషణం : దూషణం

పార్తై : ఆచార్యనుర సారాయణ పక్షియుం

పుళ్లి : పక్షిన్ని మచ్చానున్ను

పులత్తల్ : యుడబాయుడము

మిక్కై : అధికం

మాలై : సంధ్యాకాలమున మాలిక్కైయును త్రిప్పి

వానం : ఆకాశమును మేఘమును పరమాకాశమును

వాళ్లై : బాధ

వెఱుప్పు : కోపము

వెళ్లిఅవు : మత్స్య విశేషం

వెఱువియర్ : యేమి లేనివారున్ను దరిద్రులు

వెఱుమై : దారిద్ర్యము లేమిడిన్ని ఆశించన్యము

వారత్తై పెట్టు : వాడిక

వాయాటి : వాచాలకుడున్ను వాక్కున్ని యేవేళా స్మరణకు వచ్చేవాడు.

వాలాట్టు కై : గర్వాతిశయ సాధనము.

---

# ఆనందా!!

✳ శ్రీ శ్రీనివాసకాశ్యప ✳

ప్రపంచపు కేలండర్లో నించి
ప్రతి ఏటా ఓ కాగితం చిరిగిపోతోంది!
ఐతే — ప్రతికాగితం— విలువైనదే,
ప్రతి కాగితం— బరువైనదే!!

* * *

ప్రమాది రాకతోనే— ప్రళయం ధ్వనించింది!
ప్రజల కెంతో మనస్తాపాన్ని కల్గించింది.
దేశం కన్నబిడ్డల్ని— దిగమింగింది!!
పాత కతల్ని — కొత్త కోణంలో చూపింది!
అన్నిట్నీ — తల్లక్రిందులు చేసింది —
అమాయకుల్ని — పీడించింది!!

* * *

నీపేరు ఆనందం! అదే మాకానందం!
నీ వెనకవారిని మించనిపించే ధోరణి
నీ వెప్పుడూ అవలంబించ బోకు!
నీ సహజగుణాన్ని — నిరూపించు!
ప్రమాది తెచ్చిపెట్టిన ప్రమాదాలను
ప్రక్కకు నెట్టించు —
ప్రజలకు ఉత్సాహం కల్గించు!
ప్రబంధ నాయకుడిలా ప్రవేశించు!!
నీ పేరు అక్షరాలా నిలబెట్టుకో!!!

* * *

ఆనందా! నీ రాకే మా కానందం!
నీవు నిత్యానందమై ప్రకాశించు!
దేశంలోని కొరతల్ని — తీర్చించు!
మానవతని — మరికొంచెం పెంచు!!
కశ్మలాన్ని — కడిగించు!
వర్షాల మెప్పూ — సాధించు!!

* * *

దుఃఖభాజనమైన ఈ లోకాన్ని —
దురంతాల కాలవాలమైన ఈ జగాన్ని
ఉద్ధరించు !! —
దానవత్వాన్ని — దహించు!
అందరికీ — ఆనందం పంచు!!

* * *

రా! మా ముంగిళులు
ముచ్చటగా అలంకరించాం!
ముత్యాల ముగ్గులతో నింపించాం—
సుగంధ సురభిళాలు సమకూర్చాం!
స్వాగత సన్నాహాలు చేశాం!!

* * *

గతించిన నీ సోదరులకన్నా
గణుతికెక్కాలి నీ వన్నా!
గంపెడాశతో ఉన్నాం —
వేయి కళ్లతో ఎదురుచూస్తున్నాం!!


pragoinvest
ČKD—SKODA PRAHA
CZECHOSLOVAKIA



# అమ్మా భారతమాతా అంతరించావా! పదిహేను శతాబ్దాల క్రితమే!

మోసము, అవినీతి, హింస మొదలైన వాటిచే పీడింపబడుతున్న ఈ ప్రపంచాన్ని ఏనాటికైనా ఆదుకొని, ఆశ్రయ మిచ్చి రక్షించగలిగేవి భారత సంస్కృతి, సభ్యతలు మాత్రమే యని తలచి, నాలుగు సంవత్సరాల క్రితం భారతదేశపు జీవనాడిలో ఏకమౌదామని ఇక్కడకు వచ్చాను. కానీ నేటి భారతదేశ స్వరూప స్వభావాలను గాంచి, నిరాశా నిస్పృహలతో అమెరికా తిరిగి వెళ్లిపోతున్నాను.

—ఇసాక్ తూచిస్మాన్.

నేటి భారతీయులు మా పాశ్చాత్య సంస్కృతి యొక్క భౌతికజీవన వ్యామోహ చిహ్నాలయిన టి. వి., కార్లు, ఫ్రీసెక్స్ (కామస్వేచ్ఛ) వ్యామోహంలో పడిపోతున్నారు. ప్రస్తుత పాశ్చాత్య సంస్కృతి టి. వి., కార్లు, కామస్వేచ్ఛతో నిండిపోయి, మాకు వాటిపై జుగుప్స, ఏహ్యత కలిగి, భారతీయ ఆధ్యాత్మిక సంస్కృతిపై ఆసక్తి కలుగ సాగింది కానీ, దురదృష్టవశాత్తూ మేము ఆశించిన సభ్యతా సంస్కృతులు నేడిక్కడ సజీవంగా లేవు. భౌతిక దృష్టి తక్కువగా, ఆధ్యాత్మిక దృష్టి అధికంగా కల భారతీయులు నేడు తమ అభిప్రాయాలు మార్చుకున్నారు. వీరి ఆధ్యాత్మిక దృష్టిపై నేడు పశ్చిమ దేశస్థులకు శ్రద్ధాసక్తులు మెండవుతున్నాయి.

నేటి భారతదేశ స్వరూప స్వభావాల్ని చూసిన వారికి ఇక్కడ గతానికి ఇంత గొప్ప సభ్యతా సంస్కృతులు, చరిత్ర ఉన్నాయా అన్న అనుమానం కలగటానికి అవకాశాలు హెచ్చుగా ఉన్నాయి.

1500 సంవత్సరాలకు పూర్వం వున్న భారతదేశ సభ్యతా, సంస్కృతి ఇంకా సజీవంగా ఉన్నాయనే అభిప్రాయంలో మేము ఉన్నాం. మేము భారతీయ శిల్ప సంపద, వేదాంతము, సంగీతము, మరియూ లలిత కళల యొక్క ప్రాచీన వైభవం గురించి వినివుండి, చదివి, అవి ఇక్కడ సజీవంగా ఉన్నాయనుకుంటున్నాము.

కానీ ఈ ప్రాచీన భూమిలో అవినీతి, మోసము ప్రజల నర నరాల్లోనూ ప్రవహిస్తున్నాయనుట నమ్మశక్యము కాకపోయినా, నిస్పందేహము.

ఎక్కడయితే మానవ మేధస్సుచే "ధర్మము — న్యాయము" సృజింపబడ్డాయో అక్కడే వాటికి సజీవ సమాధి కట్టబడుతోంది. పశ్చిమ దేశాల కుహనా సంస్కృతి అలవరచుకోవాలనే వేగిరపాటులో ధర్మాన్ని— న్యాయాన్ని సృజించిన ఈ జాతి అది మరచి అవినీతి— అన్యాయాలకు ఆటపట వుతున్నది.

వేదాలనూ, ఉపనిషత్తులను, యోగశాస్త్రాలనూ సృష్టించిన బుద్ధుడిని, మహావీరుడిని, శంకరాచార్యను గన్న, జ్ఞానదృష్టిలో అత్యంత ఉన్నత స్థానంలో ఉన్న ఈ దేశము తాత్కాలిక వ్యామోహాలకు లోనై, ఆ ఉన్నత శ్రేణినుండి వేగంగా దిగజారిపోతూంది.

నేను ఈ దేశానికి వస్తూ, ఉన్నత హృదయులైన, కలుషత్వాలకు తావులేని ప్రజల మధ్య జీవించబోతున్నందుకు ఎంతో సంతోషించాను. అప్పటి నా భావాల్లో, ఈ దేశం అవినీతికి— మోసాలకు అతీతమైన దేశం. శారీరకమైన మరేవిధమైన వాంఛలకు తావివ్వనివారీ దేశస్థులు అని నా ఉద్దేశం. కుట్రలతో, మోసాలతో కుళ్ళిపోయిన ఈ ప్రపంచాన్ని ఉద్ధరించి— రక్షించి— శరణు ఇచ్చేది ఈ దేశమని నా భావం.

అందుకనే ఈ ప్రాచీన దేశ వేదాంత జీవనంలో మిళితమైన వీరిలో నేనూ ఒకడినైపోదామని ఇక్కడకు వచ్చాను.

కానీ విచారించదగ్గ విషయమేమిటంటే నాలాగా ఈ దేశం గురించి విని, చదివి ఇక్కడి సభ్యతా సంస్కృతులను అధ్యయనం చేయాలని ఎవరైనా ఇక్కడకు వస్తే, వారు తమ పవిత్రమైన కాలాన్ని వృధా చేసిన వారవుతారు. పశ్చిమ దేశాల్లోనే ప్రాచీన భారతం యొక్క సభ్యతా సంస్కృతులు ఇక్కడ కన్నా యెక్కువగా మనకు లభ్యమవుతాయి.

ఇది నేను ఒకనాడు తీసుకున్న నిర్ణయం కాదు. నాలుగు సంవత్సరాలు ఈ దేశం నలుమూలలా చరించి, ప్రజల జీవన విధానాలని క్షుణ్ణంగా పరిశీలించి, మరే దేశంలోనయినా, నా విద్య కొనసాగించాలని— వెంటనే ఈ దేశం వీడిపోవాలని నిర్ణయం చేసుకొన్నాను.

భారతదేశంలో ఉన్నత విద్య అనేది ఒక హాస్యాస్పదమైన విషయం. భారత విశ్వవిద్యాలయాలు అమెరికన్ హైస్కూళ్ళ స్థాయిలో ఉన్నాయి. ఇక్కడ యూనివర్సిటీలలో ప్రొఫెసర్లు స్కాలర్‌షిప్పులకోసం రెకమెండ్ చేసే రీసెర్చి స్కాలర్ల స్థాయి అమెరికన్ గ్రాడ్యుయేట్ల స్థాయిలో కూడా లేదు. ఈ స్కాలర్లు తాము అధ్యయనం చేసే విషయాల మీద చూపించే శ్రద్ధ, విజ్ఞానాభివృద్ధికై చూపించే ఆతృత, వీరియొక్క సాధారణ విజ్ఞానం కంటే అమెరికాలో 13 సంవత్సరాల విద్యార్థి యెక్కువగా కనబరుస్తాడు.

ఇండియాలో "రీసెర్చి" చెయ్యాలన్నా, కనీసం మామూలు విద్య కొనసాగించాలన్నా నేడు చాలా దుర్లభమైన విషయంగా ఉంది.

అధికారుల నుండి తగిన సహాయ సహకారాలు లేకపోవటము, తగిన సౌకర్యాలు లేకపోవటమూ, విద్యార్థులకు తగిన ప్రోత్సాహము లభించక పోవటము దీనికి ముఖ్య కారణాలు.

ఉదాహరణకు బెనారస్ హిందూ విశ్వవిద్యాలయాన్ని తీసుకోండి. భారతీయ విద్యా విధానానికి ప్రామాణికమని, ఉన్నతమైన హిందూ

ధర్మాలకు నిలయమని అంటారు. కానీ ఇది నడిచే తీరు "కిండర్‌గార్డెన్" స్కూలులా ఉంది. ఈ విశ్వవిద్యాలయ విద్యార్థులకు తమ స్థాయికి తగ్గ హుందా, గౌరవము— సౌమ్యతా లేవు. మంకుపట్టుపట్టి ఏడిచే చిన్న పిల్లల్లా ఉంటుంది వీరి పద్ధతి.

ఒక యాత్రికునిగా, ఒక విదేశీ స్కాలర్‌గా వచ్చిన నేను, విశ్వ విద్యాలయ ప్రాంగణాల్లో చరిస్తున్నప్పుడు చవకబారు సంభాషణలు, పిల్లి కూతలు వినని రోజు లేదు.

భారతదేశంలోని కళాశాలలు విజ్ఞానాభివృద్ధికిగానీ, సభ్యతా సంస్కృతులను నేర్చుకోవటానికిగానీ, విద్యాభివృద్ధికిగానీ తగిన స్థలాలు లేవు. క్లాసు జరుగుతున్నంతసేపు విద్యార్థులు, తమ సీట్లలో తమకేం పట్టనట్లు, స్పృహలో లేనట్లు కూర్చుంటారు. తెలియని విషయాన్ని గురించి అధ్యాపకుల్ని ప్రశ్నించే సాహసం, ఉత్సుకత విద్యార్థులకు లేదు. చెప్పేదంతా విద్యార్థులకు తెలిసిందో లేదో కనుక్కొనే సహనం అధ్యాపకులకు లేదు.

భారతీయ విశ్వవిద్యాలయాలు నేడు పెద్ద కర్మాగారాలు. కర్మాగారాలు సరుకును ఉత్పత్తి చేసినట్లు విశ్వవిద్యాలయాలు విద్యార్థులను ఉత్పత్తి చేస్తున్నాయి.

విద్యార్థులు వారికి నిర్ణయించబడ్డ పాఠ్య గ్రంథాల పరిధి దాటి విజ్ఞానం గూర్చి ఆలోచించటం లేదు. పరీక్షలో వస్తాయను కున్న నాలుగు ప్రశ్నలూ చిలకల్లా ముక్కున పట్టుకు కూర్చొని పరీక్షలో దాన్ని కాస్తా రాసి— ఆ తరువాత తాము సంపాదించిన విజ్ఞానం గురించి ప్రదర్శనలు— స్వోత్కర్షలు ప్రారంభిస్తారు.

భారతీయ విశ్వ విద్యాలయాలను విమర్శించే ముందు, తెలుసు కోవలసిన విషయ మొకటి ఉంది. ఈ విద్యావిధానం ఇలా మలచబడ టానికి కారణం, ఈ దేశాన్ని పాలించిన ఆంగ్లేయులు— వారి విద్యావిధానము. బ్రిటిష్‌వారి అప్పటి సామ్రాజ్యవాద తత్వానికి— భారతీయుల బానిస మనస్తత్వానికీ నేటివరకూ గుర్తుగా మిగిలింది విద్యావిధానం.

"మీరు 1947 లోనే బ్రిటిష్ వారిని తరిమి వేశారుకదా — నవీన పద్ధతిలో, సజీవమైన, సహేతుకమైన — నేటి కాలమాన పరిస్థితుల కనుకూలమైన విద్యా విధానాన్ని ఎందుకు సృష్టించుకోరు?"

థామస్ డ్యూయీ కాలం నుండి విద్యా విధానాలలో అనేకమైన విప్లవాత్మకమైన మార్పులు వస్తూవుండగా భారతదేశం మాత్రం నత్తగుల్లలోని నత్తలా లోపలకు ముడుచుకు పోతూంది.

బె. హిం. వి. లో సంస్కృతం నేర్చుకుందామనే నా ప్రయత్నం నిరాశా నిస్పృహలతో ఒక నెలలోనే ముగిసింది. సంస్కృతం నేర్చు కుందామనే నా లోని ఉత్సాహాన్ని ఏమాత్రమూ గ్రహించకుండా నడచిన అధ్యాపకుని పద్ధతే దీనికి కారణం. కనీసం ఆయన క్లాసులకు రెగ్యులర్‌గా వచ్చివున్నా ఈ పరిస్థితి వచ్చి యుండేది కాదేమో! నెల రోజులలో ఆయన సగం క్లాసులకు మాత్రమే హాజరైనాడు. హాజరైన రోజుల్లో కూడా ఆయన కనీసం రెండు గంటలైనా ఆలస్యంగా రాని రోజు లేదు.

ఇక పరీక్షా విధానమైతే, పాశ్చాత్య పరీక్షా విధానంతో భారతీయ పరీక్షా విధానం పోల్చటానికైనా వీలులేని పరిస్థితిలో ఉంది.

భారతదేశం తన అప్రతిష్టకు నిదర్శనంగా ఒకతరం తర్వాత మోసగాళ్లను— అవినీతిపరుల్ని సృష్టిస్తోంది. భారతీయ విశ్వవిద్యాలయాల్లో జరుగుతున్న మోసాలనూ, అవినీతి గురించి భారతీయులకు నేను విపులీకరింపవలసిన పని లేదు.

బె. హిం. వి. లో "హిందీ" శాఖ కూడా ఇలాగే అత్యంత శోచనీయమైన స్థితిలో ఉంది. ఈ విశ్వ విద్యాలయానికి వచ్చే విదేశీ విద్యార్థులందరకూ "హిందీ" భాషా పరిజ్ఞానం అవసరం. ఇచ్చట ఈ భాషను బోధించే పద్ధతులు కూడా ఉపయోగకరమైనవి కావు. పురాతనమైనవి. దృశ్య, శ్రవణ పద్ధతుల ద్వారా సులభంగా విద్యగరపే అనేక నూతన విధానాలు వస్తూండగా, చాంధసపు విధానాలతో విద్య నేర్పే ఈ పద్ధతిని చూసి నేను హిందీ భాషాధ్యయనాన్ని కూడా మాను కున్నాను. ఆ తరువాత బజార్లవెంట తిరుగుతూ హిందీ భాషను యెక్కువగా నేర్చుకున్నాను.

"ఫిలాసఫీ" శాఖను గురించి కూడా కొద్ది వాక్యాలు రాసి ముగిస్తాను. ఈ సబ్జక్టుకు పాఠ్య గ్రంథాల్లోని ప్రశ్నలూ— సమాధానాలు బట్టీ పట్టినందువల ప్రయోజన మేముంది? "ఫిలాసఫీ" సబ్జక్టు ఒక అఖాతం లాంటిది. పుస్తకాల ద్వారా దానిలో పరిపూర్ణత్వాన్ని సాధించలేము. ఆ సబ్జక్టులో జీవించాలి, అనుభవం ద్వారా మరికొంత సాధించాలి. "ఫిలాసఫీ" వల్ల విద్యార్థి గొప్ప భావ చైతన్యాన్ని పొందాలిగాని భావదారిద్ర్యానికి లోను కాకూడదు.

బుద్ధుడిని గూర్చి చదవటానికి నాకు ఉన్న ఉత్సాహం వల్ల నేను మంగోలియన్ భాష చదువుతానంటే కాలేజీ "మాన్యువల్"లో ఉన్న ఓ నిబంధన రిజిస్ట్రార్ నాకు చూపారు. ఆ నిబంధన ప్రకారం అది నిషేధింపబడింది. దానికి సరియైన కారణం మాత్రం చెప్పబడలేదు. ఆ నిబంధన యెందుకేర్పడినదో? సమాధానం లేని ప్రశ్న.

ప్రతి విశ్వ విద్యాలయమూ, విద్యార్థులు తమ విజ్ఞానాన్ని పెంపొందించుకొనేందుకు తగిన ప్రోత్సాహాన్ని ఇవ్వాలి. బె. హిం. వి. మాత్రం నన్ను ప్రోత్సహించకపోగా నిరుత్సాహపరచి— నిరక్షరకుక్షిగా చేసింది.

విదేశాల్లో నాకో ముఖ్య స్నేహితుడున్నాడు. అతను బె. హిం వి. లో 5 సం. లు చదివాడు. ఆ తరువాత అతను తన జీవితంలో అయిదేండ్లు బె. హిం. వి. లో వృధా అయిపోయాయని గ్రహించాడు. అదృష్టంకొద్దీ భారతదేశం వచ్చిన నెల రోజులకే నాకీ విషయం తెలిసింది. అంతలోనే ఏదో అల్లర్ల కారణంగా, విద్యార్థుల సమ్మె వల విశ్వ విద్యాలయం తాత్కాలికంగా మూసివేయబడింది.

చివరకు "వారణాశీయ సంస్కృత విశ్వ విద్యాలయం"లో సంస్కృతం నేర్చుకుందామనే ఉద్దేశానికి వచ్చి బె. హిం. వి. వదలి పెట్టాను.

దురదృష్టవశాత్తూ ఈ వారణాశి సంస్కృత విశ్వవిద్యాలయంలో "విదేశీ విద్యార్థులకు జరిగే అనాదరణ" తేలికగానే కనిపెట్టాను. మరి కొందరు విదేశీ విద్యార్థులు కూడా ఈ విషయంనాతో చెప్పారు. ఈ విశ్వవిద్యాలయ విద్యార్థి సంఘం "విదేశీ విద్యార్థులను ఈ విశ్వా

యంలో చేర్చుకోనరాదనే'' తీర్మానం చేయటానికి ప్రయత్నించి నట్లు తెలిసింది. బహుశా వారి హిందూత్వపు లోతులు మాకు తెలియకుండా ఉంచటం కోసరమేమో ఈ ప్రయత్నం!

ఈ వా. సం. వి. లో ''సంస్కృత ప్రమాణ పత్రీయ'' కోర్సు చదవాలనుకొంటే, విశ్వ విద్యాలయ అధ్యాపకులు కాక, బయట ఒక పండితుని వద్ద ''కోచింగ్'' తీసుకోవలసిన అవసరం యెంతైనా ఉంది. దీనికి కారణం ఆ విద్యాలయంలో బోధన సరిగ్గా జరగక పోవటమే ఈ వృత్తాంతమంతా దయామయుడైన ఈ యూనివర్శిటీ ప్రొఫెసర్ గారే ఒకరు నాతో చెప్పి, ఈ విద్యాలయంలో చేరినాను, నా సమయాన్ని వృథా పుచ్చకుండా కాపాడారు. ఈ అనుభవాలే నేను స్వదేశా మ్ముఖుడ నయ్యేట్లు చేశాయి.

భారతదేశంలో సంస్కృత విద్యాభ్యాసం చేయాలన్నది నిరాశా, నిస్పృహలతో కూడిన విషయం. లాభసాటికాని వ్యవహారము. ఉపయోగ రహితము. ఇంతకంటే ''హైడల్‌బర్గ్''లోనో ''హార్వర్డ్'' లోనో సంస్కృతం అభ్యసించుట ఉత్తమం— తేలిక.

**మతము :**

మతం గూర్చి అధ్యయనం చేయటానికి నిష్కామయోగియైన గురువు చాలా అవసరం. అలాంటి గురువు కావాలంటే యెవరైనా యూనివర్శిటీ వదలి బయట వెతుక్కోవాలి. అలాంటి గురువుకోసం వారణాశి, సారనాథ్, బుద్ధ గయ, కాశ్మీర్, రాజస్థాన్, గుజరాత్‌ల లోనూ, అనేక ఆశ్రమాలలోనూ, కొండలలోనూ, హిమాలయపర్వత సానువులలోనూ, గుహలలోనూ మూడు సంవత్సరాలపాటు వెదికాను. కానీ, నా శ్రమ అంతా వృథా అయినది.

భారతదేశంలో అలాంటి గురువే ఉన్నట్లయితే (గురువు అన్న పదానికి సరియైన నిర్వచన మివ్వగల, ఆత్మ కేంద్రీకరణశక్తి కలిగి, భగవంతుని ఆత్మను గ్రహించగలిగి, తనలో ప్రభావితమై వున్న శక్తితో సహజనులను సరియైన పంథాలో నడిపించగలవాడు) దయయుంచి వారి చిరునామా నాకు తెలియ చేసినట్లయితే— నేను పైన పేర్కొన్న విషయం తప్పుగా ఒప్పుకొంటాను.

నా సాధువులనూ, స్వాములనూ, గురువులను, బాబాలను చూసి నేను గ్రహించిన దేమిటంటే—''దేశం నలుమూలలా తిరిగి వచ్చిన వాడు— నాలుగు ముక్కలు దేముని గురించి, ధర్మం గురించి మాట్లాడ నేర్చినవాడు ప్రతివాడూ నాకు వో గురువే! వో బాబాయే! వో స్వామీజీయే!''

ఇలాంటి వారినందరినీ గొప్ప స్వామీజీలుగా—బాబాలుగా ఆరాధిస్తున్న భారతీయులను చూస్తే వీరు చాలా గొప్పఉదారబుద్ధి కలవారు, అల్ప సంతోషులు అనిపిస్తోంది.

భక్తి, గౌరవాలకు అమెరికన్లు చాలా ప్రాధాన్యత నిస్తారు. కాకపోతే వాటిని చాలా పొదుపుగా వాడతారు. అర్హత కలవారికి మాత్రమే అందచేస్తారు. అడ్డమైన వారిని ఆరాధించరు. (బహుశ ఈ విషయం నేను నా గురించి మాత్రమే చెప్తున్నాను. ఎందువల్లనంటే—ఈమధ్య మాదేశస్థులు కూడా కొంతమంది గుడ్డిగా ''లోటస్ ఫీట్''ని ఆరాధిస్తున్నారు.)

అమెరికాలో కూడా చెప్పుకోదగ్గ సంఖ్యలో సోమరులు ఉన్నారు. వారెవరంటే పని, పాటాలేకుండా ప్రొద్దస్తమానమూ ఖాళీగాకూర్చొని ''మార్చువానా—హాషిష్'' పీలుస్తూ కూర్చునేవారు. వీరిని మేము ''బమ్స్'' అంటాము. నిజంచెప్పాలంటే భారతదేశంలోని సాధువులకూ వీరికి, ఒక దుస్తుల విషయం మినహాయిస్తే, ఏమీ తేడాలేదు.

బెనారస్‌లో అస్తమానం హిప్పీలతో గడిపే వో బాబాగారున్నారు. ఆయనలో లేనటువంటి ఎన్నో మహత్తర శక్తులు ఆయనకు ఉన్నాయని భ్రమసి ఈ హిందువులూ—మా హిప్పీలు కూడా ఒకే విధంగా ఆయన్ని ఆరాధిస్తున్నారు. ఆయనకు గొప్ప తెలివితేటలు ఉండిఉండవచ్చు— అపరిమితమైన ఆంగ్లభాషాపరిజ్ఞానం కూడి ఉండవచ్చు—కానీ, అసలైన సాధుపుంగవునికి వుండవలసిన భక్తి భావమూ—పవిత్రత— పావనత్వమూ ఏవి? అతను ఒప్పేసట్టే వల్లించేఆ రెండు వందల యాభై వేదాంతసంబంధమైన పదాలు అతని వేషధారణ మినహాయిస్తే అతనిలో నిజమైన సాధులక్షణాలేవి?

అహంభావ పూరితమైన నాస్తారణి, ఇతరులను అవమానపరచే హీనమనస్తత్వము, ఆనందమే జన్మయొక్క సాఫల్యతకు ముఖ్యసాధనమని, దానికొరకై అపసవ్య మార్గాలనైనా అనుసరించే బుద్ధి ఎల్. ఎస్. డి, గంజాయి మొదలైన మత్తు పదార్థాలు సేవించటం, బఫూన్‌లా వేషాలు వెయ్యటం, ఇవే పై సాధుపుంగవుని లక్షణాలు.

(ఇక్కడే ఒక విషయం రాస్తాను. పశ్చిమ దేశాల్లో నేడు విరివిగా తయారవుతున్న హిప్పీల తరహాగా ఇండియాకు వస్తూండటం చూసి భారతీయులు భయపడనవసరంలేదు. ఈ హిప్పీల జన్మస్థలం భారతదేశమే. ఈ హిప్పీ ''స్వాములు'' 5000 సంవత్సరాల్ క్రితమే భారతదేశంలో ఉంది.)

నిజమైన సాధుపుంగవుని లక్షణాలేమిటి?

సన్యసించుట, తపస్సు చేయుట, శీలవర్తనుడై యుండుట జ్ఞాననిధియై యుండుట, ప్రజ్ఞ కలిగియుండుట. ఇవే నిజమైన సాధు లక్షణాలని నేను భావిస్తున్నాను. ఇలాంటి లక్షణాలుకల వ్యక్తి నాకింతవరకూ తారసపడలేదు. నిజంచెప్పాలంటే, అలాంటి నిజమైన సాధుపుంగవుని మనం కాలిఫోర్నియాలోనే కలుసుకోగలం. అక్కడి వారు గౌరవము, దయ, అనుగ్రహము, సత్యసంధత, నిష్కాపట్యము జ్ఞానాన్వేషణ విషయాలలో (పరిపక్వమైన దశలో) పూర్తి వికాసము చెందియున్నారు.

ధర్మము—యోగములయందు నాకు గొప్ప నమ్మకముంది. ఒకనాడు బెనారస్‌లో ఒక విద్యార్థి నన్నిలా ప్రశ్నించాడు-''ఫలానా ఫలానా స్వామీజీ మీకు తెలుసా? మూడువేళ్ళను ఒకదానికి మరొకటి జతపరచికట్టి అతని మర్మాంగానికి కడితే సునాయాసంగా లాగివేయగలంత గొప్పవాడాయన!' అన్నాడు. ఇదేనా సాధుపుంగవుని గొప్పతనం గురించి చెప్పే మాటలు! ఈ మాటలను బట్టి ఆ సాధుపుంగవుని గొప్పతనం మనం గ్రహించవచ్చు.

నేడు భారతదేశంలో గొప్ప వాళ్ళుగా చెలామణీ అవుతున్న సాధువు లెవరూ నన్ను ప్రభావితం గావించలేక పోయారు. సత్యసాయిబాబాని గురించి నేను విన్నదానిని, చదివినదానిని బట్టి చూస్తే ఆయనో గొప్ప తాంత్రిక విద్యాపారంగతునిలా కనిపిస్తున్నాడు.

అందరి యెదుటా హఠాత్తుగా అరచేతిలో విభూతి సృష్టించటం వినోదం కలిగించే గొప్ప తమాషా! కానీ ఇలాంటి పద్ధతు లవలంబించటం ద్వారా హిందూమతానికి కలిగే ఉపయోగమేమిటి?

దురదృష్టవశాత్తూ భారతదేశంలోని సగటు మనిషికి మతానికి తంత్రానికి (మాజిక్) మధ్య భేదం కనుపించదు. అందుకే తంత్రాలు నేర్చిన ప్రతిగారడీవాడు గొప్ప మతప్రవక్తగా పేరుపొందే అవకాశం ఇక్కడ వుంది.

వాగ్బంధనం అంటే—తన వాక్ప్రవాహ పటిమచే యెదుటి వారిని ఆకర్షించి వశపరచుకోవటం. ఈ పద్ధతి చాలాకాలంగా పశ్చిమ దేశ ప్రాజ్ఞుల దగ్గర వాడుకలో ఉంది. అదేపద్ధతి రజనీష్ ఉపయోగిస్తున్నాడిక్కడ.

కొందరు "స్పిరిట్యువల్ లీడర్స్" (కొన్ని క్షుద్ర శక్తులను హస్తగతము చేసుకొన్న పెద్దలు) అసాధారణమైన, ప్రజలకు తెలియని పద్ధతు లుపయోగిస్తూ, అందమైన తమ శిష్యురాండ్రతో సమాగమము జరుపుట ద్వారా 'కుండలినీ యోగ" సాధనకు ప్రయత్నిస్తున్నారు వారికున్న "హిప్నటైజింగ్" శక్తివల్లనే ఇది సాధ్యమవుతుంది. ఆనందమూర్తిజీ గురించి వ్రాయటానికి ఆయనను గురించి అధికారికమైన వార్తలు ఏమీ నాకు తెలియదు. సంఘము—మతము. ఈ రెంటిని సమన్వయపరచి విప్లవాత్మకమైన మార్పులు తీసుకు రావాలని కోరుతున్న వ్యక్తి అని ఆనందమూర్తిజీ గురించి విదేశాలలోని నా మిత్రుల కొందరు వల్లగా తెలిసింది. ఈ ఆనంద మూర్తిజీనే ఈ మధ్య కేంద్రప్రభుత్వము నిర్దాక్షిణ్యముగా వేటాడింది!

చివరగా బాలయోగీశ్వర్ గురించి రాస్తాను. ఈయనకు విశేషమైన ప్రచారమిచ్చి పైకి తీసుకు వచ్చిన వారిలో పత్రికలు ప్రధాన స్థానాన్ని వహిస్తాయి.

శక్తి సంబంధమైన, జ్ఞాన సంబంధమైన విషయాలు అధ్యయనం చేయుటంలో పూర్తిగా విఫలుడనై, శాస్త్రీయ సంగీతం నేర్చుకుందామని ప్రయత్నించాను. ఈ విషయంలో కూడా నేను ఘోర అపజయం పొందాను.

పండిట్ రవిశంకర్ పేరు వినబడితేనే మనకు సితార్ వాయిద్యం పైన అభిమానము నేర్చుకోవాలనే ఉత్సుకత కలుగుతాయి. కానీ ఇండియాలో సితార్ నేర్చుకోవటమా? అసాధ్యము!

భారతీయులకు తమ యొక్క గొప్ప సాంస్కృతిక వారసత్వము మీద అభిమానము లేదు. (కొద్దిమంది సంగీత ప్రియులకు తప్ప) నిజం చెప్పాలంటే—భారతదేశంలో శాస్త్రీయ సంగీతం అంతిమ దశలో ఉంది.

సంగీత విద్వాంసులు పండిట్ రవిశంకర్, అలీ అక్బర్ ఖాన్, నిఖిల్ బెనర్జీ మొదలైనవారు కాలిఫోర్నియాలో జీవిస్తున్నారు అంటే అర్థమేమిటి?

విలాయత్ ఖాన్ మాత్రం ఇంకా ఇండియాలోనే ఉంటున్నారు. సంగీతాధ్యయనంకోసం ఆయనను ఆశ్రయించటం సాధ్యంకాదు. ఆయన దగ్గర సితార్ నేర్చుకోవాలనుకునే పశ్చిమదేశ విద్యార్థులు వందలకొలది రూపాయలు చెల్లించటానికి సిద్ధపడాలి. పైపెచ్చు నెలకు ఒక పాఠం కంటే యెక్కువ ఆయననుండి ఆశించకూడదు. నాకు తెలిసిన ఒక విద్యార్థి విలాయత్‌ఖాన్ దగ్గర ఆరు నెలల్లో ఐదు పాఠాలు మాత్రమే పూర్తిచేయగలిగాడు. దాని కతను చెల్లించిన మూల్యం రెండువేల రూపాయలు. తాన్‌సేన్‌కు వారసుడని చెప్పుకొనే యీయనకు, తనంత విద్వాంసుడు మరొ దుండకూడదనే అసూయ ఉన్నా క్షమార్హుడనే నేను భావిస్తున్నాను. ఈ మధ్య తరగతి విద్వాంసులదగ్గర ఇండియాలో ఉండి సంగీతం నేర్చుకోవటం— నా ఉద్దేశ్యంలో మన అమూల్యమయిన కాలాన్ని వృధా చేయటమే అవుతుంది. సంగీతవిద్యలో కొందరు గురువులకు ఉన్న ప్రావీణ్యత తక్కువే అయినా వారు చూపే అట్టహాసము, ఆడంబరాలు విపరీతంగా ఉంటాయి. పశ్చిమ దేశాలనుండి యువతులు సంగీత విద్యార్జనార్థమై ఇండియాకు వస్తు వస్తున్నంత కాలమూ, గురువు వేషధారులైన ఈ ప్రావీణ్యతలేని జులగలకు సంపాదన విషయములో ఏ లోటూ ఉండదు.

ఇలా వచ్చిన విద్యార్థినులలో ఒక పరిచయస్తురాలు చెప్పిన ఒక విశేషం వివరిస్తాను. మధ్యప్రదేశ్‌లో ఒక గురువు గారి వద్దకు ఆమె విద్య నభ్యసించటానికి వెళ్ళగా, ఆయన ఆమెతో "నిన్ను నువ్వు నాకు శారీరకంగా అర్పణ చేసుకొంటే నేను నీకు ఈ విశ్వ రహస్యము విపులీకరిస్తాను" అన్నాడుట. ఆమె వెంటనే తెలివిగా ఈ దేశం విడచి పెట్టి అమెరికా వెళ్ళిపోయి తన విద్యాభ్యాసం కొనసాగిస్తోంది. ఈ విషయంలో నేను చాలా అదృష్టవంతుణ్ణి. ఏ గురువైనా విద్యగరపటానికి నన్ను కోరింది 3000 రూపాయలు మాత్రమే.

పూర్వం కొందరు సంగీత విద్వాంసులు దీపక రాగం ఆలాపించి దీపాలు వెలిగించేవారుట. కానీ నేటి భారతీయ యువ సంగీతకారులు, తమ స్వల్ప సంగీత పాటవంతో తమలో నిబిడీకృతమై యున్న అహంభావముతోనూ, తమలో అంతర్లీనంగా యున్న కామజ్వాలలను ప్రజ్వలింపచేసుకో గలుగుతున్నారు. వీరు కోరేది శ్వేతజాతి యువతులతో సంగమము. వారి డబ్బు, దిగుమతి చేయబడ్డ విస్కీ!

విద్యాసంస్థలలో సంగీతం అభ్యసించటం ఇంతకంటే శోచనీయమైన స్థితిలో ఉంది. సాంప్రదాయ ప్రకారము ఒక రాగము నేర్చుటానికి పది సంవత్సరాలు పడుతుంది. ఎందుకంటే విద్యార్థికి ఆ రాగములో ప్రావీణ్యము వచ్చేందుకు—ఆ రాగానికి సంబంధించిన అతిసున్నితమైన భేదాలు తెలుసుకొనేందుకు సుమారు 10 సంవత్సరములు పడుతుంది. ఢిల్లీలో సంగీత అకాడమీలో నేను ఒక సంవత్సరం పాటు క్లాసులకు వెళ్ళాను. అక్కడ ఒక సంవత్సరంలో పది రాగాలు బోధించారు. అంటే ఆ పాఠాలు ఎంత సవ్యంగా బోధిస్తారో గ్రహించుకోగలరనుకుంటాను. ఆ గురువుగారు వార్తాపత్రికలనుంచి ఎప్పుడూ మొహం బయటకుతీసి విద్యార్థులకు చూపేవారుకాదు. విద్యార్థులందరూ యెవరి ఇష్టం వచ్చిన రీతిలో వారు ఉండేవారు. రాగాల సంగతి అలా ఉంచండి, కనీసం రాగం ఆలాపించే టప్పుడు సరిగా తాళం యెలా వెయ్యాలి, యెలా అభినయించాలి అనే పద్ధతికూడా అక్కడ చెప్పలేదు.

ఈ పద్ధతిలోనేనా అల్లావుద్దీన్ ఖాన్ రవిశంకర్‌కి సంగీతం నేర్పింది? పొందిన ప్రేమామృతను నైతం తన సంగీతం ద్వారా ప్రసరింప చేయగల

సమర్థుడు, అరుదైన, అనితరసాధ్యమైన ప్రజ్ఞావిశేషాలు కలిగినటువంటి రవిశంకర్‌లాంటివారు భారతదేశంలో పుట్టినా— ప్రపంచానికే ఒక వరప్రసాద మాయన. వారిచే సృజించబడ్డ అనితరసాధ్యమైన సంగీతము మానవ మేధస్సునకో ఉదాహరణ.

కానీ ఈ రోజుల్లో యెవరైనా శాస్త్రీయ సంగీతం క్షుణ్ణంగా రాగతాళయుక్తంగా నేర్చుకోదలచుకొంటే నీ మూటా ముల్లె సర్దుకొని కాలిఫోర్నియాకు వెళ్ళండి.

గొప్పగా చదువుదామని, ఇంకెంతో గొప్పగా నేర్చుకొందామని, పెద్ద పెద్ద ఆశయాలతో, ఆశలతో, అత్యంత శక్తి, ఉత్సాహాలతో వాలుగు సంవత్సరాల క్రితం భారతదేశానికి వచ్చాను. కానీ నేడు చెదరిపోయిన ఆశలతో, వ్యధిత హృదయంతో ఈ దేశాన్ని వదలి వెళ్ళిపోతున్నాను.

నేను భారతదేశానికి 1500 సంవత్సరాలు ఆలస్యంగా వచ్చాను.

నేను కలలుగన్న సుందర భారతదేశం, ఆ ప్రాచీనసభ్యత, సంస్కృతులు, ఉన్నతి, నూనవతా 1500 సంవత్సరాల క్రితమే అంతరించాయని తెలుసుకొని, వ్యధాభరిత హృదయంతో అమెరికాకు తిరిగి వెళ్ళిపోతున్నాను.

అనువాదకులు : భోగరాజు కోదండరామశర్మ
శ్రీ నిమ్మగడ్డ రావ్‌ప్రసాద్.

[టైమ్స్ వీక్లీ సౌజన్యంతో]

---

# బ్రెన్‌గన్

## శ్రీ సీరపాణి

రాసుకోవోయ్ కవీ!
రాకాసి కోరలు నీమకో నీవోయ్ కవీ!
అణువణువున అణుబాంబులు ప్రేల్చుకో!
జీవితాన్ని హవిస్సుగా వ్రేల్చుకో!

ఎక్కదలచిన రైలు క్రింటే
ముక్కలై పోవోయ్!
మూడు యాభై లేవడు బ్రతికేను
ముందు కుతికే వోయ్!

ఇల్లా వాల్లా పిల్లా జల్లా
ఎక్కడి వేదాంతం?
బ్రతుకూ భాగం జానేదేవో
సరనోసేమ్ షమ్షరు దేవ్

సహస్ర శిరశ్ఛేద అపూర్వ చింతామణి ఆకాశ
దాని మెడలో మినుకు మినుకున కునుకుతున్న
పునుకుల పళ్ళెడ తారా నివహం.

చీకటి కోట బురుజు మీద ఉస్సూ—
రంటూ వ్రేలాడుతోంది ఉడుపతి శిరస్సు.

ఎప్పుడు నరుకుతావయ్యా ఈ చీకటి కట్లు?
ఇంకెప్పుడు కడతావయ్యా పూర్వానికి మెట్లు?

అల్పాయుస్సులో హేమంతాలు వెయ్యి
ఇప్పటికే నీ జీవితం సిగరెట్టు సగం రొయ్యి
అందుకే అందుకో ఆదర్శాల బ్రెన్‌గన్
పాటల తూటాలు బిగించి
పేల్చివోయ్ ధన్‌ధన్.

---

# జాజి పందిరి

## శ్రీ మల్లాది సూరిబాబు

అలారం కొట్టగానే రామానికి మెలుకువ వచ్చింది. క్రితంరాత్రి పొద్దు పోయేదాకా నిద్దర పట్టలేదు. ఎప్పుడో తెల్లవారు ఝామున రవ్వంత కునుకు పట్టింది. అంతలోనే ఏదో మునిగిపోయినట్లుగా గడియారం యీ గందరగోళం చేసింది.

కళ్ళు తెరవగానే అలవాటుగా "నారసింహా!" అని అనుకుని కుడి అరచెయ్యి వంక చూసుకుని లేవబోతూవుండగా ఎదురుగుండా గోడమీద రంగుల వాల్ పోస్టరు. అందమైన అమ్మాయి బొమ్మ. శ్యామలా సుకుమార్ నాయర్ భరతనాట్యం అని రాశివుంది.

శ్యామల! ఆ పేరు తలుచుకోగానే మనస్సులోంచి నిట్టూర్పు వచ్చింది. టెలిఫోను మ్రోగింది. ఆలయానికి వెళ్ళే స్పెషల్ బస్సు అరగంటలో బయలు దేరుతోంది సిద్ధంగా వుండమని అవతలి వ్యక్తి హెచ్చరించాడు.

చకచకా స్నానం సంధ్య ముగించుకుని రామం బస్సు ఎక్కాడు. యాత్రీకులని ఎక్కించుకుని, బిగ్గరగా హారన్ మ్రోగించి బసు బయలు దేరింది.

అది చాలా అందమైన వూరు. అంతకంటే అందమైన ఆడ వాళ్ళు. వాళ్ళ ఆ కట్టూ, బొట్టూ, పెద్ద పెద్ద తలకట్టు—రవివర్మ పెయింటింగ్ లాగానే వున్నారు. వాళ్ళు రోడ్డమీద నడచి వెడుతూ వుంటే, బస్సులో జనం అదేపనిగా వాళ్ళవంక చూస్తూవుంటే రామం మాత్రం మవునంగా అనంతంలోకి చూస్తున్నాడు.

బస్సు ఆలయం ముందు ఆగింది. అది అనంత పద్మనాభస్వామి వారి దేవళం. ఆ ఆలయమే ఒక కోట. ఒక చిన్నసైజు నగరం. ముఖద్వారం నుంచి ధ్వజస్తంభం వరకూ దాదాపు పర్లాంగువేర పందిరి. దానిమీద దారిపొడుగునా జాజితీగెలు.

తీగెల మీద ఆకాశంలో నక్షత్రాలలాగా లెక్కలేనన్ని జాజి పువ్వులు.

జాజిపందిరి చూడగానే శ్యామల గుర్తుకు వచ్చింది. అంతే. మనస్సు జాజిపందిరిలో చిక్కుకునిపోయింది. అడుగు ముందుకు సాగలేదు. శ్యామల ఎలా వుందో ? ..... ఇక్కడ ఒక్కక్షణం ఆగరాదు అనుకుంటూనే అందరితోపాటు తను కూడా ముందుకు నడిచాడు.

ధ్వజస్తంభం దాటి మొదటి ప్రాకారంలోకి వెళ్ళాడు. అప్పటికే అక్కడ ఎంతోమంది జనం గుమిగూడి వున్నారు. వందలాది జనం వున్నా మిగతా గుళ్ళల్లో గోపురాలలో వుండే గందరగోళం లేదు. అక్కడ అంతా నిశ్శబ్దం. భక్తులందరి చేతులో ఎర్ర కలువ పువ్వులు— ఆడవాళ్ళ తలలో జాజిపువ్వుల దండలు

ఎటు చూసినా జాజి పువ్వులే! !!

రామానికి కోపం వచ్చింది. వీళ్ళందరికీ దూరంగా వెళ్ళిపోవాలని వడివడిగా ముందుకు నడిచాడు.

"ఆగు" అని ఆజ్ఞ వినిపించింది. ఎదురుగుండా వస్తాదులాంటి వ్యక్తి నిలబడ్డాడు.

"రాజావారు పూజ చేస్తున్నారు" అని అన్నాడు. ఒక్కక్షణం అతనివంకచూశి రామం అక్కడే ఆగి రెండుడుగులు వెనక్కివేశాడు.

"రామం!" అంటూ ఒక తియ్యని కంఠం పలికింది — ఛెళ్ళని వెన్నున ఎవరో కొరడాతో కొట్టినట్టు అనిపించింది. ఆ పిలుపూ ఆ కంఠం ఎన్ని జన్మల తరువాతనైనా తనకు గుర్తే.

రామం! మళ్ళీ అదే పిలుపు. అదే కంఠం. ఒళ్ళంతా కళ్ళుచేసుకుని జనాన్ని కలయ జూచాడు రామం.

ఆ పిలుపు ఎవరిదా? అని పరకాయించి పదే పదే చూశాడు.

"శ్యామలా ! ఎక్కడున్నావు?" అని ఒక మొగ గొంతు కేక వేసింది.

రామం మనస్సు కూడా అదే ప్రశ్న అడిగింది.

శ్యామలా ఎక్కడున్నావు?

ఎక్కడున్నావు శ్యామలా ?

ఏమో—ఎక్కడుందో?

జనం హడావిడిగా లేచి నిలబడ్డారు. రాజావారు దయచేస్తున్నారు. ఆ దృశ్యం ఇరవై శతాబ్దాన్ని లిప్తకాలం మరిపించింది. కత్తి డాలు పుచ్చుకుని ముందుగా ఒక వ్యక్తి, అతని వెనుక బంగారు వన్నెగల ఒక బక్కపలచటి శరీరం. తెల్లపట్టు గూడకట్టు. ముఖాన గంధ మీద నల్లటి చుక్కబొట్టు. చూపులో తరతరాల ఠీవి. తలమీద ఎర్రటి పట్టుటోపీ, ఆయన వెనుక ఛత్రధారి. అతని వెనుక ఆస్థాన పురోహితులు. వారి వెనుక రక్షక దళం. అందరి వెనుక అండగా దళ నాయకుడు. భయమెరుగని ధైర్యం. క్రౌర్యం ఎరుగని గాంభీర్యం. దిగివచ్చిన సదాశివుడిలాగా వున్నాడు ఆ వ్యక్తి !

అందరూ రాజావారికి నమస్కారం చేస్తే, ఆయన దైవానికి నమస్కారంచేసి ఆలయం దాటి బయటకు వెళ్ళిపోయాడు. ఇంత వరకూ మూగపోయిన భక్తులు స్వామివారి దర్శనానికి బయలుదేరారు.

స్వామివారో మూడు గుమ్మాల వెనుక అడ్డంగా పడుకుని వున్నారు. నల్లటి ఆయన ఛాయ మరింత స్వచ్ఛంగా కనిపించడం కోసం కాబోలు, వారి పాదాలవద్ద ఎర్ర కమలాలు వుంటే అంగ అంగాన బారెడు బారెడు జాజి పువ్వుల దండలు.

స్వామివారి వంటిమీద జాజిపువ్వుల దండలు. ఆడవారి సిగలో జాజిపువ్వుల దండలు. పూజ చేసి యిచ్చిన ప్రసాదంలో కలువలతో బాటు జాజి పువ్వుల దండలు.

అర్చకుల మాటలకంటే బిగ్గరగా వినిపిస్తోంది రామానికి ఒకే మాట—రామం! రామం!

కళ్ళు తెరుచుకున్న, కళ్ళుమూసుకున్నా కనిపించేవి జాజిపువ్వులు వెళ్ళిపోవాలి! దూరంగా పారిపోవాలి. పారిపోతున్నంత ... గా వచ్చి ఎదురుగుండా వున్న బస్సులో ఎక్కాడు రామం!

బస్సుకూడా రామం మనస్సుకంటే వేగంగా పరుగెత్తి, అలసి నట్టుగా ఆగిపోయింది ఒకచోట. కారణం తెలుసుకుందామని రామం ముందుకు చూశాడు.

బస్సు ఇహ ముందుకు వెళ్ళలేదు.

ఎందుకని?

మూడు మహా సాగరాలు కలిసినచోటు అది.

మూడు **మహా మతాలు** కలిసినచోటు అది.

**వాటిని [illegible] యీ** బస్సు ఇహ ముందుకు వెళ్ళలేదు.

ఉవ్వెత్తుగా ప్రళయ తాండవం చేస్తున్న తూర్పు కెరటం విరిగి ప్రశాంత పశ్చిమ సాగరంలో కలిసి పోతున్న పుణ్యస్థలం అది.

మూడు దిక్కులా మనస్సు ఎవరినో వెదికింది.

తన జ్ఞాన బోధతో ప్రపంచానికి ఒక నూతన జ్యోతి చూపించిన వివేకానందుని మందిరమొక దిక్కు..!

సర్వమతాలని సర్వశక్తులని తన చిరునవ్వుతో జయించి, సంసార సాగరంలో మధనపడిపోయే అల్పజీవులకు ముక్తిని ప్రసాదించగల ఆ మహాతల్లి కన్యాకుమారి ఆలయం ఇంకొక దిక్కు!

కన్యాకుమారి !

అవును. అప్పుడు శ్యామల కూడా కన్యాకుమారి.

దృష్టి పరుగెత్తింది. చూపు మరలింది.

పరదాస్య శృంఖలాలలో క్రుంగిపోతున్న యీ భారతావనికి తన బోసినోటి చిరునవ్వుతో సర్వస్వాతంత్ర్యం చేకూర్చిన ఆ యుగపురుషుని స్మారక చిహ్నం ఇంకొక దిక్కు..!!!

అవును. ఆనాడు తనూ బానిసే!

ఈ వ్యధ నుంచి పారిపోవాలి! శాంతి కావాలి. యీ మనస్సుకు శాంతి కావాలి.

వడివడిగా వెళ్ళి స్టీమ్ లాంచి ఎక్కాడు. నిలువుటెత్తు అలలమీద ఎండుటాకులాగా తూలిపోతూ నావ రవ్వంత దూరంగా సాగి, ఆ మహనీయుడు తపస్సు చేసి తరించిన వివేకానంద పర్వతం ఒడ్డున ఆగింది.

చంచల మహా సాగరంలో నిశ్చల పర్వతం. ఇది ఆయన తపోస్థానం. ఎంత చక్కటి ప్రదేశం. సంసార సాగరంలో మధన పడే మానవుడికి ముక్తి కావాలంటే నిశ్చలమైన మనస్సు వుండాలని చెప్పే ప్రత్యక్ష తార్కాణం.

వివేకానందుని మూర్తిలో దావానికి కనిపించింది శ్యామల వదనమే!

ధ్యాన గృహంలో వినిపించింది ఓంకారాన్ని మించిన శ్యామల నామమే!

"శాంతి ఇక్కడా లేదు నాకు. ఎక్కడా లేదు నాకు" అనుకుని రామం బయలు దేరాడు.

అరేబియా సముద్రంలో అస్తమిస్తున్న సూర్యుడికి ఎదురుగా బంగాళా ఖాతంలో నల్లటి మబ్బులు.

పొగరెక్కిన సముద్రంలో విలవిలలాడి పోతున్ననావ!

మళ్ళీ అదే పిలుపు! మళ్ళీ అదే కంఠం.

**రామం! రామం!**

ఉలిక్కిపడ్డాడు. వివేకానంద మందిరం వంక చూశాడు. కన్యాకుమారి వంక చూశాడు.

**వాళ్ళిద్దరూ నిశ్శబ్దం! నిశ్చలం!**

**మళ్ళీ అదే పిలుపు.** అదే కంఠం !

రామం!

**పిటివంక చూశాడు.** అలాగే చూస్తూ వుండిపోయాడు.

**[illegible]సాగరంలో నిశ్చలంగా వున్న** పసికందు శరీరం. ఎవరో **నేల** గుడ్డు. **అంతకు రవ్వంత దూరంలో ముఖం తెలియని ముద్ద**రాలి శరీరం.

నీలం చీరె! ఎర్ర జాకెట్టు!

విడివీడని జడలో నలిగిపోయిన జాజిపువ్వుల దండ!

నిన్ననో మొన్ననో అరవిచ్చుకున్న జాజి పువ్వులు.

రామం పెద్ద పెట్టున అరుద్దామనుకున్నాడు. గట్టిగా పిలుద్దామనుకున్నాడు. కాని పూడిపోయిన కంఠంలోంచి వచ్చిన మాటలు.

పసిపిల్లా! తల్లి !!

మృత్యువుని గురించి జాలి పడకుండా జీవితం ముందుకు సాగిపోయింది. నావ ఒడ్డుకు చేరింది.

ఆ అభాగ్యులని చూద్దామని రామం వెనక్కు తిరిగాడు. తనని అక్కడివాళ్ళు చూడనివ్వలేదు.

"వెళ్ళిపోండి—ఇక్కడ వుండటానికి వీలులేదు" అంటూ బయటకు పంపించి వేశారు

బ్రతికి వున్నవాళ్ళకు ఆ క్షణం హడావిడే—ప్రతిక్షణం తొందరే.

"గుడి తెరుస్తున్నారు! గుడి తెరుస్తున్నారు" అంటూ జనం హడావిడిగా ముందుకు వెడుతున్నారు. రామం కూడా ముందుకు నడిచాడు. గుడిలో అడుగు పెట్టాడు.

మానవుల జన్మలు మారినా, కాలం యుగాలు గడిచినా! మారక నిలచింది ఆ మహాతల్లి చిరునవ్వేగా!

ఆవిడ చిద్విలాసం కన్నా రామం మనస్సులో కనిపించింది నీళ్ళమీద తేలిపోతున్న తెల్లటి జాజిపువ్వుల దండ!

ఎవరిదో వాడిపోయిన బ్రతుకు.

కసిరినట్టుగా విసుగుగా అర్చకుడు తన చేతిలో పెట్టుతున్న ప్రసాదం వంక చూసుకున్నాడు రామం—పసుపు కుంకం జాజి పువ్వుల దండ!

పాముని చూసినంత భయం వేసింది. క్షణంలో గుడి దాటి బయటకు వచ్చాడు. బిచ్చమడిగిన ముష్టివాడి జోలిలో జాజి పువ్వుల దండ పడవేశాడు.

బస్సు హారను విని కన్నెత్తి చూశాడు. రెండంగల్లో బస్సు ఎక్కాడు.

"మదరాసుకు టిక్కెట్టు ఇవ్వండి" అని అన్నాడు.

మదరాసు! ఇరవై సంవత్సరాల తరువాత తను మదరాసు వెడుతున్నాడు.

ఎన్నడూ మరువలేని మధుర స్మృతులు సృష్టించిన మదరాసు వెడుతున్నాడు.

ఒక రాత్రిలో తనను వెయ్యి సంవత్సరాలు ముసలివాడిని చేసిన మదరాసు వెడుతున్నాడు.

ఇరవై సంవత్సరాల క్రితం ...... కలలు కనే వయస్సులో వున్నతను .... ఆ నాడు .... చిన్ననాటి చెలిని

తనతో పసితనంలో చెమ్మచెక్కలు ఆడిన బాల్యసఖిని చూడటానికి, అనేక సంవత్సరాల తరువాత వెడుతున్నాడు.

చిన్ననాడు కలిసి మెలిసి ఆడుకున్నారు. ఆత్మీయులుగా వున్నారు. నాన్నగారి ఉద్యోగం వల్ల తను యింకొక వూరు వెళ్ళిపోయాడు. మనుష్యులు దూరమైనా మనస్సులు దగ్గరగానే నిలిచి పోయాయి.

చదువులకి దూర ప్రాంతం వెళ్ళిపోయినా శ్యామల ఎప్పుడూ మనస్సులో మసలేది. దైవం అనుకూలించాడు. మంచి రోజు వచ్చింది. మళ్ళీ యీనాటికి చిన్ననాటి చెలిని చూసే అదృష్టం కలిగింది. ఆ మధుర మూర్తిని తలచుకుంటూ వూహల్లో తేలిపోతూ అలా అలా నడిచి వచ్చాడు. ఎంతదూరం నడిచాడో తనకు తెలియదు. తెలిసినదల్లా అది చాలా అందమైన తోట అని. అందులో వందల రక రకాల పువ్వుల మధ్య దర్పంగా కనబడుతున్న జాజి పందిరి. ఆ జాజి పందిరితోబాటు ప్రపంచకానికే కొత్త అందం తెచ్చి పెడుతున్న అపురూప సౌందర్య రాశి శ్యామల !!

తనని చూసి గుర్తుపట్టి కూడా చిరునవ్వుతో ఆ కొంటె కోణంగి అడిగిన ప్రశ్న

ఎవరు మీరు?

తను కూడా కొంటెగానే సమాధానం చెప్పాడు—"కవిని, గాయకుడిని"

ఎందుకు వచ్చారు మా తోటలోకి?

"స్వర్గ మిదేనని భ్రమపడి"

కోపం తెచ్చుకుంటున్నట్లు నటిస్తూ ఆత్మీయతని అనేదాన్ని దాచుకొనడానికి ప్రయత్నించేస్తూ

మా నాన్నగారు చూస్తే ఇది మీ పాలిటి నరకం అవుతుందేమో?

"నీలాంటి దేవతలున్నచోట నరకం ఎన్నటికీ కాదు శ్యామలా!"

చిలిపితనం పోని శ్యామల అడిగిన ప్రశ్న

"నేను గుర్తు వున్నానా రామం?"

రామం చెప్పిన సమాధానం—"నా హృదయాన్ని అడిగి చూడు.",

అది ఆ జన్మలకు శుభ సమయం. యుగ యుగాలకు అదే సార్థకం. అంతులేని ఆనందాలకు ఆ క్షణమే నాంది.

రోజులు గడిచాయి. నెలలు గడిచాయి. వారిద్దరి మధ్య ప్రేమ హిమాలయాలకన్నా ఉన్నతంగా పెరిగింది.

కాని పెద్దలు చెప్పిన మాట అబద్ధం కాదు. పెరుగుట విరుగుటకొరకే.

మల్లెతోటలో ప్రమాదములున్నాయి.

చిలికిన అమృతంలో గరళముంది.

ఓర్వలేని వారి హృదయాలలో ద్వేషం వుంది.

ఒక చీకటి వేళలో చిన్నది తనతో అన్నది—"మనం ఇక్కడ సుఖపడలేము రామం! మా నాన్న మన వివాహానికి ఒప్పుకోవటంలేదు. ఐశ్వర్యానికి ఆయన బానిస. ఆయనకు కావలసినదల్లా ఆస్తులు అంతస్థులే కాని ఆత్మీయతా అనురాగం కాదు."

ఏం చేద్దాం శ్యామలా?

"దూరంగా పారిపోదాం. ఎవరూ తెలియనిచోట ఏకమవుదాం. రేపే ప్రయాణం. అర్ధరాత్రి వేళ యీ జాజిపందిరిదగ్గర కలుసుకుందాం. నాన్న వూళ్లో లేని యీ సమయంలో మనం పూరు దాటిపోదాం. మరిచిపోకు. నాకోసం ఎదురు చూడు. రేపు అర్ధరాత్రి వేళ. ఈ జాజి పందిరి దగ్గరే కలుసుకుందాం. కలిసి కష్టాలనుంచి దూరంగా పారిపోదాం!"

మర్నాడు రాత్రి వచ్చింది. అంతులేని చీకటి తెచ్చింది. క్షణ మొకయుగంగా గడిచింది రామానికి. తెల్లవారే తరుణంలో పందిరిని వున్న పువ్వు పువ్వే రామాన్ని వెక్కిరించింది.

ఎందుకు?
ఆడదాని మాట నమ్మినందుకు.

అహంభావం వచ్చింది! ఆవేశం వచ్చింది! అంతులేని దుఃఖం వచ్చింది. పట్టరాని కోపం వచ్చింది. కాని శ్యామలమాత్రం ఆ రాత్రి జాజిపందిరి దగ్గరకు రాలేదు. ఎన్ని రాత్రులు వేచియున్నా శ్యామల మళ్ళీ కనిపించలేదు.

మనస్సు రాయి చేసుకుని, మదరాసు తిరిగి ఎన్నడూ రాకూడదని నిశ్చయం చేసుకుని దూరంగా చాలా దూరంగా వెళ్ళిపోయాడు. ఫారెస్టు ఆఫీసరుగా మానవులకి దూరంగా ఇంతకాలం అజ్ఞాతవాసమే చేశాడు.

కాలమే మనస్సు వేసిన బొమ్మని చెరిపివేసిందని. ఈ ఇరవై వసంతాలలో ఆ చిత్తరువే హృదయంనుంచి చెరిగి పోయిందని తను అపోహ పడ్డాడు.

అవును. అది వట్టి అపోహే !!

ఉద్యోగ ధర్మంగా ఇన్నాళ్ళకు మళ్ళీ యీ సీమకు రావలసిన పని కలిగింది.

నివురు కప్పిన నిప్పు రాజుకుంది.

ఈనాడు—మనస్సులో ఆలోచన ఒకటే! ఆలాపన ఒకటే!!

శ్యామలని చూడాలి! శ్యామలని ఎల్లాగైనా ఒక్కసారి కలుసుకోవాలి !!

ఈ ఇరవై సంవత్సరాలలో చరిత్రే మారిపోయింది. మదరాసు మరీ మారిపోయింది.

ఆనాడు కలలు కన్న భూలోక స్వర్గాన్ని వెదుక్కుంటూ ఆ సుందర ఉద్యాన వనంలో, ఆకాశమంత జాజి పందిరివున్న ఆ భవంతి కోసం వెదుక్కుంటూ వెళ్ళాడు. కన్నుల ఎదుట కనపడ్డది చూడగానే మనస్సు గద్గదమైంది. ఆ సిరిసంపదలు యీనాడు అక్కడలేవు. ఆ తోట లేదు. ఆ అందం లేదు. అలవైకుంఠపురంలో శ్రీలక్ష్మి లేదు. పడిపోయిన, ఎండిపోయిన చెట్ల మధ్య, బీభత్సంగా పెరిగిన రక్కిస పొదల మధ్య ఇంకా మిగిలివున్న జాజి పందిరి చెదురు చెదురుగా పూసే పువ్వులు. రాలిపోతున్న ఆకులు.

ఈ భయంకర నిశ్శబ్దం మధ్య మళ్ళీ అదే పిలుపు—అదే కంఠం—"రామం !"

ఆ పిలుపుని వెదుక్కుంటూ, తామిద్దరూ జీవన వసంతాలలో తొలినాడు కలిసిన చోటు వూహించుకుంటూ ముందుకు నడిచాడు.

అవును. శ్యామల ఇంకా అక్కడే నిలబడి వుంది.

ఎదురు చూస్తూ నిలబడి వుంది నిశ్చలంగా.

"శ్యామలా! శ్యామలా!" అంటూ పిలుస్తూ ముందుకు అడుగు వేశాడు.

ఆ సుందరి చలువ రాతి పాదాల క్రింద, కన్నీటి తెరలనుంచి అస్పష్టంగా కనిపించిన మాటలు.

కుమారి శ్యామల జననం..... రెండో వాక్యం చదవలేకపోయాడు. మరణం ..... వైశాఖ పూర్ణిమ.

స్పృహకు దూరమవుతున్న రామానికి ఏదో లోకంనుంచి అస్పష్టంగా వినిపిస్తున్న అదే పిలుపు—అదే కంఠం—

రామం! రామం!

[ఆకాశవాణి మదరాసు కేంద్రం సౌజన్యంతో]

# నిగమ శర్మోపాఖ్యానము ఒక పరిశీలనము

డా॥ నేలటూరి వేంకట రమణయ్య

పాండురంగ మహాత్మ్యము :— చిరకాలము క్రిందనే ఈ కావ్యము ముద్రింపఁబడెను. తెన్మఠమువారి ముద్రణమే ఇప్పుడాంధ్ర దేశ మంతటను ప్రచారమునందున్నను నిది ప్రథమ ముద్రణముగాదు: పూర్వముద్రణ మొకటి కలదు. శ్రీ బులుసు వేంకటరమణయ్యగారి వ్యాఖ్య తోడి వావిళ్ల ప్రతి, ఆ తర్వాత శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారి సాహిత్య అకాడమీ ప్రతి ప్రసిద్ధములయినవి. ఘటికాచల మహాత్మ్యము:—ఇది రామకృష్ణుని చరమగ్రంథము. ఇది కలావతీ ముద్రాశాలలో 1902 వ సంవత్సరమున ముద్రింపబడెను. ముద్రాపకులు శ్రీ శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రిగారని స్మరణ. ఇట్టి గ్రంథములచ్చున గూర్పబడినను ముద్రాపకులెవ్వరును నాధునిక ముద్రణా పద్ధతుల నవలంబించి లభ్యములగు తాళపత్ర ప్రతులనుగూర్చి చక్కని పాఠ పాఠాంతరములతోఁ బ్రకటించి యుండలేదు. తాళపత్ర ప్రతులు దొరకకపోలేదు. పాండిత్యమునకు కరవు రాలేదు. ప్రోలువారికెయే దీని ముఖ్యకారణము. రామకృష్ణుని గ్రంథము లన్నిటిలోఁ బాండురంగ మహాత్మ్యము సర్వోత్కృష్టము. ముద్రితప్రతి తప్పులు కుప్ప. ఇట్టి గ్రంథమునైనను నెరసులఁ దొలగించి సాధు పాఠముల నేర్పఱచి పండిత లెవ్వరునుఁ దొరఁకొనకుంట శోచనీయము.

ఇవికాక కందర్పకేతువిలాసము, హరిలీలావిలాసము లను కావ్యములఁ దెనాలి రామలింగఁడు రచియించినట్లు ఛందోగ్రంథములవల్లఁ దెలియు చున్నది. ప్రాచీన సంకలన గ్రంథముల నుండి కూర్చి కందర్పవిలాసము లోని వని నాలుగు పద్యములను హరివిలాసములోనివని యిరువదియొక పద్యములను: శ్రీ వేటూరు ప్రభాకరశాస్త్రులువారు తమ ప్రబంధరత్నావళి యందు ప్రకటించియున్నారు. ఇవి యింకను దొరకలేదు. ఇందు కందర్పకేతు విలాసమును రామలింగకవి చిట్టమంత్రి కంకిత మిచ్చెననియు, వతఁడు 'నాదెండ్ల యప్పన గోపనలకు సన్నిహితజ్ఞాతియు సమకాలికుఁడగు చిట్టమరుసు'గా నోపుననియు నట్లయినచో 'నాకృతియు 1545 ప్రాంతములో రచింపఁబడియుండవలయు' ననియు: శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగా రభిప్రాయపడుచున్నారు.[1] కందర్పకేతు విలాసమునకుఁ గృతిపతి చిట్టమరసనుట కాధార మేమి కలదో తెలియదు. నాదెండ్ల యప్పన గోపనల సమకాలికు డొక చిట్టమరసు కలఁడు. కాని యితఁడు నాదెండ్లవారి సన్నిహిత జ్ఞాతి కాఁడు. గుంటూరు మండలములోని పెద్దకాకాణి యను గ్రామమునం దీతని శాసన మొకటి కలదు.

'శ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు 1440 అగు నేటి బహుధాన్య సంవత్సర శ్రావణ 5 ।సో। శ్రీ మన్మహారాజాధిరాజ రాజ పరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీకృష్ణదేవమహారాయలు పృథివీ సామ్రాజ్యం సేయుచుండంగాను। శ్రీమన్మహా శిరః ప్రధాన సాళువ తిమ్మరుసయ్యవారి రాజ్యభారధురంధరులైన కౌండిన్యసగోత్ర ఆపస్తంబ సూత్ర యజుశ్శాఖాధ్యాయులైన రెంటూరి చిట్టమరుసుంగారు కాకాండిని అంగడి వీరేశ్వరునిన్ని భద్రకాళిన్ని వృషభేశ్వరునిన్ని ప్రతిష్ఠలు చేసి. . .'[2]

కవిగారు చెప్పిన చిట్టమరుసు ఇతఁడే యగునా? అగునేని రెంటూరి వంశజుఁడగు నీ చిట్టమరుసు నాదెండ్లవారికి సన్నిహిత జ్ఞాతి యగు టెట్లు? కందర్పకేతువిలాసము క్రీ. శ. 1545 ప్రాంతమున వ్రాయఁ **బడెననుట కాధారము లెవ్వి?**

ఇక మిగిలియున్నది హరివిలాసము—"శైలియుఁ బదబంధములనుసరించి చూడఁగాఁ బాండురంగకృతిహరిలీలావిలాసముకంటెఁ దరువాతి రచితమని తోఁచుచున్నది" అని మానవల్లి రామకృష్ణకవిగారు చెప్పుచున్నారుటె కావచ్చును. దొరికిన గ్రంథభాగ మల్పము — గ్రంథమున నింతకంటె నెక్కువ భాగము లభ్యమగువరకును నీ కావ్యము పూర్వాపూర్వములను నిశ్చయించి చెప్పుట సులభసాధ్యముకాదు. హరివిలాసమును రామకృష్ణుఁడు వైష్ణవము బుచ్చుకొనిన పిమ్మట రచియించి యుండవచ్చును. ఇది రాధామాధవుని విష్ణుమాయా నాటకమువలె విష్ణులీలను దెల్పు కావ్యమై యుండవచ్చును.

ఆంధ్రకవుల చరిత్రమునఁ గందుకూరు వీరేశలింగంపంతులవారు రామకృష్ణుని నించుక తూలనాడియున్నారు. ఈ 'కవి కొంతవర కాత్మశ్లాఘాప్రియుఁడని తోఁచకమానదు. ఇతఁడెంత ప్రౌఢకవియైనను స్వోత్కర్ష ప్రకటనము నింతగాఁ జేసికొనక నమ్రతను చూపినచో నధిక శ్లాఘాపాత్రుఁడయి యుండును.' "ఈ కవి మొట్టమొదట శివభక్తుఁడైనను విష్ణుభక్తులగు చంద్రగిరి రాజులను సంతోషపెట్టుటకయి తరువాత విష్ణుభక్తుఁడయి వైష్ణవులను గురువులనుగాఁ గైకొనెననియుఁ జెప్పుదురు.[4]

కవులు తమ్ముఁ స్వవిరచిత కావ్యములయందుఁ బ్రశంసించుకొనుట కడు ప్రాచీనకాలమునుండియు పరంపరగ వచ్చిన యాచారము.

ఈ మూలపురుషుని బింబము నెదుట నుంచుకొనియే శ్రీనాథాదులు కథా రచనకు గడఁగిరి. తమ చేఁజిత్రింపఁబడిన ప్రతిబింబములకు దేశకాలానుగుణ్యములుగ వేష భేదములను గల్పించినను, పోలికలను మాపఁజాలక పోయిరి. నామ రూపములచే భిన్నులయ్యును సుకుమారాదులు నిజ వ్యక్త్యైక్యమును గోలుపోలేదు. వారి గుణశీల స్వభావముల యందించుకంతయు వ్యత్యాసము గానరాదు. కావున వారి చరిత్రల దెరిసినఁ దన్నిర్మాతల కళాకౌశల్యశిల్ప నైపుణ్యాదులు తెలియగలవు.

1. సుకుమారుఁడు:—వింధ్యాచల దుర్గమునందు హేమాంగదుఁడను శబరరాజేలుచుండెను. ఆ రాజ నొద్ద నఖిలశాస్త్రజ్ఞుఁడు, విద్యాపారీణుఁడు యజ్ఞదత్తుఁడను బ్రాహ్మణుఁడు ప్రధానియై రాజ్యభారంబు వహించుయుండెను. అతని భార్య సుశీల. వారికి చిరకాలము సంతానము లేకయుండి తుదకు సదాశివుని కరుణవలన ఒక పుత్రు డుదయించెను. వానికి సుకుమారుఁడను పేరు పెట్టిరి. పెరిగి పెద్దవాఁడై యా బాలుఁడు సర్వవిద్యల నభ్యసించెను, కవిత్వము: సెప్పనేర్చెను. ఇంతటనె శైశవంబు గడచి జవ్వన మావిర్భవించెను. పరదారాగమనంబున నాసక్తుఁడై యాత్మ భార్యను విసర్జించెను, గురువులను తిరస్కరించెను, విటులతోఁ గూడి జూదమాడుచు మద్యపానానురక్తుఁ డాయెను. తల్లిదండ్రులు దుఃఖితులై

1. ఆంధ్రపత్రిక, సంవత్సరాది సంచిక (1914) పుట 103.
2. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్ సం 4 నెం 202,
3. ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక (1914) పుట 102.
4. ఆంధ్ర కవుల చరిత్రము. పుట 265, 271.

యాతని కెన్నియో విధముల హితోపదేశ మొనర్చిరి, కాని యాతఁడు వారి మాటలను పెడచెవుల నిడెను. పుణ్యస్త్రీల నిలువరున జెరుప వారం భింపగా నూరివారందరును రాజుతో మొరయిడిరి. రాజాతనిపైఁ గోపించి యాతని దేశమునుండి వెడలనడచెను.

సుకుమారుఁడు దేశమును త్యజించి యన్యదేశముల సంచరింపవలసి వచ్చెను. ఇట్లు దేశాటనము జేయుచు కాలక్రమమున నొకనా డరణ్య మధ్యమందలి యొక జలాశయమును డాసి దప్పి దీర్చుకొని యొక మహీరుహ చ్ఛాయ విశ్రమించెను. అప్పుడచటి కొక చండాలకన్య జలకమాడ వచ్చి యాతని గాంచెను. వారంత మోహావిష్టమనస్కులై రాగమబద్ధులైరి. చండాలాంగన యాతనితోడ్కొనిపోయి తానుండు వెలివాడసమీపమున వండలి కాళికాలయమున వివాహమేర్పరచి రహస్యమున నాతని గలయుచ వచ్చెను. వీరి రహస్యము చిరకాలము దాగకపోవుటచేత వారా ప్రాంతమున వదలిపోవలసిన వారైరి. దూరదేశమునకు బోయి యందొక బ్రాహ్మణ పల్లియఁ గాపుర మేర్పరచుకొనిరి. చండాలాంగన గర్భవతియై యిరువురు కన్యలఁగని మృతి జెందెను. సుకుమారుఁడాకాంతకు బరలోకక్రియ లాచరించె. కుమార్తెలు పెద్దవారైన పిదప, యిరువది సంవత్సరములవాడయ్యును వారి నేకాంతమున రమించుచుండెను. అతని దుష్కర్మల నెరిగి బ్రాహ్మణు లాతని వెలిపెట్టిరి. సుకుమారుఁడు వారిని సరకుసేయక గుత్సలేక గూతలతో గాపురము చేయుచుండెను. ఎనుబదియేండ్ల ప్రాయమున సుకుమారుఁడొక శివరాత్రినాడు దన యునికి చెంతనున్న నాగేశ్వరుని గుడి యొద్ది పుష్పవాటికలో దన భార్యలకు బూవులు గోసికొనిపోవుటకు వచ్చి, కాకతాళీయముగ నచ్చట జరుగుచున్న శివపూజఁ జూచుచు నర్ధరాత్రము వరకును నిలిచియుండి యనంతరము స్వగృహమునకుఁ జనెను. మరి కొంతకాలము గడచిన పిమ్మట సుఖ మరణము నొంది శివరాత్రి జాగరణ పుణ్య వశమున శివలోకప్రాప్తు డాయెను.5

2. మందేహుఁడు:—భోజుఁడను రాజు శత్రుభయంకరుఁ డొకఁ డుండెను. ఆ రాజు యొక్క పురోహితుఁడు విష్ణుశర్మ. అతనికి ధర్మపత్నియందు మందేహుఁ డను కొడుకు పుట్టెను. ఆ కుమారుఁడు వేద శాస్త్రాది విద్యలయం దారితేరి ప్రఖ్యాతుఁడై సులగ్న యను కన్యఁ బెండ్లియాడెను. కాని క్రమక్రమముగ నతఁడు సదాచారసంపత్తిఁ బోనాడి భోగమరక్తుఁడై యాటపాటలందును, ద్యూతక్రీడయందును, పరాంగనా సంగమమున గాలముపుచ్చ నారంభించెను. వాని దుండగముల వలన యిల్లు గుల్లాయెను. తలిదండ్రులును నన్నలును హితము చెప్పిరి, కాని యాతని చెవికెక్కలేదు. ఇంటివారు వానితోడి పొత్తును మానుకొనిరి. భోజరాజాతని బాగుపరచదలఁచి తన పార్శ్వవర్తిఁగా జేసికొనెను. భక్తి శ్రద్ధలతో గొంతకాలము మందేహుఁడు రాజును గొలిచెను. భోజుఁ డతనిలకు సంతసించి యగ్రహారముల మీఁదను దేవగ్రామంబుల మీఁదను బారుపత్యముఁ సేయ వియోగించెను.

మందేహుని పారుపత్యము దేవబ్రాహ్మణ గ్రామములయం దలజడి బుట్టించె. పూర్వపు టధికార పురుషులమీఁద ముత్తుండముల నొడిచికొనెను. కావడియందు నిరంకుశులగు గ్రామీణులకు జనుపు లిచ్చెను. లంచముల మూలమున నపరాధముల బెడదలఁగని, కొందఱిని బెదరించి మరికొందఱిని యొప్పించి దేవబ్రాహ్మణసీమలవారలనెల్ల స్వాధీనము గావించుకొనెను. అగ్రహారద్విజులయం దొండొరులకు గలహములను కల్పించెను. వారి విత్తమును హరించు మార్గముల నారయ జొచ్చెను. దేవస్థాన వినియోగార్థము నెవ్వ వస్తువులయందు మేలైనవాని దన యింటి కనిచి చెడిన పదార్థము లనే యుపయోగార్థ మంప మొదలిడెను. అగ్రహారీకులు మందేహునికి లంచము లొసఁగియు, వీరిఁ గుడిసియుఁ గొలువవలసి వచ్చెను. దేవాలయములందు కైంకర్యము లాగెను. మూఁడు నాలుగు వర్షము లిట్లు గడువగా వాని బాధ నోర్చుకొనజాలక బ్రాహ్మణులును దేవాలయపు ప్రజయు నొక్కటియై రాజుతో మొరలిడిరి. భోజుఁడు మందేహుని రావించి, వాని యపరాధము నిశ్చయముగుట నెరిఁగి కోపించి, వాని యొడలిపై కుక్కచ్చు లొత్తించి తన యేలు భూవలయమునకుఁ బాపెను.

మందేహుఁడట్లు దేశము వాసి యూరూరం దిరుఁగుచు యరణ్య మార్గమున నొకచో దప్పిగొని సమీపజలాశయమునకుఁ బోయి నీరుద్రావి మార్గక్రాంతి పోనయించుటకై యొక చెట్టునీడఁ గూర్చునెను. అప్పు డప్పటికి జలకమాడ నొక బోయ కన్యక వచ్చెను. వారొండొరులం గాంచి మోహావిష్టచేతస్కులై కూడిమాడి యుండ నంగీకరించిరి. మందేహుఁడా శబరకాంతతోడ దాని పల్లియయందు గాపురము చేసెను. వేటాడియు, దారిగొట్టియు సర్వపదార్థముల నింటికిఁ దెచ్చుచుండువాఁడు. కాలక్రమమున వారు ముసలివారైరి. సంపాదనము సన్నగిల్లె. అన్నపానాదులకు జరుగుఁబాటు తక్కువయాయె. ఉదరపోషణార్థము గనుజేరి తినవలసి వచ్చెను. ఇట్టిస్థితియం దొక యేకాదసీ పుణ్యదినంబున నొకముసలివైష్ణవుఁ డామార్గమునఁ బోవుచు, మధ్యాహ్నవేళ కాగా నా కొలనియం దుదకమాడి, యాహ్నికము దీర్చుకొని యాయడవిమధ్యమున విష్ణునారాధించుమార్గము గానక చింతానిమగ్నుఁడై యుండెను. జనకలకలము విని యాచెంత నొక పల్లె యుండవలయునని యూహించి, జాడపట్టుకొని యచ్చోటి కరిగెను. మందేహుఁడతనిఁ గని దగ్గరకుఁ బోయి యతని చరిత్ర మారసి కనుగొని పూజారాధనకు దగిన యాటవికపదార్థములనుదెచ్చి యిచ్చెను. మఱియు నారేయి యా వైష్ణవుడు జాగరణము సేయువేళ మందేహుఁడుఁ తోడి బోయలతోడ నాతనికిఁ గాపుండెను. తెల్లవారినంతటనే యా వైష్ణవుడు కృతపారణుండై మందేహునకు భుక్తావశిష్ట భోజ్యంబుల నొసగి చనెను.

తరువాత మందేహుఁడు మృతినందెను. తక్షణమే యాతని జీవముఁ గొనిపోవ యమకింకరు లరుదెంచిరి. వారింబోదోలి విష్ణుదూత లాతని వైకుంఠమునకు గొంపోయిరి.6

3. నిరంకుశుఁడు :— మాణిక్యపురమని యొక పట్టణము. అందు సుశర్మ యను బ్రాహ్మణుఁడు, విద్వాంసుడు, అగ్నిష్టోమాదియజ్ఞములు చేసినవాఁడు, తన ధర్మపత్నిఁగూడి కాపురము సేయుచుండెను. చిరకాలము సంతానములేక పరితపించుచుండిన యా దంపతులకు గడపట విష్ణుదేవుని కృప వలన నొక కుమారుఁడు గల్గెను. వానికి నిరంకుశుఁడను పేరుపెట్టిరి. బాల్యముననె వాఁడు వేదవేదాంగశాస్త్ర పురాణేతిహాసముల నేర్చి, సకల విద్యల యందును నేర్పరియై కీర్తి వహించెను. తలిదండ్రు లాతని వైదగ్ధ్యమునకు మెచ్చుకొని, వైదిక కులాభిఖ్యాత నొక చక్కని కన్యకం దెచ్చి వివాహము గావించిరి.

బాల్యము పోయి యవ్వన మాపాదించగనె నిరంకుశుని బుద్ధి యుమారెను. ముందెంతి యణకువశాలియని పేరొందెనో యప్పుడంతటి దుష్టుఁడను దుర్యశస్సును సంపాదించెను. వారాంగనల మరిగి తిరుగజొచ్చెను. వేశ్యాగృహములనె ప్రొద్దుపుచ్చుచు, కులసతిని విసర్జించి, ఇంటకల ధన మంతయు వెచ్చపెట్టి జూదరులతోఁడి చెలిమివాటించి కాలమున

---

5. శివరాత్రి మహాత్మ్యము అ 2 మొదలుకుని 4 వరకు— శ్రీనాథుఁ డిట్టి కథనె కాశీఖండమునఁ జెప్పియున్నాడు. కాంపిల్య పురనివాసి యజ్ఞదత్తుని కుమారుఁడగు గుణనిధియు నిట్టివాఁడే. కుల భ్రష్టుఁడై చండాలురం గలసి స్వకుమారికా భర్తయగు కార్యంబుల యందు దక్క గుణనిధి సుకుమారున కెందును దీసిపోవువాఁడు కాడు— కాశీ: 4: 76—128.

6. పార. ఖ: 124—194.

గడుపుట యతనికి నిత్యకృత్యమాయె. ఇటు దుష్టుఁడై వేశ్యాలంపటుఁడైన పతిం గని దుఃఖించి యాతని భార్య తన యత్తగారితో మొరపెట్టుకొనెను. అత్తయు దన కోడలి స్థితి గని వగచి యామె నోదార్చి, కుమారుఁ డింటికి వచ్చినపిమ్మట, వానికి నయమున బోధించెను కాని యా దుర్మార్గుని చిత్తము మరల్ప జాలదయ్యెను. యథావిధి వాఁడు భోగమువారి పంచల నాశ్రయించి, వారి కపటవాక్యముల బేలువడి చేతదొరకిన యర్థమును వారి కప్పజెప్పుచు, వారాంగనల పొందే జీవితముయొక్క పరమావధిగఁ దలఁచి కాలము గడిపెను. కడపట విత్తవిహీనుఁడు కాఁగా వేశ్యల నిరాదరణకు బాత్రుఁడై, వేశ్యమాతచే నవమానితుఁడై, యింటికిఁ బోనొల్లక యొంటరియై యడవిమార్గము పట్టెను.

ఆ యరణ్యమున నొక పాడుగుడి, అందు గబ్బిలములు దప్ప యన్య జీవజంతువులు లేవు. మంటపాదులెల్ల విరుగఁబడినవి. గర్భగృహము మాత్రము నిలిచియుండె, శివలింగము యథాస్థానమున మెరయుచుండెను. నిరంకుశుఁడు శివునిముందర అంగవస్త్రమును బరచి యాసీనుఁడై యాలోచనకు గడంగెను. భోగమువారిని విడిచి యాతని మనస్సు వెనుదిరగకుండె—వారిమీఁదనే నిరంతరము చిత్తము; ధనములేదు; ధనము లేనిచో వారి పొందు కుదరదు. ఈ దురవస్థ నుండి తప్పించుకొను మార్గమును నెమకి నెమకి కడపట స్వాంతచిత్తుఁడై శివుని పురోభాగమున నక్షములు వైచి పన్నిదమును బేర్కొనెను. శివుడు ద్యూతమున నోడిన నిరంకుశునకు 'లంజ'నుఁ దెచ్చి యీవలయు—ఇద్దరి యెత్తుల నాడు వాఁడు నిరంకుశుఁడే. ఆటయందు శివుఁడోడిపోయె. ఇక నిరంకుశునకు లంజియను దెచ్చి యీవలయును. ఇంతనాటకము నాడినదియు నిరంకుశుఁ డొక్కఁడే. శిలారూపలింగమేమి, సచేతనవ్యక్తియా, సొగటాలాడుటకు. నిరంకుశుఁ డీ విషయమెరుఁగక పోలేదు, కాని తనపేరు ప్రఖ్యాతులు నిలుపుకొనుటకు శివుడు ప్రత్యక్షము కాకపోఁడను నమ్మక మాతని హృదయమునఁ బొడమెను. ఆటయందోడి లంజియను శివుఁడు ఋణపడియె గదా ఋణగ్రస్తుని కడనుండి తనకుఁ జెందవలసిన సొమ్మును రాబట్టుకొను విధానము నవలంభించినగాని సొమ్మురాదు. కావున నిరంకుశుఁడా లింగమునిక్కపట్ట సాగెను. అప్పుడు నందివాహనారూఢుఁడై. పార్వతిలోఁగూడ శివుఁడు ప్రత్యక్షమాయెను. వెంటనే దేవతలెల్లరును నష్టదిక్పతులతో నా పాడుగుడికి బరుగులిడిరి— ఇట్లు ప్రత్యక్షులైన పార్వతీపరమేశ్వరులను దేవతా సమూహమును జూడఁగనే నిరంకుశునికి లంజియపై కోరెక సడలెను, లంజెకు బదులు మోక్షకాంత దయసేయవలయునని వేఁడెను. శివుడు భక్తపరాధీనుడైనను, ద్యూతధర్మము నెరుగనివాఁడుగాఁడు, కావున మొదట లంజియనిచ్చి యవ్వల మోక్షమునొసఁగెదను,నీకు వలయులంజియఁ బేర్కొనుము; తెచ్చియిచ్చెదను అని పల్కెను. నిరంకుశుఁడు రంభను బేర్కొనెను. వెంటనే పరమేశ్వరుఁడచటనున్న దేవేంద్రునితో రంభ నితని కిచ్చివేయుమని యుత్తర వొసంగెను. ఇంద్రుఁడు మహాప్రసాదమని రంభకు నాతనిఁ గూడుమని యాజ్ఞజేసెను. అంతట దేవత లంతర్ధానమునందిరి.

రంభను నిరంకుశుఁడు సురతమున మెప్పించి దేవలోకమును మరపించుటచే నది యాతనితోడ చిరకాలము కాపురము జేయుచుండెను. రంభా నిరంకుశు లొకనాడు క్రీడానిమగ్న మానసులై యున్నతరి జగడగొండి నారదముని వారిని జూచి, రంభ తన్ను గనియు నమస్కరించలేదను నీసుచే దేవేంద్రుని కొలువునకుఁబోయి దానిపైఁ గొండెములు సెప్పెను. ఆగ్రహపరవశుఁడై దేవేంద్రుఁడు దాని రప్పించి, నీ ప్రియుఁడున్న పట్టణము కడ గండశిలవై యుండుమని శపించెను. రంభ కడు దుఃఖితయై శాపాంతమనుగ్రహింప నింద్రుని వేఁడెను. ఇంద్రుఁ డా యచ్చర దుఃఖముఁ గని కరుణించి, యాగండశిల తుమురై ధరణిన్వ్రాలి బడునపుడు శాపాంతమని చెప్పి కొలువు చాలించెను.

రంభయు మరలి భూలోకముజేరి నిరంకుశునితో దనకు గల్గిన యాపదను దెలుప నతఁడాఁ శాపమును సరకుఁగొనక, 'శాపవిముక్తి శ్రీఘ్రమున గలిగించెదను, నీవు పోయి శాంతముగ నిలువుము'అని త్వరపెట్టి పంపెను. రంభ యంతట శతతాళదఘ్నమగు శిలయై పట్టణము వెలుపట నిలిచెను. ఇంతటనే యా పురమేలు రాజును బ్రహ్మరాక్షసు డావహించెను. భూతవైద్యులెందరెందరో వచ్చి చికిత్సయొనర్చిరి; కాని బ్రహ్మరాక్షసుఁ డారాజును విడువలేదు. మంత్రులందఱు నుపాయాంతరమెఱుంగక బెంగఁగొని యుండిరి. అదియే నిరంకుశున కనుకూలమైనయదను అతఁడు మంత్రులఁగాంచి యూరివెలుపటనున్న గండశిలఁ దుమురు గావించి నేల మట్టగావించిన రాజు పిశాచవిముక్తుఁడగునని వారిని బురికొల్పెను. నిజమని తలఁచి మంత్రులు దేశమందలి ప్రజలనెల్ల బోగుజేసి యాబండాయున్న యానవాలు సైతమెఱుఁగరానీక చదనుఁ గావించిరి.

శాపవిముక్తయై రంభ స్వర్గముఁజేరి ఇంద్రునికి నమస్కరింప నాతఁడది భూమికి బోయి తన శాపముగొనక యచటనే తిరుగాడుచున్నదని కన్నులెర్రఁజేసెను. కాని యది తనకు శాపవిముక్తి యాయెనని తెలుపగా విని యచ్చెరువంది యంతటి యల్పకాలముననే శాపాంతముఁ గలుగ నేరవుఁ గల్పించిన ధూర్తబ్రాహ్మణుని, నిరంకుశునిఁ గన కౌతూహలమంది దేవత లందరుఁ గొల్వు భూమిఁ కరుదెంచెను. అతనిఁగని యాతని బుద్ధికుశలతకు మెచ్చి నిరంకుశునికి రంభనొసగి, రాజునకు గ్రహనిగ్రహముఁ గావించి స్వర్గమున కేగెను. నిరంకుశుడును, తలిదండ్రులకడఁజేరి దనవారికెల్లను మేలు సేయుచు, రంభయనుమతిగొని నిజ భార్యగూడి పుత్రులగాంచి సుఖముండెను.[7]

4. నిగమశర్మ:— కళింగదేశమున పీఠికాపురమను పట్టణము కలదు. అందు శిష్టుడు, కులశీలసంపన్నుఁడు, విద్యావంతుఁడు సభాపతి యను నాహితాగ్ని యొకఁడుండెను. అతని పుత్రుడు నిగమశర్మ. సత్కులసంజాతుఁడయ్యు దురాచారుఁడై. విద్యావంతుఁడయ్యు విషయాసక్తుఁడై నిగమశర్మ యూరివీథుల వెంబడి దిరుగుచు వేశ్యలప్రాపునఁగాలము గడపువాఁడు. వేశ్యాంగనలకై యింటగల యర్థమునంతయుఁ వెచ్చపెట్టెను. కడపట విత్తహీనుఁడై, తనమేని సొమ్ములను కుదువయుంచెను, తల్లి పైఁ బడి గిలుబారెను. తండ్రికి యప్పువడినవారు వ్రాసియిచ్చిన పత్రములను, వారిచ్చినంత ధనముగొని తిరుగనిచ్చివేసెను. సాహుకారుల కెంతవడ్డీ యైన నిచ్చుటకియ్యగొని, యప్పుఁ గొనెను. పుత్తులు, చేలు, గ్రామములు మొదలగు వాని నమ్మఁజొచ్చెను. ఎన్నివిధముల ధనముగొని వచ్చినను వారవనితలకు జాలదాయె. ఋణమిచ్చినవారికి వెడసి యూరివెలుపటఁ దిరుగుచు తినఁ గూడులేక క్షుధాగ్నియందు మాడవలసివచ్చె. నిగమశర్మ స్థితి యిట్లుండ యతని యక్క బిడ్డలతల్లి సభర్తృకముగ బుట్టినింటికి వచ్చెను. తలిదండ్రులు తమ దుఃఖము నామెతో చెప్పుకొని వగచిరి. పశ్చాత్తాప హృదయుఁడై తమ్ముని నెట్లైనను మంచి మార్గమునకు ద్రిప్ప నిశ్చయించి తరివేచి యుండెను.

ఒకనాడు చలిదిఁ గుడుచుటకు నిగమశర్మ యింటికి వచ్చెను. అప్పుడామె వానికి మెత్తని మాటల బుద్ధిచెప్పి వేశ్యవాటికకుఁ బోనీక యింట నిల్పెను. ఇంటిపను లరయుచు నగరికి రాకపోకలు సేయుచు నతడు గొంత కాలము గడపెను. కాని వాని బుద్ధి మారదాయెను.

ఒకరేయి అందరు నిదురించుచుండు సమయమున నిగమశర్మ దేశ త్యాగముసేయ నిశ్చయించి, యింటగల సర్వస్వమును దోచుకొని యరణ్యమార్గముఁబట్టి చనెను.కాని యాధనమును స్వోపయోగార్థము వినియోగించుకొన జాలఁడాయెను. దారియందు దొంగలాతని గొట్టి గాయపరచి

7. నిరం. ఆ. 1—4.

యతఁడెత్తుకొనిపోవుచున్న ధనమును గొని పారిపోయిరి. ప్రాణమాత్రావశిష్టుఁడై నిగమశర్మ నేల గూలెను. అప్పుడామార్గమున బోవుచున్న రెడ్డికుమారుఁడొక డాతనిజూచి కనికరించి, మోచికొని స్వగృహమునకుఁ గొంపోయి, పుండ్లు కడిగి, గాయములకుఁ గట్లుకట్టించి రక్షించెను. అతనికి నిగమశర యందు గాఢమైత్రి జనించెను. కావున నిగమశర్మ స్వస్థుఁడైయ్యును రెడ్డియింటనే కొంతకాలము గడపెను. కాని యా ద్రోహి రెడ్డియంగన తనయందు లగ్నచిత్తయవుట యెరింగి, ఆయూర జరుగుచుండిన జాతరసందడిలో నాచెడివతో బారిపోయి యరణ్యమున నొకబోయపల్లెయందు కాపుర మేర్పరచుకొనియెను. కొంతకాలమున నాకాంత మృతినందెను. నిగమశర్మ యంతట నొక ప్లవకన్య బెండ్లాడి యడవుల దిరుగుచు యడవి జంతువులను వేటాడి తినుచు సుఖముండెను. ఆమెయందాతనికి పలువురు పుత్రులు జనించిరి. వేటాడియు, దారులుగొట్టియు గుటుంబ సంరక్షణ గావించుకొనుచు, వారితోడిదె లోకమని యెంచి యాపల్లియందె స్థిరనివాస మేర్పరచుకొనెను. కాని యొడుదొడుకుల బడి యతని జీవమగాధదుఃఖ పంకమున బ్రుంగిపోయెను. విధి నెవ్వరు తప్పించుకొనగలరు.

యథావిధి నిగమశర్మ యొకనాడు భార్యాపుత్రులను వీడ్కొని మృగయార్థ మరణ్యమునకుఁ బోయి, పెక్కు మృగములను సంహరించి గ్రాసార్థము వలయు మాంసమును పొత్తరలం గట్టికొని యింటికి మరలి వచ్చెను. కాని యంతకు పూర్వము నిప్పు రగుల్కొని యాతని గృహమును భార్యాపుత్ర సమేతముగా గాల్చి మసిచేసివేసెను. ఆ దృశ్యమును జూడగ నిగమశర్మ గుండెలు నీరాయె. ఎవ్వతె తనతోడినీడయని తలచెనో యా భార్య దుర్మరణము నందెను. ఇక నేటి జీవనము? బ్రదికినను చచ్చినట్లే. కావున యాతనికి జీవనముపై విసుగు జనించెను. కడుదుఃఖితుడై యాహారమును విసర్జించి నిలచినచోట నిలువక పరిదేవన మొనర్చుచు అడవియందు దిరుగుచు నృసింహక్షేత్రము జేరి యచ్చట నసువుల విడిచెను. ఆ దుష్టుని చావునకు సంతసించి యమకింకరు లాతని జీవమును యాతనల బెట్టుచు నిజలోకమును గొంపోజొచ్చిరి; కాని యతడు నృసింహక్షేత్రమున మృతి నందుటచే విష్ణుదూత లచటికి వచ్చి యముని బంట్లను పారదోలి యాతని వైకుంఠమునకు దోడ్కొని చనిరి.

సంగ్రహముగ ఇది, సుకుమారాదుల చరిత్ర-ఒండొంటితో బోల్చి చూచిన యందలి వస్త్వైక్యము విదితము కాగలదు. కాని కథను విస్తరించుట యందు శ్రీనాథాదులు వేరొయొక మార్గము నవలంబించిరి. ఇందు సుకుమార మందేహులు కవలు—వారి పోలికలు గాఢములు—ఇరువురును నగరి క్రీనీడఁ బెరిగిరి. ఇరువురి జనకులును యజ్ఞదత్తులే, ప్రెగ్గడలే. సుకుమారుడు హేమాంగదుని మంత్రి కొడుకు. మందేహుడు భోజుని పురోహితుని పుత్రుఁడు. వీరిద్దరి చరిత్రమును చాలవరకు నొక మార్గముననే నడిచెను. కాని హేమాంగదునికంటె భోజుఁడు యొక్కఁడు సహనవంతుఁడు మంత్రికుమారుని దుష్కార్యముల నెరిగిన వెంటనే హేమాంగదునివలె యాతడు శిక్షింపదొరకొనలేదు. బాగుపరచి మందేహుని మంచిమార్గమునకు ద్రిప్పజూచెను. తన రాజ్యమున దేవాదాయ బ్రహ్మదాయముపై బారుపత్యము నిచ్చెను. హరిభట్టునకుఁ దనకాలపు ధర్మాధికారుల యక్రమ ప్రవర్తనలను వెల్లడి సేయుటకు మంచియదనుఁ గల్పించెను. కాని మందేహుని పారుపత్యము రాజ్యమున క్షోభను గలిగించెను, కావున భోజుఁడాతని ధర్మపరిపాలన విధానమును పరిశీలించి యుత డపరాధియని యెరిగి దేశము నుంచి వెడలనడచెను.

సుకుమార మందేహు లిరువురును అరణ్యమార్గమునే పట్టిరి. స్నానమాడుటకై వచ్చిన చండాలకన్యకను సుకుమారుఁడును శబరకాంతను మందేహుడును జలాశయముకడనే కలుసుకొనిరి. అచ్చటనే వారికి గాంధర్వ వివాహము నడచెను. కాని యావల కొంతవరకును వారి చరిత్ర భేదించెను. సుకుమారుడు కొంతకాలమాచాండాలితో గాపురముచేసి, దాని మరణానంతరము దానియందు దనకుద్భవించిన కూతులనే పెండ్లియాడి వారితో సంగమించుచు మరణకాలము వరకును సుఖముననుండెను. మందేహుడు సుకుమారునివలె పాపాత్ముఁడయ్యును నంతటి యోహ్యమున కొడికట్టలేదు. జలాశయము కడ నే శబరకాంతనుగాంచెనో దానితోడనే మరణకాల పర్యంతమును కాపురముండెను కడపట సుకుమార మందేహు లిద్దరును సుఖ మరణము నంది శివరాత్రి జాగరణ పుణ్యమున శివలోకమున కొకడును, హరివాసర జాగరణ పుణ్యమున వైకుంఠమున కొకడును పోయి కైవల్యము నందిరి.

సుకుమార మందేహులు దక్క ఈ కథలయందు సచేతనములగు పాత్రములు గానరావు. శబరకాంతకంటె జాండాలికి యెక్కువ యూపిరియున్నట్లగపడినను దాని చేతనాశక్తి యత్యల్ప మగుటచేత నదియు కళాహీనమైన చిత్తరువు వలెయున్నది. శ్రీనాథ హరిభట్టుల కవితా ధోరణి వేరు. శ్రీనాథుని వాక్ప్రౌఢియు, పద్యముల గంభీరపు నడకయు హరిభట్టునందు గానరావు. కాని హరిభట్టు శ్రీనాథునియుద్ది గాకున్నను ఆంధ్రకవుల యొక్క మొదట బంతిలోనివాఁడు. ధారాళమైన కవితాధార యింపైన మాటలతోడను, పదాడంబర విరహితములగు వర్ణనలతోడను గూడి సొంపుగనున్నది. హరిభట్టు కవనమునందు శ్రీనాథుని గ్రంథములందు గానరాని భావోద్రేక మస్పి పట్లను గానవచ్చుచున్నది.

నిరంకుశుఁడు సుకుమార మందేహాదుల వలె జీవయాత్ర నారంభించినను, రుద్రకవి యాతనివారికంటే భిన్నమార్గమున నడిపించెను. అతడు పుట్టినది శుద్ధశ్రోత్రియ కుటుంబమున—రాచవారితోడిపొందెరుఁగడు కాని చిన్ననాడె సుకుమార మందేహుల బోలి యన్ని విద్యలను గరచెను, పేరు ప్రఖ్యాతలు సంపాదించెను, వేశ్యాలంపటుడై వారివలెనే యూరఁ దిరుగుచు కల ధనము సర్వము వ్యయము జేసి హీనదశకు వచ్చెను. ఇంటివారందరు హితము జెప్పిరి. నిరంకుశుఁడు వారిని సరుకుగొనలేదు. కాని వేశ్యమాత యొనర్చిన యవమానమున కోర్చునలేక పోయెను, దాని మనస్సున చక్కగ నాటెను. ఇంటికి రావెరచి యరణ్యమార్గము పట్టెను. ఇంతటితో నిరంకుశునకు సుకుమార మందేహులతోఁ గల పోలికలు సమాప్తినందెను. ఇక నతడు వేరుదారిని బోయెను. అందెచ్చటను జలాశయము, స్నానమాడు సుందరాంగులును రాలేదు. ఆ దారి యొక పాడుగుడి కీడ్చెను. నేలమట్టముగబడిన మంటపములును గోడలును వానిమధ్య శివలింగము దప్ప మరేమియు నచట గానరాలేదు. సుకుమార మందేహులు నిరంకుశుని వలె విద్యావంతులైనను తెలివితేటలయందతని సమానులుగారు. లేమిడియందు వారి కున్న బుద్ధి సన్నగిలెను. విద్వాంసులయ్యు పామరులకంటే నీచముగఁ బ్రవర్తించి తుచ్ఛజాతులఁ గలిసి విషయాసక్తులై గతించిరి. కష్టముల రాపిడిచే యాతని బుద్ధి వికసించి ప్రతిభాన్వితమై వెలుగజొచ్చెను. బుద్ధికౌశలముచే గడవరాని కష్టము లెవ్వి?

# కుట్టికవి తీవ్రావహేళన

## శ్రీ పి. గణపతిశాస్త్రి

"తనువున్ దత్తునియల్ పొనర్చికొని
　　త్యత్సంపాదితంబైన యా
ధనమున్ ధాన్యము దోచివేయగ,
　　సుబేదారుల్ కతంబేమొ, నా.
మన మూహించిన దానినిన్ వినుము!
　　ప్రేమన్ బల్మనిన్ దాల్మనిన్
దనయుల్ తండ్రి ధనంబు, గొందురు
　　గదా! ధాత్రిన్ అలా యాధిపా!"

శ్రీ గట్టి లక్ష్మీ నరసింహశాస్త్రి. — మహిష శతకము.

ఓ మున్నరేడా! ఒళ్ళు హూనం చేసుకుని నీవు సంపాదించిన ధన ధాన్యాలన్నీ అధము లీ సుబేదారు లపహరిస్తున్నారు! దీనికేమి కారణమో నే నూహించి చెబుతున్నాను విను! బలిమితోగాని, తాలిమితోగాని తన యులు తండ్రి సొత్తు స్వాధీనం చేసుకుంటున్నారు గదా!

అంటే ఆ ధనధాన్యాదు లపహరిస్తున్న సుబేదారులందరు ఆ దున్న కన్నకొడుకు లన్నమాట!

ఈ విధమయిన తీవ్రావహేళనతో తన కాలంనాటి సాంఘిక దురన్యాయా లన్నిటిమీద స్వకీయ సంస్కృత మహిష శతకంతో దుమ్మెత్తి పోసిన గట్టికవి కుట్టికవి. మొత్తంమీద ఈ మహిష శతకంలో శ్లోకాలన్నీ సుమారు నూరు. ఒక్కొక్క శ్లోకము ఒక్కొక్క పెనుభిచ్చరి పిడుగులాగ, ఒక్కొక్క బ్బాణలాగ, ఆ కాలం లోని రాజమంత్రులమీద, సుబేదారుల మీద, అధికారుల మీద విరు చుకు పడుతుంది.! కనకనే తన మహిష శతకంలో అంతటి పెద్ద పులుల వంటి శార్దూల విక్రీడిత వృత్తాలే రచించాడేమో కుట్టికవి.

### కుట్టికవి

కుట్టికవి అసలు పేరు వాంఛానాథుడు. ఈతని తండ్రి గొప్ప విద్వాంసుడు, రాజ్యకార్య నిర్వహణదక్షుడు, మహనీయవేత్త, స్వయంగా కవి, మహారాష్ట్ర భోసల వంశీయుడు అయిన శహాజీవల్ల అగ్రహారం స్వీకరించిన నలభై ఏడుగురు విద్వాంసులలో ప్రముఖుడీ వాంఛానాథుని జనకుడు.

శహాజీ క్రీ. శ. 1684 మొదలుకుని 1710 దాకా తంజా వూరు రాజ్యం పరిపాలించాడు. ఇతని పరిపాలన కాలంలో సంస్కృతాంధ్ర సాహిత్యాలు పూడు పువ్వులు, ఆరు కాయలుగా వర్ధిల్లాయి. ఈ విద్యాప్రభువు శహాజీపురమన్న పేరట తిరువిసనల్లూరు గ్రామం నలభై ఏడుగురు ప్రముఖ విద్వాంసుల కుటుంబాలకు ధారాదత్తం చేసిన ఏడాది క్రీ. శ. 1691.

శహాజీ మంత్రులలో ఒక సచివుడు నరసింహరాయమఖి త్రిపుర విజయమన్న గీర్వాణ గద్య పద్యాత్మక కావ్యం రచించాడు. వేరొకమంత్రి త్ర్యంబకరాయమఖి శహాజీ రాజ్యంలో యజ్ఞ యాగాది వైదిక కర్మల కన్నింటికి గొప్ప ప్రోత్సాహం కలిగించిన మహనీయుడు.

### ప్రతాప సింహుడు

శహాజీ అనంతరం తంజావూరు రాజ్యం పరిపాలించినవాడు ఆతని సహోదరుడు శరభోజీ. ఇతడు 14 ఏళ్లపాటు తన ఏలుబడి కొనసాగించాడు. ఇతని కాలంలో శత్రువుల పీడలతోబాటు అంతఃపురంలో కలహ లెన్నో చెలరేగాయి. ఇతని సహోదరుడు తుకోజీ రాజ్య పరిపాలన కాలంలో మధురనాయక రాజుల రాజ్యా లంతరించాయి. ఇందు వల్ల తంజావూరు పరిసరాలలోనే తురుష్కుల పీడ చెలరేగింది.

ఈ ఉపద్రవాలకు తోడుగా అనేకులు తామే శరభోజీ తనయుల మని ప్రకటించుకుంటూ రాజ్యాధికారం తమ కాయత్తం కావాలని వివాదా లారంభించారు. ఆ పైన చిట్టచివరి దశలో ఒక వైశ్య మంత్రి దుస్తంత్రాలకు లోనై ఈ పరిపాలన కొనసాగించాడు తుకోజీ. దానితో ప్రజానీకంలో మరింతగా ఆగ్రహం ప్రారంభమయింది.

ఇతడు మరణించిన పిమ్మట అంటే క్రీ. శ. 1736 తరవాత తంజావూరు రాజ్యమంతా అరాజకమయింది. తుకోజీ కుమారుడు ఏకోజీ రాజ్యంలో కుతంత్రాల పాలయి ఏడాదిలోగానే పరమపదించాడు. అప్పుడు అతని భార్య సచివుల సాహాయ్యంతో రెండేళ్లపాటు రాజ్య పరిపాలన కొనసాగించింది. ఇదే తగిన తరుణమని గ్రహించి, తానే శరభోజీ కుమారుడనని ప్రకటించుకుని షాహుజీ అన్న వ్యక్తి ఆరుగు బాటు లేవదీసి తంజావూరు రాజ్య సింహాసనం దక్కించుకున్నాడు. కాని ఒక ఏడాదిలోగానే ప్రజలు ఈతడొక చకలిస్త్రీ కుమారుడని గ్రహించి సింహాసనంమీదనించి దించివేసి, తుకోజీ కుమారుడు ప్రతాప సింహునికి పట్టాభిషేకం జరిపించారు.

ఇతడు 1739 మొదలుకుని 1763 దాకా తంజావూరు రాజ్యం పరిపాలించాడు. మహారాష్ట్ర భోసల వంశీయులలో ఇతడే చిట్టచివరివాడు. ప్రతాపసింహుడు మొట్టమొదట రాజ్యభారం స్వీకరించ డానికి అంగీకరించలేదని, కాని ప్రజానీకం పట్టుపట్టినందువల్ల కాదన లేక ఒప్పుకున్నాడని తెలుస్తున్నది.

ప్రతాపసింహుడు ఆ యువుడైన తరుణంలోనే పరిస్థితు లెటు వయ్యాయి! ఒక వైపున మహమ్మదీయుల అలజడులు, వేరొక వైపున అంతఃకలహాల మితిమీరాయి. షహుజీని సింహాసనం మీద కూర్చో బెట్టడానికి ప్రయత్నించిన మహమ్మదీయుల కలకలోలాలతో రాజ్యంలో అంతటా కరువు కాటకాలు తాండవించాయి.

ఇదే సమయంలో సతారాలోని మహారాష్ట్ర నాయకులు మహమ్మదీయుల మీద దండెత్తి వచ్చి తిరుచునాపలి ఆక్రమించుకున్నారు. అయితే తన రాజ్యాధికారం పరాధీనం కాగలదేమో అన్న భీతితో ప్రతాపసింహుడు వారితో సహకరించడానికి కొంతమాత్రము ఇష్టపడ లేదు. ఇందువల్ల అతనికి తిరుచునాపల్లిలో అధికారం చెలాయిస్తున్న మురారితోను, నైజాముతోను పోరాటా లారంభమయ్యాయి.

1742 లో తిరుచునాపల్లి నైజాము చేతికి చిక్కింది. తంజా వూరు రాజ్యానికి అటనిక కష్టం కట్టవలసిన దుస్థితి ఏర్పడింది. ఇటువంటి పరిస్థితులలో రాజ్యంలో అంతటా అల్లకల్లోలా లెక్కు వయ్యాయి.

## ముద్దు పేరు

వాంఛానాథునికి కుట్టికవి అన్నపేరు స్థిరపడి పోవడానికి ఒక కారణం వినవస్తున్నది. ఈ కవి ఒకసారి తన తండ్రితో కలిసి మధురలో మీనాక్షీ దేవాలయానికి వెళ్లి దేవతా సందర్శనం చేసుకున్నాడు. అదే తరుణంలో అచ్చటికి విచ్చేసిన శహాజీ ఆశుకవితా ధోరణిలో ఆ దేవి నిలాగ ప్రస్తుతించాడు:

"పురి మధురం, గిరి మధురం,
గిరి మధురం, ధరనితంబ భార్యాతవ్
స్థూల కుచం, నీల కచం
బాలక చంద్రాంకితం తేజః"

ఆ సమయంలో అచ్చటనే తండ్రి పజ్జనే నిలుచున్న పిన్నవాడు వాంఛానాథుడు శహాజీ కవితా సంపత్తికెంతో ముగ్ధుడయి ఆ మహారాజ కవి నిలాగ ఆశుధోరణిలో వినుతించాడు:

"హ్లాది తరసా, విదిత రసా
తదితర సాహిత్య వాఙ్మవేలగతిః
కవిలోకే నవిలోకే
భువిలోకేశస్య శాహజీ రుపమాన్"

అంతటి చిన్నతనంలోనే ఆవిధంగా గిర్వాణవాణిలో వెలువడిన అతని ఆశుకవితా ధోరణికెంతో అబ్బురపడి, శహాజీ అతనిని "కుట్టికవి" అని పిలిచి ఆదరించి గౌరవించాడట! "కుట్టి" అంటే తమిళంలో పిన్నవాడని అర్థం. ఈ బిరుదంమీది గౌరవం వల్లనే కాబోలు మహిష శతకంలో వాంఛానాథుడు తన్ను గురించి కుట్టికవి అని పేర్కొన్నాడు. ఆనాటినించి కూడా అతనికి కుట్టికవి అన్న బిరుదమే స్థిరపడిపోయి ఉండవచ్చును. మన దేశంలో "బాలకవి" బిరుదులాగే అతని కుట్టికవి బిరుదమే యథార్థ నామధేయమై లోకంలో స్థిరపడి ఉండవచ్చును.

## కవి కన్నడుడా ?

చాలాకాలంనించి తమిళదేశంలో స్థిరపడిపోయినందువల్ల కుట్టికవి తమిళ దేశీయుడుగా ప్రసిద్ధి పొంది ఉండవచ్చును. కాని ఇతడు కన్నడిగుడని మహిషశతక వ్యాఖ్యానకర్త పేర్కొంటున్నాడు. ఈతడు కుట్టికవి ప్రపౌత్రుడు. కుట్టికవి భోసల వంశీయుల అమాత్యుల కులంలో ప్రభవించిన వాడని, వేదవేదాంగ పారంగతుడని, కన్నట జాతీయుడని ఈ వ్యాఖ్యాత విస్పష్టంగా నక్కాణిస్తున్నాడు. కన్నటి జాతీయుడంటే కన్నడ జాతీయుడని నిర్ణయించుకోవలసి ఉన్నది. అంతేకాని ఈ పదానికి వేరొక అర్థం పొసగదు. కుట్టికవి తన తండ్రివలె సచివుడు కాకపోయినా, తండ్రిలాగే ప్రభువులకు నీతి పద్ధతు లుపదేశించి సన్మార్గానికి మరలించేవాడట!

## కుట్టికవి అధిక్షేపము

అయితే కుట్టికవి పెద్దతనంలో చాలా దుర్భరమయిన లేమి అనుభవించాడు. ఆ రోజుల్లో విద్వాంసులకు నిరంతర విద్యా పరిశ్రమ ఒక్కటే తక్క మిగిలిన వృత్తులన్నీ అనుచితాలే! అయినా తనకు వ్యవసాయం చెయ్యవలసిన దుర్గతి తటస్థించినదని కవి వాపోతాడు. "మహిషరాజా! నా కొక గోచిపాత అయినా మిగిలిందిగాని నీకు అదీ లేదే!" అని వ్యంగ్యంగా మహిషంమీదాని సామభూతి మిషతో తీవ్రంగా అధిక్షేపిస్తాడు! దీనికి తార్కాణంగా మూలంతోబాటు ఆంధ్రానువాదం కూడా ఇక్కడ ఉదాహరిస్తున్నాను.

"రాజా ముగ్ధమతిః తతోపి సచివాః
క్రూరాన్ వంచయంతః ఖలాః
దేశద్రోహపరాః సదైవ వృషలాః
సర్వాపహారోద్యతాః
ఆశాం మాం కురు చోళదేశ కృషయే
త్వం సైరిభాతః పరం,
శిష్టం మేత్వల మల్లకం.
తదపి న భ్రాతః స్తవాస్యం తతః"

దీనికి గట్టివారి అనువాదమిది.

"తెలియం జాలడు రాజు,
మంత్రులును నంతే! వారి వంచించి, వి
ప్లవు దేశంబును గోలకెత్తుచు
ఖలుల్ సర్వాపహారోద్యతుల్,
అంతేం పోకిక, చోళదేశ కృషికై
యాసల్ విసర్జింపుమా!
నిలిచెన్ నా కొక గోచిగుడ్డ,
మహిషా! నీ కద్దియున్ లేదుగా!"

కట్టి దున్న వర్ణనం తన లక్ష్యం కానేకాదని, తనకు ద్రోహం చేసిన దుర్మార్గులయిన అధికారులనేకాక, వారి ప్రభువులను కూడ ఘనమయిన వాగ్దండంతో దండించడమే తన ఏకైక లక్ష్యమని కుట్టికవి ఈ శతకం ప్రారంభంలోనే స్వకీయ లక్ష్యం నిర్దేశిస్తాడు. ఆ శ్లోక మిది:

"కంచిత్వ శ్వధమం బలాయ!
విగుణం కర్తుం ప్రబంధాన్ శతం
త్వా మాలంబ్య సముత్సహే,
న ఖలు తద్వర్ణ్యస్య మాహాత్మ్యతః,
మద్ద్రోహ ప్రవణాధికారి హతక
క్రోధేన, తన్నిందన
వ్యాజాత్తత్ప్రభు తత్ప్రభుష్వపి చ
వాగ్దండో మయా పాత్యతే."

దీనికి లక్ష్మీనరసింహశాస్త్రిగారి అనువాద మిది:

"పనికిన్ మాలిన నిన్ను నీచపశువున్
వర్ణింపగా బూనినా
నన. నిన్నేలగతంబు వర్ణ్యగుణ
మాహాత్మ్యంబు కాదింతయున్,
కాని మద్ద్రోహ పరాధికారి
హతక క్రోధంబు, తన్నిందన
ధ్వనితో సైరిభ! తత్ప్రభు
ప్రభులపై వాగ్దండమున్ వైచెదన్!"

తనకు జరిగిన దురన్యాయాలేకాక ఆ కాలంలో సుప్రసిద్ధులయిన మహనీయ విద్వాంసుల కెందరికో ఇట్టి దుర్గతి పట్టినది. వారి వారి పేరులతో ఉట్టంకించాడు వాంఛానాథుడు. ఆర్య శ్రీధరుడు. విద్య తెగ నమ్ముకునే జోహారిగా మారిపోయినట్లు దుఃఖిస్తాడు కుట్టికవి. ఈ రోజుల్లో విద్యా విక్రయము మన్నది ఒక పరిపాటిగా అలవాటుగా మారి పోయింది. కాని ఆ రోజుల్లో అది ఒక గొప్ప తప్పిదము. విద్యార్థుల కంద

రికి అన్నపానాది సౌకర్యం విర్పాటులతోపాటు, నిరంతర విద్యా ప్రదానమే అలనాటి విద్వాంసుల నిత్యవృత్తి. ఇలాగే అంబుమఖికి కడుపారా భోజనమే కరువయిపోయినదట! ఆ శ్లోకమిది:

"విద్యావణ్య విశేష విక్రయవణిక్
జాతః సుధీః శ్రీధరః
వ్యస్తం స్వర్ణమభూత్ బతాంబుమఖినో
ధిక్తస్య షడ్దర్శనీం
ఖ్యాతః కుట్టికవిస్తు దుర్ధనిగ్రహ
ద్వారేషు విద్రాయ తే!
తత్సర్వం మహిషేశ్వరా
నను శ్రుతే ర్భాగ్యధామ్నః ఫలమ్.

దీనికిది తెలుగుసేత :

"వడి. విద్యా బహు వస్తు విక్రయమున్
వ్యాపారియై శ్రీధరుం
డడరెన్, కూటికిలేని యంబుమఖి శా
స్త్రాఖ్యానముల్ వ్యర్థముల్!
బడలెంబో కవి కుట్టి దుర్ధనిగ్రహ
ద్వారంబునన్ నిద్రతో.,
కడకుం గాసరరాజు నాశ్రయమునన్
గామింపఫలం బింతయున్!

ఇంకొకచోట ప్రజానీక పీడకులయిన అధికారి దురాత్ముల నీ తీరులో శపిస్తాడు కవి.

"ధనమున్ ధాన్యము నొండొరుల్ బలిపి
స్వర్ణం బంచమున్ బెట్టి, వం
చనమై లోగొని రాజపూరుషుల, నా
స్థానంబునం జేరి, చే
సిన రాజ్యంబును దోచుచుండిరి
ఖలుల్ కూళల్ ప్రజానీకమున్
జనినిన్ పిందురుగాక ప్రేతపురికిన్
వారెల్ల వార్వారితోన్!

ఇలాగ అనేక విధాలుగా సాగిపోతుంది ప్రజానీకపీడకుల మీద కవి ఎడతెగని దుమ్మెత్తిపోత!

## శ్లేష చాతురి

ఈ కవి శ్లేష వ్యంగ్యార్థ నిందా వైఖరిలో మిక్కిలి పేర్పరి. సంస్కృత వాఙ్మయంలో అన్యాపదేశ శతకాలు కొన్ని వ్యంగ్యంగా రాజులను వారి అమాత్యులను అనేకవిధాల నిందించకపోలేదు. ఖలులైన వారిని పేర్పేరు విధాలుగా అవహేళన చెయ్యక పోలేదు. కాని ఈ విధమయిన అవహేళన మహిష శతకంలో నూరు శ్లోకాలలోను ఒక అవధికి వెళ్ళిపోతుంది. పలుతావులలో మహిషాన్ని అయా దేవతావతారాల మూర్తిగా అభివర్ణిస్తాడీ కవి. ఇలాగ అనేక విధాలుగా నిందాగర్భంగా ఈ శతకం రచించడంలో కుట్టికవిది ఒకే ఒక లక్ష్యం. అది ప్రతాపసింహానికి తిరిగి తిన్నని దారి చూపించడమే! దుర్మార్గపరులయిన రాజామాత్యుల దుశ్చర్యలేకాక, సుబేదారుల దురాగతాలన్ని ఎలుగెత్తిచాటుతూ ఈ శతకం ప్రజానీకం సుఖించాలని ఆక్రోశిస్తుంది.

## ఆశ్యసిద్ధి

ఆనోట ఆనోట ఈ శతక శ్లోకాలన్ని విన్న ప్రతాపసింహానికి పశ్చాత్తాపం కలిగినదట! తన దుస్సహవాసాలన్ని విడిచిపెట్టి, అతడు తిన్నవయిన దారిలోపడి తన తప్పిదాలన్ని మన్నించవలసినదని కుట్టికవిని వేడుకున్నాడట! ఈ విషయాలన్ని ఈ శతక వ్యాఖ్యాత స్వయంగా వ్రాసినందువల్ల అవి తప్పక విశ్వసించదగినవే! కనకనే ఈ శతకం ప్రజానీకానికి శుభాకాంక్షతోనే ముగిసిపోతుంది.

కుట్టికవి ధాటీ శతకము. ఆశీర్వాద శతకము అన్న ఇంకా రెండు శతకాలు కూడా రచించాడు. కాని, అన్నింటిలోను మహిష శతకమే సర్వోత్తమ మయినది. కనకనే దీని కింతటి ఘనప్రశస్తి లభించింది.

## అనువాదకులు

ఈ శతకానువాదకులు శ్రీ గట్టి లక్ష్మీ నరసింహశాస్త్రిగారు గట్టి విద్వాంసులు. శాలివాహన గాధాసప్తశతి, అచ్యుత రాయాభ్యుదయము. అమరుక కావ్యము, భాగవత చంపువు, అశ్వీన మాహాత్మ్యము, మొదలయిన సంస్కృత కావ్యాలెన్నో ఉదాత్త ప్రౌఢశైలిలో తెనుగులోనికి అనువదించారు వీరు. ఇలాగే భాస మహాకవి నాటకాలన్ని ఆంధ్రీకరించారు. స్వయంగా స్వతంత్ర కావ్యాలెన్నో రచించారు.

చాలాకాలం క్రితం శ్రీ కూచిభొట్ల ప్రభాకరశాస్త్రి, శ్రీ గట్టి లక్ష్మీ నరసింహశాస్త్రి అన్న అన్నదమ్ములయిన జంట కవు లిరువురు అనువాద కావ్యాలు, స్వతంత్ర కావ్యాలు, రచనలు చాలా వెలువరించారు. వీరిలో గట్టివారు దత్తులుగ వెళినందువల్ల వారి ఇంటిపేరు వేరక

విధాలుగా గట్టిపడింది. ఆ తరవాత మరికొంత కాలానికి వీరుభయులు వేరువేరుగా తమ తమ రచనలు వెలువరించడం ప్రారంభించారు. మరి కొంతకాలానికి శ్రీ గట్టి లక్ష్మీ నరసింహశాస్త్రి సన్యసించి తురీయాశ్రమం స్వీకరించారు. ప్రస్తుతం వీరిప్పుడు శ్రీ నృసింహానంద భారతీ స్వామి అన్న ఆశ్రమ నామధేయంతో గుంటూరులో పీఠాధిపతులుగా ఉంటున్నారు.

## అనువాద పద్ధతి

కుట్టికవికి శ్లేష సార్వభౌముడన్న బిరుదమున్నది. కాని ఈ శ్లేష క్లిష్టమయినది కాదు. చాలా మృదువయినది. అనువాదంలో తమ స్వంత ధోరణులవేవి దరికి రానీయక యథాతథంగా మూలంలోని భావాలే తెలుగు వృత్తాలలోని కనువదించాలని ప్రయత్నించారు, నరసింహశాస్త్రిగారు. వీరిది సహజంగా ఉదాత్త ప్రౌఢ మధుర మయిన శైలి. ఇది ఒక్కొక్కచోట మూలానికే మెరుగులు దిద్దుతున్నట్టున్నది.

మూలంలోని తెలి జొన్నలు, పెసలు, మిరియాలు, ఆళ్లు, చోళ్లు మొదలయిన దినుసుల సంస్కృత పదాలున్న శ్లోకం తెనుగులోనికి యథాతథంగా తీసుకురావడం చాలా కష్టం. కాని వీరిది ఎంతో హృద్యంగా తెనుగులోని కనువదించారు.

"అలచందల్, తెలి జొన్నలుం బెసలు,
మిర్యా, లాళ్లు, చోళ్లల్వలుం
దిలలున్, గోధుమముల్ యవల్
మినుములున్ దివ్యంబులౌ వడ్లు కో
ల్లలుగా గంపలకెత్తి పోసెడు నటుల్
పండించి, నండించి, యి
మ్ముల నిందింపుము సైరిభేంద్ర! యు
దరంబుల్, మాకు నాయాతరిన్!

ఈ సందర్భంలో రాజుల మీద శ్లేషోక్తులతో స్తుతి నిందలతో నిండిన ఈ పద్యం కూడా ఎన్నదగినదే!

"చెవిదోయిం బిశునోక్తి
సేరదెపుడుం, జీమంత మోసంబు
సేయుదు, ని వెల యవస్థలం దిలమినే
కాకారతం బూని యుందువు
దుర్వంచకు, లవ్యవస్థ విషముల్
దుష్టుల్ నృపుల్ చా, లిసీ!

భువిద్వన్నాధులమ్మా గడింతుము
ముదంబుం గానరాధీశ్వరా!

రాజమంత్రుల నింతగా అనేకవిధాల నిందించినా తన రేనిమీద కవి కేమాత్రము విద్వేషం గూడుకట్టుకోలేదు! బహుశః పశ్చాత్తప్తుడయిన ప్రతాపసింహుని అనునయం వల్లనే శతకాంతంలో ఈ శుభ పరిణామం కలిగి ఉండవచ్చును. రాజాశీర్వాదంతోనే చిట్టచివరికీ శతకం ముగిసిపోతుంది.

"శ్రీ మద్భోసలవంశ దుగ్ధ జలధి
శ్రీ పూర్ణ చంద్రుండు, సు
త్రామాభుండు ప్రతాపసింహపతి
ధర్మస్థుండు, వృస్థుండునా
ప్రేమజ్యోత్స్నల ముంచి తేల్చి,
సకలోర్విన్, స్వప్రజాగౌరవ
శ్రీ మాన్యుండయి పొందుగాత
విజయశ్రీతోడ దీర్ఘాయువుల్!"

కుట్టికవి స్వయంగా రాజమాత్యుడు కాకపోయినా రాజమంత్రి పుత్రుడే. అయినా దేశ సంక్షోభ సమయంలో అతనికి దుస్సహ కష్ట నష్టా లెదుర్కోక తప్పలేదు! కాని అచంచల ధీరుడయి నిలిచి ఆ కవి తన కవన కరవాలంతో దుష్టుల నందరిని చీల్చి చెండాడి, ప్రతాప సింహనృపతిని తిరిగి సన్మార్గానికి మరలించాడు! కనకనే ఈ నాటికి అతని సుకవితా వాణి విజయకాహళమయి సంస్కృతాంధ్ర వాఙ్మయాలలో మార్మ్రోగుతున్న దనుకుంటాము.

ఎన్నెన్ని విధాల పురోగమించినా ప్రపంచంలో మంచి చెడుగుల కెల్లప్పుడు కొంగ్రొత్త రూపాలలో ఎడతెగని పోరాటం కొనసాగుతూనే ఉంటుంది. ఒక్కొక్కప్పుడు మంచి చెడుగా చెడు తాత్కాలికంగా మంచిగా స్ఫురించవచ్చును. ఈ మంచి చెడుగుల లోతులన్ని అతి నిశితంగా ఆకళించుకుని మంచి వైపు నిలిచి పోరాడిన వారే మాన్యులయిన కవి మూర్ధన్యులు కాగలరు!

మనవారు పాతిక ఏళ్ల క్రితమే స్వాతంత్ర్యం చేకూర్చినా నేడు మన దేశంలో ప్రజానీకానికి అడుగడుగునా దుస్సహపరిస్థితు లెదురు పడుతూనే ఉన్నాయి. ఒక్కొక్కప్పుడు ఈ పరిస్థితులన్ని గమనిస్తుంటే కుట్టికవి మన హృదయాలలో సాక్షాత్కరిస్తాడు! ఆ కవిలాగ దుర న్యాయాల కెదురొడ్డి నిలిచిన రచయితలున్నా అతనివలె దిగ్విజయం సాధించిన వారు చాలా అరుదుగా కాన వస్తున్నా కుట్టికవి నిశ్చయంగా వాంఛానాథుడే! ధన్యుడు కవి వాంఛానాథుడు.

# నున్నని టైరులతో పంటలు పండవు...టివియస్ రిట్రెడ్‌లతో పుష్కలంగా పంటల లాభాలను పొందడం ప్రారంభించండి.

అరిగిపోయిన నున్నని ట్రాక్టరు టైరులు వల్ల వృధా కాల యాపన, శ్రమ, ఖర్చు కూడాను. అతి విశిష్టంగా ఖచ్చితంగా ట్రెడ్ చేయబడిన టైరు మాత్రమే దుక్కి సామర్థ్యతను అధికంచేసి పంటలను పుష్కలంగా పండింపజేస్తుంది. టివియస్ దానినే మీకు ప్రసాదించేది.

అతి ఖచ్చితంగా 24 గంటలలో రిట్రెడ్ చేయబడిన టైరు వెల క్రొత్త దానికంటె 30% తక్కువ.

కలుసుకోండి: టివియస్ విజయవాడ, బెంగళూరు

TVS

**మీరు టివియస్‌ను విశ్వసించవచ్చు**

సుందరం ఇండస్ట్రీస్ ప్రైవేట్ లిమిటెడ్
విజయవాడ - బెంగళూరు

ISAA/SI/1269 TEL

# మొగిలీశ్వర క్షేత్రము

శ్రీ ఇరువారం లోకనాథం

ఆంధ్రదేశమందలి దేవాలయాలలో దాదాపు మూడింట ఒక భాగము చిత్తూరు జిల్లాయందే కానవచ్చుట యొక ముఖ్యవిశేషము. అందులోను శివక్షేత్రాలు ప్రతినాలుగైదు గ్రామాలకొకచోటనైనా వెలసియుండుట చూడ పూర్వకాలమున శైవమతమెంత అధికముగా ఆధిక్యత గాంచియుండినదో తేట తెల్లమగును. ఈ ప్రాంతము



(శ్రీ మొగిలీశ్వరాలయ గోపురము)

పూర్వమేలిన పల్లవ, చోళ, హొయసలరాజ వంశములు శైవమత ప్రచారమునకై శివాలయము లధికముగా కట్టించి ఆయాలయాలంగరంగ భోగ నిత్యకైంకర్యాదులకు విధులను మాన్యములు, భూవిరాళములొసంగినట్లు ఇట వ్రాయించిన శిలా శాసనాదుల వలన విదితమగుచున్నది. విజయనగర రాజులుకూడ యిక్కడి ఆలయాల పునరుద్ధరణకు అటనట ద్రవ్య సహాయమొనర్చినట్లు కూడ స్థల చరిత్రల పరిశోధించిన వెల్లడికాగలదు.

ఈ జిల్లాయందు వెలసియున్న శివక్షేత్రములన్నియు పురికి దూరముగ నదుల యొడ్డుననో, నదస్సరములందో కొండ కొనభాగముననో కట్టబడి యుట ప్రశాంతత నెలకొని యున్నది. మనశ్శాంతి లోపించిన వారి శివాలయములలో ప్రదక్షిణాదికాలు గావించిన వారి చిత్తక్షోభకు ఉపశమనము గలిగి మనోధైర్య నిగ్రహాలు కలవారై భక్తి భావన గలవారై యలరారగలరనుట నిర్వివాదము.

చిత్తూరు జిల్లాలో స్థల, తీర్థ, మహాత్మ్యాలు గల పుణ్యక్షేత్రాలలో శ్రీ మొగిలీశ్వరక్షేత్రము ప్రసిద్ధిగాంచినది. ఈ క్షేత్రరాజము చిత్తూరునకు పదునెనిమిది మైళ్ళదూరమున, అటు పలమనేరునకు ఏడుమైళ్ళ దగ్గర మద్రాసు, బొంబాయి ట్రంకురోడ్డు ప్రక్కగా వెలసియున్నది. ఈ క్షేత్రము యొక్క ప్రశస్తిని గూర్చి స్థలపురాణములనేకము లున్నవి. స్థల మహాత్మ్యమును గూర్చి ప్రజలనేకరీతుల వర్ణించుచుండెదరు.

## 1. దేవళకొండ :

పూర్వము పార్వతీ పరమేశ్వరుల వివాహసమయమున వివాహ వైభవాన్ని వీక్షించుటకు సకల దేవతలు హిమనగమును చేరిరి. సకల లోకవాసులొక్కచోటనే చేరుటవలన భూభారమొక్కప్రక్క అధికమై భూమి భారమును మోయజాలక కంపించినది. వివాహమునకు వచ్చిన



(శ్రీ మొగిలీశ్వరస్వామి లింగము ....

### ౩. విభూతికొండ:

పూర్వము ముని బృందారకులందరు జేరి ఈ క్షేత్ర సమీపమున పౌండరీకమను సత్రయాగమును కొన్ని వత్సరములు చేసిరి. ఆయజ్ఞమున వ్రేల్చబడిన యాగ ద్రవ్యము బూడిదై కొండవలె రాశి పడినది. అదియే విభూతికొండ యను నామమున బరగుచున్నదని స్థల పురాణములందు తెలుప బడియున్నది. ఇక్కడి మొగిలీశ్వర లింగమునకు నేటికిని ఆ విభూతి కొండలో లభించు విభూతినే పూజారులు పూయుచున్నారు.

### ౪. మొగిలప్ప వృత్తాంతము:

చెంజి రాజైన దేశింగురాజు నోడించిన ఆర్కాటు నవాబు వద్ద సేనాధిపతిగా నుండిన ముద్దుబంగారునాయనివారు ఆ యుద్ధమున చూపిన సాహసమునకు మెచ్చి నవాబు చిత్తూరు జిల్లాలో కొంత భాగమును, గుడియాత్తం తాలూకాలో కొంతభాగమును నాయకరము చేసికొనుట కొసగెను. ముద్దు బంగారు నాయనివారు బంగారుపాలెమును నివాసముగా నుంచుకొని తన కొసంగిన రాజ్య భాగము నాయకరము చేయుచు వచ్చెను. అందుచే ఆపాలెమునకు బంగారుపాలెమని ఆవంశస్థులకు బంగారు వంశస్థులని నామమేర్పడినది.

ఆ వంశములలో మొగిలప్ప యనువతడు ఈ క్షేత్ర సమీపమందలి మొగిలివారి పల్లెలో కాపురముండెను. అతడు పశువులను దేవరకొండ సమీపమున మేపుకొను చుండెడివాడు. అతని మందలోని యొక గోవు మామూలు ప్రకారము పాలివ్వకుండుట జూచి కారణము నరయ నెంచి యాగోవును విడువక వెన్నంటి వెళ్ళెను. ఆయావు దేవరకొండలోని యొక గుహలో ప్రవేశించెను. మొగిలప్పయు వెన్నంట వెళ్లెను. ఆగోవు ప్రవేశించిన గుహాంతర్భాగమున పార్వతీ పరమేశ్వరులు సకలగణ సేవితులై యుండిరి. ఆ ఆవు వెళ్ళి పార్వతి చెంత నిలువగా నామె గోవు పొదుగునుండి క్షీరమును కుంభమునకు పిండుకొనెను. మొగిలప్ప ఈ వింతను జూచి చకితుడయ్యెను. ఈనాటి నానిని గాంచి ఆట నాతడు జూచిన విశేషము లెవరికి తెలుప రాదని, అట్లు చెప్పిన మొగిలప్ప తల వ్రక్కలగునని శపించి, పిదప కనికరించి యాతని కాకలిదప్పులు లేకుండుగాకని వరము నొసగెను.

మొగిలప్ప భక్తి తత్పరుడై యాదేవికి మ్రొక్కి తనగోవుతో గృహము చేరెను. అది మొదలాతని కాకలిదప్పులు లేవయ్యెను. ఈ మార్పును వాని భార్య గమనించి కారణమునడిగెను. కాని మొగిలప్ప తాజూచిన రహస్యమును నుడువలేదు. ఒకనాడు ఆకలిదప్పులు లేకుండుటకు కారణము తెలుపవలసినదని నిలదీసి యడిగెను. మొగిలప్ప తన భార్యకావృత్తాంతమును తెలుపగా నాతని తల వ్రక్కలై మరణించెను. అతని భార్య సహగమనమొనర్చినది.

### ౫. మిరియాల వర్తకుల వృత్తాంతము:

బళ్ళారి ప్రాంతపు మిరియాల వర్తకు లొక పర్యాయము మద్రాసునకు మిరియములు తెచ్చుచు మొగిలి క్షేత్రమువద్ద మజిలీ చేసిరి. అటనున్న శివలింగమును మామూలు రాయి యనియెంచి పొంబార ద్రవ్యములు నాలింగముపై నూరిరి. ఈశ్వరుని కందుచే శిరోవేదన యేర్పడ యొక వృద్ధుని రూపమున వచ్చి తలనొప్పికి పట్టు వేసికొనుటకు కొంత మిరియపుగింజలిమ్మని యడిగెను. వర్తకులు తమ వద్ద మిరియములు లేవని బస్తాలలో నున్నవి జొన్నలని అసత్యమాడిరి. అప్పుడు డట్లే జొన్నలుండనిండని వచించెను. వర్తకులు మద్రాసునకు వెళ్ళి మిరియపు బస్తాలను అమ్మకమునకు పెట్టి మూట లను తీసి కుప్ప పోయగా నవియన్నియు జొన్నలై యుండెను. వణిజులు దిగ్భ్రాంతి జెంది తాము చేసిన అపచారమును మన్నింపుమని శ్రీ మొగిలీశ్వరస్వామిని ప్రార్థించిరి. మూటలందలి జొన్నలంతయు మిరియములుగా మారినది. దానిని అమ్మి అధిక లాభమును గడించిరి. ఆవర్తకుల తిరుగు ప్రయాణములో నా మొగిలీశ్వరస్వామిని భక్తితో పూజించి ఆలయమును కట్టించిరి. అని స్థల పురాణములందున్నది. పిదప బంగారు జమీందారు వంశీయులు యీ దేవాలయము నభివృద్ధి పరచిరి.

శివరాత్రినాడీ క్షేత్రమును సందర్శించి, త్రిశూల తీర్థమున స్నానమాడుటకు వేనకు వేలు జనులు వచ్చెదరు. కార్తీకదీపోత్సవమునాడు దేవరకొండపై దీపమునుంచి ఆలయమున లక్షదీపోత్సవములు వైభవోపేతముగా జరుపుదురు. ఇక్కడ జరుగు పుష్పపల్లకి సేవను సందర్శించుటకు యాత్రికులు మైసూరుమున్నగు దూర ప్రాంతముల నుండి తండోపతండములుగా వచ్చుచుందురు.

# తెనుగు కవుల కవితా చమత్కృతి

కుమారి దాసరి శారద

చమత్కారము హాస్యములో అంతర్భాగము. లలితహాస్యముకంటే ఒక మెట్టు ఎక్కువ. జీవితం అంటే ఏమిటో తెలుసుకున్నవాడు చమత్కారశీలుడు. మన ప్రాచీన కవులు తమ తమ కావ్యాల్లో ఈ చమత్కార వైచిత్రిని ఎట్లా పోషించారో చూద్దాము. తిక్కన సోమయాజి మహాభారతం విరాటపర్వంలో ద్రౌపది కీచకునివల్ల అవమానింపబడి, కొలువుకూటానికి వచ్చి ఈ సంగతి విరటునికి చెప్పి తన గోడు వెళ్ళబోసుకుంటుంది. ఆ సమయములో సభను వదలిపోకుండా ఉన్న ద్రౌపదిని చూచి ధర్మరాజుకి కోపం వచ్చింది. రాజసభలో ఇంతసేపు మాట్లాడ్డం, మాటకి మాట చెప్పడం సబబేనా? అని అంటాడు—

"పలు పోకల బోవుచు వి
చ్చలవిడి నాట్యంబు సూపుచాడ్పున నిచటం
గులసతుల గరువ చందము
దొలగగ నిట్లునికి దగునె తోయజవదనా."

ద్రౌపది సమాధానం చెప్పింది మెత్తగా.

"నాదువల్లభుండు నటుడింత నిక్కంబు
పెద్దవారి యట్లు పిన్నవారు
గాన పతుల విధముగా కాక యే శైలూషి
గా ననంగరాదు కంకభట్టు"

'జూదరి యాలికి గరువతనం ఎక్కడిది' అని వెళ్ళిపోతుంది. ఈ సంభాషణలో కవి ప్రదర్శించిన చమత్కారము అద్భుతము. కావ్యంలో చమత్కారం లేకపోతే సొంపులేదు. నన్నయభట్టు కూడా ఇటువంటి చమత్కారాలు చెప్పనేర్చినవాడే.

విచిత్రవీర్యుడు అహర్నిశం కామదాసుడయిపోవడంతో రాజయక్ష్మము— అనగా క్షయవ్యాధివల్ల నిర్యాణం చెందాడు. ఈ విషయాన్ని కవి చమత్కరిస్తాడు. 'రాజయక్ష్మ బాధితుడయి దేవలోక సుదతీ ప్రియుడయ్యె విచిత్రవీర్యుడున్.' ఇక్కడ కవి విచిత్రవీర్యుడు చచ్చిపోయాడని ఎదటబడి చెప్పలా. ఇహలోకంలో కామవాంఛ తీరక దేవలోకంలో ఉన్న సుదతులకు ప్రియుడయినాడట!

ఇటువంటి చమత్కారాలకు పెట్టింది పేరు చేమకూర వేంకటకవి విజయ విలాసం. 'ప్రకట శ్రీహరియంఘ్రి బుట్టి హరుమూర్ధం బెక్కి యాపాదమస్తకమున్ వర్ణన కెక్కు దేవి . . .' అని గంగానది వర్ణన. గం ముల్లోకాలలోనూ పారుతూంటుందనీ, అది ఎక్కడ ఉన్నా పాపనివారిణి అని చెపుతారు. అనగా సర్వేసర్వత్రా పునీతమైనదని భావం. ఇక్కడ ఆపాదమస్తకం అన్న మాటకి అర్థం అదే. మరో చమత్కారము ఉంది ఇందులో. గంగ విష్ణుమూర్తి పాదాన పుట్టి ఈశ్వరుని తలమీద కెక్కిందట. అనగా విష్ణుపాదం మొదలు ఈశ్వరమస్తకం వరకూ అని చమత్కరించాడు' చేమకూర. 'అమ్మకచెల్లి' అన్న నుడికారాన్ని ప్రయోగిస్తూ ఒక పద్యం చెప్పాడు విజయవిలాసంలోనే. ఉలూచి అర్జునుడ్ని గూర్చి తన కోరిక వెలార్చేఘట్టంలో:

"కమ్మని జాళువా నొరయ గల్గిన చెక్కుల టెక్కువాడు, చొ
క్కమ్మగు జాతికెంపు వెలగా గొను మోవి మెరుంగువాడు, న
త్యమ్మగు రూపసంపద ధనాధిపసూనుని ధిక్కరించు వా,
డమ్మక చెల్ల! నా హృదయ మమ్మక చెల్లదు వీనికియ్యెడన్."

ఇందులో ఆశ్చర్యానికి ఆశ్చర్యం, అమ్మకానికి అమ్మకం రెండూ ఉన్నవి. ఇందులో ఉలూచి హృదయం అందానికి అమ్ముడు పోయింది. హృదయం ఎటువంటిదీ— జాతి కెంపులు పొదిగిన సువర్ణాభరణం. దీన్ని అమ్మాలంటే బంగారం మంచిదో కాదో వన్నె తెల్సుకోవాలి. తర్వాత కెంపుల వెల కట్టాలి. తగిన ధర యిచ్చి కొనుక్కొనేవాడు లభ్యమవ్వాలి. అప్పుడు అమ్మక తప్పదు. కాకుంటే మరోచోట చెల్లక పోవచ్చును. ఈ అర్థాన్నే కవి చమత్కరిస్తున్నాడు. అర్జునుడు నున్నగా గీటురాయి వలె నల్లని చెక్కులు కలవాడట. కెంపురాయికంటె ఎర్రగా ఉన్న పెదవులట! కుబేరుని కొడుకైన నలకూబరుని సైతం వెక్కిరించగల సౌందర్యము కలవాడట— అన్నీ ఆశ్చర్యానికి ఏమీ సందేహం అవసరం లేదు. అమ్మకచెల్ల అనుట సమంజసమే. అటువంటి రూపసంపద కలవాడి చేతనే వెలకట్టాడు. అంత డబ్బు యిచ్చి కొనడానికి నలకూబరుని మించిన రూపవంతుడు మిగిలాడు. ఇన్ని విషయాలు కలిసి వచ్చినప్పుడే గదా ఆ ఆభరణం చెల్లేది? కొన్ని కొన్ని మాటలు తెలివిగా ఉపయోగించుకొన్నప్పుడు ఇటువంటి చమత్కారాలు బయల్పడుతుంటవి. కొన్ని చమత్కారాన్ని అర్థం చేసుకునే నైపుణ్యం గూడ సతితల్లో ఉండాలి. అప్పుడే చమత్కారాల సొగసు తేటతెల్లమయేది.

నన్నెచోడుని కుమార సంభవంలో దక్షాధ్వర ధ్వంసం ఘట్టంలో కొన్ని చమత్కారాలు ప్రత్యక్షమవతవి ఈశ్వరసేన యజ్ఞప్రాంతాన్ని పాడు చేసిన ఘట్టంలో దిక్పతుల పడ్డపాట్లు కవి చెపుతున్నాడు. వాహనమైన నరుని మీద కూర్చోవడానికి బదులు కుబేరుడు, తనమీద నరుని ఎక్కించుకొని పలాయన మంత్రం పఠించాడు.

"తన యెక్కిన మానిసి దా
ననయము నెక్కంగ మరచి యాతని దన మూ
పున నిడికొని పఱచె భయం
బున ధనపతి తన్ను బిరుద భూతము లార్వన్"

అక్కడ ప్రమథగణాలు అరుస్తున్నవి— కుబేరుని తెలివికి సంతసించి, కాని ఎవరికైతే మటుకు అప్పటికప్పుడు ఏం తోస్తుంది? కుబేరుని పాట్లు మనకు చమత్కారంగా కనిపిస్తవి. ఇట్లాగే ప్రమథగణాల నుంచి తప్పించుకొని పోవాలనుకుంటున్న బ్రహ్మ తన వాహనమైన హంస మీద ఎక్కబోయి, పట్టుజారి నేలమీద పడ్డాడట. హంస చేసేది లేక దాని స్వభావము వలె తామరతూడును పట్టుకొన్నట్లు పట్టుకొని బ్రహ్మను పరుగెత్తించిదట.

"వాహనంబు నెక్కవచ్చి భయంబున
వడకి నేలబడ్డ వనజ గర్భు
గమిచికొని మరాళకము వాతి
జెందమ్మి కఱచికొని రయమున బఱచినట్లు."

వీళ్ల అవస్థ ఇట్లా ఉంటే సాక్షాత్తూ శ్రీమన్నారాయణుడు గరుత్మంతుని కావలించుకొని దాని కాళ్లూ వేళ్లూ పట్టుకొని తిరుగుముఖము పట్టాడట. నన్నెచోడ మహాకవి అంటాడు. ఈ విషయాన్ని—

'గరుడి నడుము మెడయు, కాలును, కేలును,
ఇఱికికొనుచు చక్రి వెఱచి పరచె.'

ఈ విధంగా ప్రతి దిక్పతి పద్మాసాటు చమత్కారంగా చెప్పాడు కుమార సంభవ కావ్యంలో.

ఇట్లాగే శ్రీ వేంకటాచల మాహాత్మ్యము అనే కావ్యంలో కవయిత్రి తరిగొండ వేంకమాంబ గూడ కొన్ని తావుల చమత్కారము చూపించింది.

శృంగారవనంలో విహరించుచున్న పద్మావతి ఆమె చెలులను చూచి విష్ణువు "ఈ తరళలోచన చక్కదనము చూడ రతికన్న విమల భారతికన్న మరియు పార్వతికన్న శ్రీరమావనిత కన్న నతిశయించి యుందంపు నతికదా . . . ." అని తలపోశాడు. మరో కవితాచమత్కృతి చక్కగా చూపించింది. వరహావతారుడైన హరి భూమిని కామించి వైకుంఠానికి పోవుటకు ఇష్టంలేక వాహనమైన గరుడునితో అంటున్నాడు.

"ధారుణీ నీటన్ మునిగిన
కారణమున దాని నెత్తు కార్యముకొరకై
ఘోరాకారము దాల్చితి
నా రూపము జూచి లక్ష్మి నగదె ఖగేంద్రా."

"ఆ వైకుంఠపురంబున
కే విధమున వత్తు లక్ష్మి యొకనక్కముగా
నీవెవ్వడనుచు నడిగిన
శ్రీ విష్ణుడ ననుచు జెప్ప సిగ్గగు గరుడా."

విష్ణువు వరహావతార మెత్తిన సందర్భములో ఆ రూపంతో వైకుంఠానికి పోతే లక్ష్మీదేవి నా అవతారం చూచి నవ్వుతుంది. ఎగతాళిగా నీ వెవరు స్వామీ అని అడిగితే నేను శ్రీ మహావిష్ణువునని చెప్పడానికి నాకే సిగ్గుగా ఉంది అని ఆ ఖగరాజుతో చెప్పినాడు. ఈ విధంగా ఆమె కవితలో చమత్కృతి, హాస్యము మిళితమై ఉంది. ఈ కావ్యంలో ఇంకా అనేక తావుల్లో ఇటువంటి చమత్కారాలు మనము చూడగలము. వ్యాస విస్తర భీతివల్ల కొన్ని మాత్రమే చెప్పాను.

శ్రీనాథుడు రెడ్డి రాజుల ఆస్థానంలో విద్యాధికారిగా ఉన్నప్పుడు అచటి చిల్లర చిల్లరకవులను ఉద్దేశించి— ఒక గాడిదతో— "గాడిద! నీవునున్ కవివి కావుగదా! ఇట కొండవీడులో—" అని చమత్కరిస్తాడు. శబ్ద చమత్కారానికి శ్రీ నాథునిదే మరో చాటువు. పల్నాటి ప్రాంతంలో ప్రయాణం చేస్తూ త్రోవలో మంచినీరు దొరక్క చెప్పిన పద్యము— అందరికీ సుపరిచితమైందే—

"సిరిగలవానికి జెల్లును
తరుణుల పదియారువేల దగ పెండ్లాడన్
తిరిపెమున కిద్దరాండ్రా
పరమేశా గంగ విడుము పార్వతి చాలున్."

పల్నాడు అంటే ఆనాడు శ్రీనాథుడు తనకు కావలసే భోగాలన్నీ తేలికగా లభించే తావు అనుకొని వెళ్లాడు. పాపం. అవేవి లేవు—

"రసికుడు పోవడు పల్నా
డెసగంగా రంభయైన నేకులె వడుకున్
వసుధేశుడైన దున్నును
కుసుమాస్త్రుండైన జొన్నకూడే కుడుచున్."

"గరళము మ్రింగితి ననుచున్
బురబుర! గర్వింపబోకు పోపోపో! నీ
బిరుదింక గానవచ్చెడు
మెరపెడి రేనాటి జొన్న మెతుకులు తినుమా."

ఇటువంటి చాటువుల్లో తప్పితే శ్రీనాథుని కావ్యాల్లో అంతగా చెప్పదగ్గ చమత్కారాలు లేవు.

తెనాలి రామకృష్ణుని కవితలో గూడ అంత రసవంతమైన చమత్కారాలు కనిపించవు. పేరుకి ఏదో వికటకవి అంటారేగాని. పాండురంగ మహాత్మ్యంలోని నిగమశర్మోపాఖ్యానంలోని అక్కబోధలో కొద్ది చమత్కారముంది. నిగమశర్మది పిల్లిశీలమనీ, చిలకం చదువులనీ అంటుంది. పిల్లిశీలానికి తగ్గట్టుగానే నిగమశర్మ అంతా నిద్రించే సమయంలో రాత్రిక రాత్రి అక్క ముక్కుపుడకతో సహా వస్తువులన్నీ పట్టుకొని ఉడాయిస్తాడు. అక్క నగలన్నీ పోయినందుకు దుఃఖపడలా. పాపం కొత్తగా చేయించుకున్న ముక్కుపుడక ఎత్తుకు పోయాడే అని బాధపడిందట! అదే చమత్కారం.———

వేమనగూడ తన రచనల్లో చమత్కారాన్ని, హాస్యాన్ని మిళితం చేసి చెప్పినాడు. ఈయనవి అన్నీ సర్వోక్తులు. ఇదే ఉక్తిగతమైన హాస్యమంటే.

"విప్రులెల్లరు చేరి వెర్రికూతలు కూసి,
సతిని పతిని గూర్చి సమ్మతమున
మును ముహూర్త ముంచ
ముండెట్లు మోసెరా, విశ్వదాభిరామ . . . ."

"గుహలలోన జొచ్చి గురువుల వెదుకంగ,
క్రూర మృగము లొకండు తారసిలిన
మోక్ష మార మదియె ముందుగా జూపురా,
విశ్వదాభిరామ వినురవేమ."

ఇందులోని చమత్కారము సువిదితమే గదా. మరోకవి చాటువుగా నల్లి బాధను గూర్చి చెప్పినది. చమత్కారమైనది.

"శివు డద్రిని శయనించుట,
రవిచంద్రులు మింటనుంట రాజీవాక్షుం
డవిరళముగ శేషునిపై
బవళించుట నల్లిబాధ పడలేక సుమీ."

ఇందులో దేవతలు సైతం నల్లిబాధను తప్పించుకోలేక ఏయేమార్గాలు తొక్కారో కవి చమత్కరించాడు. దేవతలకు చాకలివాళ్ళ పోరుగూడా తప్పలేదు.

"చాకివానితోడ జగడాలు పడలేక
సిరిగలాడు పట్టుచీరగట్టె
శివుడు తోలుగప్పె సీయని మదిరోసి
దిగంబరుండు చీర పారవైచె."

ఆయా దేవతల సహజ గుణాల్ని అవకాశంగా తీసికొని చెప్పినచాటువు.

తిరుమలరాయుని గూర్చి చెప్పిన ఈ చాటువు గూడ చమత్కారమైనదే.

"అన్నాతి గూడ హరుడవు,
అన్నాతిని గూడనప్పు డసురగురుడవౌ
దన్నా! తిరుమలరాయా!
కన్నొక్కటి మిగిలెగాని కౌరవపతివే"

ఇందులో తిరుమలరాయుని ఒంటి కన్నును ఆక్షేపించినాడు. ముందు శివుడు శుక్రమహర్షులతో పోల్చి, ధృతరాష్ట్రునివలె పూర్తిగా అంధుడు కాలేదే అని చమత్కరించాడు. ముందుస్తుతి, తర్వాత నింద.

కవి చౌడప్ప గూడ ఒక పద్యంలో చమత్కరించాడు.

"ఆడిన మాటలు దప్పిన
గాడిద కొడుకంచు దిట్టగా విని మదిలో
వీడా నా కొడుకని యేడ్చెను,
గాడిదయును కుందవరపు కవి చౌడప్పా."

ఖడ్గతిక్కన యుద్ధం నించి పారిపోయి వచ్చినపుడు భార్య అతని స్నానానికై పసుపు, నులకమంచం అడ్డుపెట్టినదట. ఎందుకిది అన్న తిక్కన ప్రశ్నకు—

"పగరకు వెన్నిచ్చినచో నగరే నిను మగతనంపు నాయకులెందున్
ముగురాడువారమైతిమి, పగపేటికి జలకమాడ వచ్చినచోటన్"

భోజనమప్పుడు తల్లి విరిగిన పెరుగు వడ్డించగా—

"అసదృశముగ నరివీరుల,
మసిపుచ్చక విరిగివచ్చు మగపంద క్రియన్
గసవున్ మేయగబోయిన,
పశులున్ విరిగినవి తిక్క! పాలున్ విరిగెన్."

ఇటువంటి చమత్కార చాటువులు మన సాహిత్యంలో అణిముత్యాలనవచ్చును.

అడిదం సూరకవి తన కవితా చమత్కృతిని చూపించాడు. సూరకవి భార్య భర్తతో— "ఏమండీ మన బావన్న మీద ఓ పద్యం చెప్పండీ" అన్నదట. కవిగారు—

"బావా బూచుల లోపల
బావనె పెద్దబూచి భావింపంగన్
బూచంటె రాత్రి వెఱతురు,
బావన్నను చూచి పట్టపగలే వెఱతుర్"

పద్యమునకు చమత్కారము ముఖ్యము. వాచ్యార్థమున శోభ లేదు. కనుకనే ధ్వని జీవన మన్నారు పెద్దలు.

# ఆస్తికతలో జిజ్ఞాస వైశాల్యమెంత

శ్రీ కొండపర్తి శేషగిరిరావు

జిజ్ఞాసా

జిజ్ఞాసా

జిజ్ఞాసా

అని అంటున్నప్పుడు.

ఈ జిజ్ఞాస అన్నది ఎక్కడ నుండి పుట్టింది, ఎందులోనుంచి పుట్టింది.

అని అంటే —

కోరికల్లోంచి పుట్టింది

ఆ కోరికలు మనస్సుల్లోంచి పుట్టాయి.

అని అనిపిస్తుంది.

అలా జన్మనెత్తిన ఈ జిజ్ఞాసను గురించి కాస్త ఆలోచిస్తే, అది పదార్థపు ప్రభావాలకు కొద్దిగా దూరంగా ఉండి, జీవస్వరూపాన్ని కాస్త మార్చుకొన్న ప్రలోభమయిగా కనిపిస్తుంది.

ఇంకొంచెం ముందుకుపోయి దానితోబాటు నడిచిచూస్తే: ఈ జిజ్ఞాస ఉన్నంతవరకూ దానిలో దానికి తెలీకుండానే అంపర్నిహితంగా మనస్సు ప్రవహిస్తూనే ఉంటుంది. కనుక జిజ్ఞాస ఎంతదూరంపోయినా అది మనస్సు యొక్క స్వభావాన్ని దాని వాసనలనూ అధిగమించలేక పోతోంది అని అనిపిస్తుంది. దానిని అధిగమించాలంటే మనస్సును నసింప జేసుకొని ముందుకుపోయే మార్గమే ఉత్తమం ఉదాత్తం ఐంది అవుతోంది.

అంతేకాకుండా ఈ జిజ్ఞాస ఎంతదూరం ప్రయాణించినా అది మనస్సు వాసనలను దాటలేకపోగా పైగా ఇది అనేక సంఘర్షణలను తెచ్చిపెట్టి సాధకుని భ్రమింపజేస్తూ అతన్ని గిరగిరా త్రిప్పుతూ ఉంది. ఇలాంటి జిజ్ఞాస ఆధ్యాత్మిక ప్రయాణంలో ఆస్తిక జగత్తులో నిరుపయోగమైంది అని అంటారు ఆస్తికతలో సాగిపోయే కొందరు.

నిజం మాట్లాడితే జిజ్ఞాస అలాంటిదే.

కానీ అలాంటి ఈ జిజ్ఞాస సాధకునితో ఏవేవో అనుమానాలను లేవుతూ అవి తీరేంతవరకూ అతన్ని నిద్రపోనీయక అతన్ని త్రిప్పుతూ ఉంటుంది.

అసలు మనస్సులేంది జిజ్ఞాసకు చోటేలేదు. అలా జిజ్ఞాసకు చోటునిచ్చిన మనస్సు తన ప్రభావాన్ని జిజ్ఞాసమీద ఎంత బలంగానో వేస్తూ ఉంటుంది. దానిమండి ఈ జిజ్ఞాస తప్పించుకోవటం అన్నది మహాకష్టం.

యదార్థం చెప్పాలంటే జిజ్ఞాస, మనస్సు అనేదాన్ని ఆశ్రయించి ఉంది. దాన్ని తీసేస్తే జిజ్ఞాసకు అస్తిత్వమే లేదు. అలా తనకు అస్తిత్వాన్నిచ్చిన మనస్సు యొక్క స్వభావం ఆస్తికతలో అందరికీ తెలిసిన విషయమే. దాన్ని అధిగమించాలంటే మనస్సునూ దానిమీద నడిచే వాటిలో ఒకటైన జిజ్ఞాసనూ, అవతలకునెట్టి ముందుకు పోవటమే ముందుగా చేయవలసిన పని.

అసలు మనస్సు జాగ్రదావస్థలోనే ప్రకాశిస్తూ ఉంటుంది. దాన్ని అంటిపెట్టుకొని ఉన్న వాటిలో ఒకటైన జిజ్ఞాసా అలానే జాగ్రదావస్థలోనే మేలుకొని ప్రకాశిస్తూ ఉంటుంది. కనుక వీటన్నిటినీ దాటాలంటే సుషుప్తావస్థ దానిలో ప్రకాశించే జీవీ ఆత్మా అన్న వాటిని ఆశ్రయించటమే ఉన్నతమైన మార్గం. ఆ మార్గం ఎంతో దీర్ఘమైంది. అంత సుదూరంగా ప్రయాణించవలసిన ఆధ్యాత్మికత చిన్నరూపంలోనే కాలాన్ని వ్యర్థం చేయటం అర్థంలేనిపని. అందుకని మనస్సునూ దాన్ని అస్తిత్వంగా ఏర్పరచుకున్న జిజ్ఞాసనూ సాధ్యమైనంతవరకు చెరిపివేసి తొందరగా ముందడుగు వేయటం మంచిది. ఎప్పుడైనా దానిని దాటటం చెరిపివేయటం ఆధ్యాత్మక గమనంతో ఆస్తిక జగత్తులో తప్పదు. కనుక ఆ పనిని ఇప్పుడే చేస్తే ఏమవుతుంది అని అనిపిస్తుంది. ఆస్తికతతో సాగిపోయే కొందరికి.

ఇది శ్రమలేని పని.

* * *

ఐతే జిజ్ఞాస అన్నదానియొక్క వైశాల్యం ఇంత కురచైందా, ఇంత చిన్నదా అని కాస్త ఆలోచిస్తే అనిపిస్తుంది. ఈ జిజ్ఞాస లేకపోతే ఆధ్యాత్మిక జగత్తుకు అస్తిత్వం ఎంత బలంగా ఉంటుందో ఆలోచించదగిన విషయమే మరి.

నిజంగా, ఈ 'జిజ్ఞాసా' 'మనస్సూ' అన్నవి పరస్పరాశ్రితాలై పోష్యపోషక సంబంధాన్ని కలిగి వాటిని విడదీయటానికి వీలుకాని సంబంధ బాంధవ్యాన్ని కలిగి ఉన్నాయి.

అసలు వీనికిగల ముందటి స్వరూపాన్ని గురించి ఆలోచిస్తే, జిజ్ఞాస అన్నది ఎప్పుడు గుర్తింపబడుతుందో తెలుస్తుంది. ఆ దృష్టితో ఒక్కసారి వెనక్కు తిరిగిచూస్తే, మనస్సు కోరిన భౌతికమైన కోరికలు తీరిన తరువాతో పదార్థాల అనుభవం తీరిన తరువాతో జిజ్ఞాస మొదటి స్వరూపమైన 'ఇది ఏమిటో తెలుసుకుందాం' అన్నదానిలో పుట్టి ఇదిఇలా ఎందుకుందో తెలుసుకుందాం. ఇది అలా ఎందుకు ఉండకూడదో తెలుసుకుందాం అనే తపనతో పదార్థాలను ఒకోదానిని ఎత్తి దాన్ని అటూ ఇటూ త్రిప్పుతూ పరిశీలిస్తూ అవి ఇచ్చిన కొన్నిటిని తనలో పోసుకుంటూ, అలా పరిశీలించిన ఒక్కో వస్తువునూ క్రిందపడవేస్తూ సాగిపోతూ ఉంటుంది. ఆ స్థితిలో పదార్థాన్ని అనుభవించాలనే ఇచ్చకు మనోశ్రితమైన జిజ్ఞాస

కాస్త దూరమై కూర్చుంటుంది. కానీ అలా దూరమైన ఈ జిజ్ఞాస వేటి మధ్య తన జీవితాన్ని గడుపుతోంది అని అంటే —

పదార్థాల మధ్యా వాటి స్వభావాల మధ్యా అని సమాధానం చెప్పక తప్పదు.

సరే ఇక్కడ జిజ్ఞాస పదార్థాల మధ్యే తిరిగింది అని అనుకొందాం. మరి ఐతే ఆ పదార్థాలమధ్య తిరిగిన ఆ జిజ్ఞాస దేనికోసం తిరిగింది అని ప్రశ్నించుకొంటే స్వభావాల కోసం అని సమాధానం దొరుకుతుంది. ఆ స్వభావాలైనా పదార్థ వాసనావాసితాలేగదా మరి అని అంటే— అవును అనే అనాలి. కానీ వాటిమధ్య జిజ్ఞాస తిరగటం వల్ల దానికేమి ఒరింగిది అని అంటే, ఏముంది జిజ్ఞాస బయలుదేరినప్పటి స్థితిలో తనకు కావలసిన దానిని కొంత తనలో పోసుకొని బరువును పెంచుకొంది. అలా జిజ్ఞాస తనలో పోసుకున్న దానిని, పదార్థాల ప్రక్కన పెట్టిచూస్తే ఆ రెంటికీ తేడా ఎంతఉందో తెలుస్తుంది. అలానే మనస్సునూ జిజ్ఞాసనూ ప్రక్క ప్రక్కన పెట్టిచూస్తే, ఆ రెంటిమధ్య తేడా ఎంతవరకు ఉందీ తెలుస్తుంది.

ఐనా, ఇంతగా తనలో దేనినో తీసుకొని కొంతభారాన్ని పొందిన ఈ జిజ్ఞాస పదార్థ స్వభావవాసనా వాసితమైందే అని స్థూల పరిశీలనగా ఒప్పుకొందాం.

సరే ఇక్కడ జిజ్ఞాస వైశాల్యమెంత అని ఆలోచిస్తే ఈ విశ్వంలో ఉండే పదార్థాలను ఒక్కోదానినీ చూస్తూపోవాలి, పైగా తనలోని పదార్థాలను కూడా చూస్తూపోవాలి. ఈ మధ్యలో తగిలే ఏకత్వాలూ, భిన్నత్వాలూ సంఘర్షణలూ, సమతలూ అన్నిటినీ దాటుతూ పోవాలి. వీటన్నిటిలో అనుస్యూతంగా ఏదైనా ఏకత్వంగానీ లేక ఏదైనా అనేకత్వంగానీ ఉందా అని చూడాలి ఇవన్నీ అందించిన వాటిని తనతో పోసుకొంటూ వీటన్నిటికీ ఏది దేనికి అస్తిత్వాన్నిస్తుంది దాని స్వభావంఏమిటీ అని ఆలోచిస్తూ పోవాలి.

ఇదీ ఇక్కడ జిజ్ఞాస వహించవలసిన పాత్ర. ఇప్పుడు జిజ్ఞాసకు చేతినిండా ఎంతో పని.

ఇలాంటి స్థితిలోని ఈ జిజ్ఞాస, ఎక్కడ తన తలను ఎత్తి తనకు అస్తిత్వాన్నిచ్చిన మనస్సులో భాసించే వాంఛలవైపు చూస్తుంది.

కనుక ఇక్కడ జిజ్ఞాస తనకు అస్తిత్వంగా మనస్సును తీసుకున్నాను మనోప్రభావిత కోరికా ప్రభావితమైన వాసనలకు కాస్త దూరంగానే ఉంది.

కానీ ఈ స్థితిలోనే మనస్సూ జిజ్ఞాసా అన్నవి రెండూ, రెండుగా చీలి దేనికదిగా జీవించే చోటు.

ఇలా ఐనా జిజ్ఞాస తన మొదటి స్థితిలోనే ఉంది అని అనిపిస్తుంది.

నిజం మాట్లాడితే అసలు ఇక్కడే జిజ్ఞాస జన్మనెత్తుతోంది అని అనాలి.

* * *

ఆ తరువాత జిజ్ఞాసలో పదార్థ జగత్తూ భౌతిక జగత్తూ అన్నవాటిలోంచి స్థూలమూ సూక్ష్మమూ అనే రెండు స్వభావాలను బయటకు తీస్తుంది.

ఈ రెంటిలోనుంచి విశ్వంలోని ఏపదార్థమూ ఏ భౌతికతా తప్పించుకు పారిపోలేదు. అలాంటి అస్తిత్వపు మూలాలను పట్టుకొంటుంది ఈ జిజ్ఞాస ముందుగా.

అలానే మానవునిలో ఉండే శరీరమూ దానిలో నివసించేవి ఆ ప్రాణమూ మనస్సూ జీవుడూ మొదలైన వాటిని పట్టుకొని స్థూలమూ సూక్ష్మమూ అన్న రెండు అస్తిత్వమూలకాల క్రింద పరుస్తుంది.

ఇక్కడ శరీరాన్ని పదార్థంగానూ భౌతికంగానూ ముందులెక్కగట్టి స్థూలం అని, ఆ తరువాత వీనినుండి వేరుపరచిన ప్రాణమూ మనస్సూ జీవుడూ ఆత్మా మొదలైన వాటిలో ఏవి స్థూలము ఏవి సూక్ష్మము అని ఆలోచించి వీటిలో ఏవి స్థూలమైన పదార్థం చుట్టూ భౌతికతచుట్టూ తిరుగుతాయి, ఏవి సూక్ష్మమైన వాటి చుట్టూ తిరుగుతాయి అనిచూచి, వీటిలో కూడా కొన్ని స్థూలమైనవి అనీ, మరికొన్ని సూక్ష్మమైనవి అనీ నిర్ధారించుకొని, అవి ఎలా సూక్ష్మతత్వం చుట్టూ సూక్ష్మతమం చుట్టూ తిరుగుతాయో అనికూడా చెబుతుంది. అలానే తన చుట్టూ ఉన్న ప్రకృతిని చూచికూడా ఈ దృక్పథంతోనే చెబుతుంది.

ఇక్కడ నిలబడి మానవునిలోని బహిర్‌అంతర్ స్థూల సూక్ష్మాలనూ అతనిచుట్టూ ఆవరించి ఉన్న విశ్వం యొక్క బహిర్‌అంతర్ స్వరూప స్వభావాలలోని స్థూలసూక్ష్మ తత్వాలనూ కలుపుకొని ఓబృహత్ స్థూల సూక్ష్మతత్వాలలోని రెండు స్వభావాలను తీసి బయటపెడుతూ గతిశీలతా స్థితిశీలతా అన్నవి రెండు ఉన్నవనీ అవి రెండూ పరస్పరాశ్రితాలనీ, అవిరెండే ఈ విశ్వానికంతటికీ అస్తిత్వాన్ని కూర్చిపెడుతున్నాయనీ అంటుంది ఈ జిజ్ఞాస.

* * *

ఆ తరువాత ఈ జిజ్ఞాస ఇంకా ముందుకు సాగిపోయి ఈ గతిశీలతనూ ఈ స్థితిశీలతనూ గూడా మార్చగలిగినది మరొకటి ఉందా లేదా అని తీవ్రంగా పరిశీలించి ఉందనీ అంటూ, ఈ రెండూ దాని ఆధీనంలో ఉండవలసినవేననీ, అసలు ఈ రెంటి అస్తిత్వమూ దానిమీదే ఆధారపడి ఉంటుందనీ అంటుంది. స్థితిశీలతలో భాసించే జడమైన ఓ రాయిని తీసుకొని పరిశీలిస్తే అది కాలగతిలో రూపాంతరం చెందుతుంది. అలా దానిని రూపాంతర పరచగలిగినదీ అంత రూపాంతర పరచ శక్తివంతమైందీ 'కాలం.' అలానే మహామేధావులైన ఓ తత్వవేత్త కనిపెట్టి శాశ్వతంగా భాసింప జేసిన ఓ సత్యం, లేక ఓ విషయం రేపు రూపాంతరం పొందుతుంది. అంటే, ఆ భౌతికమైన ఇలాంటి స్వభావం కల వాటిని కూడా కాలం రూపాంతరపరుస్తూ ఉంటుందన్నమాట. అంతదూరం దేనికి పసితనం నుండి ముసలితనం మధ్యలో ఎన్ని భావాలు మారటంలేదూ, ఎన్ని స్థితులు మారటంలేదు. కనుక కాలం అన్నది అన్నిటినీ తన ఆధీనంలోకి తీసుకోగలిగిన శక్తివంతమైంది. దానినుండి ఈ విశ్వంలోనీ ఈ సృష్టిలోనీ ఏదీ తప్పించుకు పారిపోలేదు అని తేలుతుంది. అంత శక్తివంతమైనదీ ఈ కాలం. కనుక ఈ కాలం అన్నదాన్ని

తొలగించి ఈ విశ్వంలో ఉన్న ప్రతిదానినీ చూస్తే వాటికి అస్తిత్వమే లేకుండా పోతుంది. అలాంటిది ఈ కాలం.

ఈ కాలం గతిశీలతగలదిగదా! అలాంటి గతిశీలత విశ్వంలోని గోళాలకన్నిటికీ (సూర్యుడు తప్ప) ఉందిగదా. పోనీ, ఒక్క భూమినే తీసుకొని చూడండి అలా తిరిగే ఆ భూమి గతిశీలతను ఒక్కసారి ఒక్కక్షణం పోనీ కొంతకాలం ఆపిచూస్తే ఈ భూమిమీద ఉండే వాటిలో దేనికి అస్తిత్వం ఉంటుందో చివరికి భూమికే అస్తిత్వం ఉండదేమో మరి. మరి అలాంటి గతిశీలత గలది కాలం. కనుక ఈ గతిశీలత గల కాలం యొక్క అస్తిత్వం మీదనే ఈ విశ్వం యొక్కలేక ( స్థూలసూక్ష్మ ) ఈ సృష్టి యొక్క అస్తిత్వం ఆధారపడి ఉంది.

* * *

అలాంటి గతిశీలమైన కాలం అస్తిత్వాన్ని పొంది ఉండంటే, దానికి మరొకటి ఏదోదానికి చోటును ఇవ్వవలసి ఉంటుంది. అదిలేందే ఇంత శక్తివంతమైన కాలం మనుగడను కలిగిఉండలేదు. అస్తిత్వాన్ని పొందనూ లేదు.

ఎలా అంటే గతిశీలమైనకాలం దాని స్వభావంలో సాగిపోవాలంటే అది సాగటానికి కొంత అవకాశం ఉండాలి. గుప్పెట్లో బిగించిన గుండ్రని బంతి తిరగలేదు. అది తిరగాలన్నా, దాన్ని తిప్పాలన్నా గుప్పెటను సడలించి అది తిరగటానికి వీలైనంత చోటును ఇవ్వాలి. అప్పుడే అది తిరుగ గలుగుతుంది. అలానే గడియారంలోని లోలకం కదలకుండా ఖాళీ లేకుండా దానిచుట్టూ దేన్నైనా బిగిస్తే అది కదలలేదు. అందుకని ఒకటి కదలటానికి సూక్ష్మజడస్వభావియైన అవకాశం కావలసి ఉంటుంది.అలానే కాలం అనేదాని మనుగడకు అవకాశం అనేది ఒకటి కావలసి ఉంది. అది అతిసూక్ష్మస్వభావంలో 'దిక్' అనే స్థితిశీలతలో ఉంటుంది. కనుక ఈ విశ్వంలో అన్నిటికీ అస్తిత్వాన్ని గలిగిన ఈకాలం దిక్ అనే దానియొక్క అస్తిత్వంమీద కూర్చొని తన మనుగడను సాగిస్తోందన్న మాట. కనుక ఈ దిక్ అనే దానిని తొలగించి కాలంలోని ఏ భాగాన్ని చూచినా అది తన అస్తిత్వాన్ని కోల్పోయి తన మనుగడను సాధించలేదు. కనుక దిక్ అనేదే కాలానికి అస్తిత్వాన్ని కూర్చిపెడ్తోంది అని అంటోంది జిజ్ఞాస.

ఇలాంటివన్నీ దేని మీద ఆధారపడి ఉన్నవో తెలుసుకోగలిగాం. అలా తెలుసుకోటం దేనిమీద ఆధారపడి తెలుసుకొంటున్నాం అనిఅంటే, జిజ్ఞాస మీద ఆధారపడితెలుసుకోగలిగాం అనిఅంటాం.కమక ఇలాంటి ఈ విశ్వంలోని అస్తిత్వపు చోటులన్నీ ఈ జిజ్ఞాస అనే అస్తిత్వం మీద ఆధారపడి ఉన్నవేనని అనిపిస్తోంది కాస్త నిదానంగా ఆలోచించిచూస్తే. కనుక ఈ జిజ్ఞాసను కమక కాస్త తొలగిస్తే ఈ విశ్వంలోని ఈ సృష్టిలోని ఈ సత్వాల అస్తిత్వాలన్నీ కుప్పకూలినట్లు కూలిపోతాయి. కనుక ఈజిజ్ఞాస అస్తిత్వమే వీటన్నిటికీ అస్తిత్వాన్ని కూర్చిపెడ్తోంది.

ఇలా కనిపించే ఈ జిజ్ఞాస యొక్క స్వభావం చొచ్చుకు పోవటం, దాని శీలము గతిశీలత. అలాంటి ఈ జిజ్ఞాసలోని గతిశీలతకు అస్తిత్వాన్ని ఏది ఇస్తోంది అని తీవ్రంగా ఆలోచిస్తే, ఈ విశ్వంలో భాసించే జ్ఞానం అస్తిత్వాన్ని ఇస్తోంది. ఆలాంటి జ్ఞానం అవకాశాన్నిచ్చి జిజ్ఞాసలోని గతిశీలతకూ దానిలోని చేతనకూ అస్తిత్వాన్నికూర్చిపెడ్తోంది, కమక ఈ విశ్వంలో అంతర్హితమై స్తబ్ధశీలియై అస్తిత్వంలో ఉన్న ఈ జ్ఞానం అనే అస్తితవుచోటును కనుక తొలగిస్తే జిజ్ఞాస తన అస్తిత్వాన్ని కోల్పోతుంది. కనుక జ్ఞానం అనే అస్తిత్వం మీదనే అన్నిటియొక్క మనుగడలూ ఆధారపడి ఉన్నాయి.ఆ అస్తిత్వపు చోటులను ఈ జిజ్ఞాస చూపిస్తూ చైతన్య శీలతలో అది జ్వలిస్తూ ఉంటుంది.

ఈ విధంగా చైతన్యశీలతలో జిజ్ఞాస భాసిస్తూ ఉంటే సమాధి శీలతలో విశ్వంలోని జ్ఞానం నిండి నిండుగా ఉంది.

అందుకే ఒకోసారి అంతిమస్థాయిలో చైతన్యశీలతలోని జిజ్ఞాస విశ్వంలోని సమాధి స్థితిలో ఉన్న జ్ఞానాన్ని చేరటానికి, దానిలో కలిసి పోవటానికా తనలో ఉన్న, తన చైతన్య శీలతలో ఉన్న చొచ్చుకుపోయే తన గుణాన్ని ఒదులుకొని నిర్గుణతను సంతరించుకుని అందులో ప్రవేశింప ప్రయత్నిస్తూ ఉంటుంది. అప్పుడు ఈ జిజ్ఞాస జ్ఞానం అన్న రెంటిలోన ఏకంగా భాసించేది "జ్ఞా" అన్నటువంటిది అవుతోంది. అదే ఈ రెంటికీ అస్తిత్వాన్నిచ్చేది అవుతుంది.

* * * *

కనుక ఇలాంటి జిజ్ఞాస బయలుదేరటంలో మనస్సు అనేదానితో కలిసి బయలుదేరినా, అందులోనుండి జన్మనెత్తినా. అది తన ప్రయాణంలో, తన నడకలో, తాను సంపాదించుకొని తనలో పోసుకుంటూ పోయిన ఈ జిజ్ఞాస మనస్సునూ దాని స్వభావాలైన ఇచ్ఛా వాంఛాలాంటి వాటినీ, ఈ విశ్వంలోని తనలోని స్థూలసూక్ష్మతత్వాలనూ వాక్కుని గ్రహించేప్పుడే అవి అంతరిస్తవి. పోనీ అక్కడ అంతరించకపోయినా గతిశీలతా స్థితిశీలతా అన్నవాటిమీదే ఈ విశ్వంలోని పదార్థాలన్నీ అస్తిత్వాన్ని కూర్చుకొని ఉన్నాయనే స్థితికి వచ్చినప్పుడైనా, మనస్సూ దానివాసనలనూ జిజ్ఞాస నెట్టిపారేస్తుంది. పోనీ అక్కడ కూడా నెట్టిపారవేయలేకపోయినా ఈ రెంటినీ కాలం తన గుప్పెట్లో ఇరికించుకునే శక్తివంతమైనది దాని అస్తిత్వం మీదే ఇవి రెండూ ఉన్నాయని అనుకున్నప్పుడే మనస్సూ దాని వాసనలూ ఆవిరైపోతాయి. అసలు బయట విశ్వంలోనికి జిజ్ఞాసపోయి 'కొంతను' సంతరించుకొని తిరిగి తనలోని భావంలోకీ భవంలోకీ ఈ జిజ్ఞాస అంతర్ముఖమై సాగిపోయినప్పుడైనా, మనస్సూ అది పరిమళింపజేసే వాసనలూ గుర్తింపబడి వాటిని ఈ జిజ్ఞాస దాటుతుంది.

కనుక జిజ్ఞాస మనస్సు వాసనలను తన మొదటి అడుగులోనే దాటుతుంది. చివరికి తానుగూడా గతిశీలమైన వో గుణస్వరూపినని తెలుసుకొని ఆ గుణ స్వరూపాన్ని గూడా విశ్వంలో భాసించే జ్ఞానంలో కలుస్తూ ఏకమవుతున్నప్పుడు విడిచేస్తుంది.

అలాంటి దశలోని జిజ్ఞాసలో ఇంకా మనస్సులోని వాసనలుఉంటాయనుకోవటానికి అవకాశం దొరకటం లేదు.

* * * *

ఇది అంతా జిజ్ఞాస మేల్కొని ఉన్నప్పుడే జరుగుతోంది. ఇందులో సుషుప్తిగానీ తుర్యముగానీ దానిని దాటిన స్థితులుగానీ దీని దగ్గరకురావు. ఇదీ తన దగ్గరకు వాటిని చేరనివ్వదు.

ఎందుకంటే తాను జాగ్రదావస్థలో భాసిస్తుంది. విశ్వంలో ఉన్న జ్ఞానమూ విశ్వం నిద్రపోతున్నప్పుడు భాసించటంలేదు. విశ్వం జాగ్రదావస్థలో ఉన్నప్పుడే, అది అస్తిత్వంలో ఉన్నప్పుడే దానిలో అంతర్గతమైన జ్ఞానం భాసిస్తోంది. అలాంటప్పుడు స్తబ్దతను ఆలంబనంగా తీసుకొని స్తబ్దతోరణాలలో ఉన్న యోగసమాధి స్థితులను ఈ జిజ్ఞాస దగ్గరకు రానీయదు.

అందుకనే జిజ్ఞాస మానవుని జాగ్రదావస్థలో ఉంటూ, విశ్వంలోని జ్ఞానం అస్తిత్వంలో ఉన్నప్పుడే అది భాసిస్తూ ఉంటుంది.

కాని సమాధిసాధన అలాకాక వీటినన్నిటినీ ఒదిలేసి కేవలం విశ్వంలోని స్తబ్దతను చూస్తూ దానిలో తాను స్తబ్దరూపంలోనే ప్రవేశించటాన్ని నిర్వికల్పమూ అమనస్కమూ ఐన సమాధి స్థితిని ఆలంబనంగా తీసుకొంటోంది.

అందుకని ఆధ్యాత్మిక జగత్తులో, విశ్వం అస్తిత్వంలో ప్రకాశించే జ్ఞానమూ, దానిముందున్న సాధకుని జాగ్రదావస్థలో భాసించే జిజ్ఞాస మాత్రమే, కాస్త అస్తిత్వ ఉదాత్తతలను కలిగి ఉన్నాయి అని అనిపిస్తుంది పరిశీలనా అన్వేషణలలో. కనుక ఆధ్యాత్మిక జగత్తులో జిజ్ఞాసా జ్ఞానమూ అన్నవి మాత్రమే ఆధ్యాత్మిక వాదానికి సరైన ఆస్తికత్వాన్నిస్తున్నాయి అని అనిపిస్తూ ఉంటుంది బాగా ఆలోచిస్తే.

* * * *

ఇలాంటి విశాల విశ్రుతి విస్తృతిగల జిజ్ఞాసకు మనస్సును ముడి పెట్టి దాని వైశాల్యాన్ని చిన్నదిగా చూపించే ఆధ్యాత్మికమార్గం కొంచెం లోపమయినదేమోనని అనిపిస్తుంది.

నిజంగా ఈ జిజ్ఞాస దాని విస్తృత వైశాల్యంలోనే సాధకుడు తనలో ఎంతో పోసుకుంటున్నాడు. అసలు ఇక్కడ సంపూర్తిగా తిరిగినప్పుడే సాధకుడు అసలైన ఆధ్యాత్మికతలో అడుగుపెడుతున్నాడేమోనని కూడా అనిపిస్తూ ఉంటుంది.

అలాంటి స్థితి కలిగినది ఈ జిజ్ఞాస.

సరి ఐతే ఈ జిజ్ఞాస ఎంతదూరం పోయినా అది 'తన' అన్న దానిలో దేనిలో పోస్తుందిగదా అని అనవచ్చును ఆధ్యాత్మికతలోని కొన్ని మార్గాలు.

అవును నిజంగా తనలో తాను అన్నది లేకపోతే జిజ్ఞాస ఇంత దూరం ప్రయాణం చేయలేదు. అంతవరకూ యదార్థమే. కేవలం అది ఆలంబన మాత్రమే అవుతోంది ఈ జిజ్ఞాసా మార్గంలో.

అంత మాత్రంలో ఈ జిజ్ఞాస 'తన' అన్న స్వరూపంతో వెలితితో కూడింది గదా అని, ఇంతదూరం ఇన్ని ఆవృత్తాల్లో ప్రయాణించకుండా దేన్నీ తనలో పోసుకోకుండా, ఇంతవిశాల పరిధిని తుడిచివేస్తే అతనిలో మిగిలేదేమిటి. అప్పుడు అతని స్వరూపం ఏమిటి ఎలా వుంటుంది అని ఒక్కసారి ఆలోచించుకుంటే, అక్కడ మిగిలేది తపస్సుకు బదులు తమ

స్తేమోమరి. అప్పుడు తన స్వరూపం కేవలం జడత్వం అవుతుందేమో తెలీదు మరి.

అలాంటి స్థితిని ప్రాథమిక దశలోనే ఏ ఆధ్యాత్మికతా, సాధకునిలో కోరదు.

కనుక ఇంత విశాలమైన ఇంత సుదీర్ఘమైన ఈ జిజ్ఞాసను ఇరుకు చేయక కురచచేయక శ్రమ అని అశ్రద్ధ చేయక, దాన్ని విస్తృతపరచుకొంటూ అందులో తిరుగుతూ పోతే, సాధకునికి ఆధ్యాత్మిక అస్తిత్వపు మూలాలు వాటంతట అవే అతనికి తెలుస్తాయి. చివరికి తన ప్రయాణపు అంతిమ దశలో ఈ జిజ్ఞాస సగుణత్వం కలిగిందని దాన్ని చెరిపివేస్తే చెరిపివేయవచ్చు. అలా చెరిపివేస్తే, అంతటితో అతని అనంత ఆధ్యాత్మిక ప్రయాణం అంతమవుతుంది. కానీ దాన్ని ఆస్తికతలోని ఆధ్యాత్మికత ఒప్పదు.

ఇంత సుదీర్ఘమైన దానిలో కొంతదూరం మాత్రమే నడిచి అక్కడే జిజ్ఞాస తనలో ఏమీ పోయకుండానే, ఇది ఎలాగూ తనలో దేనినో పోసేదేనని దాన్ని తుడిచివేయటం తాను సాగించే ఆధ్యాత్మిక పరిధికే విరుద్ధం. అది అతనికి శ్రేయంకాదు. దుశ్శకునం.

అందుకని ఈ జిజ్ఞాస అన్నది దాని పరిధిలో ఎంతబాగా తిరగగలిగితే అంత బాగా ఆధ్యాత్మిక అస్తిత్వపు మూలాలు తెలుస్తాయి. తత్వశాస్త్రం తెలుస్తుంది. అది అంతా జిజ్ఞాస మీదే ఉంటుంది.

అలాంటి దానిన్ని దానిలో ఏదో పనికిరానిది ఉందని కాలదన్ని పారేసి సాగిపోతే ఇటు మనకూ శ్రేయంగాదు అటు ఆస్తికతకూ తత్వజిజ్ఞాసకు ప్రియంకాదు.

అందుకనే సూర్యుడు ఇంకొక్కక్షణానికి అస్తమిస్తాడనేంతవరకూ ఈ జిజ్ఞాసలో తిరుగుదాం ఎన్నో అస్తిత్వాలను తెలుసుకుందాం. వాటి నన్నిటినీ మనలో (మన జిజ్ఞాసలో) నింపుకొందాం.

మనం తొందరపడ్డాంగదా అని సూర్యుడు ఏమీ ఒక్క క్షణం ముందు అస్తమించడు.

ఏ వేళ అలా అస్తమిస్తే అది అస్తమయంకాదు. ప్రళయ మవుతుంది.

జిజ్ఞాసా

జిజ్ఞాసా

జిజ్ఞాసా

అని అంటూ —

అందిన ప్రతిదానినీ పట్టుకొని అటూ ఇటూ త్రిప్పుతూ జిజ్ఞాసను నింపుకొంటూ, పోసుకొంటూ మరోదానిని పైకెత్తి చూసుకొంటూ పరిశీలిస్తూ ఆస్తికత అస్తిత్వాన్ని తెలుసుకొంటూ నింపుకొంటూ నిండుకొంటూ

సాగి పోదాం .... ....

సాగి పోదాం .... ...

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7, Thumbu Chetty Street, Madras-600001. Editor: S. Radhakrishna.